సాధన గ్రంథ మండలి - 92.

# సాధనసామగ్రి

[దుర్గాసప్తశతి ఆధ్యాత్మిక వివృతిసారము]

మూడవ మూట



గ్రంథకర్త:
శ్రీ శ్రీ[illegible]నందనాథులు
[illegible] సత్యనారాయణ శర్మ



ప్రకాశకులు:
సాధన గ్రంథ మండలి, తెనాలి.

 *** [వెల రు. 3=00

సాధన గ్రంథ మండలి - 92.

# సాధనసామగ్రి

[దుర్గాసప్తశతీ ఆధ్యాత్మిక వివృతిసారము]

## మూడవ మూట



గ్రంథకర్త:
శ్రీ శ్రియానందనాథుడు
ఈశ్వర సత్యనారాయణ శర్మ



ప్రకాశకులు:
సాధన గ్రంథ మండలి, తెనాలి.

    ***    [వెల రు. 3=00

శ్రీః

'వేదాంతపారీణ' శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారు
తెనాలి సంస్కృతకళాశాలా పూర్వాధ్యక్షులు,
సాహితీసమితి ఉపాధ్యక్షులు.

---

# పరిచయము

యా దేవీ పరమా శక్తిః పరబ్రహ్మవిధాయినీ ।
బ్రహ్మానందాభిధానాయై తస్యై దేవ్యై నమోనమః ॥

చిన్మాత్రస్వరూపుడగు పరమేశ్వరుని ఆశ్రయము కలది మాయ. మాయయొక్క శక్త్యాకారముగా దనుప్రవిష్టమైన సంవిత్తు పరాశక్తి. పరాశక్తి నిర్వికల్పక, స్వప్రకాశస్వరూపిణి. ఈ శక్తియే సలిలపవనాది సమాయోగమువలన ఉచ్ఛూనమైన బీజమున కంకురావస్థ కలిగినట్లు ప్రాణి కర్మపరిపాక వశమున ఇంచుక వికల్పితమై శివశక్తివిభాగము తత్కాలమున లేకున్నను ఉభయ సాధారణమైన చిన్మాత్రము నాశ్రయించి సృష్టికార్యమున కున్ముఖ మగుచున్నది. అందువలన పరబ్రహ్మవిధాయిని యైనది.

ఏతదర్థమునే :—

"యతోవా ఇమాని భూతాని జాయంతే । యేన జాతాని జీవంతి । యత్ప్రయం త్యభి సంవిశంతి । తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ"

అని తైత్తిరీయ శ్రుతి ప్రమాణించుచున్నది. ఆ బ్రహ్మస్వరూపమును క్రమముగా వివరించుచు —

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే । ఆనందేన జాతాని జీవంతి । ఆనందం ప్రయం త్యభిసంవిశ న్తి ।"

అని ఆ పరబ్రహ్మవిధాయిని నిజస్వరూపమును సువ్య క్తము చేసినది.

కనుక ఈ శక్తి పరాశక్తి, బ్రహ్మాభిన్న, బ్రహ్మస్వరూపిణి. శక్తి బ్రహ్మలకు భిన్నత్వవ్యవహారము ఉపాధినిమిత్తకము. ఉపాధిపరిచ్ఛేదముచేతనే చిన్మాత్రమునకు శివశక్తిరూప విభాగవ్యవహారము.

జగత్కార్యసంబంధమునుబట్టి అనుమేయించి నిరూపింపదగినది మాయాశక్తి. అనుమితికి సాధ్యముకాక స్వతంత్రముగా నిరూపింపదగిన చిన్మాత్ర శివుడు. శివశక్త్యుభయాశ్రయమైన చిన్మాత్రమే ఉపాస్యమైన పరదేవత. కావున శివశక్తుల కభేదమని తాత్పర్యము. ఈ విషయమే సూతసంహితయందు—

"చిన్మాత్రాశ్రయ మాయాయాః శక్త్యాకారే ద్విజోత్తమాః ।
అనుప్రవిష్టా యా సంవి న్నిర్వికల్పా స్వయంప్రభా॥
సదాకారా సదానందా సంసారోచ్ఛేదకారిణీ॥
సా శివా పరమా దేవీ శివాభిన్నా శివంకరీ॥

అని ప్రవచింపబడినది. అట్లే—

"సర్వచైతన్య రూపాం తా మాద్యాం విద్యాంచ ధీమహి,
బుద్ధిం యా నః ప్రచోదయాత్॥"

అని దేవీభాగవతారంభమందును,

"చిత్కళా పరమానందా చిదేకరస రూపిణీ"

అని లలితోపాఖ్యానమందును వివరింపబడినది.

ఏతదర్థమునే —

"భావాభావ కలా వినిర్ముక్తా చిద్విద్యాఽద్వితీయ బ్రహ్మసంవిత్తిః, సచ్చిదానందలహరీ, మహాత్రిపురసుందరీ, బహిరంత రనుప్రవిశ్య స్వయమేకైవ విభాతి॥"

అని శ్రుతి వినిపించుచున్నది.

శ్రుతి స్మృతు లిట్లు ఉద్ఘోషించుచుండ శక్తి శివునికన్న భిన్నమనియు, అది జడమనియు, అందుచే ఉపాస్యముకాదనియు కొందర జ్ఞు లనుచున్నారు. అవివేకమే వారికి శరణము.

వస్తుతస్తు ఈ పరదేవతయే ముక్తిరూపిణి, ముక్తిదాత్రి. అవిద్యావరణము తొలగి ఆత్మోపలబ్ధి కలుగుటకు పరదేవతోపాసనముకన్న మరి సాధనాంతరము లేదు. శివాభిన్నయైన శివాశక్తియే శివదర్శనము కలిగించుటకు సమర్థురాలు. కావున ఆ జగజ్జనని సంసారోచ్ఛేదకారిణియై సచ్చిదానంద స్వరూపిణియై జ్ఞానోపలబ్ధికి పరమపదమగుచున్నది. అందుచేతనే—

"అత స్సంసార నాశాయ సాక్షిణీ మాత్మరూపిణీం ।
ఆరాధయే త్పరాశక్తిం ప్రపంచోల్లాస వర్జితామ్॥"

అని ధ్యానింపబడుచున్నది. ఈ పరాశక్తి స్త్రీ రూపకముగా చెప్పబడియున్నను సాధకుని అభిరుచిని హృదయార్ద్రతను ఆప్యాయతను అనుసరించి స్త్రీ పుం నిష్కళారూపములలో ఏరూపముగానైనను ధ్యానింపవచ్చును. ఈ అర్థమునే —

"పుం రూపం వా స్మరే ద్దేవీం స్త్రీ రూపం వా విచింతయేత్ ।
అథవా నిష్కళం ధ్యాయేత్ సచ్చిదానంద విగ్రహామ్॥"

అని కులార్ణవతంత్రము నిగదించినది.

అయినను మాతృస్వరూపిణిగా ధ్యానించుటవలన హృదయమం దార్ద్రభావము విశేషముగా కలుగుట మానవసహజము. లోకమందు ప్రేమాస్పదులైనవారిలో అందరమీద కన్న అమ్మమీద ప్రేమాతిశయ ముండుట అనుభవసిద్ధము. అట్లే ఆపదలందును, హర్షములందును, ఆతంకములందును, ఆకాంక్షలందును అమ్మను స్మరించుచుండుటయు, అందువల్ల మనశ్శాంతి ఆహ్లాదము ఆప్యాయత ఇత్యాదులు పొందుచుండుటయు అనుభవసిద్ధము. శ్రుతిమాతయు —

"ఉమాం హైమవతీం బహుశోభమానాం"

అని స్త్రీరూపముగా, మాతృరూపముగా అనుగ్రహించినది. ఆ హైమవతినే —

"అహం దేవీ న చాన్యోఽస్మి బ్రహ్మైవాహం న శోకభాక్ ।
సర్వం ఖల్విద మేవాహం నాన్యదస్తి సనాతనమ్ ॥"

అని స్త్రీ పుం రూపాభేదముతో సాధకోత్తముడు భావించుచున్నాడు.

ఆ బ్రహ్మస్వరూపిణి యగు ఉమయే దుర్గాసప్తశతి యందు విస్తృతముగా వర్ణింపబడినది. సప్తశతి గ్రంథము మార్కండేయ పురాణాంతర్గతము. త్రయోదశాధ్యాయాత్మకము. 'మార్కండేయోవాచ' మొదలు 'సావర్ణిర్భవితామనుః' అంతముగా అయిదువందల డెబ్బదియెనిమిది శ్లోకములు గలది. ఇది పురాణాంతర్గతమైనను భగవద్గీతవలె, వేదమట్లు అనాది. ఇది వ్యాసమహర్షిచే ప్రకటీకృతమగుటవలన లోకమందు వ్యాసకృతమని వ్యవహృతమగుచున్నది. ఈ యర్థమును —

"యథా వేదో హ్యనాదిర్హి తద్వత్సప్తశతీ మతా"

అను భువనేశ్వరీసంహితావాక్యము తెలిపినది. ఈ సప్త శతిని కాత్యాయినీతంత్రము సప్తశతమంత్రాత్మకముగా విభ జించినది. ఇందుకు రుద్రయామళము —

"అస్తి గుహ్యతమం దేవ్యా మాహాత్మ్యం సర్వసిద్ధిదమ్ ।
వాక్యైరర్ధైశ్చ పద్యైశ్చ సప్తశత్యాత్మకం శుభమ్॥
సవిశేషపరం సాక్షాచ్చిచ్ఛక్తి మహిమాశ్రయం ।
తాత్పర్యగత్యా తత్కృత్స్నం నిర్విశేష చిదాశ్రయం॥"

అని సప్తశతీ మంత్ర సంఖ్యాస్వరూపమును, తత్పర మార్థమును నిర్వచించినది.

ఈ సప్తశతియందు దేవీమాహాత్మ్యమును వర్ణించు చరిత్రలు మూడు కలవు. ప్రథమచరిత్రయందు మధుకైటభ వధయు, మధ్యమచరిత్రయందు మహిషాసురవధయు, ఉత్తమ చరిత్రయందు శుంభ నిశుంభ వధయు వర్ణితములు.

ఈ సప్తశతిని మాలామంత్రముగా పరిగణించి సకల భయ రోగ విఘ్న మహోపద్రవ నివృత్తికిని, ధన పుత్ర రాజ్య లాభాది మహాఫలప్రాప్తికిని శతచండీ సహస్రచండీ విధానములు మేరుతంత్రాదులం దభిహితము లగుటచే తజ్జపహోమాదులు ప్రాచీన కాలమునుండి నిర్వర్తింపబడుచుండుట సుస్పష్టము. ఇందు కుపోద్బలకముగా ఈ సప్తశతికి గౌడపాదకృతమగు భాష్యముకూడ కలదని, అందలి ముప్పదిరెండు శ్లోకములు నీలకంఠభట్టు తన వ్యాఖ్యానమున ఉదాహరించినాడు.

ఇప్పటి కీ సప్తశతికి పదింటికి పైగా వ్యాఖ్యానములు ఉపలభ్యము లగుచున్నవి. వానిలో నాగేశి, గుప్తవతి, దుర్గా ప్రదీపము, సప్తశతీసర్వస్వము మొదలైనవి మహోపాసకులైన

పండితప్రకాండులు రచించినవి. వీనినిబట్టి సప్తశతీ జపహోమాది ప్రాశస్త్యము సుద్యోతకమగుచున్నది.

అట్టి మహోత్కృష్టమైన సప్తశతికి శ్రీ శ్రీ శ్రీయానంద నాథ దీక్షానామాలంకృతులు బ్రహ్మశ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు 'సాధన సామగ్రి' అను పేరుతో ఆధ్యాత్మిక వివృతిసారము నాలుగు సంపుటములుగా విరచించినారు. అందు ఒకటి, రెండు, నాలుగు సంపుటము లిదివరకే ముద్రితములైనవి. ఇయ్యది మూడవసంపుటము. ఇందు శుంభ నిశుంభవధలోని నిగూఢార్థము ప్రపంచితమైనది.

'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః' అని శ్లోకార్థములో అద్వైతస్వరూపమును నిర్ణయించినట్లు దైవభావమునకును, ఆసురభావములకును కలిగిన సంఘర్షణమే శుంభవధాంతరార్థమని ఒక్కమాటలో చెప్పవచ్చును.

శాస్త్రజనిత జ్ఞాన కర్మభావితులు — ప్రకాశించువారు సురలనియు, స్వాభావిక ప్రత్యక్షానుమానజనిత దృష్టప్రయోజన కర్మజ్ఞానభావితులు — తమ తమ అసువులందు రమించువారు అసురులనియు బృహదారణ్యకమున శంకరభగవత్పాదులు నిర్వచించినారు. దైవభావము సురశబ్దవాచ్యము. అసుర శబ్దవాచ్యము అస్మిత. అస్మిత అనగా బుద్ధిని ఆత్మగా భావించి జన్మమృత్యుభయాదులు లేకుండ సమస్తము తనకు లభించినది. తానే సమస్తము అను భావము పరాశక్తిదర్శనమునకై దైవ భావమునకును అస్మితకును జరిగిన అంతరంగ సంఘర్షణమే యుద్ధమని నిగరణముచేసి నిరూపించినారు శ్రీ శ్రీ శ్రీయానంద నాథులు. ఆసురభావ నిబర్హణమే అసురవధ. అసురులను

వధించినప్పుడే సురభావము – సాధకుడు పరాశక్త్యంకమున బ్రహ్మానంద మనుభవింపగలడని ఆయన ప్రవచించినారు.

ఇట్టి ఆంతర్యార్థములు పూర్వము కొన్నిటికి కొందరు చెప్పియున్నారు. "సాంసారికత్వధర్మములకును పరమధర్మమగు ఆత్మదర్శనమునకును క్షేత్రము (ధర్మక్షేత్రము) శరీరము. ఇంద్రియములు అవిద్యాజనితములగు కామక్రోధాదులకు వశమైనపుడు హింసాదులును, జ్ఞానోద్భవములగు క్షమా వైరాగ్యాదుల కాస్పదమైనపుడు అపవర్గప్రాప్తియు కలుగుచుండును. అవిద్యా పురుషోచితులు కౌరవులు. శుద్ధవిద్యా పురుషోచితులు పాండవులు. విద్యావిద్యాసంఘర్షణమే యుద్ధము" అని కొందరు వ్యాఖ్యానించినట్లు అభినవగుప్తుడు తన భగవద్గీతా వ్యాఖ్యానారంభమందు ఉదాహరించినాడు.

ఇట్టి ఆంతర్యార్థములు సూచనామాత్రములు. శ్రీ శ్రీ శ్రియానందుల ఆంతర్యార్థము – ఆధ్యాత్మికవివృతిసార మట్టిది కాదు. వీరి వివృతిలో పదపదమందును, వాక్యవాక్యమందును ఆదినుండి అంతమువరకు ఆధ్యాత్మికత హృదయంగమముగా సమన్వితమైనది. లలితమైన పదములతో, చవులూరించు శైలితో ఆసాంతము వీరి రచన విలసిల్లుచున్నది. గ్రంథమంతట వీరు పరదేవతను అమ్మ యని వ్యవహరించినారు. అమ్మ అను పదము లోకములో ఎంతో మధురమైనది. ప్రీతికి చనువుకు ఆప్యాయతకు విశ్వాసమునకు పరమాస్పదమైనది. అమ్మా అని సంబోధించుటలో శ్రీ శ్రీ శ్రియానందనాథులు పరదేవత కెంత ప్రీతిపాత్రులో బోధపడును. వీరి ఆధ్యాత్మిక వివృతిసారమును పరిశీలింప వీరు తమ జీవితమంతయు పరదేవతాంకము చేయుటకు వినియోగించినట్లు స్పష్టపడును.

శ్రీ శ్రీ శ్రీయానందనాథులను ఈశ్వర సత్యనారాయణ శర్మగారు గీర్వాణాంధ్రములందు మంచిపండితులు. వీరు తమ వేదాంతాది శాస్త్రపాండిత్యము పాఠప్రవచనములకే కాక పరమార్థతత్త్వ మనన నిధిధ్యాసములకే విశేషముగా వినియోగించినట్లు వీరు రచించిన గ్రంథజాలము స్పష్టపరచుచున్నది. వీరు తపఃసంపన్నులు. తమ తపఃఫలములగు అమూల్యానుభూతులను ఉపాసకలోకమున కందించి మహోపకార మొనర్చినారు.

శ్రీ సత్యనారాయణశర్మగారు ఆంధ్రమందు లలితమైన శైలిలో కావ్యములు రచించిన కవీంద్రులు. ఎంత క్లిష్టవిషయమునుగూడ తేలికమాటలతో విస్పష్టముగా చెప్పగల సమర్థులు. వీరలు ఈ 'సాధనసామగ్రి' అను గ్రంథమునేకాక 1 సిద్ధాంత శిఖామణి, 2 శ్రీ రాజవిద్యాగీత (భగవద్గీత–నవమాధ్యాయము), 3 మహాసార మంత్రపాఠము, 4 అమ్మతో ముచ్చటలు, 5 భీమేశ్వరనుతి, 6 శాస్త్రసాధనము, 7 దేవపూజారహస్యము, 8 దేవీసూక్తపరమార్థము మొదలగునవి రచించినారు. కొలది కాలములో వీరి "సప్తశత్యుపాసనాక్రమము" అను గ్రంథము వెలువడనున్నది.

వీరి గ్రంథము లన్నింటిని సాధన గ్రంథ మండలివారు ముద్రించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనర్చినారు. ముఖ్యముగా ఉపాసకులీమండలివారికి చిరకృతజ్ఞులుగానుందురు.

ఇతి శ్రీః

తెనాలి
20–6–1965

ఉపాసక విధేయుడు,
త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు, కడప.

# అభిప్రాయము

శ్రీమద్భగవద్గీతకు పూర్వము వేదోపనిషత్తులందు తత్త్వము, సాధనములు మిశ్రితములై యుండెను. తైత్తిరీయ మాండూక్యాదులు ప్రధానముగా తత్త్వప్రతిపాదకములే. యోగకుండలి, వరాహ, త్రిపుర, త్రిపురతాపిన్యాదులు సాధనములను వివరించును వీనన్నిటియందు విషయములు సమ్మిశ్రితములై యుండును. అచ్చటచ్చట కించిద్వ్యత్యాసములు, మతభేదములు ఉండును. పద్ధతి వివరణాపేక్షకముగా ఉండును. ఇట్టి మూలస్థానము నాధారముగాగొని మంత్రయోగశాస్త్రములావిర్భవించినవి. తంత్రములందు తత్త్వసాధన విభాగము జ్ఞానయోగక్రియాచర్యాపాదములను పేర స్పష్టముగా ఉన్నది. తంత్రములు విరివిగా పెరిగిన తర్వాత యావత్తుశాస్త్రరాశి అతివిస్తారమై ఏది తత్త్వమో, ఏది సాధనమో తెలియక మతభేదములకు భ్రాంతులకు హేతువేర్పడెను. యోగీశ్వరేశ్వరుడైన శ్రీకృష్ణభగవానుడు అవతరించి తత్త్వవిద్యావిషయముల నన్నిటిని క్రోడీకరించి తత్త్వము సాధనములు అను విశదస్వరూపమును సమకూర్చి లోకోపకారము చేసెను. తదనంతరము కాలక్రమమున మరల దేశమందలి తత్త్వవివేచనారంగము అల్లకల్లోల మయినది. ఏది శిష్టమార్గమో ఇదమిత్థముగా తెలియక కుమార్గములు ప్రబలమయి ఆ విశదస్వరూపము కల్లోలసముద్రమున మునిగిపోవనున్న సమయమున శ్రీశంకర భగవత్పాదు లుదయించి తత్త్వవిద్యలను సమీకరించి ఏది

ఉత్తమాంగమో, ఏవి ఉపాంగములో, దేనిస్థాన మేదో నిరూపించి మంత్రయోగ వేదాంతశాస్త్రములు సుప్రతిష్ఠితము చేసి జ్ఞానరాశి నుద్ధరించెను. అనగా శ్రీకృష్ణుని తర్వాత శ్రీ శంకరుడు తత్త్వప్రతిష్ఠాపనకై వచ్చిన యవతారము. శంకరుని మూలముననే బ్రహ్మవిద్యకు తదంగభూతములైన మంత్రయోగశాస్త్రములకును దేశమందు అపూర్వప్రచారము లభించెను. శాంకరమఠములు ఈ విద్యలకు శాశ్వతప్రతిష్ఠ కలిగించి వాటి నవశ్యానుష్ఠేయములుగా జేసెను.

శంకరునికి పూర్వము వ్యాపించిన భ్రాంతులలో పురుషుడు ప్రధానము, శక్తి అప్రధానము అను తత్త్వవిషయ మొకటి. "వేదాహ మేతం పురుషం మహాంతం . ." అనియు, "మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్ పురుషః పరం పురుషాన్నపరం కించిత్ . . ." అనియు చెప్పు శ్రుతుల ఆంతర్యము చక్కగా గ్రహింపబడకపోవుటచేత కొందరు పురుషు డధికుడు, శక్తి అట్లుకాదను భావమేర్పడెను. వేదాంతము గొప్పదనియు, తంత్రశాస్త్రము కాదనియు భ్రాంతి కలిగెను. ఇందుండి ఎన్నియో అనర్థము లావిర్భవించెను. వేదాంతులే గొప్పవారనియు తాంత్రికులు కారనియు భావమేర్పడెను. కానీ ప్రసిద్ధాద్వైతులు అనేకులు గొప్పతాంత్రికులుగా కలరు. మాండూక్యమునకు కారికలు వ్రాసిన గౌడపాదుడు సుభగోదయమను ప్రామాణిక తంత్రశాస్త్రగ్రంథమును వ్రాసెను. శంకరుని విషయము జగద్విదితమే. లక్ష్మీధరభాస్కరరాయాదు లద్వైతులే. తంత్రములే అద్వైతముపై ఆధారపడి యున్నవిగదా! కానీ న్యూనాధికతలు తోచెను. ఇదంతయు అచ్ఛతత్త్వమేదో ప్రతి

పాదింపబడి ఉండకపోవుటచేత గాదు. శివశక్తుల అభేదము వేదములందే గలదు. 'పురుషాన్న పరం కించిత్' అనిన శ్రుతియే "సా కాష్ఠా సా పరాగతిః" అని స్త్రీలింగప్రయోగము చేసెను. "ఏకో రుద్ర స్సర్వభూతేషు గూఢో మాయా రుద్ర స్సకలో నిష్కలశ్చ స ఏవ దేవీ న చ తద్విభిన్నా హ్యేతి జ్ఞాత్వా హ్యమృత తత్వం వ్రజంతి" ఇత్యాది శ్రుతివాక్యములు గలవు. దేవీ వాఙ్మయమందును ఈ తత్త్వమే ప్రతిపాదింపబడెను. దేవికి సమయ అను పేరెట్లు వచ్చెను? "సమయానామ శంభునా సామ్యం పంచవిధం యాతీతి సమయా......ఉభయో స్సమ ప్రాధాన్యే నైవ సామ్యం విజ్ఞేయం-అధిష్ఠాన, అనుష్ఠాన, అనుష్ఠాన, రూప, నామ సామ్యంచ ఇతి పంచవిధం" దేవీవాఙ్మయ సారాంశకోశమైన లలితాసహస్రనామావళి ఈ తత్త్వమునే ప్రతిపాదించును. ఇన్ని ఇట్లుండగానే శక్తి అప్రధానముగా పరిగణింపబడ జొచ్చెను. శంకరభగవత్పాదులు ఈ భ్రాంతిని తొలగించి శక్తిస్థాననిర్ణయముచేసి తత్త్వమును పునః ప్రతి ష్ఠితముచేసెను. దేవీతత్త్వము నిష్కళంకము, నిష్కంటకము చేసి ప్రతిష్ఠింపబడగానే మంత్రయోగశాస్త్రములు అపశ్యాను ష్ఠేయములై సమప్రాధాన్యమును సంతరించుకొనెను.

బ్రహ్మాండ పిండాండముల అభిన్నతత్త్వము ఔపనిషదిక వాఙ్మయమునందు కంటె దేవీవాఙ్మయమునందే ప్రస్ఫుట ముగా కలదు. శ్రీచక్రమే దీనికి ప్రసిద్ధ నిదర్శనము. నాడులు, చక్రములు, పురములు, దేవతలు, అధిదేవతలు, శివశక్తులు ఇత్యాది రహస్యములతో నిండిన దేహముయొక్క స్వరూ పము శ్రీ శంకరుని మంత్రయోగ వేదాంతశాస్త్ర ప్రతిష్ఠచేతనే

లోకమున అపూర్వ ప్రచారమును పొందెను. ఇదంతయు శంకరుని లోకోపకారము. అష్టాదశచక్రములవలె అష్టాదశశక్తిపీఠములు, ఇడా పింగళా సుషుమ్నలవలె గంగా యమునా సరస్వతులు, కుమారీ యోషిత్పతివ్రతారూపములతో మూలాధారమువంటి దేశపు దక్షిణాంతమున కన్యాకుమారి, కొల్లాపురియందు శ్రీమహాలక్ష్మి, కాశీయందు విశాలాక్షి ఉండుట, క్రౌంచపర్వత రంధ్రము నుండి హంసలు మానససరోవరమునకు వచ్చుచు పోవుచుండుట ఇత్యాది విచిత్రములుగల ఈ దేశము ఆ శంకరునకు శివశక్తి క్షేత్రమైన ఒక బృహద్దేహముగా గోచరించెను కాబోలు. దేశమంతయు తిరిగి శక్తిచక్రములను స్థాపించెను. మంత్రయోగ వేదాంతశాస్త్రములను సుప్రతిష్ఠితము చేసెను. దేవీశాస్త్ర సర్వస్వదర్పణమగు సౌందర్యలహరియను అమృతధారలచే దేవి కభిషేకము చేసెను. ప్రపంచసారసంగ్రహమును ప్రసాదించెను. ఇట్లు శంకరభగవత్పాదులు దేవీతత్త్వ ప్రతిష్ఠాపనాచార్యు లగుట చేతనే "శ్రీ శివాచార్యవర్యాద్యాం శంకరాచార్య మధ్యమాం అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరాం" అని తాంత్రిక పూజా సంప్రదాయ మేర్పడినది.

జ్ఞానసిద్ధికి దేవీకటాక్షమే మార్గము. జ్ఞానదాయై నమః, జ్ఞానవిగ్రహాయైనమః, ఆత్మవిద్యాయై నమః (ల. స. నా) కామేశ్వర బ్రహ్మవిద్యాయై నమః (ల. త్రి.) అట్టి దేవీతత్త్వము వేదోపనిషత్తులందు, తంత్రములందు ప్రతిపాదింపబడినది. కాని ఉపనిషచ్ఛాస్త్రములు ఉన్నతాధికారులకే ఉపయోగించునవై యుండి అన్యులకు దుర్గ్రహములుగా ఉన్నవి. కనుక పురాణము లావిర్భవించినవి. జాగ్రత్తగా పరిశీలించినచో ఉపనిషత్తులందలి

తత్త్వమును స్పష్టము చేయుటకే తంత్రములు పుట్టినట్లు తోచును. తంత్రములు ప్రతిపాదించిన సిద్ధాంతములు, దేవతలు, మంత్రములు ఇత్యాది విషయముల నే స్వీకరించి సామాన్యాధికారులకై పురాణము లావిర్భవించినట్లు విశదమగును. అనగా ఉపనిషత్తులనుండి తంత్రములు, తంత్రములనుండి పురాణములు. ఇట్టిది వాని జన్మక్రమము. శాస్త్రసిద్ధాంతములకు, రూపరహిత వస్తువులకు తంత్రశాస్త్రము తొలిసారిగా రూపములను కల్పించెను. అదియే దేవతలను దేవాలయములను సృష్టించెను. వానినే పురాణములు గైకొనెను. అనగా మన పురాణకథలు స్థూలదృష్టికి కథలుగా దోచుచున్నను సూక్ష్మముగా చూచినచో అవి తత్త్వప్రతిపాదకములే. గ్రీసు మొదలైన పాశ్చాత్య దేశములందలి దేవతలకును మనదేశపు దేవతలకును ఏలాటి సంబంధమును లేదు. వారి దేవతలు కేవలము మానవ భయోత్పన్న భావములు. అచ్చటి పూజావిధానము తదనుగుణమైనదే. కానీ ఈదేశపు దేవతలు బ్రహ్మాండపిండాండములందున్న తదుత్పత్తిస్థితిలయహేతువులైన శక్తులు. దేహము ఎన్నియో శక్తుల చేత నడిపింపబడుచున్నది. పంచప్రాణములు ద్విసప్తతి సహస్ర నాడీజాలము, ఇంద్రియములు, మనోబుద్ధ్యహంకారములు ఇత్యాదులే ఆశక్తులు. వీనియందు తత్తత్ప్రభావకర్మాదులచేత తారతమ్యములు గలవు. దేహమున శిరస్సునుండి గుదస్థానము వరకు గలశక్తులు ఐదు వర్గములుగా నున్నవి. శుద్ధచైతన్యము ఐదుదశలు దాటి పొందిన పరిణామమే శరీరముయొక్క ఈ స్థూల స్థితి. ఈ పరిణామము చైతన్యదశనుండి జడత్వదశవరకు పర్యాప్తమై యున్నది. ఇదే పంచకోశ విషయము. శుద్ధచైతన్యమును ఈ అయిదుకోశములును అయిదుపొరలుగా కప్పియున్నవన్నమాట.

ఈకోశముల సృష్టికి, కోశరూపపరిమాణమునకు, ఈకోశములను పాలించుశక్తులకు కారణము ఒక్కశక్తియే. ఆ శక్తి ఈ ఐదు కోశములకు అతీతమగు స్థానమునం దున్నది. ఆశక్తియే చిచ్ఛక్తి యనబడినది. ఈశక్తులన్నియు కొన్నిస్థానములందు కేంద్రీకృతములై యున్నవి. దేహమునందు అట్టికేంద్రములు ఆరు కలవు. ఆరవది చిచ్ఛక్తిస్థానము. ఇవన్నియు చక్రము లన బడెను. షట్చక్రాతీతస్థానము శిరస్సునందు కలదు. అచ్చట శివశక్తిరూపమగు సర్వకారణ బిందువు కలదు. యోగశాస్త్ర మీవిషయమునే నాడులు, ప్రాణములు, కుండలిని ఇత్యాది శబ్దజాలముతో వర్ణించును. కాని అది ఒకపాటి అధికారము గలవారికే అవగతమై ఉపయోగించును. మరింత తక్కువ అధికారము గలవారికి ఈవిషయము మరింత ఇంద్రియ సన్నిహితముగా ఉన్న స్వరూపమునం దుండవలెను గదా. కనుకనే ఈ శక్తులకు బ్రహ్మేంద్రాది నామరూపములు కల్పితములాయెను. సాధనకు తదనుగుణమైన ఉపాసనా ప్రధానమైన మంత్ర శాస్త్రము ఏర్పడెను.

(ఈ అధికార తారతమ్యములు వివిధమానవవర్గము లందుండుటేగాక, వయోభేదముల చేత, స్థితిగతులందలిమార్పుల చేత, జన్మసంస్కారాదులచేత ఒక్కనియందే కలుగుచుండ వచ్చును. అనగా ఒకప్పుడు బ్రహ్మభావనకు అనధికారి యైన వాడు జీవితములో ఒకదశలో పైనచెప్పిన కొన్ని కారణముల చేత పరిణామమునుచెంది అధికారి కావచ్చును. కావున అందరికి మంత్రయోగ వేదాంతశాస్త్రము లవసరమే; ఉత్తరోత్తర క్రమముగా ఉపాసనాదులనువిడిచి బ్రహ్మభావనాపద్ధతిని అవలం

బింపవచ్చును. కాని ఎట్టివారికిని మొదటినుండియే (బ్రహ్మ భావనామార్గము సాధ్యము కాదుగదా.)

కనుక మన దేశపు దేవతలు డయానా అపోలోలవంటి దేవతలుగారు అనువిషయము తెలుసుకొనుట మన దేశస్థులకు ముఖ్యముగా అవసరము. ఇది తెలిసినగాని హనుమంతుడు సముద్రము దాటుటయేమిటి, హంస మానవభాషలో మాట్లాడుట యేమిటి, కుండలో పుట్టుట యేమిటి, ఇవన్ని పిల్లలకు చెప్పవలసిన కథలు అను అపహాస్యధోరణి తొలగిపోదు. పురాణములందు చరిత్ర లేకపోలేదు. ఖగోళ భూగోళ శాస్త్రములు, చరిత్ర, తత్త్వవిషయములు అన్నియు ఉన్నవి. కాని ఏవిషయమైనను మూలతత్త్వముయొక్క దృష్టితోనే చెప్పబడును. కనుక వాస్తవముగా జరిగిన నలచక్రవర్తికథ తత్త్వ దృష్టితోనే భారతమున చిత్రింపబడెను. ఈ పద్ధతినే రామాయణాది కావ్యము లవలంబించినవి.

మార్కండేయ పురాణాంతర్గతమైన దేవీసప్తశతి అట్లు తత్త్వవిషయప్రతిపాదకమైన గ్రంథమే. సురథుడను చైత్ర వంశపు మహారాజు మహామాయానుభావమున ఎట్లు సావర్ణి మనువాయెనో మార్కండేయుడు క్రోష్టుకికి చెప్పుటయే ఈ కథ. సురథుడు శత్రువులచేత ఓడిపోయి స్వపురమునకు తిరిగి రాగా అచ్చట స్వభృత్యామాత్యులును అతని సేవ వదలి శత్రువులకు సేవకులై యుండిరి. కోశ మపహృతమాయెను. అప్పుడు సురథుడు వేటకను నెపమున ఏకాకిగా అడవికి పోయెను. అచ్చట మేధయను ఋషియొక్క ఆశ్రమమునందు ఆశ్రయము పొందెను. పోయిన రాజ్యమునుగూర్చి అచ్చట మమతతో

చింతించుచుండగా, సమాధియను వైశ్యుడతనిని కలిసికొనెను. ధనలుబ్ధులై తనను బాధించిన భార్యాపుత్రుల బారినుండి తప్పించుకొని అడవికి వచ్చినవాడు సమాధి. కాని అతడు దారాపుత్రులను తలచుకొని వారెట్లున్నారో క్షేమముగా ఉన్నారో లేదో అని చింతింపజొచ్చెను. రాజు పోయిన రాజ్యమునందు, వైశ్యుడు తనను బాధించి అడవికిత్రోలిన భార్యాపుత్రుల యందు మోహము విడువలేకపోవుట వారికి ఆశ్చర్యమాయెను. దీనికి హేతువేదో తెలుపుమని మేధానామ ఋషి నడిగిరి. ఆయన కిదంతయు మహామాయా ప్రభావముచేతనని చెప్పుచు మధుకైటభ వధ, మహిషాసుర వధ, శుంభ నిశుంభుల వధలను మూడు కథలను చెప్పి దేవీమాహాత్మ్యమును వర్ణించి ఆమెను పూజించినచో వారి అజ్ఞానము తొలగిపోవునని చెప్పెను. ఈ గ్రంథమునకు గాయత్రి ఉష్ణిక్ అనుష్టుప్ ఛందములు, ఋషి శక్తి బీజ కీలకాది షడంగాదులు చెప్పబడినవి గనుక ఇవి మంత్రములని పురాణముయొక్క ఉద్దేశము.

ఇందలి పాత్రలపేర్లు, సంభాషణలు, సన్నివేశములు అన్నియు అర్థాంతరస్ఫూర్తిగలవే. ఈ గ్రంథమునకు వ్యాఖ్యలు, టీకలు గలవు గాని ప్రస్తుతము శ్రీ శ్రియానందనాథులవారిచే ఆవిష్కరింపబడిన గర్భితార్థవిషయము అపూర్వరమణీయము. మూడు వధలయందలి రహస్యమును వివరించుచు శ్రియానంద నాథులవారు మూడు ప్రత్యేకగ్రంథములు వెలయించిరి. అందు శుంభ నిశుంభ వధకు చెందినది ఈ తృతీయ గ్రంథము. ఈ కథలోని నామధేయములే గ్రంథము రహస్యార్థగర్భితమని చెప్పును. రాజుపేరు సురథుడు, కోమటిపేరు సమాధి, ఋషి పేరు మేధా, సంసారమోహకారణ మేమిటనునది ప్రశ్న.

సురథ సమాధులు ఈ ప్రశ్నను మేధా నడుగుట. ఇది తత్త్వ విషయముగాక మరేమగును ?—

శ్రీ శ్రియానందనాథులవారు దీక్షితులు; కనుక తత్త్వజ్ఞులగుటేకాక సాధనరహస్యములు కూలంకషముగ నెఱిగినవారు. అట్టివారు దేవీసప్తశతియందలి రహస్యము నావిష్కరించుట జిజ్ఞాసువులకు ఎంతో లాభదాయకము. వారికృషి సప్రమాణము గాను బుధజనమనోహ్లాద సంధాయకముగాను ఉన్నది— సురథుఁడనఁగా జీవుడని చెప్పిరి. ఈమాట బాణముతో కొట్టినట్లు సూటిగా తగిలినది. ఇది శ్రుతిసిద్ధము. వారిచ్చిన కఠోపనిషద్వాక్యమేగాక శ్వేతాశ్వతరోపనిషత్తునందుగూడ జీవుడు రథిగా వర్ణింపబడెను. "ప్రాణాన్ ప్రపీడ్యేహసః యుక్తచేష్టః, క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత, దుష్టాశ్వయుక్తమివ వాహమేనం, విద్వాన్మనోధారయేతా ప్రమత్తః" యుక్తచేష్టలు గలవాడయి (జీవుడు అనగా సాధకుడు) ఇచ్చట ప్రాణములను నిరోధించి ప్రాణవాయువులు క్షీణించుచుండగా నాసికచేత ఉచ్ఛ్వసింపవలెను. విద్వాంసుడు (సాధకుడు) దుష్టాశ్వయుక్తమగు ఈ రథమునువలె మనస్సును అప్రమత్తుడై ధరింపవలెను అని ఈ శ్రుతి కర్థము. ఇచ్చట సాధకుడు రథిగాను, దేహము రథముగాను చెప్పబడినది గదా.

రాజు సురథుడుకాగా వైశ్యుడు సమాధి. ఈ గ్రంథమునందు యోగముచేత జ్ఞానమును పొందుపద్ధతి చెప్పబడినది. ఋషి మేధా అట. మేధా అనగా ఏదో కాదు. శ్రుతులందు జ్ఞానసాధనగా చెప్పబడినదే. బ్రహ్మసిద్ధి మేధచేతనే కలుగునని తైత్తిరీయమునందు కలదు. "బ్రహ్మ మేధయా మధు మేధయా

బ్రహ్మమేవ మధుమేధయా" ఇత్యాది. జీవేశ్వరాభేద జ్ఞాన సిద్ధికై మేధాభిమాన దేవతా ప్రార్థనము అందు చెప్పబడినది. "మేధా దేవీ జుషమాణా న ఆగా ద్విశ్వాచీ భద్రా సుమన స్యమానా." ఇత్యాది. అట్టి మేధ సాక్షాత్తు దేవియే. కనుక మేధాయై నమః. (ల. స. నా.)

ఈ మూడు వధలు వారు గ్రంథిత్రయ భేదనమని చెప్పిరి. దీనికి కథలందలి విషయ మాధారమగుటే గాక సప్తశతీ కారుడు బ్రహ్మ విష్ణు రుద్రులు ఈ మూడు కథలకు ఋషు లనుటచేత మొదటివధ బ్రహ్మగ్రంథి భేదనమనియు, రెండవది విష్ణుగ్రంథి భేదనమనియు, మూడవది రుద్రగ్రంథి భేదనమనియు సూచించినవాడాయెను. మొదటిది స్థూలశరీరాభిమానవధ, రెండవది సూక్ష్మశరీరాభిమానవధ, మూడవది కారణశరీరాభి మానవధ. దీనినే ఆగామి సంచిత ప్రారబ్ధ కర్మనాశనమనియు, సచ్చిదానందప్రతిష్ఠఅనియు శ్రీయానందనాథులవారు వివరించిరి.

ఇచ్చట రుద్రగ్రంథి తురీయసన్నిహితముగా ఉన్నది. అనగా మూలాధార స్వాధిష్ఠానోపరి అగ్నిస్థానము బ్రహ్మగ్రంథి, మణిపూర అనాహతోపరి సూర్యస్థానము విష్ణుగ్రంథి, విశుద్ధ ఆజ్ఞా ఉపరి చంద్రస్థానము రుద్రగ్రంథి. ఇందీ క్రమము చెప్ప బడినది. ఇచ్చట ఒక విశేషము కలదు. లక్ష్మీధరవ్యాఖ్యలో గ్రంథిక్రమము దీనికి వ్యతిరేకముగా కలదు. (14 శ్లో. సౌం.) "ప్రథమ ఖండోపరి అగ్నిస్థానం తదేవ రుద్రగ్రంథి రిత్యుచ్యతే, ద్వితీయఖండోపరి సూర్యస్థానం తదేవ విష్ణుగ్రంథి రిత్యుచ్యతే, తృతీయ ఖండోపరి చంద్రస్థానం తదేవ బ్రహ్మగ్రంథి రిత్యు చ్యతే – సోమసూర్యానలాత్మక మిత్యవరోహ క్రమేణావ

గంతవ్యం." ఇట్లే 10 శ్లోకవ్యాఖ్యయందు; "రుద్రగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః బ్రహ్మగ్రంథిం చ భిత్త్వైవ కమలాని భినత్తిషట్ ..." ఇత్యాది లక్ష్మీధరుడు దీనిని (10 శ్లో. వ్యా.) వామకేశ్వర తంత్రమునందలిదని చెప్పి ఉద్ధరించెను. కానీ లలితాసహస్రనామావళీ భాష్యమునందు భాస్కరరాయలు కూడా దీనినే ఉద్ధరించి చూపుచు క్రమమునుగూర్చి (111 నామం) "బ్రహ్మగ్రంథిం తతో భిత్వా విష్ణుగ్రంథిం భినత్త్యతః, రుద్రగ్రంథిం విభిద్యైవ కమలాని భినత్తిషట్ ..." అని చూపించెను. ఇట్లు గ్రంథి క్రమమున వ్యత్యాసము కలదు. భాస్కరరాయలే 104 నామమునకు వ్యాఖ్యయందు ఇట్లు చెప్పెను. "రుద్రగ్రంథి ద్వయం హృదయగతానాహత చక్రీయం విభినత్తీతి తథా అనుష్ఠానే ఏతద్వైపరీత్య మున్నేయం... ... శ్రీవిద్యాయాం చత్వారః ఖండాః - ఆగ్నేయసౌరసౌమ్య చంద్రకళాఖ్యాః...... తేషాం చతుర్ణాం మధ్యే త్రయో హృల్లేఖాభ్యాగ్రంథయః - తాశ్చతస్రః - క్రమేణ రుద్ర విష్ణు బ్రహ్మ సంజ్ఞకాః - తత్త్రియం విభినత్తి తదంతః ప్రవిశతి .." ఇత్యాది. కానీ 'ల.స.నా.'యందు గ్రంథిక్రమము లక్ష్మీధర వ్యతిరేకముగానే కలదు. "మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ ......" ఇత్యాది.

మంత్రార్థమెరిగి జపించినవారికే మంత్రము ఫలించును. కనుక సప్తశతీ హృదయమెరుగుట ముముక్షువుల కవశ్య కర్తవ్యము. అట్టి నిగూఢరహస్య మావిష్కరించిన శ్రీ శ్రియానంద నాథులవారు లోకమునకొక అపూర్వమైన మహోపకారము చేసినవారైరి. దీనిని వారు ఇంగ్లీషులోగాని లేక సంస్కృత

మునగాని అనువదించి ప్రకటించినచో వారుచేసిన ఉపకారము అధికసంఖ్యాకులకు లభింపగలదు. ఈ గ్రంథమునకు అధిక ప్రచారము కావలెనని నా కోరిక. ఇది ఒక అపూర్వకార్యము. దీనివలన కలుగు లాభములు:—

1. సప్తశతీ పారాయణముచేయువారు దీనిచే మంత్రహృదయ మెరిగి అధికఫలము పొందెదరు.
2. పురాణకథలు శాస్త్రవిషయములే అని తెలిసి పురాణ ములపై ఇపుడుగల అపోహ నశించును.
3. తంత్రశాస్త్రము కల్పించిన నామరూపములు, సిద్ధాంతములు పురాణములందు కథలుగా వెలిసినవని తెలిసి తంత్రముల తర్వాత పురాణములు పుట్టినవని విదితమగును.
4. వేదోపనిషత్తులకు పురాణములకు మధ్య తంత్రములు లంకె యని విశదమగును.
5. ఈ పద్ధతులే పురాణములనుండి ప్రాచీనకావ్యములందు ప్రవేశించెనని తెలిసి తద్ద్వారా సాహిత్యముయొక్క ఆద్యసంప్రదాయ మేదో గుర్తింపబడును.

శ్రీ శ్రీయానందనాథులవారి గ్రంథత్రయము చదువుట చేత గ్రంథిత్రయభేదన మగుటయే గాక అధికముగా ఇన్ని ప్రయో[illegible]లు సిద్ధించును. వారికి ముముక్షువు లందరు అధమర్ణు[illegible]

కడప
17-5-1965

ఇట్లు,
గుంటూరు శేషేంద్ర శర్మ

శ్రీమాత్రే నమః
ఓం నమశ్చండికాయై

# నావి రెండుమాటలు

ఇమ్మాట మూడవది. రుద్రగ్రంథిభేదము, ప్రారబ్ధ క్షయము, ఆనందప్రతిష్ఠ యనువాని సాధనమున కగు సామగ్రి యిందుఁ గానసగును. ఇదె దేవీమాహాత్మ్యమందలి యుత్తమ చరిత్రమను పేరఁ బరఁగు శుంభవధ కథ.

ఇందలి విషయము లతిగహనములు. సాధనభూమికలఁ గొన్నింట నడుగూని తొలి రెండుమాటలయందుఁ గ్రహింపఁ బడిన సత్యప్రాణప్రతిష్ఠాభ్యాసము గల సాధకులకు మాత్రమే సుగ్రాహ్యములని దోఁచుటచేత, తొలుమాటయం దుదాహ రించిన, పండిత శివనారాయణశర్మగారి సహాయము పలుసారులు పలుతావుల నపేక్షింపవలసిన యక్కఱపడినది. వారును నా వ్రాయు జాబులకు విసువక సమాధానము లిచ్చుచు నా సందే హములను దీర్చుచు నాధ్యాత్మిక రహస్యముల నెన్నిటినో వివరించి తెల్పిరి. అట్టివారి సాయమే లేకున్న నిది యీ విధమున రూపొందెడిది కాదు. ఇటీవల నుత్కలదేశీయ సాధకులలో నా మిత్రు లొకరు చండీపాఠమునకు "సాధన సమర" మను పేర, వంగదేశీయ సాధకోత్తము లొకరు విపులవ్యాఖ్య వ్రాసిరని వింటిని. వంగభాషతో నాకుఁ బరిచయము లేదు. అది లభించు తావునుం దెలియక యది రావించుకొను ప్రయత్నమును జేయలేదు. శ్రీ పండిత శివనారాయణశర్మగారు హిందీభాషలో నిచ్చిన సహాయసంపదతోనే తృప్తినొంది నా యోపినంత వ్రాసితిని.

సప్తశత్యుపాసా పిపాసువుల కుపకారి యగునట్లు, సక్ర
మోపాసన విధానమును మూలముతోఁ డీకాతాత్పర్యములతో
షడంగసంపన్నముగా దీనికిమున్నే నా వ్రాసియుంచిన "సప్తశతీ
సర్వస్వ"మను పేరిడి వెలువరించు నా కోరికను సప్తశతీస్వరూప
దుర్గాంబ యచిరకాలముననే దీర్ప శాక్తబంధువర్గము నాశీ
స్సుల నర్థించుచున్నాఁడను.

నా యభ్యర్థనమును స్వీకరించి ఈ మన్మూడవమూట
యెడ నాశీఃపూర్వకముగా నమూల్యాభిప్రాయము నిచ్చిన,
సాధక పండితోత్తములగు బ్రహ్మశ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ
స్వామిగారికి, శ్రీ కుంటూరు శేషేంద్రశర్మగారికి నా వినయ
పూర్వక నతిశతి సంకేతము.

సాధనగ్రంథమండలి నిర్వాహకులు, విద్వాన్ శ్రీ బులుసు
సూర్యప్రకాశశాస్త్రిగారు నా రచనములను దమ గ్రంథమండలి
పక్షమున సర్వాంగసుందరముగఁ బ్రకటించు భారము వహిం
చిన ఫలముగా శ్రీదేవి వారి నిత్యాధికముగా సాధనగ్రంథ
ప్రకాశమునకుఁ బ్రోత్సాహశక్తిరూపమున ననుగ్రహించుటే
కాక, సర్వసంపదున్నతులను జేసి సాకుఁగాతమని యా యమ్మ
నర్థించుచున్నాను.

అయాచితముగా సహజౌదార్యముతో నిమ్మూట
ముద్రణమునకు ధనమిచ్చినవారు శ్రీయుతులు —

1 అరిపిరాల వెంకటసోమాచార్యులుగారు రు 100 లు,
2 వడ్డి దాలిశెట్టిగారు రు 100 లు,
3 గుడ్ల వాసయ్యశ్రేష్ఠిగారు రు 116 లు,
4 కూచి సూర్యనారాయణమంత్రులుగారు రు 50 లు,

5 వేమూరి రామకృష్ణయ్యపంతులుగారు రు 100 లు,
6 కాపులూరి రామచంద్రారెడ్డిగారు, నెల్లూరు. రు 116 లు.

ఈ ద్రవ్యయజ్ఞనిపుణులు శ్రీమాతృకృపా సుధాభిషేచనమున నిత్యానందమయులై మందురుగాతమని యాశాసించు—

శ్రీకాకుళము
25—4—65.

నిరంతర శుభచింతకుఁడు, శాక్తబంధుఁడు,
శ్రీ శ్రియానందనాథుఁడు,
ఈశ్వర సత్యనారాయణశర్మ.

## కృతజ్ఞతాంజలి

"ఓంకారపఞ్జరశుకీ ముపనిష దుద్యానకేలి కలకంఠీమ్,
ఆగమ విపిన మయూరీ మార్యా మంతర్విభావయే గౌరీమ్॥

అంబికానుగ్రహముచే 'సాధనసామగ్రి' మూఁడవమూట పాఠకలోకముయొక్క కరకమలములయందు ఉంచఁగల్గినందుల కెంతయు సంతసించుచున్నాము. తొలుమూట, మలుమూట చదివియున్న పాఠకులకీ మూఁడవమూట మిక్కిలి రుచించగలదు.

సాధనావిషయమై తగినంత విజ్ఞత యలవడకున్నను, గతానుగతికముగా ఆచరణప్రవృత్తులైనవారికీ గ్రంథములు సర్వసంశయములను నివారించగలవనుట నిర్వివాదము.

ఎన్నో మహార్థములు నిండియున్న యిట్టి గ్రంథరత్నములను సముచితరీతి ప్రకటనకగు ధనసహాయముతో మా మండలి కొసఁగిన గురువరేణ్యులు, శ్రీ శ్రియానందనాథుల పాదపద్మముల కనవరతము ప్రణతుఁడను. — అంతేవాసి,

తెనాలి
27—6—65

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుఁడు : సాధన గ్రంథమండలి.

# శ్రీమాత కిది యంకితము.

ఈం కారవాచ్య! ఐం హ్రీం
క్లీం కమనీయాంగి! ఇత్తుఁ గృతి నీకే; కో
మ్రోంకృతితో; నీ యమృత మ
యాంకమ్మునఁ జోటు నుంచుమా! చాముండా!

శ్రీకర శ్రీకరమ్మునఁ ద్రిపుటి బోధ
మును సడల్చు త్రిశూలముఁ బూని, మహిష
నామక రజోగుణప్రవినాశిని వగు
నమ్మ, విమ్మాటలెల్ల నీ కచ్చుకొందు.

ఏయమ, అబ్బి! వ్రాయుమని యీ పరమార్థ రహస్యబోధముల్
వ్రాయఁగ నెన్ని దేండ్లు పనిపట్టఁగఁ గట్టడచేసె, నమ్మహా
మాయవు, నాత్మవున్, సకలమాతవు; నీ కృతులెల్ల నిత్తు నీ
కే; యవి యందుకోఁదగు మహేశ్వరి! యర్హులు లాఁతులెవ్వరే?

చిరముగ నాత్మదృష్టులు త్వదీయముఖమ్మున నిల్పు సాధనన్
బోరపడనట్టి నీప్రియతనూజులు నాకవరుల్ పవిత్రు లీ
సరకులె దారిబత్తెముగ, జన్మరుజాపహ శర్మదౌషధో
త్కరముల పైఁడిసంచికలుగాఁగని సద్గతిగాంత్రు, చండికా!

తల్లితనమ్ముఁ జూపి, యిడి ధన్యునిఁ జేసితి; చూచి యిచ్చితిన్
ముల్లెలు మళ్లి నీకె; ప్రియపుత్త్రిల కంటను బెట్టు బవ్వ, నా
వల్లనుగాదు మోయ; సదుపాయముచూడుము నీవె; యాఢ్యులా
పిల్లలు కొల్లగాఁ గలరు; పేదఱికమ్మటె నీకు? శ్రీమతీ!

— శ్రీ శ్రియానందనాథుఁడు





ఈ గ్రంథ రచనమునందుఁ దగు సామగ్రిని విరివిగా నాకందించిన అద్వైత విద్యాలంకార - పండిత శివనారాయణశర్మగారు, సంగా ఫిరోజాబాద్ - ఆగ్రా జిల్లా

గ్రంథకర్త :

శ్రీ శ్రీయానందనాథుఁడు, శ్రీకాకుళవాసి

**ఈశ్వర సత్యనారాయణశర్మ**

"ధన్యోఽహం కృతకృత్యోఽహం, సఫలం జీవనం మమ,
ధన్యోఽహం ధన్యధన్యోఽహం బ్రహ్మానందం విభాతిమే.
ధన్యోఽహం ధన్యోఽహం దుఃఖం సాంసారికం నవీక్ష్యతేఽద్య,
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితం క్వాఽపి,
ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం నవిద్యతే కించిత్,
ధన్యోఽహం ధన్యోఽహం ప్రాప్తవ్యం సర్వమద్య సంపన్నమ్ ॥"



శ్రీ శ్రీ శ్రీ
అవధూతేంద్ర సరస్వతీస్వామి

శ్రీ శ్రియానంద నాథుఁడు
ఈశ్వర సత్యనారాయణ శర్మ

విషయసూచిక

ఓం ఈం నమః

శ్రీ మాత్రే నమః

ఓం నమశ్చండికాయై

# సాధన సామగ్రి

## మూడవ మాట

ఉత్తమ చరిత్ర యనబడు శుంభవధ కథ యందలి సాధనసార భాగము. ఇందు, ఆనందప్రతిష్ఠ — రుద్రగ్రంథి భేదము — ప్రారబ్ధక్షయము అను పేళ్లతో నొప్పు సాధనమున కగు సామగ్రి, శ్రీ మాతృదత్త్వమును జూపఁదగును.

ద్వితీయ చరిత్రమున మహిషాసురుఁడు చంపఁబడెను. విష్ణుగ్రంథిభేదము — సంచిత కర్మక్షయము, చైతన్యప్రతిష్ఠ యను లాభము సాధకుఁ డొందెను.

సాధకుని సంచిత కర్మసంస్కారములవల్లనైన చిత్త విక్షేప మణఁగినది. కామనావిషయవాసనల వలని పీడ యిపుడు లేదు. మఱల ముమ్ముందు కలుగునని సంశయ మును లేదు. ప్రాణమయగ్రంథి భేదమైనది. ఇపుడు సాధకులు, అంతరమునం బొందిన ప్రాణరూపమగు (చైతన్య రూపమగు) జ్ఞానము, వెలిని వ్యక్తమగు విశ్వరూపమున భాసించినదని తెలియవలయును. లక్ష్యముపడిన చోటనే పూర్ణజ్ఞానమయసత్త, విభిన్ననామరూపములతోఁ ప్రకాశిం

చును. జడత్వబోధ మించుమించుగాఁ దొలఁగినది. పరము ప్రియతమమైన ప్రాణము (చైతన్యము) తక్క మఱేమియు నెచ్చటను గానఁబడదు. సాధారణదృష్టికి జడముగాఁ దోఁచు నది వాస్తవముగ జడము కాదు. ఇది వట్టిమాట కాదు. సరిగదా, శ్రీ గురూపదిష్టమైన యుపాయముచేతను, విశ్వమును చైతన్యప్రతిష్ఠ యనెడి సాధనము సహాయముచేతను, జడప్రకృతి యిపుడు చిన్మయ మాతృమూర్తి రూపమునఁ బ్రత్యక్షము కాఁజొచ్చును. జీవమాత్రుఁడు మాత్రంకమం దున్న నగ్నశిశువనెడి మాట, విచార సహాయముచేతను, యుక్తి సహాయముచేతను, తెలియఁబడదు. స్మరణమాత్రము ననే ప్రాణమయ మాతృస్వరూపము భాసింపఁజొచ్చును. ఇపుడు భయమున్నది లేదు. విశ్వమయ మాతృకర్తృత్వ దర్శనమగుటచేతఁ గర్తృత్వజ్ఞాన మస్తమించి పోవును. సాధకుఁడు సకల సంసారచింతలనుండి నిష్కృతింబొందు సుయోగముపట్టినది. ఔరా! అనేక జన్మార్జితపుణ్యమును, అపార గురుకృపయు, జీవు నిట్టి శాంతిమయావస్థయందుఁ జేర్చును గదా! కాని ప్రబల ప్రారబ్ధ సంస్కారము క్షయింపలేదు. "అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః" (ప్రణవగీత)— ఇట్టిదనరాని యొక మహాశక్తి ప్రబల ప్రేరణముచే, నిచ్ఛ లేకున్నను గర్మము సాగఁజొచ్చును. సాధకుఁడు "న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః" అని తెలిసికొనఁగల్గినను గర్తృత్వాభిమాన బోధము (నేనీ పని చేసితిననెడి బోధము) మాటిమాటికి వచ్చి నిల్చి జ్ఞానమును వెనుకకు నెట్టును.

అంతే కాదు. మాత్రంకప్రాప్తికై (పరమాత్మ స్వరూప స్థితికై) యింత ప్రయాసము (అనేక జన్మముల సుఖదుఃఖ సహనము) అగుచున్నదని తెలియుఁడు. ఇంతదనుక దేనిని బొందినచో నిజముగా జీవనము పరిపూర్ణమగునో, దేనిని దెలియుటయుఁ దెలియకుండుటయు నిజముగా నోరఁ జెప్ప వీలుకాదో, ఆ వస్తువవఱకు మనము పోలేదు; కనుక మనము పొందిన తెలిసికొన్న రవ్వంతయు వ్యర్థమే యగుచున్నది. దేనిని జర్చించువేళ నుపనిషదృషులు ప్రశాన్త చిత్తముతో "నోన వేదేతి వేద" నేను దానిని దెలియవలయును. అది దానిని దెలియదు. ఏలన — "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" "అన్నిటిని దెలిసికొనుదాని నెటు లెవరివలనఁ దెలిసికొనుట? మనము దాని నెఱుంగము" అనిరి. అది మన 'నేను' రూపమున నుండుటచేత మన మెఱుఁగ మనుట కేవల సత్యము. అపుడది యెవరు? 'మే మెఱుఁగుదుము; మే మెఱుఁగము' అని చెప్పునదేది? అది యెంత మనోవాగగోచర మైనను, ఎంత భావాతీతమైనను, ఎంత దురధిగమ్యమైనను గానిమ్ము, దానిని గోరుము. దానిని వెదకుము. యథార్థముగా నవశ్యముగా నది చిక్కును. పొందుట, పొందకుండుట, తెలియుట, తెలియకుండుట యనెడి భ్రమము పూర్తిగాఁ దొలఁగినపుడుగాని, సాధకుని లోని దైన్యము సమూలముగాఁ దొలఁగదు. ఏమన — జీవుఁడు బ్రహ్మము నుండి వచ్చినాఁడు; అతఁడు మఱల బ్రహ్మమునం దుప శీతుఁడు గాఁజాలనంతకు, నీ యతృప్తి తొలఁగనే తొలఁగదు. అతృప్తియు మన యమ్మ మూర్తియే. అమ్మ యా

మూర్తితోనే ప్రతి జీవుని హృదయమందు నిత్యము విరాజి ల్లును. మనము తెలిసియో తెలియకో నానాఁటికి నమ్మె వంకకే పోఁగలుచున్నాము. ఈ యతృప్తి ప్రభావమునల్లనే, ఆగామి సంచితకర్మక్షయమైనను, వీడని ప్రారబ్ధసంస్కారము క్షయింపనంతఁదాక, జీవుఁ డేవిధముగాను స్థిరపడఁజాలఁడు— ప్రారబ్ధ మొకడుఃఖము కాదు. అది యానందలీల — విలా సము మాత్రమే. దీని పూర్ణానుభవము కానంతవరకే, ప్రారబ్ధసంస్కారము దుఃఖదాయకముగాఁ దోఁచును. ఇదె రుద్రగ్రంథి, జ్ఞానమయగ్రంథి యనఁబడును. ఇది ముస్ముందు వివరింపఁబడును.

"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విందతి॥"

ఈ విశ్వ మానందమయమనియు, ఆనందమే దీనికి ఉపాదానమనియు, ఆనందమే దీనికి నిమిత్తమనియు, మఱి యానందమే దీనికి గమ్యమనియు, నింతదాఁక సాధకునకు అనుభవము కాలేదు. సత్యప్రతిష్ఠా బలముచే (ప్రథమ ఖండము) సత్సంధానము లభించినది. ప్రాణప్రతిష్ఠా బల ముచేఁ (ద్వితీయఖండము) జిత్సంధానము లభించినది. ఇపుడు (తృతీయ ఖండమువలన) ఆనందమయ ప్రతిష్ఠితుఁడు కాఁగల్గి నంతనే సాధకు జీవనము చరమ పరమార్థత నొందును.

విజ్ఞానమయ క్షేత్రమును జేరినంతనే యీ విశ్వము కేవల బోధరూపముగా భాసింపఁజొచ్చును. ఈ బోధ మాత్మయే యని తెలియనంతదాఁక, ఈ బోధస్వరూప

వస్తువు నీరసముగాను నానందహీనముగానే తోఁచుచుండును. గాని వాస్తవముగా నిది రసహీన శుష్కబోధ మాత్రము కాదు, నిక్కముగా నానందమయ చిద్వస్తువే, ఆనందఘనాత్మయే యని తెలియఁగలుగునపుడే జీవుని రుద్రగ్రంథి (జ్ఞానమయగ్రంథి) విడిపోవును. అపుడు జీవుఁడు ప్రారబ్ధము ననుభవించుచున్నను, దానిని దుఃఖదాయకముగాఁ దలఁపలేఁడు. విశ్వ మానందమువల్లనే యైనది. తన దేహ మానన్దమయ పరమాత్మ సమష్టియే, యని మనసునకుఁ దట్టఁజొచ్చును. ఈ యవస్థయందు జీవుని ప్రత్యేకచింతయుఁ గార్యమును, ప్రతినిఃశ్వాస పర్యంతము నానందమయాత్మ స్ఫురణముగానే యనుభూతమగుచుండును.

ఏ విధముగాఁ జీవుఁడీ తత్త్వమందుఁ (ఆనందమయాత్మ క్షేత్రమున) జేరఁగలఁడో, అదె, మేధసమహర్షి శుంభ నిశుంభవధ ప్రసంగమందు జీవాత్మఁ డనెడి సురథునకుఁ దెలిపెను. ప్రాణప్రతిష్ఠా - సంచిత కర్మక్షయ - విష్ణుగ్రంథి భేదన-మహిషాసురవధప్రసంగము తరువాత రాఁబోవు రహస్యమును (ఆనందప్రతిష్ఠా - ప్రారబ్ధక్షయ రుద్రగ్రంథి భేదన - శుంభ నిశుంభవధ రహస్యమును) జెప్పెదనని సూచించి, యిపుడు ఆ ప్రతిశ్రుతవిషయము నుపదేశింపఁ బూనెను. కనుకనే 'ఋషిరువాచ' యను మాటతో నధ్యాయారంభ మైనది. (ఈ రుద్రగ్రంథిభేద - ఆనందమయ ప్రతిష్ఠోపదేశమందలి సాధనమునకైన సారభాగములే 'సాధనసామగ్రి' మూడవ మాట.)

గురుశిష్య సంబంధము సరిగా నిటులే యుండును. శిష్యుఁడు యథార్థానందమయ స్వరూపమునందుఁ బ్రతిష్ఠితుఁడు కానంతసేఁపు, గురుఁడు శిష్యునకుఁ బ్రశ్నములు వేయ నవకాశమీయఁడు. అధికారి యగునపుడు (ఉపయుక్త సమయమురాఁగా) తన్నాతఁడడుగకయే వాని సర్వసంశయములను దానే తొలఁగించి వేయును. తగు సమయముచూచి, అమ్మరయే యిట్లు మేలుచేయుచున్నదని యాతఁ డనుభవింపఁ గల్గును.

అనేకులు శిష్యు లపుడపుడు శాస్త్రోక్తముగా నధికారులగుటకు మున్నే, గురువును బ్రశ్నముమీఁదఁ బ్రశ్నము వేసి వ్యాకుల పెట్టుదురు. ఒక్కనాఁడే సర్వసంశయములుఁ దీర్చుకొనఁ జూతురు; కాని యీ ప్రాణ (శక్తి) వస్తువు గుహ్యాతమ రహస్యమగుటచే నతిదుర్లభము. కేవలోపదేశ కేవల పుస్తకపఠనములచే నీ పరమాత్మ వస్తుప్రాప్తి కాఁజాలదు.

తన సంతానమునకు నాఁకలి యెప్పుడగునో, యెట్టి యాహారవస్తువు లేసంతానమున కుపయుక్తములో యనునది తల్లియే మిక్కిలిగా నెఱుఁగును. మాతృరూప శ్రీగురునిపైఁ గర్తవ్యమును నిర్ధరించు భారమును బెట్టక, యెవ్వఁడేనిఁ దానే యా బరువును మీఁద వేసికొన్నచో నభిమానము నిల్చిపోవును. అభిమాన ముండునంతదాఁక శ్రీగురుకృపానుభవము కాదు. గురుకృపలేక మోక్షలాభ మసంభవము. చూడుఁడు — అర్జునుఁడు సాధకశ్రేష్ఠుఁడు. శ్రీకృష్ణుఁడే

సాక్షాద్గురువైనవాఁడు. విభూతియోగపర్యంతము నుపదేశ మొందియుఁ దుదకుఁ జేతులు జోడించి, "మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో। యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥" (గీత॥)

యోగేశ్వరుఁ డతనికిఁ జెప్పుచున్నాఁడు. 'నేను (నీవు) ఏ భావముతోనున్నను, యోగావస్థాభావ మెన్నఁడునుండదు.' అనెను. నేను – ఈ నీ ననెడి జ్ఞానమందుండి నీ యహంభావ మును జూడఁదగినవాఁడవైనచో, నన్ను నీవు లోను వెలిని జేసుకొని నీ యవ్యయాత్మభావమును జూపుము.

ప్రభువా! నీవు నన్ను విశ్వరూప సందర్శన యోగ్యు నిఁగాఁ దలఁచినచో, నొక్కసారి యా యవ్యయ స్వరూప మును దయతోఁ జూపుము. ఈ వాక్యముచేత నెంత చక్కని భావము, ఎంత నిరభిమానము, ఎంత వినయము, ఎంత శ్రద్ధయు నర్జునునియందుఁ దోఁచునో చూడుఁడు. శిష్యుఁడీ విధముగాఁ దన కర్తృత్వ బోధము గురుచరణములయం దర్పింపఁ గల్గునపుడే, జిజ్ఞాసకు మఱి తావులేదనియు, గురుఁడే స్వయ ముగా, నేది యావశ్యకమో చూచుకొనుననియుఁ గనుఁ గొనును. అపుడు శిష్యుఁడేమియుఁ జేయనక్కఱలేదు. గురుఁడే శిష్యుఁడు చేయవలసినదానిని జేయించును, గనుక శాంతము లేక, అధికారసంపన్నుఁడుగాక, సాధనక్షేత్రమం దున్నతి నాశించుచో ఫలలాభమందు విలంబమగునన్న నింతయు వింత లేదు.

ఈ శుంభవధ మనెడి యుత్తమచరిత్ర మతిగహనము. వైచిత్ర్యపూర్ణము. ఉత్తమాధికారి కాక, నిర్మలబుద్ధి కాక, ఈ రహస్యమందుఁ బ్రవేశించుటసాగదు. గాన మనము మన యేకాన్తాశ్రయమైన మాతృచరణములకుఁ మ్రొక్కి మాతృకృపను యాచించుకొన్నచో, నామెయే మన బుద్ధి వృత్తులను నిర్మల మొనర్చును. అపుడీ యపూర్వ రహస్యపు యాథార్థ్యము తెలియును.

## గురుకృప, శాస్త్రకృప, ఆత్మకృప.

ఈ మూడు కృపలును లేక యెవ్వఁడును మోక్షరాజ్యమందుఁ బ్రవేశింపఁజాలఁడు. ఈ మూడుకృపలరూపముతోను దల్లియే వెలయుచున్నది. అమ్మయే గురువు; అమ్మయే శాస్త్రము; అమ్మయే యాత్మ. అమ్మయే కృప. శాస్త్రవాక్య సముదాయము కేవల జడలిపికాదు. అది ప్రాణమయము (చైతన్యమయము). నిత్యచైతన్యమయి యమ్మయే శాస్త్ర వాక్యరూపమున వెలసి, జీవులమైన మన యజ్ఞానాంధ నేత్రమును జ్ఞానాంజన శలాకతో విప్పునని యెఱింగియే, మన మమ్మను స్మరింపవలయును. కరుణయే అమ్మమూర్తి. అమ్మ సంతానవత్సల. అమ్మయే దుర్గమ పరమాత్మ తత్త్వమందుఁ జేర్చును. జీవునకు శాస్త్ర వాక్యముల చైతన్యమయత్వము ననుభవించు యోగ్యత నమ్మ ప్రసాదింపనంతదాఁక, ననంత శాస్త్రములఁ జదివినను అజ్ఞానము తొలఁగదు. కనక బుద్ధి రూపముతో వెలసి యమ్మయే, మనకీ యతిగహన తత్త్వ

మందు మున్నఁగల శక్తిని ప్రసాదించునపుడే మన సంశయము లెల్లఁ దొలఁగును.

1. పురా శుంభనిశుంభాభ్యా మసురాభ్యాం శచీపతేః ।
త్రైలోక్యం యజ్ఞభాగాశ్చ హృతా మదబలాశ్రయాత్ ॥

## శుంభుఁడు — అస్మిత.

"దృగ్దర్శన శక్త్యో రేకాత్మతైవాస్మితా" (పతంజలి 2-6) బుద్ధి, పురుషుఁడు (జీవుఁడు) అనువాని యభేదాభిమానమే 'అస్మిత'యని పేర్కొనఁబడెను. పురుషుఁడు-భోక్త; బుద్ధి - భోగ్యము. ఈ రెండు నొక్కటికాదు. శోభార్థకమైన 'శుమ్భ' ధాతువు వలన శుంభపదము కలిగినది. ఈ విచిత్ర విశ్వము, ఈ స్త్రీపుత్త్రాదులతోడి సంసారము, ఈ ధన యశఃఖ్యాతులు, ఈ స్థూల సూక్ష్మదేహములు, అన్నియు నీ యస్మితయందే నిల్చియున్నవి. జాగతికపదార్థ సమూహములు నీ యస్మితయొక్క వేర్వేఱు వ్యూహములే.

## అస్మిత యనఁగా నేమి?

'అస్మి' యను పదమునకు భావార్థకమైన 'తా' ప్రత్యయము చేరఁగా, 'అస్మితా' శబ్దమైనది. 'నేను, నేను' అను భావము పేరే 'అస్మిత'. జీవుఁడేపని చేసినను, ఏమి యోజించినను, ఆ యన్నిటితో 'నేను' అనునది చేరియే యుండును. ఈ 'నేను' అనెడి భావముపైనే యీ విశ్వ బ్రహ్మాండములు

నిల్చియున్నవి. ఈ దేహాత్మబోధ సంబంధమైన యహంకార స్వరూపము 'నేను' కాదు. అది విజ్ఞానమయకోశ సంబంధమైన యహంత యనుట మఱువకుఁడు. సాధకుఁడు బుద్ధి (విజ్ఞానమయ) కోశమందు అహంత నుపసంహరింపఁ గల్గినపుడు, అనఁగా 'నేను' అనఁగానే సాధారణ లోకులకు స్థూలదేహమని తోఁచునటులే, సాధకుఁడు 'నేను' అనునపుడు విజ్ఞానమయ కోశమునే పట్టుకొనును. అనఁగా దేహాత్మబోధమునకు బదులు, విజ్ఞానాత్మబోధము సుదృఢమగును. అపుడే యీ యస్మితా స్వరూప మనుభవయోగ్య మగును. దేవీమాహాత్మ్య ప్రథమ ద్వితీయ ఖండములందు, ఏ కేంద్రమందు నిల్చుటకుఁగాను సాధకుఁ డుపదేశింపఁబడునో, యా కేంద్ర మాతని కాయ త్తీభూతమగును. అనఁగా నిచ్ఛామాత్రముననే విజ్ఞానమందు నిల్వ సమర్థుఁడగును. అపుడే యతఁడీ యస్మిత జాడ నెఱుంగును.

## అస్మితా విస్పష్ట వివరణము.

ఆత్మను లాంతరులోని దీపకళికనుగాను, బుద్ధిని లాంతరుయొక్క చిమ్నీగాను భావింపుఁడు. దూరమునుండి చూచునపుడు, గాజుచిమ్నీ కాంతిగానే తోఁచును. సమీపించి, ధ్యానపూర్వకముగాఁ జూచునపుడు, వత్తి వెల్గుట కానవచ్చును. అటులే, సాధారణముగా దేహమే యాత్మగా (నేనుగా) వ్యవహరింపఁబడును, గాని, సాధకుఁడు విజ్ఞానమయ కోశమందుఁ జేరినపుడు, వానికి బుద్ధికంటెను ఆత్మ వేఱని తెలియఁజొచ్చును.

పాతంజల దర్శనమందు "దృక్ఛక్తి పురుషుఁడుగాను, దర్శనశక్తి బుద్ధిగాను" జెప్పఁబడినది. ఈ రెంటియందును బ్రతీతమగుచున్న యభిన్నత్వము పేరే 'అస్మిత'; అనఁగా బుద్ధియే యాత్మగాఁ బ్రతిభాత మగునపుడు, అస్మిత యనఁబడును. ఇదియును నొకవిధమైన క్లేశము. అవిద్య, అస్మిత, రాగద్వేషములు, అభినివేశము అను నైదు క్లేశములలో, నిది యొకటి కదా! ఇదే దేవీమాహాత్మ్య భాషలో శుంభ మహాసురుఁడు. విషయేంద్రియములు, మనస్సు, అనున వన్నియు బుద్ధి పర్యవసానములు. రూపరసాదీంద్రియ గ్రాహ్య వస్తువులు, చక్షురాదీంద్రియములు అనువాని కెంత చంచలత (క్రియాశక్తి) కలదో యదియంతయు బుద్ధిని జేరి సమాప్తమై పోవును. బుద్ధికంటెఁ బైని నుఱి విషయేంద్రియ సంబంధము లేదు. ఈ బుద్ధియు నస్మితయు నభిన్నములు. నిశ్చయాత్మిక వృత్తియు నహంతాబోధమును బూర్తిగా నభిన్న పదార్థములు. నిశ్చయత్వమునకును అహంతా ప్రతీతికిని భేదము లేదు. కార్యగత విభిన్నతను లక్షించియే యారెంటికి (బుద్ధికి, అస్మితకు) విభిన్నవ్యపదేశములు చేయఁబడినవి.

సాధకుఁడు సత్యప్రతిష్ఠా ప్రాణప్రతిష్ఠాఫలముగా నీ బుద్ధితత్త్వమందాత్మబోధము నుపసంహరించి కొంతకాలము నిల్చును. అనఁగా నస్మితను (బుద్ధిని) ఆత్మగా భావించును. అమ్మ యసురుల నాశ్రయించిన వారలకిట్టి విపర్యయజ్ఞానము (భ్రాన్తి) చాల నాళ్లుండదు. అమ్మ తానే యీ సూక్ష్మతమ క్లేశమనెడి మహాసురుని జంపి, తన యథార్థరూపమును

ప్రకాశింపఁజేయును. అయినను ఆ శుభముహూర్తము రానంతసేఁపు, సాధకుఁడు ఇంతయో, అంతయో పీడింపఁ బడుచుండును. ఈ పీడనము వెలి కెవ్వరికిని దెలియదు. సాధకుఁడు మాత్రమే తనలోఁ దానీ యస్మితాక్లేశము ననుభ వించుచు బాధపడుచుండును. ఈ యస్మితా క్షేత్రమందుఁ జేరిన సాధకుఁడు "నాకన్నియు లభించెను. అన్నియు నెఱింగితిని. బహుకాలమునుండియున్న జన్మమృత్యుభ్రమము పోయినది." అనుకొనుచుండును. సాధారణ మానవునిబట్టి చూడఁగా నతనికిఁ గొంత విశిష్టత కలిగినమాట సత్యమే, కాని యెచటఁ జేరినపైని, జెప్పుట కేమియు లేదో, సర్వక్లేశ ములుఁ బూర్తిగాఁ దొలఁగిపోవునో, అజ్ఞానము తుదముట్ట నశించునో, యాస్థానమందాతఁ డింకను జేరికొనలేదు. అతఁడు స్నేహాశీతలమైన శ్రీమాత యొడిని సర్వభావాతీతమును త్రిగుణ రహితమునైన మాతృవక్షమును, సర్వభయహార మును, అమృతమయమునునైన యభయపదము నొక్కసారి చేరుకొన్నచో, నీ జగద్భ్రమము పూర్తిగాఁ దొలఁగిపోవును. అపుడు జగత్తనుటకును జీవుఁడనుటకును, నేను అనుటకును నేమియు నుండదు. అదే యమ్మ వక్షము. ఓహో! ఎంత సుఖమయము! మధుమయము! ఆనందమయము! ఆ స్థానమును, ఆ నేనులేని నేనును జేరలేనంతవఱకు, నీ జగత్సత్తను మీఱిన త్రిగుణాతీతమైన మాతృవక్షమునందు, వ్యష్టియైన నేనును జేర్పలేనంతవఱకు, బ్రహ్మాండకర్తృత్వము, సృష్టిస్థితి ప్రలయ శక్తి, సర్వజ్ఞత మున్నగు నైశ్వర్యములు లభించినను మనసు తనియదు. చల్లఁబడదు. క్లేశము తొలఁగదు. అంతదనుక

నిచ్ఛతోనో అనిచ్ఛతోనో, యీ యసురుని యత్యాచారము నోర్వవలసినదే. అది యట్లుండనీ.

## నాఁ డుపాదేయములు, నేఁడు హేయవర్జనీయములు.

బ్రహ్మ విష్ణుగ్రంథి భేదప్రసంగమునందు సాధకుల కే స్థానమందుఁజేరుటకై విశేషించి సంకేతములు చేయఁబడినవో; ఏ సేనను బొందుటకై యుపదేశము లీయఁబడినవో, అవే యుత్తమచరిత్రమందు (శుంభవధమందు) అసురులుగా వర్ణింపఁ బడినవి. అవియును జంపఁబడవలయును. మున్నుపాదేయము లుగాఁ జేకొనఁదగినవే, సాధనములుగా నుపదేశింపఁబడినవే యిచట హేయములుగా, వర్జనీయములుగా వ్యాఖ్యానింపఁ బడును. సాధనరాజ్యమం దిటులే యగును. నేఁడు తప్పక యాశ్రయింపఁదగినదే కొన్నాళ్లవెనుకఁ బూర్తిగా వర్జనీయ మగును. నానాటి కిట్టి వర్జనీయభావము రాకున్నచో నదేమి సాధనము? బహుత్వపరిత్యాగము, ఏకత్వలాభము అనునదే సాధనము. ఆ యద్వైత తత్త్వమందుఁ జేరఁజాలనంతదాఁకఁ గోరిమో కోరకో వర్జనము తప్పకగును. మాతృచరణము నందుఁ జక్కఁగ నాత్మార్పణముచేయు సంతానమునకు, ఇట్టి వర్జనము ఇచ్ఛాపూర్వకముగా జరుగదు. అమ్మ కృపచేఁ దనంతట నదియే యగును. ఈ వరుస నీ యస్మిత (శుంభ మహాసురుని) యొక్క స్వరూపము, మఱియుఁ దెల్లముగాఁ జెప్పఁబడునపుడు మఱింత చక్కఁగాఁ దెలియును.

నిశుంభుఁడు (శుంభుని తమ్ముఁడు) మమత — 'నాది, నాది' యను భావము పేరే మమత. సాధారణ భాషలో, మమత యనఁగా నేమి తోఁచునో, అది యిది కాదు. ఇది విజ్ఞానమయ కోశమునకుఁ జెందిన మమత. ఆ సూక్ష్మ తత్త్వమందు వికసించు మమత్వజ్ఞానమే నిశుంభుఁడు. విజ్ఞానమయ కోశము జాడనెఱుంగని వార లీ మమతాస్వరూపము జక్కఁగా నెఱుంగలేరు. ఏలన — కేవల మస్తిష్క ధర్మము వలనఁ దెలియునది కాదు. 'నా జ్ఞానము, నా బోధము' అనుటచేఁ బొందఁబడు మమతయే యిది. అస్మిత 'అహం' యొక్క సూక్ష్మావస్థయైనటులే, మమతయును సూక్ష్మతమమైన యొక భావవిశేషము. ఈ రెండును అన్నదమ్ములు. అస్మిత యున్నచోటనే మమత యుండును. కనుకనే శుంభనిశుంభు లనెడి ఈ యిరువురి విషయము మన కొక్కచోటనే కానవచ్చును.

### ఇక్కడ శచీపతి పరమాత్మ; దేవరాజు కాఁడు.

శచీపతి మాయోపహిత చైతన్యము. సాధారణముగ శచీపతి పదముచే దేవరాజైన ఇంద్రుఁడే తోఁచును. అయిన నిచట నీ పదము పరమాత్మ పరముగానే చెప్పఁబడెను.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" శ్రుతి॥

ఇంద్ర = అంతరాత్మ. అనఁగా, బ్రహ్మమునకు మాయ వల్లనే యా రూపమయ్యెను. శచీ = మాయ, ఆమెపతి — మాయోపహిత చైతన్యము. మంత్రమందు శచీపతియని ప్రయోగింపక, ఇంద్ర శబ్దప్రయోగము చేయుటచే, వెన్క-

మాయోపహిత చైతన్యమనుకొనక, నిర్గుణబ్రహ్మమను కొందురనెడి యాశంకతో మహర్షి మేధసుఁడిచట శచీపతి శబ్దమునే ప్రయోగించెను. శచీపతి పదముచే సాంఖ్యుల భాషయందు—మహత్తత్త్వము, ప్రతిబింబిత పురుషుఁడు; వేదాన్త భాషయందుఁ—గూటస్థ చైతన్యము; భగవద్గీత యందు—అక్షరపురుషుఁడు; అని తెలియుచున్నది. శచీపతి శబ్దమున కిట్టి యర్థముఁ జేయుటచేఁ బలువురు దీనిని గల్పితార్థ మనుకొందురు, కాని పైనిచ్చిన శ్రుతి ప్రమాణముచే నింద్ర శబ్దము బ్రహ్మవాచకమని తెలియును. శ్రుతియందుఁ బలు తావుల నిట్టి ప్రయోగము కానవచ్చును. ఇది తక్క 'శచీ పతే స్త్రైలోక్యం' శచీపతియొక్క ముల్లోకము లనినంత నెట్లును దాని యర్థము దేవరాజు అనఁబడదు. ఏలన – దేవరా జింద్రుఁడు త్రిలోకపతి కాఁడు. కేవల స్వర్గాధిపతి. త్రిలోక పతి పరమేశ్వరుఁడే. త్రిలోకశబ్దమునకు యథార్థముగా స్థూల సూక్ష్మకారణములనెడి మూఁడు విధములుగాఁ బ్రకా శించుటే యర్థము. ఈ మూఁడు విధములైన ప్రకాశమున కధీశ్వరుఁడు, ఒక్క మాయోపహిత చైతన్యమనెడి సగుణ బ్రహ్మముకంటె మఱేమియుం గాఁజాలదు.

కానిమ్ము; మంత్రమందు శుంభనిశుంభు లసురులు— (సురభావ విరోధులు) వీరు మదమును బలమును నాశ్ర యించి శచీపతియొక్క **మూఁడు** లోకములను సర్వయజ్ఞ భాగములను హరించిరి. మదము=గర్వము; బలము=సామ ర్థ్యము. అస్మితా మమతల ధర్మమే మదము. ఈ జగత్తు

నాయందే యున్నదనెడి గర్వభావము శుంభ నిశుంభులకు స్వాభావికము. మఱి నేనే జగత్కర్తను, పాతను, సంహర్తను, అని తలంచువాని సామర్థ్య మెంత గొప్పదో, దానిని వ్యాఖ్యానమువలనఁ దెలియనక్కఱలేదు.

ఇఁక శచీపతియొక్క త్రైలోక్యమును యజ్ఞభాగములను హరింపఁబడుటన నేమో తెలియఁగలుగనంతనే, యీ ప్రథమ మంత్రార్థ మొక విధముగా బోధపడును. అది కఠినము గనుక విశదాలోచనము చేయవలయును. స్థూల సూక్ష్మ కారణములకు నిజముగా నధిపతి శచీపతియే. అనఁగా మాయోపహిత చైతన్యమే కాని, అస్మిత కాదు. అస్మిత బుద్ధి తత్త్వము. అదియు దృశ్యజడము (మాయికము). చైతన్య సత్త వల్లనే దాని యునికి. దానికి వేఱొక సత్త యేదియు లేదు. ఉండదు. కాని, అస్మిత యసురుఁడు. వాఁడు తనను సర్వమయు జగత్కర్తగా నెన్నుకొను చున్నాఁడు. "నాయందే జగత్తున్నది. నేనే సర్వభావాధిష్ఠాతను." అనుకొనును. మఱి తన్నుఁ బ్రకాశింపఁజేయు వాఁ డొకఁ డున్నాఁడను నిట్టి భావన చేయలేఁడు. కనుక నజ్ఞాన వశమునఁ ద్రిలోకాధిపత్యమును దాను గ్రహించినాఁడు. ఇంతేకాదు, యజ్ఞభాగములను సైతము లాఁగికొన్నాఁడు. ఈ విచిత్ర బ్రహ్మాండమందు జరుగు యజ్ఞరూపకర్మములను, వాని ఫలములను వాఁడు తనయందే కాంచును. "మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం। మయి సర్వం లయంయాతి॥" అనుకొనుచు సర్వజగత్తుల యుత్పత్తి స్థితి

లయాదులైన సర్వకర్మములను, వాని ఫలములను దనయందే దర్శించును; గాని ఈ నేను శబ్దముచే, అహంవర్జితమైన, అద్వయ జ్ఞానస్వరూపమైన, యాత్మయనెడి 'నేను' లక్ష్యముగాఁ జేయఁబడినది. 'నేను' అనుటచే యథార్థముగా, నెవఁడనుకొనఁదగునో, యా పరమాత్మను విడిచి — అనఁగా యథార్థ పరమాత్మ స్వరూపమును బరిగ్రహింపకుండుటచే, అస్మితయే యాత్మరూపమునఁ బ్రతిభాత మగుచున్నది. ఇదియే శుంభాసురుని యథార్థ రహస్యము.

యజ్ఞభాగము=హవిస్సు - అమృతము. భాష్యకారులు శ్రీ శంకరులు, ఉపనిషద్భాష్యమందు "లోకాః కర్మసు చామృతమ్" అనెడి మంత్రవ్యాఖ్యయందు, అమృతశబ్దమునకుఁ గర్మఫలమని యర్థము చేసిరి. సర్వకర్మఫలరూప యజ్ఞభాగము=అమృతము; అస్మిత యనెడి యసురుఁడు తన యందే యున్నట్లు కాంచును. కావున మంత్రమునందు "త్రైలోక్యం యజ్ఞభాగాశ్చ హృతాః" అని చెప్పఁబడినది.

## అస్మిత (శుంభుఁడు) అసురుఁడే.
## మమత (వాని తమ్ముఁడు నిశుంభుఁడు) అసురుఁడే.

అయ్యసురు లిద్దరు, సూర్యచంద్ర కుబేర యమ వరుణ వాయ్వగ్నుల యధికారములను దామే చెలాయించిరి.

ఆధ్యాత్మిక వ్యాఖ్య:- సాధకుఁడు, అస్మితా తత్త్వముఁ జేరినపుడే సూర్యచంద్ర యమ వరుణాది దేవతలు, నా విశేష ప్రకాశములే యని గ్రహింపఁగలఁడు. విషయగ్రహణమున

కైన సర్వేంద్రియములును, దానిపై నధిష్ఠించియున్న చైతన్య మంతయును, అస్మితయొక్క వేర్వేఱువ్యూహములే. బాహ్య వస్తువునందు సత్యప్రాణప్రతిష్ఠ చేయఁగాఁ జేయఁగా, సాధకుఁ డిట్టి సత్తయం దుపస్థితుఁడగును. మఱియు రూపరసాది విష యములు, చక్షురాదీంద్రియములు, స్మృతి, కల్పన, నిశ్చ యాది వృత్తులును 'నేను' అనుదానికంటె వేఱు కావనియే తలంచును. ఇవన్నియు నా విభిన్నాకారములే. దవ్వులనున్న సూర్యచంద్రాది జ్యోతిష్కమండలము పర్యంతము నాయందే యున్నది. దారపుత్త్రాత్మీయ స్వజనము, ఈ స్థూలదేహము, మున్నగున దంతయు నా సత్తచేతనే నిల్చియున్నది. నేనే యీ యనేక రూపములతో వెలయుచున్నాను. నేనే వీనిని ప్రబోధించుచున్నాను, గావుననే యివి యున్నవి. నాబోధము కాక వీని కెట్టి యస్తిత్వమును లేదు. కనుకనే నేను వానికిఁ బ్రభువను. కర్మము చేయుచున్నను నవి యకర్తలే. మఱి నేనే ధాతను, సంహర్తను. బహుపుణ్య బలముచేతను, గతిన సాధన ఫలముగాను, సాధకుఁ డిట్టి యీశ్వర క్షేత్రమందు జేరఁగలఁడు. కాని, ఔరా! ఇవియు నాసురభావములే. కనుక సర్వజగత్తు దేనినుండి పుట్టి, దేనియందు నిల్చి, దేనియందుఁ జేరి పోవునో, యా వస్తువు (నేను) అస్మిత కాదు. ఆత్మ. మన యమ్మ. అస్మితయు దృశ్యమాత్రమే. అది యాత్మసత్త చేతనే సత్తావంతమగుచున్నది, గాని యది యథార్థ సత్త వైపు లక్ష్యముంచక; తననే జగత్కర్తగాఁ దలంచినది. కను కనే యది యసురుఁడు.

ఈ యవస్థ క్షణిక విజ్ఞానవాదుల యవస్థతో నొక్కించత కలిసి మెలసి యున్నది. విజ్ఞానవాదులు "జగత్తు దృశ్యము, భోగ్యము నైనది. అంతకంటె వస్తేమియుఁ గాదు; మన క్షణపరిణామి విజ్ఞాన సమూహము ఇక్కాన వచ్చు విశ్వరూపమునఁ బ్రతీత మగుచున్నది" అందురు. కానిమ్ము.

సాధకుఁడు, "నేను" అను వస్తువును సరిగాఁ బట్టుకొనఁజాలనంతవఱకు నిట్టి భ్రాంతి తప్పకగును. సాధకుల కనేకుల కిట్టే యైనది. అగుచున్నది.

'నేను' అనుదానికి రెండర్థములుకలవు. 1 వాచ్యార్థము 2 లక్ష్యార్థము. 'నేను' అనఁగానె బోధమయము విజ్ఞానమయమునై సర్వభావములతోఁ జేరియున్న 'నేను' అనునదే లక్షింపఁబడును. అదే 'నేను' అనుదాని వాచ్యార్థము. మనము జాగ్రత్ స్వప్న సుషుప్తులం దేమి చేయుచున్నామో, ఏమి విచారించుచున్నామో, ఆ ప్రత్యేక కార్యముతోను నేను (అహంభావము) ప్రకాశించును. సర్వభావములతోఁగూడి, అనఁగా బూర్తిగాఁ జేరియున్న నేనే — నేను అనుదానికి వాచ్యార్థము. ఇపుడు సుషుప్త్యవస్థయందు 'నే నేమియుం జేయ లేదు. విచారింప లేదు.' కనుక నపుడు అహంత్వజ్ఞానముండదు. అను శంక కలుగవచ్చును. అది వాస్తవము కాదు. సరిగదా — సుషుప్తియందు సైతము 'నే నేమియు నెఱుఁగను' అని మేల్కొన్నతర్వాత ననును. కావున నపుడు కూడ, అజ్ఞానమునుగూర్చిన జ్ఞానముండనేయున్నది. ఈ మూ

దవస్థలయందును సర్వభావములతోను (నాకు) నేను అనుదానికి సంబంధమున్నది. ఉండును. అను నిట్టి ప్రతీతి లేదు; అది భావాతీతము. వాఙ్మనసుల కగోచరము. ఆత్మరూపియైన 'నేను' సర్వభావములతోఁగూడి, నేనుగానే తెలియఁబడు చున్నది. కావున నీ విశుద్ధబోధస్వరూపమైన పరమాత్మ వసువే తెలియఁబడును (కానఁబడును). ఈ యహంతా ప్రతీతియు నచట లేదనుట మఱువకుఁడు. ఏలన నీవులేనిచోట నది లేదు. అనఁగా దృశ్యము జ్ఞేయమునైనదాని సంపూర్ణా భావమే. (అనఁగా దృశ్యజ్ఞేయములు లేనే లేవనుట.) అచట మిగిలియున్న దేదో యది స్వరూపముచే 'నేను' అయి యున్నను. 'నేను' అను మాట యింతయుఁ బ్రయోగింపఁ బడదు. కావున మొదటి నేనును విడిచి 'నేను' అనుచు, ఆత్మవస్తువ్యాఖ్యయే చేయఁబడుచున్నది.

ఒక దృష్టాన్తమువలన మన మీ విషయము నెఱుంగఁ జూతము. ఒకఁడు "అంగుల్యగ్రే కరిశతమ్" అన్నాఁడు. అనఁగా "వ్రేలితుద నొక వంద యేనుఁగులు." అని యర్థము. వ్రేలికొనను వంద యేనుఁగు లుండుట కేవల మసంభవము. కనుక వ్రేలితోఁ జూపఁబడిన భూభాగమం దొక వంద యేనుఁగుల యునికి తెలియఁబడును. సరిగా నిటులే 'నేను' అను మాటచేఁ బ్రతిపాదింపఁబడు నస్మిత యనెడి వస్తువు యథార్థముగా నాత్మకాదు. ఆత్మ యనునది, ఆ యస్మితను సైతము ప్రకాశింపఁ జేయునది, యనుట తెలియక, సాధకుఁడు అస్మితనే యాత్మగాఁ దలంచునంత వఱకు, అతఁడు శుంభాసుర రూపమున నాత్మ మహత్త్వము

(ఆత్మ విభూతి) నపహరించి కూర్చుండును. ఆ యవస్థలో సాధకుఁడు, ఆత్మ నిర్గుణము, సర్వధర్మ వివర్జితము ననియు, దానిని బొందుట, పొందకుండుట యను రెండును సమానములే యని తలంచును, గాని యీ యస్మిత యను నది యథార్థముగ నీశ్వరుఁడే; ఈశ్వరధర్మము లన్నియు నందుఁ బ్రకాశించును; గాన సర్వభావాతీతమై జడమువలెఁ దోఁచు నాత్మను వెదకుటవల్ల నేమి ప్రయోజనమని తలంచును. ఇట్టి యజ్ఞానమువలన (అనఁగా నసురభావము వలన) సాధకుఁడు సుడిలోఁ బడిపోవును. ఎప్పుడైనను అస్మితను విడిచి నిర్గుణాత్మ తత్త్వము ననుభవించుటకు సావధానముగా యత్నించి, భావాతీత స్వరూపముయొక్క స్వరూపమును, రవ్వంత యస్పష్టముగానైన నెఱుంగనపుడు, దానిని వాఙ్మనసుల కతీతమైన బ్రహ్మస్వరూపముగా నెఱింగి, ఇఁక మనము తెలిసికొనఁదగిన దింతయు లేదనుకొనును. కాని యిపుడును సాధకుఁడు సరిగాఁ దెలిసినవాఁడుకాఁడు. ఇది యొక యనుభవ మాత్రనే.

మున్ను, ఏ విజ్ఞానమయ కోశము (బుద్ధి తత్త్వము) ఆశ్రయణీయముగాఁ జెప్పఁబడినదో, దాని నిచట, మహర్షి మేధసుఁడు, అసురరూపముగా వ్యక్తీకరించినాఁడు. నిశుంభాదుల తోడుగల మహాసురుఁడు నిహతుఁడైనంతనే జీవత్వము నిక్కముగా నంత మొందును. జీవత్వావృతి మూలము పూర్తిగాఁ దెగిపోవును. ఈ విజ్ఞానగ్రంథి భేదముగుటవల్లనే, జీవుఁ డానందనికేతనమును జేరును. కేవల గురుకృపయు నాత్మకృపయు లేక, యెట్టి సాధన బలముచేతను, ఈ విజ్ఞాన

గ్రంథి భేదన మగునని మనము అనుకొనలేము. ఇచట సర్వ విధ సాధనలును, కేవల మాతృకృపాకటాక్షముపైనే, తీవ్ర స్నేహాకర్షణముపైనే యాధారపడి యున్నవి.

### శుంభుని దేవాధిపత్యాహరణాలోచనము.

మంత్రమందు శుంభుఁడు సూర్య చంద్ర యమ వరుణానలానిల ముఖ్యదేవతాధిపత్యములను హరించెనని యున్నది. చైతన్యముయొక్క విశిష్ట భావములే దేవతలని మున్నె చెప్పఁబడెను; గాని యిచట నస్మితనే యాత్మగా (ఈశ్వరుఁడుగా) గ్రహించుటవలన దేవతల (ఇంద్రియాధిష్ఠిత చైతన్యము — క్షిత్యాది పంచభూతాధిష్ఠిత చైతన్యము) యొక్క చిద్భావము అస్మితచేఁ దిరస్కృతమని చెప్పఁబడెను. దేవతలు తమతమ చిద్భావముతో నెడసి, కేవల జడమును దృశ్యమునైన యస్మితాంశరూపముగా నయిరి.

ఈ ప్రాణమునకు సూర్యుఁ డధిపతి, దేవత యనుకొనుము. ఆత్మయొక్క యే యంశమందీ ప్రాణమయ విశిష్ట బోధమగునో, అదె సూర్యుఁడు. ఆత్మయొక్క యా విశిష్టబోధమే సూర్యుని సూర్యత్వము. శుంభుఁడనెడి యస్మిత యాత్మబోధమును బూర్తిగాఁ దిరస్కరించినది; కనుకనే సూర్యదేవుఁడును దన యధికారమునుండి తొలఁగిపోయెను. తక్కిన దేవతల విషయమునను నిటులే యెఱుంగునది.

కేవల జడాస్మిత తననే యాత్మగా (చైతన్యముగా) నెంచునపుడే, ప్రాణము మనస్సు మున్నగువాని యధిష్ఠాన

చైతన్యరూపమైన సూర్యచంద్రాది దేవతాబృందము జడత్వమువల్లఁ దిరస్కరింపఁబడెను. శుంభునిచే దేవతాధిపత్యము హరింపఁబడెనను దానిరహస్య మిదియే.

3. తతో దేవా వినిర్ధూతా భ్రష్టరాజ్యాః పరాజితాః ।
హృతాధికారా స్త్రిదశా స్తాభ్యాం సర్వే నిరాకృతాః॥
4. మహాసురాభ్యాం తాం దేవీం సంస్మరంత్యపరాజితాం।
తయా స్మాకం వరో దత్తో యథాపత్సు స్మృతాఖిలాః ॥
5. భవతాం నాశయిష్యామి తత్ క్షణా త్పరమాపదః ।

పిమ్మట నయ్యిరువురు మహాసురులచే నెట్టివేయఁబడి రాజ్యభ్రష్టులై పరాజితులై దేవతలు, తమతమ యధికారములనుండి విచ్యుతులై, యపరాజితాదేవిని స్మరింపఁ గడగిరి. ఏలన – మహిషాసుర యుద్ధాంతమందు, ఆ దేవి "మీకెప్పుడే విపత్తి వచ్చిపడినను, నపుడు నన్ను స్మరించినచో, మీ గొడవలనన్నిఁటిని నేను దొలఁగింతు"నని వరమిచ్చినది.

వివరణము:— శుంభనిశుంభుల యత్యాచారముచే దేవతలు పీడింపఁబడి, యోడి, రాచఱికములు తొలఁగి, భయకంపితులై యధికారహీనులైపోయిరి. దేవతలనఁగాఁ జైతన్యముయొక్క విశిష్టాభివ్యక్తి మాత్రములని చెప్పితిమి కదా. చైతన్యమనఁగాఁ జిచ్ఛక్తి (అమ్మ). దేవతలు, మేము మాత్రంకమందు సర్వవిధములఁ బ్రతిష్ఠితులమని యెఱుఁగుదురు. తమతమ విశిష్టతల నవలంబించియే, చిత్ క్షేత్రమందు స్వర్గరాజ్యమందు నివసించుట దేవతల ప్రకృతి; యైన నిపుడు, అస్మిత తన్నాత్మ రూపముగా నెన్నుకొన్నది. కనుకనే ఆ

యస్మిత, తమ తమ యధికారములయం దాయస్మిత యెపుడు కన్ను వేసెనో యపుడే దేవతాగణము, చైతన్య విశిష్ట భావముతో వెలయక, అస్మితయొక్క వ్యూహ విశేషములుగాఁ బ్రతిభాసించినవి. అస్మిత యథార్థముగఁ జిద్వస్తువుకాదు. కనుకనే యది దేవతలకుఁ జిత్పదార్థా స్వాదము నీయఁజాలదు. అమృతరసపానముచేసి దేవత లమరు లనఁబడిరి. ఆ యమృత మిపుడు జడామృతమువలనఁ దిరస్కరింపఁబడినది, గాన వారు దేవతలయ్యును స్వర్గ రాజ్యమునుండి (చిత్ క్షేత్రమునుండి) నెట్టివేయఁబడిరి. ఇంకను విశదముగాఁ జెప్పికొందము. ఇదిగా–మన చూచుట, వినుట, మున్నగు నే యింద్రియవ్యాపారమే కానిండు, అన్నిటికి మున్ను, అహంభావ మొకటి (నేను జూచితిని, నేను వింటిని, అను భావము) నిల్చుచుండును. ఆ 'అహం'ను నేను అనెడి శుంభాసురుని బరిత్యజించి యింద్రియాధిష్ఠిత చైతన్యవర్గము, క్షణమైనను స్వతంత్రముగ నుండఁజాలదు.

చూడుము, నీ వెచట నెట్టి యవస్థయందైననుసరే, నీ విషయమున, నీ యింద్రియాధిష్ఠిత చైతన్యవర్గ విషయ మున, 'నేను' అనెడి (అహంకారమనెడి) శుంభాసురుని సహింపరాని సూక్ష్మాత్యాచార మెట్టిదో, చూడుము. అమ్మతక్క మతెక్కడను నేమియు లేదన్న మాట, వేయిసార్లు తట్టుచున్నను, హృదయమం దెప్పు డీ 'నేను' పొడుచుకొని వచ్చునో, అపుడు, 'అమ్మ – నేను' అను రెండిటియందును నొక తెగని వ్యవధానము వెలయుచుండును. నీవు ధ్యాన

ధారణాదులే చేయుము, సమాహితావస్థలోనే యుండుము, ఆ నీ సూక్ష్మాహంకారము, నిర్మల మాతృవక్షమునుండి నిన్ను దవ్వు గెంటివేయును. నీ వొక వంద ప్రయత్నములు చేసియు, నా వ్యవధానమును దొలఁగింపఁజాలవు. ఈ యత్యాచారము నేఁటిదేకాదు. ఏ యనాదికాలమునుండియో, నీ హృదయ సింహాసనమందు, ఈ యస్మిత యనెడి శుంభాసురుఁడు, ఎక్కి కూర్చుండి, నిన్ను ఆత్మరాజ్యమునుండి తొలఁగించెను. ఇదెవ్వరును గనుఁగొనలేదు. ఈ యత్యాచారము జీవుని హృదయమందుఁ జిరమై సాగుచునేయున్నది. కాని మధు మహిషాసురుల (అనఁగా – కామనా వాసనల, కామక్రోధాది శత్రువుల) యత్యాచారమును దొలఁగించుటకు సాధకులు పనిచేయుచున్నంతదాఁక, మఱియొకవైపు లక్ష్యముంపఁ బనిలేదు. సామర్థ్యము నుండదు. దేవతలు మధుకైటభ మహిషాసురుల యత్యాచారముచే నింతవఱకుఁ బీడింపఁబడిరి. ఇపుడు సాధకు లిది తెలిసికొనవలయును. మాతృకృపచేతను శ్రీగురుని యవ్యాజాశీర్వాదముచేతను, స్థూలేంద్రియాదుల యత్యాచారము శాంతించినది. స్వరూపమువంకఁజూచు సామర్థ్యము వచ్చినది. ప్రశాన్తచిత్తముతో నొకసారి తన వర్తమానావస్థను బర్యవేక్షించు సుయోగము పట్టినది.

ఇపుడు దేవతలు తమ తమ యధికారములపై దృష్టి వఱపి, మన మింతదనుక నే యాసురభావములచేఁ బీడింపఁ బడితిమో, యా పీడ యతిస్థూలమనియు, ఇపు డింకను, అతి

సూక్ష్మోపద్రవము లున్నవనియు, అవి బుద్ధిచేయు (అస్మిత చేయు) నత్యాచారము లనియుఁ దెలిసికొనఁ గల్గితిమి. అస్మిత వలన మన యథార్థాధికారములు లాఁగికొనఁబడినవి. మన మన్నివిధములచేతను, ఆత్మ (అఖండచిచ్ఛక్తి) యొక్క యాశ్రయమందున్నాము. కాని, ఔరా! ఇపుడీ జడాహంతయే మన యేకాన్తాశ్రయముగాఁ బ్రతీత మగుచుండుటచే మిగుల శోచనీయావస్థ గాక మఱేమగును? అని తెలిసికొనిరి.

### *శుంభమహాసురుని జంపుట కడు దుస్తరము.*

యథార్థముగా నీ సూక్ష్మాహంత బహుభయానక వస్తువు. తొలుత స్థూలదేహాభిమానముపై నిల్చిన యహంత (స్థూలాహంకారము) యనునదియును, గురుచరణ శరణాగతి సహాయముచేఁ దొలఁగినప్పుడే యది మనోమయదేహమందు (సూక్ష్మశరీరమందు) నిల్చును. ఈ యవస్థయందు పలు విధములైన సాధన భజనాదు లనుష్ఠింపఁబడును. క్రమముగా "నేను భగవత్సాధనయందు నిరతుఁడను, నేనొక సాధకుఁడను" అను నిట్టి యహంబోధము బలియఁజొచ్చును. శ్రీగురుని యవ్యాజకృపచేతను; సాధకుని సాటిలేని సాధనపటిమచేతను, అది యచటనుండి తొలఁగింపఁ బడినను, ఆ 'నేను' మహాశయుఁడు యథాపూర్వముగానే — కాదు కాదు, మున్నిటికంటె నధిక శక్తిమంతుఁడై బుద్ధిక్షేత్రము నాశ్రయించి కూరుచుండును. వీఁడే శుంభమహాసురుఁడు. వీనిని జంపుట కడు దుస్తరము.

అప్పుడే అమ్మను స్మరించి ప్రణతులగు పనిపడును.

తొలుత బుద్ధి నవలంబించి సాగుచుండిన సాధన మందును నహంతాదోషము తగుల్కొన్నదని తెలియును. సాధకుఁడు తొలుతనుండియు "అమ్మ నా కెడమై పోవు చున్నది. గాని రాకున్నది" యని తలంచుచున్నాఁడు గానఁ బ్రాణము లొడ్డియైన నహంతను దొలఁగించుటకుఁ బ్రయ త్నించును. మొదట స్థూలదేహమునుండి తొలఁగించును. క్రమముగా నది యింద్రియ మనస్సుల హద్దును దాఁటి బుద్ధిక్షేత్రమందుఁ గాలూనుకొనును. ఇక్కడఁజేరి సాధకుఁ డిది విజ్ఞానమయకోశపు టహంతయని తెలిసికొనును. మిగుల గొప్పదియైనను, ఈశ్వరతుల్యములైన సర్వ దేవాధికార ములు దీని చేతిలో నున్నవి. దీనిని నెట్టివేయుట సులభము కాదు. మఱి యీ యహంతవల్లనే యాత్మరాజ్య తిరస్కార మగుచున్నది. చెప్పెడి దేమనఁగా — విజ్ఞానవస్తువు సయితము జడ (దృశ్య) మాత్రమే. ఈ యనుభవము క్రొత్త సాధకు లకు రాఁజాలదు. విష్ణుగ్రంథిభేదనము జరిగినవారలే బుద్ధి యొక్క జడత్వము ననుభవింపఁగలరు. ఏమైనను, ఈ యవస్థ యందు సాధకుల యింద్రియాధిష్ఠాన చైతన్యవర్గము నిరుపా యమై కాతరమతితో నపరాజితాదేవియొక్క స్నేహమును స్మరించును. ఆమెను స్మరించుటచే మఱెవ్వరికి నెన్నఁడుఁ బ్రణతులగు పని పడదు.

సాధకులారా! రండు, దేవతల వలెనే మనమును అమ్మా! అమ్మా! యని యేడ్తము. అమ్మ స్నేహవిహ్వలయై

మనస్సున కతీతమైన క్షేత్రమందు దిగి, మనల నీ దుర్జయా హంత చేతినుండి తప్పించి రక్షించును. అమ్మా! యని యేడ్చినపుడే యామె వచ్చును. మున్నే వరదానము చేసినది. రండు తల్లిని స్మరింతము. స్తుతింతము. *

## దేవతలు హిమాలయముకడ దేవిని స్తుతించుట.
## పార్వతీమూర్తితో, అమ్మ గంగాస్నానమునకు వచ్చుట.

దేవతలు స్తుతించిరి. అమ్మ పార్వతీమూర్తితో గంగా స్నానమునకు, అచటికి వచ్చెను. స్తుతిపాఠవేళ దేవతలలో సాత్త్వికభావ ముదయించి యానందాశ్రు లురలఁజొచ్చెను. అదే జాహ్నవీతోయము. పలుసారులు మాతృ నామస్మరణ మాతృ విభూతి దర్శన, కాతరకంఠ రోదన, భక్తివినమ్రతా ప్రణామములచేఁ దప్పక గు ఫలమే, ఆనందాశ్రురూప గంగా జలము. అం దాడుటకే యమ్మ వచ్చినది. బిడ్డల భక్తిపూర్ణా శ్రువు లనెడి స్వర్గంగాజలమందే మన యమ్మ మునుఁగ

* శుంభవధమును గోరిన దేవతలు చేసిన స్తుతి సమగ్రవ్యాఖ్య నాల్గవమూటలోఁ గలదు. శ్రీదేవీమాహాత్మ్య (సప్తశతి) చరిత్రత్రయమందలి స్తుతుల వ్యాఖ్య మూలమంత్ర సహితముగా నాల్గవ మూటగా వెలువడినది. అందు 1. మధుకైటభవధమునకై బ్రహ్మకృతస్తుతి. 2. మహిషాసుర వధాంతమున శక్రాదికృత స్తుతి. 3. శుంభవధమును గోరిన దేవతలు చేసిన స్తుతి. 4. శుంభవధానంతరము దేవతలు చేసిన స్తుతి (నారాయణీస్తుతి) — ఇవే నాల్గవ మూట.

నభిలషించును. తాపత్రయ సంతప్తసంతానము నార్తనాదము విని యుడికిన యమ్మ గుండె చల్లఁబెట్టుకొన నిష్కపట ప్రేమాశ్రుజలమే కావలయును గాన, అమ్మ వడిగా నచట నావిర్భవించినది.

దేవతాగణము అమ్మను స్తుతించుటకు హిమాద్రికి (స్థూలదేహాభిమానమునకు) దిగి వచ్చెను. కనుక మన యమ్మయు స్థూలమందుఁ బార్వతీమూర్తితో వెలసెను. అనఁగా నీ స్థూలవిశ్వమందే విశేషించి మాత్రావిర్భావము (ఆనందమయ మాతృసత్త) అయినది. ఈ పరిదృశ్యమాన జగత్తు వట్టి జడవస్తువు కాదనియు, ఆనందమయ మాతృ మూర్తియే యనియు, జగత్తునందలి ప్రతి పరమాణువును ఆనందాభివ్యక్తియే యనియు, ఆనందమయ పరమాణు రాశియే మజల నానందమయధారణ శక్తివలన జగదాకార మునఁ గానవచ్చుచున్నదనియు నెఱింగిరి. పదార్థము పదా ర్థము కాదు, ఆనందమయ ఘనసత్త. పర్వతము పర్వతము కాదు, ఆనందఘన పార్వతీయమూర్తి. రూప రసాదు లానందమయాత్మ సత్తయే. క్రిందుమీదులఁ గుడి యెడ మల, ముందువెన్కల, నెటుచూచిన సర్వత్ర యొక ఘనసత్త యానందమయ మాత్రనే, యను నిట్టి యనుభూతి నొందు నపుడే మనమును దేవతలవలె, ధన్యులమైతి మనియు, మన యాశలు నెఱవేఱుననియుఁ దలఁపఁగలము.

*వారికి జన్మదుఃఖము తప్పదు — ఎవరికి; ఎప్పుడు ?*

పరమాత్మ తత్త్వజ్ఞాన శూన్యులైనవారికి. ఏలన వారి దేవతోపాసనము అవిధిపూర్వకము. మోక్షప్రదము కాదు. ఈ సందర్భమున భగవంతుని మాట "అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవ చ" ఇత్యాది. నేనే సర్వ యజ్ఞభోక్తను. నేనే సర్వయజ్ఞాధ్యక్షుడను. నేనే దేవతాది సర్వజీవుల యాత్మను. నేనే యా మూర్తులతో విరాజిల్లు చున్నాను. కనుక నే భోక్తను. అంతేకాక, సాక్షాత్పర మాత్మ భావముతోను నేనే భోక్తను. శ్రుతి — "యస్య బ్రహ్మచ క్షత్రంచ ఉభే భవతి ఓదనమ్ । ఋతం పిబన్తౌ సుకృతం చ లోకే" ఇత్యాదివాక్యములచే నా భోక్తృత్వము ప్రసిద్ధము. కాని యీ భోక్తృత్వము జీవుల భోక్తృత్వము వంటిది కాదు. జీవుడు, అనుప్రవిష్టుడై యనుభోక్త యగుచున్నాడు. నేను పరమేశ్వరుడను. సంభూతి శక్తి బలముచే విశ్వరూపమును ధరించి, తదనుసారముగా నే సంభోక్త నగుచున్నాను. "అత్తా చరాచర గ్రహణాత్" "సమస్త చరాచరములను గైకొని నేనే భోక్త నగుచున్నాను. నేనే సర్వము నగుచున్నాను." ఇట్టి దర్శనమే నా భోగము. జీవుడు జీవత్వభోక్తయైనటులే, పరమేశ్వరరూపముగా, అటులే నేను పరమేశ్వరత్వ భోక్తను. జీవత్వము విషయా ధీన భోగము; పరమేశ్వరత్వము స్వాధీనభోగము. ఇదే తేడ.

వాస్తవముగ బరమాత్మయే. "క్షరః సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే । ఉత్తమః పురుషస్త్వన్యః

పరమాత్మే త్యుదాహృతః॥" (గీత. 15_12) - పరమేశ్వరుఁడనఁగానే, వానియందు స్వాధీనభోక్తృత్వము నంగీకరించుచోఁ దప్పేమియు లేదు. కొందఱకు భాష్యకారులకుఁ బరమాత్మని భోక్తృత్వము నంగీకరించుపట్ల ఖడ్గహస్తులై కానఁబడుదురు, గాని వారు పరమేశ్వరుని పరమేశ్వరత్వము ననుచింతనము చేసినచో భోగ మెవరి దందురు? బాగుగా నాలోచింతురేని ఇట్టి యమూలకమైన శంకకుఁ దావే లేదు. నేనే పరమేశ్వరుఁడనని యెప్పుడు తెలిసికొన్నాఁడో, యపుడే యతఁడు భోక్తయైనాఁడు. కనుకనే దేవతాది జీవుల యాత్మరూపముగ ననుభోక్త కాఁడు, కాని స్వాధీనభావముతోఁ దానే సమస్తము నైనాఁడు; కనుకనే యతఁడు చరాచరముల యొక్క స్వాధీనభోక్త; అని తత్త్వదర్శనము చేయవలయును. తత్త్వదర్శన మనఁగా – సర్వకర్తృత్వము, సర్వజ్ఞత్వము, భోక్తృత్వము, క్రియాశీలత, సాక్షిత్వము, నియంతృత్వము, విభుత్వము, పరమాత్మస్వరూపము నాతనిదే, యనెడి తత్త్వము నెఱింగికొని యా యాత్మబోధముతో నేకీభూతుల మైనపుడే పునరావర్తన ముండదు. భగవంతుఁడు, "నేనే నియంత – ప్రభువను, సర్వనియంతృ శక్తులకు నేనే దేవత" నన్నాఁడు. ఈ విధముగా, యథార్థ పరమాత్మతత్త్వము తెలియనంత సేఁపు వెనుకంజ వేయుటే యగును.

ఈ దేవీమాహాత్మ్య మందును "స్తోత్రం మమైత త్క్రియతే" యని యమ్మ తన యథార్థ స్వరూపమును బయల్పెట్టుకొన్నది. గీతలందు, అన్యదేవతాపూజ యెట్టి

వైన నది, యవిధిపూర్వకముగాఁ దనదే యని భగవానుఁ డన్నాఁడు. ఇచట దేవతలు సాక్షాచ్చితిశక్తినే స్తుతించిరి. (ఆత్మనే స్తుతించిరి.) కనుక నన్యదేవతా ప్రసంగమే లేదు.

సాధకుఁడా ! కేవల సాధనమే కాదు, సర్వకార్యములు చిత్స్వరూపమైన నేను నందే లక్ష్యముంచి చేయఁబడ నపుడు, అవియవిధిపూర్వకములేయై జననమరణరూప సంసార గతికే హేతువు లగును. దురత్యయ (7-14) యైన దాని చేతినుండి తప్పుకొొన దేవతల వలెనే యమ్మకు శరణాగతులు కావలసినదే. సర్వదా సర్వకార్యములను, ఆ నేను నే లక్షించి చేయఁగల్గినచో నుభయలోక జయము గల్గును.

"మా మేకం శరణం వ్రజ" యనెడి యమూల్యాచరమోపదేశము సాధకులయెడ సార్థకము లెట్లగునో యదే యీ చండీపాఠమందుఁ బ్రదర్శింపఁ బడినది. మఱియొక మాట — ఇచట, 'అహం, మమ' (నేను, నాయొక్క) అను రెండు పదములు ప్రయోగింపఁబడెను. అవి అస్మితా మమతల (శుంభ నిశుంభుల) సంబంధమైనవి కావు. అవె, ఆత్మ, అమ్మ, గురువు.

*అంబికాదేవికి 'కౌశికీ'నామ ప్రసిద్ధి రహస్యము.*

పార్వతీశరీరకోశమునుండి వెలునడినది గానఁ గౌశికి యని పేరయ్యెను.

దేవి = ద్యోతనశీల; స్వప్రకాశరూపిణీ చితిశక్తి, సాధారణముగా నీ యన్నమయాది స్థూలకోశముల నాశ్రయించియే

వెలయును. అప్పుడపుడు సాధకుల విశుద్ధభక్తి హిమముచేఁ జెమ్మగిలి స్థూలకోశమును విడిచి కేవల చితిరూపముగానే స్వరూపమును వెలయించును. ఈ యాత్రశయము కోశసంబంధ మైనది గనుక, మన యమ్మకుఁ గౌశికీనామ ప్రసిద్ధి కల్గెను. పంచకోశావరణముతో నున్నంతవఱకుఁ బార్వతీనామయే, కోశసంబంధమును విడిచి కేవల చిన్మయరూపముతో వెలయు నపుడు కౌశికీనామయే.

అంబికా పరమరూపము సుమనోహరము.

అంబిక = అమ్మ; విశ్వజననీమూర్తి. సుమనోహర. విషయకలుషిత కానిది. బహునిర్మల. మనసును లెస్సగా విలోపింపఁజేయునదే సుమనోహర. సుమనా=దేవతలు, వారిని గూడ నాకర్షింపఁగలది. మన యమ్మ, మనస్సును ఇంద్రియా ధిష్ఠిత చైతన్యరూప దేవతాబృందము నఱకు విలుప్తప్రకాశు లను జేయఁగలంత శ్రేష్ఠతను దాల్చినది. కనుకనే “తతోఽ మ్బికాం పరం రూపం బిభ్రాణాం సుమనోహరామ్” అనెను.

అదే, అమ్మగారి నిజమైన పరమరూపము.

అంబిక నిజముగాఁ బరమరూప – సర్వభావములు లోపించినను, ఆమె ప్రకాశముచేతనే సర్వవస్తువులు ప్రకాశించును. అదె నిజమైన పరమరూపము. మనసును హరింపఁజాలనిచోఁ బరమరూపప్రకాశము కాదు. పరమరూపప్రకాశము కాక మనసు లోపింపదు. పరమరూపముతో వెలయుటచేఁ దనంతఁ దానే వెలయును. బ్రతికియున్న వృక్షలతాదులకుఁ బ్రాణశక్తి

వల్లనే యొక విశిష్టరూపము కలుగుచున్నది. చచ్చియెండిన వృక్షలతాదులందును, బ్రతికియున్నవానియందును గానవచ్చు తేడ దేనిదో యదే పరమరూపము. దాని విశిష్టప్రకాశము చేతనే జగత్తు ఇంతసుందరమును మోహనమును నైనది. తన జడత్వసంబంధమును విడిచి మనయెదుటఁ బ్రకాశించుచున్న దే పరమరూపము. ఆ రూపమును గాంచినంతనే, మనసు దొంగిలింపఁబడకుండునా? కనుకనే మనస్సును స్థిరపెట్టుకొనుటకై సాధనము చేయవలదని పలుసార్లు చెప్పవలసివచ్చినది. అమ్మ పరమరూపమును జూచునపుడు మనసు తనంతనే స్థిరపడును. విలుప్తమైపోవును. మనోహరణమైనంతనే, యింద్రియాధిష్ఠాన దేవతలు తమంతనే యా పరమరూపమందుఁ జేరిపోవుదురు.

## చండముండులు — ప్రవృత్తి, నివృత్తి.

చండముండులు శుంభనిశుంభుల (అస్మితామమతల) సేవకులు. చండుఁడు ప్రవృత్తి; ముండుఁడు నివృత్తి. చండశబ్దము కోపనార్థమందు వాడఁబడును. కోపము ప్రవృత్తియొక్క యొక యుద్వేలనము మాత్రమే. మన మెంతగా ముందంజ వేయుదుమో, యంతగా సూక్ష్మ సూక్ష్మతర తత్త్వమందుఁ జొత్తుము. మున్ను గానవచ్చిన కామక్రోధాది స్థూలవృత్తులకు మూలమైన యొక సూక్ష్మతరశక్తిప్రవాహమును, దానితోనే నివృత్తియనెడి యొక సూక్ష్మశక్తిప్రవాహమును గానఁబడును. ఈ ప్రవృత్తి నివృత్తులు రెండే యస్మితామమతల నాశ్రయించి బయల్పడును. కనుక నే వీనిని శుంభనిశుంభుల భృత్యులనుగా వర్ణించెను. వారివలెనే వీరును జట్టు వీడకుందురు. ప్రవృత్తి

యుండుచోట నివృత్తియు నుండునని యర్థము. సాధారణముగఁ బ్రవృత్తినివృత్తులనఁగానే యేమితోఁచునో, యిచట నది కాదు. ఇచటఁ జండముండ పదములవలనఁ బరమాత్మాభిముఖ ప్రవృత్తియు, అహంవిరతి యనెడి నివృత్తియునని తెలియ వలయును. ఇట్టి ప్రవృత్తి, నివృత్తి ప్రాప్తికొఱకే, యింతవఱ కనేకసాధనములు చేయుచున్నారు బహుసుకృతబలముచేతను బహుసాధనా ఫలముగాను, మన ప్రవృత్తి పరమాత్మనే కోరును. నివృత్తి యథార్థముగా, అహంరూప విషయ విరతిని గోరును. ఇది గొప్ప భాగ్యమేకాని, యివియు నసురులే. వీరును నిహతులు కావలసినదే. అపుడు ప్రవృత్తి నివృత్తియనుటకును, అస్మితామమతలనుటకును నేమియు మిగులదు. సుమనోహర పరమరూపమైన యమ్మ యొక్కతెయే మిగులును.

ఇచట విషయవాసనాప్రవృత్తిమాట కాదు. దాని తరు వాతిది యుభయతోముఖప్రవృత్తి. అనఁగా విషయములు, పరమాత్మ యను రెంటివంకను బ్రవృత్తి సాగును. ఇట దాని మాటయుం గాఁజాలదు. కేవల పరమాత్మాభిముఖప్రవృత్తిని లక్షించియే చండముండాసురుల కథ చెప్పఁబడును. ఆత్మాభి ముఖప్రవృత్తి విషయాభిముఖవిరతి యగును. ఇదియు నసుర భావమే. అనఁగా ననాత్మబోధమునే తెలుపును. పరమాత్మ తక్క వేఱేదే నున్నచోఁ బ్రవృత్తి నివృత్తు లుండును. వాస్తవ ముగ నొక్క యద్వయాత్మతక్క నెచ్చట నేమియు లేదు. కను కనే పరమాత్మను విషయవిరతిని గోరునంతదాఁక, సాధకునందు అనాత్మబోధ ముబుకుచుండును. అదియు నిహతము కావల యును. అందులకై సాధకుఁడు మఱెట్టి యాయోజనమును

జేయనక్కఱలేదు. అమ్మ పరమరూపముతో వెలసినది. చండముండాద్యసురసమూహము, నొక్కొక్కరునిగ అద్వయజ్ఞానమనెడి పరమరూపాగ్నియందు వ్రేల్చి సాధకుని యనాదిసంచిత సంస్కారములను విలయమొనర్చును. శుంభనిశుంభసేవకులు చండముండులు పరమరూపమయియైన యంబికామూర్తిని గాంచిరి. కనుకనే మఱి తడవులేక విలయమొందుదురు. తొలుత ఆత్మాభిముఖప్రవృత్తి పరమాత్మస్వరూపాభాసము నొందును కనుక శుంభునకు అంబికాదర్శనము కాకమున్నె, వాని భృత్యులు చండముండులు అంబికామూర్తిని దర్శించిరి.

ప్రవృత్తి నివృత్తులకే తొల్త బరమరూప దర్శనమగును.

సాధకుఁడా! విషయముతో నిండిన క్షేత్రమునకు నిన్నొకప్పుడు గెంటెడు ప్రవృత్తి నణంచుట కెన్నియత్నములు చేసితివో కదా! ఒకప్పుడు దానినే సర్వదుఃఖకారణ మను కొంటివికదా! ఇపుడు చూడు; ఆ ప్రవృత్తియే యన్నిటికంటె మున్ను, అతీవసుమనోహర పరమరూప సంధానమును దెచ్చి పెట్టినది. (చండముండులే 'మహారాజ! అతీవసుమనోహరయు, ననిర్వచనీయయునగు నొక స్త్రీమూర్తి హిమగిరిని వెలిగించుచు నచట నున్న'దని శుంభునితోఁ జెప్పుట యిదే.) ప్రవృత్తి నివృత్తి సహాయముతోనే యస్మిత పరమాత్మ స్వరూపమును దర్శించినది. సాధకా! నిన్నొకపుడు బంధనమువంకకు లాగికొనిపోయిన ప్రవృత్తియే, నేఁడు ముక్తిమందిరార్గలను దెఱచినది. ప్రవృత్తి దోషమేమున్నది? అది పరమరూపమును గాననంతసేఁపు విషయముల వంకకే పరువెత్తినది. నివృత్తి దోషమేమున్నది?

అది పరమాత్మస్వరూప సంధానము నొందనంతదాఁక, కేవల విషయ విరతిసాధన చేయుటకు, అనఁగాఁ త్యాగవైరాగ్యాదుల సాయము నొందఁబ్రయత్నించినది. ఇపు డదే యంబికాదర్శనము చేసినది. కనుక నన్నిటికంటె మున్నువచ్చి యస్మితకు బుద్ధి కతీతమైన యీ యనిర్వచనీయ స్త్రీమూర్తి హిమగిరిని వెలిగించుచున్నదని సువార్తను దెచ్చినది.

## సాధకుఁ డిపుడేమి తెలిసికొనెను ?

సాధకుఁడింతవఱకు హిమాచలమును(జడత్వము) చైతన్య వికాస స్థానముగాఁ దలంచెను. ఇపుడు చైతన్యమే జడాకారమున వెలయునని యనుభవించెను గాని, ఇపుడేమి తెలిసినది? స్వయంప్రకాశచైతన్యము జడసంబంధము లేకున్నను నిర్విశేష రూపముతోఁ గానఁబడునని తెలిసినది. ఆ జడత్వమునకుఁ గేవలము వేఱయినను జడమును బ్రకాశింపఁజేయు చైతన్యము నేఁడు స్వతంత్రముగా నుద్భాసించినది. ఉపనిషత్తు లిమ్మాటనే "తమేవ భాంతి మనుభాతి సర్వమ్ । తస్యభాసా సర్వమిదం విభాతి" యన్నవి.

అమ్మను మున్ను గేవల పార్వతీమూర్తిగాఁ జూచితిమి. అనఁగా సత్యప్రాణ ప్రతిష్ఠాఫలముచే వ్యక్తవిశ్వరూపముగాఁ జైతన్యసత్త నెఱుంగఁగల్గితిమి. కాని నేఁడో—విశ్వముకంటెను స్వతంత్రరూపముగా ననుభవించు భాగ్యము కల్గినది. అది ప్రాయుటెట్లు? "జన్మాద్యస్య యతః" మన జన్మ స్థితి లయము లకుఁ గారణమై, తనకు జన్మ స్థితి లయములు లేని దాని సాక్షాత్కారమైనపుఁ డిట్టి యానంద మొందితిమని చెప్పఁ

గలమా? చెప్ప నలవికాని దగుటచేతనే చండముండులు, దాని వర్ణింపలేమనిరి. అది యట్టి శక్తి కనుకనే స్త్రీ యనిరి. శక్తి వస్తు వెప్పుడును అనిర్వచనీయమే. కార్యము నవలంబించియే శక్తి నిర్వచనీయ యగును. కార్యసంబంధము లేని శక్తి యాభాసించినపుడే సాధకుఁ డానందముతో నుబ్బిపోవును.

ఇదే సాధనకైన కర్మకాండము; ఇదె యుపాసనాకాండము; ఇదే జ్ఞానకాండము.

ముందుగా చండముండులు (ప్రవృత్తి నివృత్తులు) శుంభునితో (అస్మితతో) ననిన మాటలు విను:-'అట్టి యుత్తమ రూపము నెవ్వఁడు నెన్నఁడును జూచియుండఁడు. ఆమె యెవ్వతెయో, తమరొక్కసారి తెలిసికొనుఁడు; మఱి యామెను జేకొనుఁడు.' ఎంత చక్కని మాటలు !

దానిఁ జూచినవారు అదియే యైపోవుదురు. వేఱుగా నుంచినచో దానిఁ జూచు నుపాయమే లేదు; చూడుడు గీతలందును ——

జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప,
నహి వేదై ర్న తపసా నహి దానేన చేజ్యయా॥
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా,
భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున॥

— గీత. 11-53, 54.

ఈ 'నేను' అనునది ఋగాది చతుర్వేదములు కంఠస్థము చేసినవారికిని గానరాదు. తలక్రిందుగాఁ దపస్సు చేసినవారికిని

గానరాదు. ఎట్టి మహాదానములు, ఎట్టి యాగాదులు చేసినను గానరాదు. నీ విపు డేవిధమున నన్నుఁ జూచితివో, యా విధమున సాధనముచేసి నన్నుఁ జూడఁగలఁడు.

ఓ పరంతప ! అర్జునా ! ఒక్క యనన్యభక్తిచేతనే యిట్టి నన్ను యథార్థముగ నెఱుంగుటకును, జూచుటకును నాయందుఁ జేరుటకును సమర్థుఁడగును.

సాధనబలముచేఁ బరాశక్తిని సైతము తపింపఁజేయు సాధకుని "పరంతపుఁ" డందురు. గురువాక్యమందుఁ బూర్ణ విశ్వాసముంచి, సావధానముగఁ గ్రియానుష్ఠానము చేయుట పేరే 'అనన్యభక్తి'. ఒక్క యనన్యభక్తితో, నీ విశ్వరూపి అహంతత్త్వము, అనఁగా – పృథివీతత్త్వము, రసతత్త్వము, తేజస్తత్త్వము, వాయుతత్త్వము, ఆకాశతత్త్వము నను వరుసతో నారంభమై, క్రమముగా నా విధముగానే యాత్మ స్వరూప బోధ మగును. (ఇదే సాధనకైన కర్మకాండము.) తరువాత నాత్మసాక్షాత్కార మగును; అనఁగా విశ్వరూప ప్రత్యక్షదర్శన మగును. (ఇదే ఉపాసనాకాండము.) ఆ వెనుక నా విశ్వరూపమందుఁ బ్రవేశించుటగును; అనఁగా నా రూపమును జూడఁజూడఁ దన్మయుఁడై యందుఁ జేరుటగును – ముక్తుఁడగును. (ఇదె జ్ఞానకాండము.) కనుకనే భక్తిలేక ముక్తి లేదందురు. ఈ శ్లోకమందు ముందుగా దాని స్వరూపము నెఱుంగుటయుఁ, దరువాతఁ జూచుటయుఁ, బిదపఁ బ్రవేశించుటయు నగును. దీనినే యుపనిషత్తు శ్రవణ మనన నిదిధ్యాసన మనుచున్నది.

మంత్రమందు "గృహ్యాతామ్" చేకొనుమని యర్థము. చేకొనుటయుఁ బ్రవేశించుటయునన్న నొక్కటేమాట. ఏమన- తల్లిని గ్రహించుటే (చేకొనుటే) ఆమెయందుఁ బ్రవేశించు టగును. తల్లిని గ్రహించుట కాఁజాలదు; కాని యామెయే తానే (గృహీంత) చేఁజిక్కును. అమ్మ గ్రాహ్యయు (చేకొనఁ దగినదియు), జ్ఞేయయు (తెలియఁదగినదియు) గాదు. అమ్మ తానే జ్ఞాతృస్వరూప. విజ్ఞాత నేవిధముగాఁ దెలిసికొనుట? (గ్రహించుట?) ఆమె నెఱుంగుటయే జ్ఞాతృ జ్ఞేయాదిని దాఁటి పోవుటగాఁ దోఁచును. దర్శన మనఁగా దృష్టిగోచర మగుట. దర్శనము రెండు విధములు. లౌకికము, అలౌకికము. విశ్వ మందుఁ బంచభూత వికారవస్తువులే లౌకికచక్షువుల కందునవి. అలౌకిక దర్శనమునకే దివ్యచక్షువు కావలయును. శ్రీకృష్ణుఁ డును అర్జునునితో "దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్" అనఁగా దివ్యచక్షువుతోనే విరాడ్రూపమును జూడఁ గలరు. అధ్యాత్మశాస్త్రమే దివ్యచక్షుఃప్రదానము చేయును.

## ప్రవృత్తి యస్మితను లోభపెట్టు రహస్యము.

చండముండులు (ప్రవృత్తి నివృత్తులు) అంబికను స్త్రీ రత్నము, చార్వంగి యనియు; దిక్కులను వెలిగించుచున్న దనియు, చూడఁదగినదనియు వర్ణించిరి.

ఇది ప్రవృత్తియొక్క లోభపెట్టు మాటలైనను, రవ్వం తయు మిథ్యకాదు. అంబిక నిజముగా స్త్రీరత్నమే, అనంత శక్తియొక్క నిర్విశేష కేంద్రమే. రత్నమనఁగా జ్ఞానమని యర్థము. స్త్రీరత్నశబ్దముచే జ్ఞానమయ శక్తిస్వరూప వస్తువే

తోఁచును. ఆ చిన్మయ మహాశక్తికథనే చండముండులు స్త్రీ రత్నశబ్దమును ప్రయోగించి ప్రభువునకు మెల్లగా నందించిరి. నిజముగా నామె యంగప్రత్యంగములు మిగుల మనోహరములు, అతిసౌందర్యాకరములు. ఆమె పరమప్రేమమయ, పరమ ప్రియతమాత్మ.

(ప్రణవగీత - భక్తిసాధనక్రమము)

(తొలుత ననన్యభక్తితో గురూపదిష్టమార్గమందు, ఆత్మక్రియాసాధనము, తరువాత నపరోక్షజ్ఞానలాభము, ఆ తరువాత ముక్తియుఁ గలుగును. అందువలన, సాధనక్రియ యొక్క యాద్యవస్థపేరే భక్తి. మధ్యావస్థ పేరే జ్ఞానము. తుది యవస్థయే ముక్తి. లోకులు భక్తియే ముక్తి యందురు. 'భక్తి ర్ముక్తి రేవ సునిశ్చితా')

అది యరూపముయొక్క రూపము. అపూర్వానుపమ (శోభ). దాని స్వరూపమును స్పష్టపఱచు మాటలే లేవు. జగత్తునందలి చక్కఁదనమంతయుఁ బ్రోవుచేసి, జగత్తునందలి యానందము నంతటిని రాశికూర్చి యొకచోట నుంచి కల్పనా దృష్టితో సాధకుఁ డాభావము నూహింపఁగలిగినచో, నా యపరిచ్ఛిన్నానందము నించుకంత యాస్వాదింపఁగలఁడు. అది యెంత మధుమయమో! ఎంత ప్రియతమమో! అది యెంత యభయదమో! అది యేమో!

ప్రవృత్తి నింద్యకాదు; హితమునుగోరు బంధువు.

"తస్యభాసా సర్వమిదం విభాతి" తన కాంతిచేత జగత్తు నంతటిని ప్రకాశింపఁజేయుచున్నను, తాను కేవలానంద

స్వరూపముతో విరాజిల్లుచున్నది. ఆ యంబికయే, ఆత్మ; మన యమ్మ; కేవలానందమయి; చితిశక్తిరూపిణి యని తెలుపుటకే చండముండులు చార్వంగీ స్త్రీరత్నాది శబ్దములను బ్రయోగించిరి. ఆనందమున కొక విశిష్టస్వరూపము లేదు. అది కేవలానుభవస్వరూపమే.

సాధకా! దానిని జూచు యోగ్యత నీకుఁగలదని (శుంభుని) అస్మిత నాస పెట్టినది. "త్వాం భవాన్ ద్రష్టు మర్హతి" యన్నది. అస్మిత జాడ నెఱుంగనంతదాఁక "రూపం రూపవివర్జితస్య" యను దాని స్వరూపమును దెలియఁ లేఁడు. కాని గురుకృపచే సాధకుఁ డిన్నాళ్లకు సత్యప్రాణసంధానము నొంది అహంతా కేంద్రమును జేరినాఁడు కనుకనే, యిపుడు వానికిఁ బరమానంద స్వరూపము ననుభవించు యోగ్యత కలిగినది. ఈ విధముగానే చేసి ప్రవృత్తి యస్మితను బ్రలోభ పెట్టును.

ప్రవృత్తి విషయాభిముఖియై యున్నంతదాఁక జీవుని నరకమార్గమునకే కొనిపోవును, గాని యీ ప్రవృత్తియే మఱలఁ బరమాత్మాభిముఖియై, యర్గలాబద్ధమైన ముక్తి మందిరమార్గమును దెఱచును గనుకనే ప్రవృత్తిని నిందింప రాదనియు, నది నిజముగా హితమునుగోరు బంధువనియు నందురు.

## శుంభుఁడు (అస్మిత) సంగ్రహించిన శ్రేష్ఠవస్తువుల రహస్యము.

1. ఐరావతాదుల రహస్యము తొలుమాటయందుఁ గలదు.

2. బ్రహ్మదేవుని హంసయుక్త విమానము:— వేధాః= బ్రహ్మ (విరాణ్మనస్సు). హంస=జీవుఁడు, విమానము=వ్యోమ యానము. హంసయుక్త విమానము = జీవభావిఁపు మ.ుస్సు. ఆకాశతత్త్వము నవలంబించి చరించునుగాన, మనస్సు విమానము. విరాణ్మనఃసంకల్పమైన యీ విశ్వమే వేధ (బ్రహ్మ). ఈ మన వ్యష్టిమనస్సు సైతము వాని మఱియొక విశిష్టసంకల్ప మాత్రమే. సమష్టి వ్యష్టి మనస్సులు దేనిపై నాధారపడి యున్నవో, యెఱింగికొన్న నే బ్రహ్మదేవుని హంసయుక్త విమానరహస్యము తెలియఁగలదు. వ్యష్టిమనస్సు (హంసయుక్త విమానము) నధిరోహించి సమష్టిమనస్సు (ప్రజాపతి) ఏ భావముతో విచరించునో (ఏ భావముతో సృష్టివ్యాపారము చేయునో) యది నిజముగా వింత. ఇదె బ్రహ్మయొక్క శ్రేష్ఠ రత్నము అనఁగా శక్తి.

జీవులము మనమే బ్రహ్మకు వాహనములైన హంసలము.

ఒక చెట్టును జూచుచున్నావు. అది విరాణ్మనః సంకల్పము. అది కంటికిఁ గానరాదు. అది సంకల్పమయము; భావమయము; ఆనందమయము. ఏలన – ఆనందమయ పరమేశ్వరుని కల్పనయే వృక్షముగా వెలయుచున్నది. ఆ చిన్మయానందమయ వస్తువు నీకజ్ఞేయము. అపుడు నీవే వృక్షమును జూచుచున్నావు. ఆ చిదానందమయ వృక్షమునుండి, యొక విధమైన స్పందనము, ఇంద్రియములదారిని జేరి నీ మనస్సు (హంసయుక్తవిమానము) నుద్బుద్ధము చేయుచున్నది. అపుడు నీ మనస్సు వృక్షాకారముతోఁ బ్రకాశించును. ఈ విధముగా

నీవు చూచు వృక్షము, నీ సంస్కారమున కనురూపమైన యొక స్థూలభౌతిక వృక్షమాత్రమే. ఆనందమువల్ల ఘటితమైన చెట్టు నీభౌతికవస్త్రముచేఁగప్పఁబడి ప్రకాశించుచున్నది. ఇదే వృక్షము యొక్క అభూతపూర్వ సృష్టివైచిత్ర్యము. ఈవిధముగా నీశ్వర సృష్ట వస్తుస్వరూపము సచ్చిదానందస్వరూపమైనను, జీవుని యెదుర భౌతిక సంస్కారరూపమైన యావరణముచేఁ గప్పఁబడి ప్రకాశించుచున్నది. బ్రహ్మము తాను చిన్మయస్వరూపమైనను, దన కల్పనలను జడాకారముగాఁ (భౌతికాకారముగా) బరివర్తనములు చేయఁగలదు. హంసయుక్త విమానము అనఁగా జీవభావీయమనస్సే యీ పరివర్తనమునకు సాయపడును గాన, బ్రహ్మ హంసవాహనుఁడు. ఏ యనంతకాలము నుండియో, మన యీ వ్యష్టిరూప మనస్సును, కేవల భౌతిక రూపరసాదులను గ్రహింపఁదగినదానిగాఁ జేసి యుంచినాఁడు, గాన మనము జగత్తును చిదానందమయముగా భోగింపగల శక్తిని మఱచితిమి. కోల్పోయితిమి. కనుకఁ బ్రజాపతి బ్రహ్మకు మనపై నీ యాధిపత్యము. మనము జీవులము, మనమే బ్రహ్మకు వాహనములైన హంసలము.

## శుంభుఁడు బ్రహ్మవిమానమును హరించుట.

అనఁగా నీ యద్భుత సృష్టివ్యాపార మిపుడు బ్రహ్మది కాదు, శుంభునిది. అస్మితాస్వరూపము నెఱుంగఁగల్గినపుడు సాధకులు, మనమే వ్యష్టి సమష్టి మనస్సుయొక్క సర్వసంకల్పములను స్పందనములను జేకొంటిమని తెలియఁగలరు. మనవల్లనే వ్యష్టి సమష్టి మనోవికాస మగుచున్నది. మనము లేకున్న

మనస్సునకు సత్తయే లేదు. ఇదే శుంభుఁడు బ్రహ్మవిమాన మును హరించు రహస్యము.

శుంభుఁడు మహాపద్మమనెడి కుబేరుని నిధిని హరించుట.

మహాపద్మనిధి యనఁగా నిర్మలసత్త్వగుణము. మార్కండేయ పురాణమందు — "సత్త్వాధారో నిధిశ్చాన్యో మహాపద్మ ఇతి స్మృతః । సత్త్వప్రధానో భవతి తేన చాధిష్ఠితో నరః॥" మహాపద్మమనెడి నిధి సత్త్వగుణమున కాధారము కనుకనే, సత్త్వగుణప్రధానుఁడగువాఁడే యీ నిధి నొందఁదగును. రజస్తమో గుణములను దిరస్కరించుటచేతనే సత్త్వము విశుద్ధ మగును. ఇచట నీ విశుద్ధ సత్త్వగుణమునే మహాపద్మమనెడి నిధి యనిరి.

(విశుద్ధసత్త్వగుణబోధము వివేకచూడామణియం దిటులున్నది.)

"విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః
స్వాత్మానుభూతిః పరమా ప్రశాన్తిః,
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా
యయా సదానందరసం సమృచ్ఛతి॥"

ప్రసాదము=మనోనైర్మల్యము - మనస్సున కెట్టి గ్లానియు లేకుండుట; స్వాత్మానుభూతిః = స్వస్వరూపము నెఱుంగుట; పరమా ప్రశాన్తిః = సర్వోత్కృష్టమైన సంతోషము; తృప్తిః= తనివి - కోరిక చెడకుండుటచే నగు నవస్థ; ప్రహర్షము=ఉత్తమాహ్లాదము - సదానంద రసానుభవము; పరమాత్మనిష్ఠా =

పరమాత్మ ధారణచే నగు శాశ్వతానందము ననుభవించుట. ఇవి శుద్ధసత్త్వగుణకార్యములు.

సర్వవిభూతులు విశుద్ధ సత్త్వగుణమువల్లనే కల్గును. రజస్తమోగుణములు నెట్టివేయఁబడక, విశుద్ధసత్త్వగుణ మందు నిల్వకున్నంతకాలము, సాధకుఁడు అస్మితా స్వరూపానుభవముఁ జేయలేఁడు. గాన మహాపద్మనిధి శుంభుని యింటనే యుండును.

ధనేశ్వరుఁడు కుబేరుఁడు. ప్రాణమే యథార్థసాధనాధిపతి, కనుక ధనేశ్వరశబ్దార్థము ప్రాణము. విశ్వమందు దోఁచు ప్రాణసత్తే ననుభవించుటతనే, సత్త్వము నిర్మలమగును, గాన మహాపద్మము (విశుద్ధసత్త్వగుణము) నకు సైతము ప్రాణమే యాశ్రయ మనఁబడును. అస్మిత నెఱిఁగిన సాధకుఁడు, అంతకు మున్నె ప్రాణప్రతిష్ఠ ననుశీలించి (బాగుగా నభ్యసించి), సర్వత్ర ప్రాణసత్తే ననుభవించినవాఁడు కావుననే, విశుద్ధసత్త్వగుణ మనెడి మహాపద్మనిధి కధికారి కాఁగల్గెను. ప్రాణప్రతిష్ఠయైననే విశుద్ధసత్త్వము లభించును. ధనేశ్వరునుండి శుంభుఁ డీ నిధిని గైకొన్న రహస్య మిదే.

సముద్రునివలనఁ గింజల్కినియనెడి పద్మమాలను గైకొనుట.

సముద్రుఁడు కర్మాశయము. అస్మితను జేరిన సాధకునకు సంచిత భవిష్యత్కర్మ సంస్కారము లేని కారణమునఁ గర్మాశయము క్షీణమైనను, ప్రారబ్ధసంస్కారము బాగుగా క్షయింపనంతదాఁకఁ దఱుగుచున్నను నిండుచునే యుండును. కనుక వీనికి బంధమును గల్గించు సకామకర్మానుష్ఠానము చేయు నక్కఱ

లేదు కాని, దేహముండుదాఁకఁ బ్రారబ్ధసంస్కార ముండనే యుండును. (వాని సమూహమే దేహము.) దీని నంగీకరింపక తప్పదు. కనుకనే కర్మాశయమనఁగా నిచటఁ గేవల ప్రారబ్ధ కర్మాశయమని తెలియవలయును. సంచితాగామి కర్మ విషయము తొలుమాటయందుఁ జూపఁబడినది.

అమ్లాన పంకజమాలను గేవల ఫలోన్ముఖ ప్రారబ్ధ సంస్కారరాశిగాఁ దెలియవలయును. ఇంతవఱకది పూర్తిగా క్షయింపలేదు. కనుకనే యమ్లానము (వాడనిది).

పంకము=పాపము (అజ్ఞానము). అజ్ఞానమనెడి పంకము నుండియే దానిపుట్టుక, కనుక పంకజమని పేరు. కింజల్కము లనఁగాఁ గేసరములు, కనుక నది కింజల్కినీ. మును జెప్పిన ఫలోన్ముఖ ప్రారబ్ధకర్మసమూహమే, అమ్లాన పంకజమాల. తామరలోనుండు సన్నని పచ్చని కేసరసమూహమువలెఁ బ్రబల ప్రారబ్ధబీజములు, యథార్థాత్మస్వరూపమందు సాధకుని నిల్వనీయక యెడముగా నుంచును. ప్రబల ప్రతికూల ప్రారబ్ధ సంస్కారములు క్షయింపనంతదాఁక, ఆత్మజ్ఞానము లభింపదు.

సాధకా ! మనయమ్మ పరమార్థముగా నాత్మప్రకాశము చేయనంతవఱకు, ఆ కింజల్కినియనెడి వాడని పంకజమాల ప్రతిబంధముగా నుండుననియే తలఁపుము. ఆ ప్రతికూల ప్రారబ్ధ క్షయ మగుటకై యోర్పుతోఁ బ్రతీక్షింపవలయును. ఓర్పు లేకున్న మఱింత తడవగును. కేవల మాతృకరుణపైనే నిర్భరుఁడై దీనముగా నేడ్వవలయును. రెండవమాటలో సముద్ర శబ్దమునకు గుణత్రయ సంయోగతారతమ్యమని చెప్పఁబడిన

యర్థముతో, నిపుడు చెప్పిన కర్మాశయమనెడి యర్థము విరోధింపదు. బుద్ధిమంతు లూహించుకొందురుగాక.

వరుణుని కాంచనస్రావి ఛత్రము శుంభుని దయ్యెనట.

ఎండవానల వలనఁ గాచు నాచ్ఛాదనము కాంచనస్రావి=ఐశ్వర్యదాయకము. అస్మితయం దాత్మబోధ ముపసంహరింపఁబడఁగానే, యథార్థాత్మ వస్తుస్వరూప మొకవైపు కప్పివేయఁబడును. మఱియొకవైపు సర్వభావములకు నధిష్ఠానరూపమైన యీశ్వరధర్మము ప్రకాశించును. అనఁగా నానావిధములైన విభూతులు ప్రకాశించుచుండును. ఇదే కాంచనస్రావిత్వము. పరమాత్మ స్వరూపమును గప్పిపుచ్చునది యగుటచేతనే ఛత్రమనిరి. ఇది మున్ను రసాధిపతియైన వరుణునిది. ఇపుడు శుంభునిది. మున్ను సాధకుఁడు ఐశ్వర్యాదికమును వేఱుసత్త గలదానిగఁ దలంచెను. ఇపుడు దానిని, ఒకవిధమైన తన విశిష్టవికాసమునుగానే కన్గొనెను. సాధకునకుఁ గడు సూక్ష్మరూపమున నీశ్వరత్వాది కాత్మమహత్త్వమును అనుభవించు కోర్కె యుండుటచేతనే యది కాంచనస్రావి. ఛత్రరూపమున బరమాత్మ స్వరూపమును గప్పిపుచ్చునదయ్యెను.

ప్రజాపతి స్యందనవరము శుంభునింటఁ జేరెనట.

స్యందనవరము (రథశ్రేష్ఠము). అదె వృత్తి. వృత్తుల నవలంబించియే, మనస్సనెడి ప్రజాపతి యిటనట రాకపోకలు — నియత సృష్టికార్యములు చేయును, గాన చిత్తవృత్తియే స్యందనవరము. ఇపు డిది శుంభునింట నున్నది.

సాధకుఁ డింతకుమున్ను వృత్తులను మనోధర్మములనియే తలంచెను, ఇపుడవి తన (అస్మితయొక్క) విభిన్నస్ఫురణములు గాక మఱేమియుం గాదని తెలిసికొనెను.

స్యందనమనఁగా స్ఫురణ మనియు నర్థము. అనఁగా కాఱుట. నిశ్చల పరమాత్మభావము స్ఫురణ మగుటచేతనే వృత్తులను స్యందన మనిరి. సాధకుఁడు ప్రథమావస్థయందు వృత్తుల నాత్మలాభమున కంతరాయములుగాఁ దలంచెను. కాని యిపుడవి యాత్మస్ఫురణముగానే కనుగొనెను. ఇపుడు వాని యెడఁ బ్రతికూలభావ ముండదు. దేని సత్తచే నవి సత్తావంతములైనవో, దానివంక లక్ష్యము పడినది.

శుంభుఁడు ఉత్క్రాన్తిద యనెడి మృత్యుశక్తిని హరించెనట.

మృత్యువు = ధర్మరాజుయొక్క మరణింపఁజేయు శక్తి (అస్త్రవిశేషము). దేహమునుండి ప్రాణములను వెడలించుటే మృత్యుకార్యము. అదె దానిశక్తి. అస్మితను జేరుటకు మున్ను సాధకుఁడు మృత్యువు నొక యాగంతుకవ్యాపారముగఁ దలఁచెను. ఇపుడు మృత్యువను పేరితో వేఱొకటి లేనేలేదు; నేను గోరినపుడే దేహమునుండి యుత్క్రాంతుఁడ నగునపుడే మృత్యు వనుచు నొక వ్యాపారము కానవచ్చుననును. అదే మృత్యువు నుత్క్రాన్తిదాశక్తిని హరించుట.

ప్రవృత్తి నివృత్తులు మాత్మలాభమునకై జీవుని మేల్కొల్పును.

అస్మితయం దాత్మబోధ ముపసంహరింపఁబడినచో సాధకుఁడు మన యస్మిత యనెడి మహారత్నమువల్లనే యీవిశ్వము

సంఘటిల్లినదని తెలియఁగలఁడు. ఎటుచూచినను, ఇంద్రియము లచే నేను గ్రహింపఁబడినను అవి యన్నియు మన యహంతా మయములే. అహంత యనెడి మహారత్నమే బహురూపము లతోఁ బ్రకాశించుచున్నది, కనుకనే రత్నములన్నియు నీచేఁ జిక్కినవని ప్రోత్సహించిరి (చండముండులు).

సత్యప్రాణప్రతిష్ఠవలనఁ దప్పక కలుగు ఫల మిదే. జగ న్మయ ప్రాణప్రతిష్ఠాఫలముగా సాధకుఁడు నా'నేనే' జగద్రూప ముగాఁ బ్రకాశించుననియు, అది వ్యాప్తమై యున్నదనియుఁ గన్గొనును. అహంత్వరత్నమే సమస్తరూపములుగా నున్నదనెడి జ్ఞానలాభ మెంతగొప్పది! ఎంతలోభనీయము! ఎంతయానంద దాయకము! అనేకులు సాధకులు, ఈ యుపలబ్ధిచే జీవనము సార్థకమైనదని నిశ్చేష్టులగుదురు. అదియిట్టి మధుమయావస్థయే కాని, యింతేకాదు; ఇంకను ముందడుగు పెట్టవలయును. కనుక, అమ్మ (చండముండులనెడి) ప్రవృత్తి నివృత్తి రూపమునఁ జితిశక్తితోఁ (పరమాత్మతో) జేర లోభపెట్టినది. నివృత్తి సాక్షాత్తుగా నెన్నఁడును సాధకుని లోభపెట్టఁ (పరమాత్మనంక కాకర్షింప) బనిలేదు. ఆ నివృత్తి తోల్త లభించిన రత్నాదుల (యోగవిభూతుల) యెడనైన తీవ్రాసక్తిని దొలఁగించి ప్రవృత్తి చేయు తీవ్రాకర్షణమందు మిగుల సాయపడును. నివృత్తి ప్రభావమువల్లనే యంబికాప్రాప్తి యగును. ప్రవృత్తి నివృత్తులు (చండముండులు), సర్వరత్నములు (విభూతులు) నీవే యైనపుడు, ఆ స్త్రీరత్నము (మహాశక్తి) మాత్రము నీదేల కాఁగూడదు. దానినిగూడ నీదిగాఁ జేసికొమ్మనిరి. ఆ చండ ముండుల (ప్రవృత్తి నివృత్తుల) ప్రోత్సాహముచే, అస్మిత

(శుంభుఁడు) ఉద్యమించెనుగాని అంబికను దనదిగాఁ జేసికొనుటకుఁ దనపైనే యాధారపడలేదు. అంబికమాత్ర మొక్కతెయే యున్నది యని యెఱుఁగదు. చితిశక్తిని దనదిగాఁ జేసికొన్నచో, మఱి యస్మితయే వినష్టమైపోవును.

సాధకా! నీవును శుంభునివలెఁ బ్రలోభపడుము. ప్రవృత్తి యా కల్యాణి (అమ్మ) కొఱకు లోభపెట్టును. నివృత్తి నీకు లభించిన రత్నములయం దాసక్తిని దొలఁగించును. నీ జీవనము చరమ చరితార్థత నొందును.

## శుంభుఁడు దేవికడకు సుగ్రీవుని దూతగాఁబంపిన రహస్యము.

ప్రవృత్తి ప్రేరణమున శుంభుఁడు చేసిన మొదటి పని సుగ్రీవుని దూతగాఁ బనుచుట. శోభనమైన గ్రీవముగలవాఁడు సుగ్రీవుఁడు. అనఁగాఁ జక్కఁగాఁ మాటలాడఁగల జ్ఞానము. కేవల వాచనిక జ్ఞానసహాయముతోఁ బరమాత్మ స్వరూపము నెఱుంగుటకైన చేష్టయే, శుంభుఁడు సుగ్రీవుఁడనెడి దూతను బంపు రహస్యము.

ఆత్మక్షేత్రమును జేరు సాధకుని మనసునందు స్వభావముగా "నేనే జగత్ప్రకాశకుఁడను, నన్నుఁ బ్రకాశింపఁజేయునదేది? ఉన్నచో నది - అస్థూలము, అనణువు, అహ్రస్వము, అను నిట్టి శబ్దార్థములచే నిటులటులని చెప్పఁబడుచు నిష్క్రియము నిరవలంబము నైన సుషుప్తివంటి యొక యవస్థమాత్రమే" యని యొక భావ ముదయించును. ఆ యవస్థ నొందు ఫలమేమి? ఇపుడు కేవల వేదాన్తాదులచేఁ బ్రతిపాదింపఁబడు నిర్గుణస్వరూప విషయమైన పరోక్షకాలోచనము చేతనే

యభీష్టసిద్ధి యగును. ఆ యవస్థ వాఙ్మనసుల కతీతమై స్థూల దేహముండునంతదాఁక కల్గునది కాదు. ఇపుడు మాటలవలన దాని స్వరూపము నెఱుంగుటే మేలు. ఇపుడుగూడ సాధకుని పరమాత్మవిషయకజ్ఞానము కేవల శ్రుతి, అనుమానముల వలనఁ గలిగిన పరోక్షజ్ఞాన మాత్రమే కనుక సరిగా నెఱుఁగ లేఁడు. అపరోక్షానుభూతి యింకనుగాలేదు. పరమాత్మాభిముఖ ప్రవృత్తి వానికి రుచిని గల్గింపకున్నచో, దాని స్వరూపమును గూర్చిన యాలోచనము చేయఁడు. సాధకుల కనేకుల కిట్టి నిశ్చేష్టతావస్థయే వచ్చిపడుచుండును.

ఏలన—సాధకుఁడు బహుజన్మార్జిత సాధనాఫలముగా, అస్మితాక్షేత్రమందు నిల్చి, సర్వభావములకు నధిష్ఠాత నని పూర్ణముగా నిశ్చింతుఁడై యుండి, అంతకంటె మీఁదికిఁ బోవు నిచ్చ నొందఁడు. విడువని ప్రవృత్తిప్రేరణమున నింతో యంతో మాఘుకాలోచనముచేసి కొంత విశేషాధ్యవసాయముచే నిరంజన క్షేత్రమువైపు ముందడుగు పెట్టఁగోరఁడు; కనుక సుగ్రీవుఁ డనెడి దూతను బంపి కార్యోద్ధారమునకై ప్రయాసపడెను.

ఈ తత్త్వము మిగులఁ జమత్కారము. ఇప్పటి వైష్ణవ సంప్రదాయమందలి పలువురు, ఈ యవస్థనే జీవన చరమ చరితార్థముగా నెంతురు. దీనిని అప్రాకృతిక లీలానికేతనము, నిత్యబృందావనము మున్నగు పేళ్లతో వర్ణింతురు. మఱియొక పక్షమున 'పరమాత్మ స్వరూపము కేవలాంధకారమయ సుషుప్త్యవస్థవంటి'దని స్థిరపఱచి, "పంచదార యైపోవుటకంటెఁ బంచదార తినుటయే మేలు" అనుచుందురు. అయ్యో వారు—ఇంచుకంత భేదజ్ఞానమున్నను, ఆత్మస్వరూపానుభవము కాదని

యెఱుఁగరు, కనుకనే నిరవచ్ఛిన్నానందమును బరమప్రేమము నాస్వాదింప లేకున్నారు. ఏలన, అద్వయజ్ఞానమే యమృతమనియు, భేదజ్ఞానమే మృత్యువనియు నెఱుఁగరు. అద్వయ స్వరూపముం జేరలేనంతదాఁక, నెంత లీలారసాస్వాదనము చేయనీ; అమృతసంధానము లభింపదు. అభయపదమందుఁ బ్రతిష్ఠితుఁడు కాఁడు.

## సుగ్రీవుఁడు సుందరశైలోద్దేశమునకుఁబోవు రహస్యము.
## (సహస్రార రహస్యము)

అతిశోభన శైలోద్దేశము సహస్రారము. (అసీమ జ్ఞాన క్షేత్రము) తత్త్వప్రకాశికా టీకాకారుఁడు "శైలస్యోర్ధ్వప్రదేశః" యనెను. నిజముగా నీ దేహమనెడి హిమాచలముయొక్క సర్వోన్నతప్రదేశమున సహస్రదళకమలము శోభిల్లును. లోకమం దెట్టి చక్కఁదనమును దానికి సాటి చెప్పఁదగియుండదు. ఏమనఁ, బార్థివసౌందర్యము జడత్వమండితము. ఆ స్థానము విశుద్ధచిన్మయక్షేత్రము. "విశుద్ధబోధం నయనాభిరామం" గనుక మంత్రమందు 'అతిశోభన' పదప్రయోగము. సహస్రారము — సహస్రదళకమలము —

శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవగణా
లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే,
పదం దేవ్యా దేవీ చరణయుగలానందరసికాః
మునీంద్రా అప్యన్యే ప్రకృతిపురుషస్థాన మమలమ్॥

ఈ సహస్రారపద్మమును శివసేవకులు శివస్థానమనియు, విష్ణుభక్తవర్గము సర్వోత్కృష్టపురుషుఁడును, సాంఖ్యోక్త పర

మేశ్వరుడు నైన నారాయణుని స్థానమనియు, మఱికొందఱు హరిహరస్థానమనియు తక్కు మునీంద్రులు యోగిశ్రేష్ఠులును నిర్మలమైన ప్రకృతిపురుష స్థానమనియు, మాయాబ్రహ్మ స్థానమనియుఁ బలుకుదురు. ఆ యా దేవతల భక్తులు సహస్రదళ కమలమును, ఆ యా దేవతల స్థానముగాఁ బలుకుదురు.

ఇహ స్థానం జ్ఞాత్వా నియత నిజచిత్తో నరవరో
న భూయా త్సంసారే క్వచిదపి న బద్ధ స్త్రిభువనే,
సమగ్రా శక్తిః స్యా న్నియమ మనస స్తస్య కృతినః
సదా కర్తుం హర్తుం ఖగతిరపి వాణీ సువిమలా॥

సహస్రారమనఁగా — తలలోపల వేయి రేకుల తామర పూవున్న దనువారు దాని రహస్యము నెఱుఁగరు. విశుద్ధచిన్మయ క్షేత్రమువంక ముందంజ వేయుటచేతనే మస్తకమందొక విచిత్రమైన యనుభవము తోఁచును. బోధవస్తువే యంతటఁ బ్రకాశించునదియు, నంతటను వ్యాపించునదియు, ననంతశక్తి కేంద్రమునై యున్నది. బండియుండ రేకులకు నాభి (అరుక-కుంచము) తోను, కమ్మి (ఇనుపబద్ది) తోను సంబంధమున్నటులే, యా బోధమయక్షేత్రమునుండి యనంతప్రసారములు, అనంతశక్తులు, ననంతప్రకాశములును బలుముఖముల వ్యాపించుచుండును, గనుక దానిని సహస్రారమనిరి. సహస్రశబ్దము అసంఖ్యావాచకము.

ఇప్పటి సాధకు లనేకులు షట్చక్ర క్రియాసంబంధమున నింతయో యంతయో యెఱుఁగుదురు. ఉపదేశించుచుందురు. ప్రవేశవిద్యార్థి విషయమున నా యుదంతములు మంచివే.

వేర్వేఱు చక్రములందు వేర్వేఱు వర్ణములు, వేర్వేఱు మూర్తుల ధ్యానము, వేర్వేఱు మంత్రముల జపానుష్ఠానములు, చక్రక్రియయందును న్యాసక్రియయందును ననుష్ఠానము నుప దేశింపఁబడును; గాని యది యనుభూతి రహితమైనచో, అనఁగాఁ జైతన్యసత్త నుద్బోధింప సాయపడనిచో నయ్యను ష్ఠానములవలన నాత్మజ్ఞానోదయ మేనాఁడునుం గాదు. ఈ చక్ర ముల విశేషరహస్యములు కలవు. అవి తత్త్వకేంద్రములు. స్థూలమునుండి సూక్ష్మమువైపు ముందంజవేయు పక్షమునందు, సాధకుఁడాయా భూమికల నాశ్రయింపక తప్పదు. తత్త్వజ్ఞాని యైన గురుఁడు, అధికారియైన శిష్యునకే యీ రహస్యములను దెలుపును. అనధికారుల తలల కవి యెక్కవు, గాన నవి తెలు పఁడు. అంతేకాని దాచుకొను నభిప్రాయము వారికి లేదు.

## సుగ్రీవుని దౌత్యము విఫలమగు రహస్యము.

మృదుమధుర వాక్యములతోనే యంబికను ముగ్ధను జేయఁ బ్రయత్నించెను. అతిమధుర ప్రణవాది మంత్రజపము, అతిమధుర స్తోత్రపాఠాదికము, అతి మధురోపనిషదాది శాస్త్రాధ్యయనము మున్నగు నుపాయములచే నంబికను (అమ్మను—ఆత్మను) శుంభుఁడు దనయింటికిఁ (అస్మితాక్షేత్రము నకు) గొనితెచ్చుటకుఁ బ్రయాసపడెను, గాని యవి పనిచేయ వయ్యెను. శుంభుఁడు ఆత్మబలి నీయవలయును, అమ్మను దెచ్చుటకుఁ దన్నుఁ దా మఱవవలయును. "నేను" ఉన్నంత దాఁక అమ్మవచ్చుట జరుగదు. ఇది సత్యోకథ. ఇచట సాధకుఁడు, "నాయమాత్మా ప్రవచనేన లభ్యో, న మేధయా న బహునా

శ్రుతేన" మున్నగు సత్యదర్శి మహర్షుల వాక్యములను దలంప వలయును. అదియైనపుడే శుంభుఁడు (అస్మిత) దూతను బంపుట యందైన విఫలతను దెలియఁగలఁడు.

దూత (సుగ్రీవుఁడు) వినిచిన శుంభుని మాటల రహస్యము.

"అతఁడు ముల్లోకములకు నీశ్వరుఁడు. అతని యాజ్ఞ సర్వదేవతలకును శిరోధార్యము. అతఁడు దేవతల నెల్లరను జయించెను. అతఁడు పంపఁగా వచ్చిన దూతను."

విను, అస్మితయందు సృష్టిస్థితిలయముల నెడి ముత్తెఱఁగుల ప్రకాశమున్నది. కనుకనే యస్మిత సర్వమును ధరించి పాలించి సంహరించు నీశ్వరుఁడుగ వెలయుచున్నది. వాచనిక జ్ఞానమనెడి సుగ్రీవుఁడువచ్చి దేవి యెదుర నిటులు వర్ణించెను. "జగత్తను పేరితో వెలయునదంతయు నాదే యైనపుడు స్వప్రకాశరూపవైన చిత్శక్తివి నీవేల నాదానవు కావు? సర్వ దేవశక్తులపైని నాయాధిపత్యమున్నది. నా సత్తవల్లనే దేవ తలు సత్తావంతు లగుచున్నారు. నాపై దేవతల కెట్టి యధికార మును లేదు. నేను వారినందఱిని జయించితిని. ఇటులు సమస్త మును నాదే యైనపుడు, ఆత్మవైన నీవును నాదానవే యెందు లకుఁ గావు?" ఇవి శుంభుని (అస్మిత) భావములు.

సాధకా! మెలఁకువతో విను. జీవుఁడు తొలుత సాధన క్షేత్రమందుఁ బ్రవేశించునపుడు, "నేను భగవంతు నొందు దును." అనుచు భగవంతు నొక యమూల్యమైన వేఱు వస్తువుగఁ దలంచును. క్రమముగా సాధనము చేయఁజేయ, ఈ 'నేను' తన సందేహము, అవిశ్వాసము, అహంకారము,

కామక్రోధాదులు ననెడి మలినవస్త్రములను వీడి శ్రద్ధ, విశ్వాసము, దయ, క్షమ, నిరభిమానము మున్నగు వెలగల దుస్తులతోఁ దన్నలంకరించుకొనును. క్రమముగా నేనుదక్క మఱే మియు లేని యొకస్థానమును జేరును. బహుత్వము మంచి సెడ్డలు మున్నగునవన్నియు 'నేను' యొక్క స్ఫురణములు మాత్రమే యని తెలిసికొనును. అపు డాశ మఱెంత పెరుగును. మఱి యాత్మను సైతము వశపఱచుకొనఁ బ్రయాసపడును. గాని యిదియు నజ్ఞానమే, ఆసురభావమే.

'నా యాత్మ' యని నోరితో ననుచున్నాము. ఇదియు నజ్ఞానమాత్రమే. ఆత్మ యెన్నఁడును నాది కాదు. ఆత్మయే నా స్వరూపమని తెలియని కారణముననే, ఆత్మను దనలోనికిఁ దెచ్చుకొనఁగడఁగును. అపుడే యీ చరమాజ్ఞానమున వచ్చి చేరును. ఇదె శుంభమహాసురుఁడు. అజ్ఞానమే శుంభుని స్వరూపము, కనుక ఆత్మను (అమ్మను) నేనునకు వశమొనర్పఁ గడఁగును. ఈ చేష్టయే శుంభుఁడు దూతను బంపుట యనెడి మొదటి పని.

## శుంభుని మాట లెంతవరకు సత్యములు?

1. 'ముల్లోకములు నావి. 2. దేవతావర్గము నా వశమయినది. 3. సమస్త యజ్ఞభాగములను నే నుపభోగించుచున్నాను.'

1. విను; సాధకా! ఈ యస్మిత (శుంభుని) మాటల సత్యమును దెలియఁగల్గుదువు. స్థూల సూక్ష్మ కారణములు (సృష్టి స్థితి లయములు) అను మూడువిధములైన ప్రకాశమునే

త్రైలోక్య మందురు. లోకశబ్దము ప్రకాశార్థకము. ఆత్మ బుద్ధి యందుఁ బ్రతిబింబించుటచేతనే కేవల జడబుద్ధియు, ఆత్మ (నేను) రూపముగా భాసించును. ఆత్మ (దృక్ఛక్తియు), బుద్ధి (దర్శన శక్తియు) పూర్తిగా వేఱైనను, అభిన్నములుగాఁ జేరియుండి ప్రతిభాసించుచున్నవి. ఇదె, అస్మిత – శుంభాసురుఁడు. కనుక స్థూలాది త్రివిధప్రకాశము, ఈ యస్మితగానే యుపలబ్ధమగు చున్నది. కనుకనే త్రైలోక్యము నాది యనెను.

2. యజ్ఞభాగము లనఁగాఁ గర్మఫలములు. కర్మమే యజ్ఞము. ఈ బ్రహ్మాండము కర్మమయము. కనుక నిది యొక యజ్ఞశాల. కర్మఫలములే యజ్ఞభాగములు. ఈ యజ్ఞభాగ ములు దేవత లొందఁదగినవి. ఏమన – చక్షురాదీంద్రియాధి పతులు (మలుమూటలోఁ జూచునది) సూర్యాది దేవతలు రూప రసాది విషయగ్రహణమనెడి కర్మఫలమును గైకొనుచున్నారు. చూడుము. ఒక పూవును జూచి నీ వానందింతువు. ఇపు డేమై నది? విరాణ్మనసుయొక్క పుష్పవిషయక సంకల్పమువలన నొక విధమైన స్పందనముపోయి, నీ చక్షురాదీంద్రియములను స్పంది తములుగాఁ జేయును. నీ చక్షువు పూవుయొక్క బాహ్యరూపము నెంతగా గ్రహించి మనసుకడకుఁ జేర్చునో మనస్సంతగా దానిని బుద్ధిప్రకాశముచే నాలోకించి పూవుయొక్క మనోహర రూప మును గ్రహించును. తత్ఫలముగాఁ జక్షురింద్రియము తనివి నొందును. ఈ చక్షురింద్రియతృప్తి యనఁగాఁ జక్షురింద్రియ విశిష్టమై ప్రకాశించును. అదె యాదిత్యదేవతా తృప్తి. ఈ తృప్తి పేరే యజ్ఞభాగము. రూపరసాది విషయగ్రహణమనెడి యజ్ఞమునకు అదె శేషభాగము (అమృతము). అది దేవతలకు

భోగ్యము (ప్రాప్యము). కాని యిపు డది యస్మితయొక్క అధి కారములోనికి వచ్చినది. ఏమన, నిపుడు దేవతావర్గము విశుద్ధ చైతన్యాంశముగా వెలయఁజాలమిచే బుద్ధితత్త్వమందుఁ బ్రతి బింబించిన చిదాభాసుని విశేషస్ఫురణముగాఁ బ్రకాశించినది. ఈవిధముగా దేవతావర్గము తను యధికారములవలనఁ దొలఁగి యజ్ఞభాగములను గోల్పోయినది.

## అసురులు యజ్ఞభాగములను హరించు రహస్యము.

గీతయందు భగవంతుని మాట (3–12) "కర్మములవలన దేవతలు తనియుదురు. అవి చేయక (యెవ్వఁడేని) యజ్ఞభాగ మును గ్రహించువాఁడు దొంగ" అని. ఈ దొంగతనము స్థూల దేహాత్మబోధముతోనే ప్రారంభమగును. జీవుఁడు సాధకుఁడు కానంతవఱకు దేహాత్మబోధమందే విచరించును. రూపరసాది విషయభోగము చేసి స్థూలదేహమును మనస్సును దనుపును. ఈ తనివి యనెడి ఫలము, యజ్ఞభాగము దేవతలకుఁ జెందవలసి నదే. ఇది యపుడు తెలియఁబడదు. తరువాత సాధనరాజ్య మందుఁ బ్రవేశించి తొలుదొల్త మనస్సునే యాత్మగాఁ దలం చును, గనుక నప్పుడును యజ్ఞభాగము చైతన్యమునం దర్పితము కాలేదు. పిదప విజ్ఞానమును జేరి, విజ్ఞానాత్మయనెడి యస్మితను దనియించు సాధనము చేయును, గాన సామాన్యజీవుఁడు మొదలు విజ్ఞానమయకోశసాధకునిదాఁక నెల్లరుఁ దెలిసియో తెలియకో యజ్ఞభాగములను హరించుచున్నారు. ఇదె యసు రుల వలన యజ్ఞభాగములు హరింపఁబడు రహస్యము.

వేర్వేఱింద్రియములవలన నాహరింపఁబడిన రూపరసాది విషయ విజ్ఞానమును జేరియు వేర్వేఱుగానే పరిగ్రహింపఁబడుచున్నది. అవి యాత్మయందే యర్పింపబడినచో, మఱి వేర్వేఱన్నదే యుండదు. సర్వభేదములు తొలఁగి యేకరస రూపమునఁ బరిగ్రహింపఁబడును. సాధకా! అపూర్వమైన యీ తత్త్వమును నెమ్మదిగా విచారించి చూడు — మఱియు నిటులు సర్వయజ్ఞేశ్వరుఁ డెవఁడో, యజ్ఞభాగము లెవని కర్పింపఁబడునో, వానికొఱకే యజ్ఞము చేయుము. నీ బహుత్వ మనెడి పాపము అనాయాసముగాఁ దొలఁగును.

## అస్మితను జేరిన సాధకుని లక్ష్యము.

అస్మిత యననేమో మున్ను వివరించితిమి. స్మరించుకొనునది. అస్మితను జేరగానే యది దేనిచేఁ బ్రకాశింపఁజేయఁబడినదో, దాని సత్తకేది సత్తయో దానివైపు లక్ష్యము పడును గనుక, దాని నొందుటకై సాధకులు సర్వవిధములఁ బ్రయత్నింతురు. శుంభుఁ డా యంబికను దెచ్చు ప్రయత్నము వట్టిదే. నిత్యసిద్ధమైన సాధనప్రణాళి నిర్దేశింపఁబడును.

## శుంభుని (అస్మిత) మాటలన్నియు సత్యములే.

"మా బుద్ధిచే నీలోకమందు నీవే (అంబిక) స్త్రీరత్న స్వరూపవు. మేమే సర్వరత్నభోగమున కధికారులము. నీవును మమ్మాశ్రయింపుము. నన్నైనను సరే, బహుపరాక్రముఁడైన నా తమ్మునైనను (నిశుంభుఁడు—మమత) సరే. చంచల నయనా! భజింపుము. ఏలన నీవు స్త్రీరత్నమవు"

శుంభునిమాటలన్నియు సత్యములే. చూడుము. మనయమ్మ యథార్థముగా స్త్రీరత్న స్వరూపయే. స్త్రీరత్నమునర్థము శ్రేష్ఠశక్తియని మున్నంటిమి. ఎన్ని శక్తులున్నను చితిశక్తి యొక్కటే సర్వశ్రేష్ఠము. సృష్టి స్థితి సంహారాది శక్తులన్నియు నా పరాశక్తి విశేషప్రకాశములు మాత్రమే. కనుకనే అంబిక (అమ్మ) స్త్రీరత్నస్వరూప. జీవుఁ డీయానందమయ చితిశక్తి సంధానము నొందనంతసేపు యథార్థశాన్తి నెట్టులును బొందఁ జాలఁడు. ఇపుడో, లక్షజన్మముల తర్వాతనో, దీని నెఱుంగునపు డేదో విధముగా దీని నాయత్తము చేసికొనక తప్పదని వివేచించియే శుంభుఁ డీమె నంకస్థను జేసికొనఁ బెద్దగాఁ బ్రయత్నించెను. ఇందులకే మేమే రత్నాధికారుల మన్నాఁడు. మఱియు నీవు స్త్రీరత్నమవైయుండియు, మా యధికారమునకు వెలినుండుటెట్లు కుదురును? "అస్మానుపాగచ్ఛ" = మా యెడకు రమ్ము అనెను. అనఁగా, మా యహంతతోనే నిన్నొందఁ గోరుదుము. రమ్ము; మా యపూర్ణాహంతను బూర్ణముఁ జేయుము. మా కెన్ని యైశ్వర్యములున్నను, నీ లేమిచే మా యహంత లేమికిఁ జిక్కిపోయినది. దేవీ! నీవే స్వయముగా వచ్చి, యీ యపూర్ణమైన 'నేనును' బూర్ణ మొనరింపుము.

"నన్నో, మా తమ్మునో నీకు నచ్చినవాని నాశ్రయింపుము. అనఁగా — నీ వాత్మవు. అహంతవలనఁ బ్రకాశిత వగుచో హానిలేదు; లేదా, నీవే యాత్మరూపముగాఁ బ్రతిభాసించినను హానిలేదు. అహంతమూలముగా నిన్నుధరింప నలవి కాదు, ఏమన— నేను (జీవాత్ముఁడను) ప్రతిబింబమాత్రుఁడను. ప్రతిబింబము మూలబింబము నెట్లుగ్రహించును? ఇది యసంభవ

మని తోఁచినపుడు, మా తమ్ముని నిశుంభుని (మమత) నాశ్ర యింపుము. సకల బ్రహ్మాండములు మమతచేతిలోనే యున్నవి. నీవు స్వయముగా నాత్మవు. నీవు నిశుంభునే (మమత్వమునే) యాశ్రయింపుము. మాకుఁ బరమలాభమే. నీవు మాయాత్మవే యగుచు మా దాన వెందుకుఁగావు? ఆత్మ మా దైయైనపుడు, మే మాత్మను గైకొని యథేచ్ఛముగా ననుభవింపఁగలము; కాని యది కాకున్నది. మా యాత్మను మేము కైకొన్న నే మమ్ము మేము (నేనును) మఱచుటగును. అపుడు నేనుండనే యుండదు. మేముండము కాని, యిపు డది కాకున్నది, నిన్ను మే మహంతగానే చూతుము. కాదేని, ఏకాంతాత్మీయ వను కొనుచు నిన్ననుభవింతుము. నీవు చంచలాపాంగివి. నీ చంచల భావమును విడిచి మమ్ము స్థిరముగా భజింపుము.

మన యమ్మ నిజముగాఁ జంచలాపాంగియే. రెప్పపా టులో జాఱిపోవును. కానరాదు. ఆ సౌమ్యప్రకాశము, ఆ సర్వతోభేది ప్రకాశము, ఆ యవాఙ్మనసగోచర ప్రకాశము, అర్థక్షణములో విలీనమైపోవును. మన సర్వభావములను, అస్మి త్వమును హరించు నమ్మను శరీరమున్నంతకాలమును గాంచు నుపాయములేదు. శరీరమానసాది సర్వమును విలయ మొనర్చి, యపుడమ్మ మనయెడ వెలసినను, వాని బీజములు మిగిలిపోవును. కనుకనే చంచల (మెఱుపుఁదీగ) యుపమానము.

## అదే యథార్థ చరితార్థత.

సాధకా! చూడు. కొండగుహాయందు బహుకాలము సమాధియందుండువాఁడు యోగాసనమందే కూర్చుండును.

ఆతఁడు సంతత మమ్మను గాంచుచున్నాఁ డనుకొనకు. ఎడ తెగక యమ్మను జూచుటచే దేహమేయుండదు. ఒక్కక్షణములో దేహాత్మసంబంధము విడిపోవును. అనాత్మప్రతీతి పూర్తిగా లోపించుటచే దీర్ఘకాలము దేహమందునిల్చుట కేవల మసంభవము. అది మెఱుపుఁదీవవలెఁ గానవచ్చునంత, జీవుఁడు ధన్యుఁడగును. జీవన్ముక్తుఁడగును. ఆనందమయుఁడగును. బ్రహ్మస్వరూపుఁడగును. ఒక్కసారియైనచో మఱెన్నఁడు మఱవఁడు. మఱి కోరినంతనే దర్శనమగుచుండును. ఈ యానంద ఘన జ్ఞానము జాఱిపోవు టెన్నఁడునుం గాదు. నా 'నేను' అన్నది, ఆత్మయన్నది, మనయమ్మయే. మఱి దానిని బొందుట, పొందకుండుట, చూచుట, చూడకుండుట యన నెట్టిది? కాని, చూడఁగోరుము. ఆ చూచుట, పొందుట యనునదే యథార్థ చరితార్థత.

## ఆత్మయే జీవుని భజించును.

శుంభుఁడు (అస్మిత) మఱియొక మాటన్నాఁడు. "భజ త్వాం" ఇది గొప్పసత్యము. ఇది శుంభుఁడే యనలేదు, శ్రుతియు నన్నది. "యమేవైష వృణుతే" ఈ యాత్మ యెవనిని వరించునో వాఁడే దానినొందును. గీత యిట్లన్నది. "తాం స్తథైవ భజామ్యహమ్" ఆత్మ నెవ్వఁడే భావముతోఁ గనునో, యా భావముతోనే వాని నది భజించును. చూచితివా — వేదము, గీత, చండీపాఠము ఇమ్మూఁడు నొక్క స్వరముతోనే యొక్క మాటనే చెప్పినవి. ఆత్మయే జీవుని భజించును. మాట వినికి యందును, మాటను బోధించుకొనుటయందును, తెలుపుట

యందును మాత్రమే క్రిందుమీదులు, విరోధముగాని మాట సత్యము, నిస్సందిగ్ధము.

## గీతయందలి యొక ప్రధానశ్లోక వివరణము.

"యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్।
మమ కర్మానువర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః॥" 4-22

"మాం యే యథా ప్రపద్యన్తే తానహం తథైవ భజామి. హే పార్థ! మనుష్యాః సర్వశః మమ కర్మానువర్తన్తే."

సూర్యునకు యోగశిక్ష నిచ్చు సందర్భమున, అర్జునుఁడు భగవంతు నడిగెను. ప్రశ్నము చిన్నదైనను, దానియందు భగవానుని సమస్త జన్మకర్మ రహస్యము ప్రచ్ఛన్నముగాఁ దెలియఁగోరఁబడినది. కానిచో "శ్రీకృష్ణుఁడు జన్మమెత్తి సూర్యునకు యోగశిక్షణ మెనర్చెనో?" యని సందేహించి యర్జుననివలె సాధకుఁడు ప్రశ్నింపలేఁడు. ఆ విధముగా భగవంతుఁడును దన జన్మకర్మములను విశదముగాఁ దెలుపు మిషతోఁ దన రెండువిధములైన జన్మములను, ఆ జన్మముల కాలమును, ఉద్దేశ్యనిర్ణయము చేసి, "యాతఁడే సర్వజీవుల కర్మనియంతయై యున్నాఁడు; అతని యిచ్ఛనే జీవబృందము సర్వవిధముల ననువర్తించుచున్నది; జీవులయెడ నతని యయూచిత స్నేహము వర్షించు" ననెడి తత్త్వ మీ శ్లోకమందు వర్ణించినాఁడు.

భగవంతుఁ డనెను — "ఎవఁడు నన్నేవిధముగా భజించునో, యే యవస్థయందుండి, యే యవస్థవలన జీవుఁడు

నా యనుగ్రహమును గోరునో, నేనా యవస్థయందు, ఆ యవస్థ వలన నతని ననుగ్రహింతును. జీవుఁ డింద్రియధర్మిమై యుండి, యింద్రియచరితార్థత – విషయభోగము నొందుటకుఁ గ్లేశపడు నపుడు, ప్రత్యక్షముగా నన్నందులకై ప్రార్థించుచున్నను, బరోక్షముగ నతఁడు ఆ విషయభోగముకొఱకు నన్ను భజించును. నేనును బరోక్షముగానే వాని యా విషయభోగమును జరితార్థము చేయుదును. లేదా, జీవుఁడు నన్నొందుటకై వ్యగ్రుఁడై నను వాని యభిలాషమును నెఱవేర్తును. ఏలన, నా నిర్దేశించిన మార్గమునే యాతఁ డనువర్తించుచున్నాఁడు. నే నేవైపునకుఁ గొనిపోఁదలఁతునో, యా వైపునకే జీవుఁడు నాచేఁ జలింపఁజేయఁబడి, యా దెసయందే నన్ను లక్షించి యగ్రసరుఁడగును. విషయభోగములనెడి గాలివానచేతను, ఇంద్రియాకర్షణమనెడి వెల్లువ వడిచేతను జీవుని హృదయము క్లేశపెట్టఁబడును. మోహతరంగపు దెబ్బ గుండెదడను గల్గించి యొడ్డునకు గెంటునపుడే, యతఁడు నా కభిముఖుఁడై ముందంజ వేయును. ఉన్న తావస్థయందే కాదు, సర్వావస్థలందును నేనే జీవు నటునిటు త్రిప్పువాఁడ నగుటచే, నేవిధముగా నా కృప నర్థించునో, నే నావిధముగానే వానిని గరుణింతును. ఐనను గర్మరహస్యమునుగూర్చిన నా మహిమ మేమన – జీవుని ప్రార్థనము, వాని యా కోరిక యేనాఁడును వాని నమంగళమువైపు కొనిపోదు. పైచూపునకుఁ బ్రార్థనోద్యమము, అమంగళమును గలిగించునదిగాఁ దోఁచినను, నా శుభేచ్ఛ వానిలోపల నుండి శుభమార్గముననే వానిఁ గొనిపోవును. జీవుఁ డెట్టి యవస్థయం దెట్టి కర్మమైనం జేయనీ; ఎట్టి సిద్ధికైన నాకర్షింపఁబడనీ; తదనురూపమైన కర్మ

మును జేయించుటయు, సిద్ధి నిచ్చుటయు, వానికి మంగళజనకము లగుటచేతనే, నేనట్టి జీవులను ఆయా కర్మములయందు నియోగించి సిద్ధి నొసఁగుదును. నేనే జీవులకుఁ గర్మాధికారమిత్తును. అపు డాతఁడు కర్మమాచరించును. నేనే జీవునికి, సిద్ధినొందు నాశ కలిగింతును. అపుడు జీవుఁడు విషయసిద్ధికో, భగవత్సిద్ధికో తహతహపడును.

సాధారణ జీవుఁడు, భక్తిప్రణాళి తెలియుటకై, యీ విధముగా నర్థమును జేసికొనవలయును. ఇపుడు సాధనసంబంధమునఁ జెప్పెదను. ఏ సాధకుఁ డేవిధముగ నమ్మను భజించునో, యమ్మయు నటులే వానియెడఁ గరుణించును. ఎవఁ డేయవస్థయందుండి యమ్మ భజన మెటులు చేయనీ, అమ్మయు నా యవస్థయందే వాని ననుగ్రహించును. ఇంటనో, యడవినో, గార్హస్థ్యమందో, సన్న్యాసమందో, నీచకులమందో, ఘనకులమందో, భక్తిజ్ఞానమందో, కర్మమార్గమందో, ఏ యవస్థయందైన సరే, యమ్మను స్మరించినంత వచ్చును. ఇదె మన యమ్మగారి చిరంతన నియమము. ఆ స్మరణమనునది యెటులు, ఎంతవఱకు ? ఆ పిలుపునకును అమ్మ రాకకును సంబంధమున్నదా ? లేదా ? అని యనేకు లందురు గాన నీ శ్లోకమున కనేకు లిటు లర్థము చెప్పుదురు. తాము కర్మాధికారమందుండి యెంతగా మాతృముఖు లగుదురో, యంతగా మాతృకృప నొందఁగలరు. అనురాగ పరిణామము నెఱింగి మాతృకృప వర్షించును. సాధారణముగా నిది సత్యమే; కాని యీ యనురాగముసైతము, ఆమె కృపచే నామె యిచ్ఛానుసారముగా వానిలోఁ బుట్టుచుండును. ఆమె నెయ్యపుటుబుకే యీ యను

రాగము పట్టుటకు మూలకారణము. కనుకనే కర్మానుపాకము వలన ఫలములేదు. ఎప్పుడేకర్మ చేయించుటకు ఎప్పుడేఫలము నిచ్చుటకు అమ్మ మనసునఁ గోరిక యుద్దీపించునో దానికిఁ దగు భావముతోనే జీవుఁడు కర్మముచేయుచుండును. సాధారణ జీవులు పెద్దప్రయత్నముతో నొందఁగల్గు ఫలమునే సాధకుఁ డిచ్ఛామాత్రమున నొందుచుండుట తెలుచు కనుచున్నాము. విడువని వ్యవసాయముతో సాధారణులు కర్మానుష్ఠానము చేయఁగానగు ఫలమును సాధుపురుషులు నిరాయాసముగా సంకల్పమాత్రమునఁ బొందుచున్నారు. ఒకవేళ సాధు వాచ రించు కర్మమునకును ఫలము కానరాదు. ఒక జీవుఁ డొక్కసారి గానే సాధువు కాఁజాలఁడు. మిగుల నాయాసముతో బహు కాలాభ్యాసముతో మాతృభావమునఁ జేరియుండి క్రమముగా జీవుఁడు సాధువగును. మాతృభావ యుక్తావస్థ నొందినపైని బహుళక్లేశ సహకారముతో జీవుఁడు సమర్థుఁడగును. మహా యాస సాధ్యకర్మము మున్నే సజ్జితమై యుండుటచే సాధు పురుషుఁ డిచ్ఛామాత్రమున సిద్ధకాము లగుచున్నారు అని కొంద ఱాశంకింపవచ్చును; గాని యది నిష్కారణము. ఏలన, మాతృలాభేచ్ఛ యనెడి కర్మమువల్లనే జీవులు సాధు త్వము నొందుదురు. కేవల మాతృప్రసన్నతా విశేషము కారణముగానే సాధువులు లబ్ధకాము లగుదురు. కనుకనే ఫలానుపాతముచేఁ గర్మములు సాగుచున్నవనియుఁ, గర్మాను పాకముచే ఫలము లేదనియు నందురు. ఉచ్చతమ క్షేత్ర మందిది స్పష్టముగాఁ గానవచ్చును. మఱియు సాధారణ మనుష్య క్షేత్రమును గర్మమయము చేయుటకై "కర్మాను

యీయీ ఫలలాభః” యను భావముతోఁ గర్మము ననుస రించియే ఫలలాభముండునను భావముతోఁ గర్మఫల సంబంధము పెంపొందుచున్నది. అమ్మ దుకాణదారునివలెఁ ద్రాసుతోఁ దూచి కర్మమూల్యమును బట్టి ఫలము నీయదు. (అమ్మ కొనదు.) ఎంత ఫల మిచ్చు టావశ్యకమో, తలంచి యపుడా ఫలమును భరింపఁదగు సామర్థ్యము నిచ్చుటకై, యా ఫల భోగమున కుపయుక్తమగు భావముతోఁ జేయించునట్టి, వాచిక కాయిక మానసిక పాంచకౌశిక సంచాలనమే కర్మమనఁబడును.

కొందఱు భగవత్కృప పాత్రాపాత్రముల నపేక్షింపక సూర్యకాంతివలె సమభావముతోనే కురియు నందురు. అయిన నయ్యది సర్వత్ర సమముగా వికసింపకుండుట కనుచున్నాము. కారణమేమన జీవుల యధికారభేదమే కారణము. చూడు, తారతమ్యము. ఒక్క మేఘము కురిసిన వానయే ముండ్ల చెట్ల ముండ్లను బలిపించును. అదే పూఁజెట్ల పూవులకుఁ దావిని బెంపొందించును. మొగ్గల నదే విచ్చును. ఇదియు సంపూర్ణ సత్యము కాదు. మాతృకృప సర్వత్ర సమభావముతో నాయా క్షేత్రోచిత గుణములనే పోషించునది యైనచో, నది జీవుల నుద్ధరించు నుపాయముగాక సతము నంధకారమున నుండవలసి నదే. సత్యముయొక్క యమృతమయ స్నిగ్ధ జ్యోతిర్దర్శనము లేక యజ్ఞానాచ్ఛన్నులైన జీవు లెన్నటికిని వంచితులే యగు దురు. అమ్మ మనయెడ నట్టిది కాదు. ఆమె యెల్లర నానంద మయ ముక్తిమందిరము వంకఁ బ్రబలవేగముతో నాకర్షిం చును. ఆమె క్షుద్ర పరమాణువును సైతము తన గుండె నత్తుకొని ప్రయోజనానుసారముగా క్షేత్రకర్మాదుల దారిని

గ్రమక్రమముగా నున్నతపదమునుండి యున్నతతరపదమునకుఁ గొనిపోవును. వానిని దన నిత్యభోగ్య ముక్తాహంతయందు నిల్వలేనంతదాఁక విరామములేక విశ్రామములేక క్షేత్రము నుండి క్షేత్రమునకు దాటించి పిచ్చిదానివలె మన యమ్మ యీ పరమాణువులఁ దీసికొని పోవుచునే యుండును. గనుక నేఁడు ఘోరతమోగుణావృతుఁడైన జీవుఁడు రెండు దినముల తర్వాత శుద్ధ సత్త్వగుణ సంపన్నుఁడగుట మనము కనుచున్నాము. అమ్మ నిరపేక్షత సూర్యకిరణముల వంటిదే యైనచో, ముండ్లచెట్టు ముండ్లచెట్టుగానే యుండును; పాపి సదా పాపిగానే యుండును; ఎన్నఁటికి నెవ్వనికిని యున్నతి కల్గకే యుండును. తల్లిలోని జీవోద్ధారేచ్ఛ సర్వకర్మ శృంఖలా మూలముగా నున్నది. గాన సాధారణముగా జీవులు తమ ప్రకృతి ననువర్తించుచున్నను వారు క్రమాచరిత కర్మఫలములచే జ్ఞానము నొందుచు బ్రహ్మజ్ఞానము వంక ముందడుగు పెట్టుదురు. కనుక నిర్గుణులము, దుష్టమాత్రులముగా నుండి జీవుల మైన మనము ప్రకృతి గుణములందుఁ ద్రిప్పఁబడుచున్నను, అమ్మ యిచ్ఛచే నాకర్షింపఁబడి యెల్లరము కర్మముల దారి నామెవంకకే నడుచుచుందుమని తెలియవలయును. అనఁగా — అమ్మ శుభమయేచ్ఛతోనే ముఖ్యముగా నడుచుచున్నాము. మనమన ప్రకృతులు (కర్మానుసారములగు నావర్తనములు) నిమిత్తమాత్రములే. తీర్థమునకుఁబోవు బండి తీర్థమువంకకే ముందునకు నడుచును, గాని దాని చక్రము లెల్లపుడును వాని యిరుసులపైనే తిరుగుచుఁ బోవును. అటులే అమ్మయొక్క మంగళేచ్ఛను బట్టియే సర్వవిధముల నామెవంకకే జీవుఁడు

నడుచుచున్నాఁడు. కేవలము తమ తమ ప్రకృతి రూపకర్మ మనెడి యిరుసుపైని వాని కర్మచక్రము దాని నిర్మాణము ననుసరించి తిరుగుచుండును. మన యమ్మ యిచ్ఛ సర్వస్వతంత్రము. జీవులయెడ నైన శుభేచ్ఛయే బ్రహ్మముయొక్క బహుత్వ వికాసము. అనఁగా మాతృత్వ ధర్మము. అదె యామె బ్రహ్మత్వము, మాతృత్వము, వరాభయములు వెద జల్లుటే, యిచ్ఛామయి యైన యమ్మ నిత్యధర్మము. సూర్యధర్మము కాంతులను వెదఁజల్లుటయు, కాంతులే సూర్యుని సూర్యత్వము నైనటులే అమ్మ (బ్రహ్మ) ధర్మము స్నేహకరుణామయములగు శుభములను వెదఁజల్లుటే, స్నేహేచ్ఛయే, అమ్మ మాతృత్వము. స్నేహాకర్షణమే బ్రహ్మ బ్రహ్మత్వము.

ఆ యమ్మను నీవొకసారియుఁ జూడలేదా? క్షేత్రజ్ఞునిగా ముస్తాబుచేసి, జగత్తునఁ బ్రత్యణు పరమాణు హృదయమందును మూర్తిమతియై, యీ కర్మయజ్ఞమయ బ్రహ్మండచక్రమును నడిపించుచున్నది. యజ్ఞక్షేత్రమునం దంతట నగు సర్వకర్మముల నడుమ నెల్లప్పుడు స్థిరముగా నుండి జ్ఞానాకారమున వెలయుచున్నది. క్రమముగా స్థిరత్వమువంకకే నడిపించుచున్నది. జ్ఞానమయగురుఁడు తానేయయి క్రిమిత్వమునుండి నరత్వమునకు, దేవత్వమునకు, బ్రహ్మత్వమునకుఁ గ్రమముగా దారి చూపుచు జీవులను గొనిపోవుచున్నది. ఆ యమ్మ నొకసారియుఁ జూడలేదా ?

జీవుఁడా! ఆ యమ్మ నెంతకాల మవమానింతువు? సర్వకర్మములకును మూలమైన చైతన్యసత్త నెంతకాలము చైతన్యమాత్రముగానే తలంచి, సర్వకర్మములకు నుపాదానమైన

యహంత నొక చిత్తవృత్తిమాత్రముగానే యెంచి, యెంత కాల మమ్మ నుపేక్షింతువు? "అమ్మా! యనలేవా? లోనున్న మధువును మధువనవు. జీవభావీయుఁడవై చూడలేవు. మాతృభావీయుఁడవై విచారింపవు. ఎంతదాఁక నరుఁ డమ్మను దెలిసికొనఁడో, అమ్మను గలయండైనఁ గానఁడో, అంతదాఁక దార్శనికుఁడై కర్మప్రాధాన్యమునే చూచుచుండును. కర్మమునే సర్వావర్తనమూలముగాఁ దలంచును, కర్మానురూపమే ఫలమనును. నేఁడా రూపమున కెదురుగా నిలిచి యామె శ్రీముఖమువలన నభయవాణిని వినఁగా వినఁగా నిఁక జీవు నకుఁ గర్మప్రాధాన్యము కానరాదు. అమ్మయే స్వయముగా 'యే యథా మాం ప్రపద్యన్తే' యెవఁడు గొప్పగా నా భజన మెటులేనిం జేయనీ, యెట్టి కర్మమును జేయకపోనీ, ఆతని కర్మచక్ర మెట్టిదేనిఁగానీ 'తాం స్తథైవ భజామ్యహమ్' నేనా విధమైన భజనమువల్లనే, యాతని కర్మమందే, జీవక్షేత్రమందే, యతని యా యునికియందే, అనఁగా సర్వసాధనములందును, సర్వ కర్మములందును, సర్వావస్థలయందును సర్వ విధముల నేనే వాని ననుగ్రహింతును. సర్వ కర్మములందును నా యనుగ్రహమే నా కర్తృత్వమే ప్రధానము" అని యమ్మ తానే యన్నది.

అంబిక శుంభదూతతో బదులాడిన మాటల
పరమార్థము వినఁదగినది.

ఈ సందర్భమున 'గంభీరాంతః స్మితా జగౌ' అని యున్నది. అమ్మ ముందుగాఁ జిఱునవ్వు నవ్వెనట.

రోష తోషములు రెండును సమభావమందుండు సామర్థ్యమే గాంభీర్యము. మన యమ్మ నిత్యనిర్వికార. ఎట్టి యవస్థయందును, ఆమెయందణుమాత్రమును వికారము కానరాదు, కనుకనే యామె గంభీర; అంతఃస్మిత; అనఁగా మనసే నవ్వుచున్నది. జగౌ=గానము చేసెను. శుంభుని దూతయైన సుగ్రీవుని శ్రవణమందు (గాన) సుధావర్షణ మగునంత మధురముగాఁ బల్కెనని యర్థము. నిజముగా మాతృవాణి యంత మధురమైనదే. శబ్దహీన వాణియైనను సంగీతస్వరము వలె నమృతమును వర్షించినది.

దేవి మాటలు:—

"సత్యముక్తం త్వయా నాత్ర మిథ్యా కించిత్త్వయోదితమ్,
త్రైలోక్యాధిపతిః శుంభో నిశుంభశ్చాపి తాదృశః॥"

"ఓ దూతా! నీవన్నది (నిజమే) సత్యమే. కల్ల యింతయు లేదు. శుంభుఁడు ముల్లోకముల యేలిక. నిశుంభుఁడు నంతవాఁడే."

ఈ మంత్రము నర్థము పలు విధములుగాఁ గలదు. క్రమముగా దాని యాలోచనము చేయుదము.

అంబిక సుగ్రీవునితో నన్నది:— శుంభ నిశుంభులు (అస్మితా మమతలు) తాము ముల్లోకముల కధిపతులుగాఁ దలఁచుచున్నారు. నీ వన్నది సత్యమే, అసత్యమేమియు లేదు.

మఱియొకయర్థము:—"దూత! త్వయా సత్యం న ఉక్తమ్, అత్ర కించిత్ మిథ్యా ఉదితమ్" ఓయి దూత! నీవు సత్యము

చెప్పలేదు. ఇందుఁ గొంత మిథ్య పల్కితివి. ఏమన, శుంభ నిశుంభులు త్రైలోక్యాధిపతులు కారు. ఇంతకు మున్ను 'త్రైలోక్యే పరమేశ్వరః" అంటివి. యథార్థముగా ముల్లోకము లకు నధిపతి అస్మిత కాదు. ఆత్మయే, అమ్మ సత్తయే ముల్లో కముల సత్త. ఆత్మయే లేనిచో నెచ్చటను నే సత్తయు నుండఁ జాలదు. కనుకనే నీమాట కల్ల.

మఱొక యర్థము కాఁగలదు. ఆత్మయే (నేనే) శుంభ నిశుంభుల రూపమునఁ (అస్మితా మమతా రూపమున) త్రిలో కాధిపతినై యున్నాను. కనుకనే నీమాట నిజము. కల్లకాదు. ఏమన శాస్త్రమందు సమస్తము సత్యరూపముగానే చెప్పఁ బడినది. బొంకింతయు లేదు. త్రై॥ శ్రుతి॥ "యదిదం కించ తత్సత్య మిత్యాచక్షతే" ఈ ప్రతీతమగుచున్నదంతయు సత్యముయొక్క రూపమే అని చెప్పుచున్నది. సత్యమును – సర్వత్ర సత్య స్వరూపమైన యాత్మను, అనుసరించి తుల్యరూపముతో నుండుటచే సమస్తము సత్యమే. ఆత్మోపనిషత్తునందుఁగాని, బ్రహ్మసూత్రములందుఁ గాని, 'మిథ్యా, భ్రాంతి' యను మాటల ప్రయోగము కానరాదు. భాష్యకారులును, అనిర్వచనీ యార్థమందే మిథ్యాపద ప్రయోగము చేసిరి. మఱి, మిథ్యయు సత్యముపైనే ప్రతిష్ఠితమైనది. ఒక్క సత్యస్వరూపాత్మ తక్క నెచ్చటను నేదియు లేదు. కనుకనే సర్వము సత్యము కనుక, ఓయి! దూతుఁడా! నీవు సత్యమునే పల్కితివి. కల్లాడలేదు.

"కిం త్వత్ర యత్ప్రతిజ్ఞాతం మిథ్యా తత్క్రియతే కథమ్,
శ్రూయతా మల్పబుద్ధిత్వాత్ ప్రతిజ్ఞా యా కృతా పురా॥"

కాని యీ విషయమున నా ప్రతిజ్ఞ యొకటి కలదు. దాని నెట్లు కల్లచేయుట? మున్ను (బాల్యముచే) చిన్నబుద్ధితో నేను జేసిన ప్రతిజ్ఞ వినుము.

అమ్మ యనుచున్నది—ఓ దూతుఁడా! మీ ప్రభువు లిరువురును త్రిలోకాధిపతులు. శ్రేష్ఠరత్నముల ననుభవించుటకు సమర్థులు. కనుక వారి పరిగ్రహము నంగీకరించుట నాకుఁ గర్తవ్యమే, నైనను జిన్నబుద్ధితో మున్ను నా పట్టిన ప్రతిన వినుము. దానినెట్లు భంగపఱచుట?

ఇచట దేవి కల్లయాడినదా? బుద్ధిస్వరూపమైన తాను, మున్ను దేవతలచే "బుద్ధిరూపేణ సంస్థితా" యని స్తుతింపఁబడినది. మఱి మున్ముందును "సర్వస్య బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితా" యని స్తుతింపఁబడును. (నాలవదిగా వెలువడిన 'స్తుతులమూట' వ్యాఖ్యలోఁ జూచునది.) అట్టి యమ్మ తానే "అల్పబుద్ధిత్వాత్ ప్రతిజ్ఞా యా కృతా" అన్నదికదా. ఇది కల్లయాట కాదా? కాదు. రవ్వంతయుఁ గల్ల లేదు. సత్యమే స్వరూపముగాఁ గలది యెట్టి యవస్థయందైన సత్యమును మఱుఁగుపఱుపదు. ఇట్టి నిరావరణయు దిగంబరయు నైన యీమె యందు మిథ్యారోపణము చేయుట కడు వెతఁగల్గించును, గాన వినుము. బుద్ధితత్త్వ మల్పము. శ్రుతియే "ఆత్మ యొక యేకదేశమందు — అత్యల్పస్థానమందే జగత్తు (బుద్ధి) యొక్క యునికి. ఆత్మ ప్రకాశకము; బుద్ధి ప్రకాశ్యము; ఆత్మ వ్యాపకము; బుద్ధి వ్యాప్యము; కనుకనే యల్పము. బుద్ధి యెప్పుడును అల్పమే. "విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్" (10-42). ఆత్మను (అమ్మను) ఈ బుద్ధిరూపముగానే కనుగొన్నచో, నల్పమే

యగును. మున్ను మనము అసత్, అనృత, అవిద్య, అజ్ఞాన మున్నగు పదములకు అల్పార్థమును జెప్పుచు వచ్చితిమి. అమ్మ తానే యిమ్మాట యన్నదని కనుగొన్నాము. ఆత్మ, మన యమ్మ, అల్పమై వెలయునపుడే యామె పేరు బుద్ధి. కావున 'అల్పబుద్ధిత్వాత్' అనుటయందు బిందుమాత్రమును మిథ్య లేదు. మఱియు నీ ప్రతిజ్ఞ యనెడి పని బుద్ధియందైనదే. 'బహుస్యామ్' ఒక్క నేనే యనేకమగుదు నన్నదే మొట్టమొదటి యమ్మ ప్రతిన. ఈ ప్రతిననుబట్టియే, అమ్మ యన్నిటికంటె గొప్పదైన బుద్ధిరూపమున నభివ్యక్తయైనది. ప్రతిజ్ఞ చేయుట యన్నది, అమ్మ యల్పయగుటయే యగును: అనఁగా బుద్ధిరూపమున వెలయుట యగును. ఔరా! బోధవస్తువు స్వప్రకాశము, పూర్ణము; దానియందు జ్ఞాతృ జ్ఞేయాది భావములు తోఁచునపుడే యది యల్పము, అపూర్ణము కనుక శుంభదూతతో "శ్రూయతామల్పబుద్ధిత్వాత్" అన్నది. ఇపుడు మనము ఆ ప్రతిననుగూర్చి యాలోచింతము.

అంబికా ప్రతిజ్ఞ కడుసుందరము, కడువింత.

"యో మాం జయతి సంగ్రామే యో మే దర్పం వ్యపోహతి,
యో మే ప్రతిబలో లోకే స మే భర్తా భవిష్యతి॥"

"ఎవ్వఁడు యుద్ధమందు నన్నుఁ గెల్చునో, ఎవఁడు నా గర్వమును దొలఁగింపఁగలఁడో, ఎవఁడు నాకు సమబలుఁడో వాఁడే నా భర్త కాఁగలఁడు."

అమ్మ ప్రతినయందు మూఁడభిప్రాయము లున్నవి. మొదటికల్పము ఇంద్రియసంగ్రామము. ఇంద్రియము లెల్లప్పు

డును రూపరసాది విషయములను జడపదార్థములుగానే గ్రహించును. ఆనందమయి, చితిశక్తిరూపిణి, అమ్మయే రూపరసాది విషయాకారముతో నింద్రియములదారిని రాకపోకలు జరుపును. ఇది పలుసారులు తెలిపినను, ఇంద్రియములు తమ యెల వాటుచొప్పున విషయములను జడములుగానే గ్రహించుచున్నవి. ఇదె యింద్రియసంగ్రామము. ఈ యింద్రియయుద్ధమందు జీవుఁడు సదా యలసిపోవుచున్నాడు. చైతన్యమయి యమ్మ యెపుడును జడత్వ మనెడి కపటవేషమును ధరించి, యింద్రియరూపము గాను విషయరూపముగాను వెలసి, జీవుని బరాజితు నొనర్చుచున్నది. విషయములు విషయములు కావు. ఆనందఘనశక్తి ప్రవాహవిశేషములు. సాధారణజీవు లీమాటను దెలిసికొనలేరు, కనుకనే యోడిపోవుచున్నారు. అయినను, అమ్మ యీ యుద్ధమందు నన్ను జయింపఁగలవాఁడు (అనఁగాఁ బ్రత్యేకేంద్రియ మార్గమందును ఆనందఘనసత్తారూపముతో నిత్యము వెలయు నాత్మనే నేనని యనుభవింపఁగలవాఁడు) ఇంద్రియ సంగ్రామమందు నన్ను గెలువగలవాఁడు.

రెండవకల్పము దర్పనాశము. కామమునకును జెల్లును. కందర్ప, అనంగ, కామ పంచశర, స్మర శబ్దములు సమానార్థకములే. కామ శబ్దముచే వృత్తిమాత్రమే యనుకొనక, కామ నామాత్మకముఁగానే గ్రహింపఁదగును దాని కేమి? అమ్మ "యో మే దర్పం వ్యపోహతి" ఎవఁడు నా దర్పమును దొలంపఁగలఁడో యన్నది. అనఁగా – ఆనందఘనాత్మనగు నేనే, అహంకార అభిమాన అస్మితా మమతా కామాది వృత్తి కామ్య వస్తు రూపమున నెల్లపుడు వెలయుచుందు ననెడి సత్యమును

దెలిసికొని యనుభవింపఁగలఁడో — అనఁగా — ఆనందఘనాత్మ నగు నేనే దర్పమనెడి యావరణముచే నన్ను మఱుఁగుపఱచుకొని, యున్నానని యెఱింగి, నా యావరణమును దొలఁగింపఁగలవాఁడే నా దర్పము నణంపగలవాఁడు కాఁగలఁడు. ఆ దర్పనాశమునే సాధారణముగా అహంకారనాశమని, కామనావిలయమని తెలియవలయును.

మూఁడవకల్పము — **సమానబలము.** అమ్మ బలమేమి? ఏకత్వము; నిర్వికారత్వము; ఆనందమయత్వము; గుణాతీతత్వము; నిరంజనత్వము మున్నగునవి. ఈ విధముగా నేకత్వానందమయత్వ గుణాతీతత్వాది బలసంపన్నుఁడైన జీవుఁడే (అనఁగాఁ దన బ్రహ్మత్వమును సరిగా ననుభవింపఁగల జీవుఁడే) నాకు సమబలుఁడు.

'స మే భర్తా భవిష్యతి' నన్ను భరించువాఁడు కాఁగలఁడు. భృ ధాతువునకు ధారణము, పోషణము అని రెండర్థములు. పరమప్రేమాస్పద పరమాత్మజ్ఞానమును జక్కఁగా ధరించి పోషింపఁగలవాఁడును, దన విషయేంద్రియ సంస్పర్శముచే నానందమయాత్మనే గ్రహింపఁగలవాఁడును, అహంకారమమకారములు తొలఁగినవాఁడును, దన యేకత్వానందమయత్వముల ననుభవింపఁగలవాఁడును మాత్రమే నా భర్త కాఁగలఁడు. మఱియు నీ బోధమును బోషింపఁగలఁడు. అతఁడే నా భర్త కాఁగలఁడని యర్థము. శ్రుతియందలి "నాయమాత్మా బలహీనేన లభ్యః" "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" అనునీ వాక్యముల తాత్పర్యమే, అమ్మ ప్రతిజ్ఞావాక్యముల తాత్పర్యము. బ్రహ్మము నెఱుంగువాఁడే బ్రహ్మస్వరూపుఁ డగును.

పైని జెప్పఁబడిన మూఁడు కల్పములు నేవనియందుండునో యతఁడే బ్రహ్మస్వరూపుఁడు కాఁగలఁడు. సంగ్రామజయము, దర్పనాశము సమబలము ననునవి లేక మాత్రలాభము నాశించుట వ్యర్థము. ఇంద్రియములచే సమాహరింపఁబడిన విషయము నాత్మస్వరూపమున గ్రహించు నలవాటగుటచేతనే దర్పము తొలఁగును. అనఁగా 'అహం కర్తా' 'మమ కర్తృత్వం' అనెడి భావము తొలఁగిపోవును. అపుడే యాత్మయొక్క నిత్యత్వము, అవిక్రియత్వము, ఏకత్వము మున్నగు ధర్మము లనుభవమునకు వచ్చును. అపుడే సమబలుఁడగును. అపుడే బ్రహ్మైక్య జ్ఞానము కలుగును. అపుడే 'అహం బ్రహ్మాస్మి' యనుచు సాధకుఁడు సర్వభేద జ్ఞానమువలనఁ దొలఁగిపోయి స్వయంబ్రహ్మరూపుఁడై భాసించును.

అనేకులు మునుజెప్పిన యీ మూఁడుకల్పములను వికల్పములుగాఁ దలంతురు. అనఁగా మొదటికల్పము లేమియందును, పరకల్పము లున్నప్పుడు భర్త కాఁగలఁడందురు. కాని మంత్రమందు వికల్పబోధకములగు 'వా, అథవా, కింవా' మున్నగు పదము లేవియు లేవు. కనుకఁ గల్పములనుచు వికల్పముల నంగీకరించు టెటులగును ? సముచ్చయార్థమే శ్రేష్ఠము. మూఁడు కల్పముల సముచ్చయ మున్నపుడే భర్తృత్వయోగ్యుఁ డగునని యే గ్రహింపవలయును. ఏమన, మొదటియింద్రియసంగ్రామ విజయము లభించినపుడే దర్పనాశమగును; దర్పనాశమైనపుడే సమబలుఁడు కాఁగలఁడు. సమబలుఁడైనపుడే యాత్మజ్ఞానము నొందఁదగియుండును. 'సమత్వం యోగఉచ్యతే' యను భావమే గీతయందుఁ జూపఁబడినది.

ఈ మంత్రార్థజ్ఞానమును బలువురు పలురీతుల నందురు. అది విస్తరించినచో గ్రంథకళేబరము పెరిగిపోవును. 'స మే భర్తా భవిష్యతి' అనునపుడు కొందఱు ప్రకృతిజయమందురు. సంగ్రామజయమనఁగాఁ గర్మయోగమని కొందఱందురు. దర్ప నాశమనఁగా భక్తియోగమని కొందఱందురు. సమబలమనఁగా జ్ఞానయోగమని కొందఱందురు. అయినను వారికిని మనకును విరోధమేమియు లేదు. అన్నియు సత్యమే, చేకొనఁదగినవే. ప్రకృతిజయ, కర్మ భక్తి జ్ఞాన సముచ్చయము లేక యాత్మ సాక్షాత్కారము కాఁజాలదు. కనుక నన్నియుఁ జేకొనఁదగినవే.

## వ్యాకులతయే సాధనమునకుఁ బ్రాణము.

అమ్మ యన్నది. "శుంభుఁడో, నిశుంభుఁడో వచ్చి నన్ను గెల్చి నా పాణిగ్రహణము చేయవచ్చును."

ఈ మంత్రమందు "యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వామ్" అనెడి యుపనిష ద్వాక్యమే ప్రతిధ్వనించుచున్నది. ఆత్మను వరించువాఁడే దాని నొందఁగలఁడు. అట్టివానికే యాత్మయుఁ దన స్వరూపమును సాక్షాత్కరింపఁజేయును. కన్యక పతిని వరించునటులే, యాత్మను వరించువాఁడు వ్యాకులతతోఁ బ్రార్థించును. వాఁడె యాత్మ సాక్షాత్కారము నొంది ధన్యుఁడగును. వానితోనే యాత్మపరి ణయ మగును. అమ్మ శుంభదూతతో 'శుంభుఁడో, నిశుంభుఁడో నా ప్రతిజ్ఞకుఁ దగిన సామర్థ్యము గలవాఁడైనచో నా పాణి గ్రహణము చేయవచ్చు' నన్నది. ఆదాన శక్తిపేరే పాణి. దానితోఁ బరిగ్రహించుటే పాణిగ్రహణము. నన్ను (ఆత్మను)

గ్రహించుటకైన తీవ్రవ్యాకులతయే యిచట 'పాణి'. ఆదాన శక్తి యని తాత్పర్యము. వాఁడెవ్వఁడో తీవ్రవ్యాకులతవలన నన్నొందఁగలఁడు అన్నది. పాణిగ్రహణ శబ్దమునకుఁ బరిణయ మని యర్థము చెప్పినను హానిలేదు. ఆత్మనుగూర్చిన యేకాన్తా సక్తి లేక యాత్మతోడి పరిణయము (సాక్షాత్కారము – మేల నము) జరుగదు. అస్మిత యనెడి శుంభుఁడు చితిశక్తిపేరి యాత్మను బొందుటకై మిగుల వ్యాకులంపడినాఁడు కనుక నిజత్వమును విడిచి యాత్మ నొందినాఁడు. తన్ను మఱచి మఱియొక కేవలాభీష్టవస్తువుగ నుండుటయే, ఆసక్తియొక్క (వ్యాకులత) తుది పరిణామము. ఆకులతయే సాధనమునకుఁ బ్రాణము. ఒక్క తీవ్రాకులత యున్నచో మఱే యనుష్ఠానము నక్కఱలేదు. కాని వ్యాకులతయు, ఉచ్ఛృంఖలతయు (కట్టు బాటు మీఱుటయు) నొక్కటి కావని మాత్రము మఱువరాదు. సర్వము విడిచి యాత్మప్రాప్తికై యిటునటు పరుగిడుట వ్యాకు లత కాదు. అది యా వేళ కగు కట్టుబాటులేని యుబుకు. వ్యాకులత మనుష్యుని కర్తవ్యజ్ఞానహీనునిఁ జేయదు. సర్వ కార్యములందును, సర్వావస్థలందును బ్రాణగతియొక్క లక్ష్యము వంక నడుచుచుండుటే వ్యాకులతయొక్క యథార్థరూపము.

ఇచట నొక పరమ రహస్యము సాధకు లెఱుంగఁ దగినది. భగవంతుని గూర్చిన వ్యాకులత నానాఁటికి హెచ్చుట కును, నానాఁటికి భగవత్ప్రేమ పెంపొందుటకును మన దేశమందు బుద్ధిశాలురు, అయిదు విధములైన భావములతోడి యుపాస నముఁను బ్రచారము చేసిరి. అవి శాంత, దాస్య, వాత్సల్య, సఖ్య, మాధుర్యము లనఁబడుచున్నవి. తండ్రి గొడుకులు, తల్లి

గొడుకులు నను భావముతో నగు భగవదారాధనము పేరే శాంతభావము. ప్రభు సేవక భావముతోడి యుపాసనము పేరే దాస్యభావము. బిడ్డలయెడఁ దలిదండ్రులకగు స్నేహముతో నుపాసించుటే వాత్సల్యభావము. బంధుభావముతో నుపాసించుటే సఖ్యభావము. పత్నీభావముతో నుపాసించుటే మాధుర్యము. పరకీయభావముతో నుపాసించుట మధురభావముయొక్క చరమరూపము. శాంత భావోపాసనమునకు దృష్టాంతము ధ్రువ ప్రహ్లాదాదులు. దాస్యభావమునకు హనుమద్గరుడాదులు. వాత్సల్యభావమునకు నంద యశోదా కౌసల్యాదులు. సఖ్యభావమునకు విభీషణార్జునాదులు. మధుర భావమునకు రాధికా గోపికలు. ఏ భావమం దెంత వ్యాకులత పెంపొందునో, యా భావ మంత శ్రేష్ఠము. వైష్ణవశాస్త్రములు మధురభావమునకే ప్రాధాన్యము నిచ్చినను, యథార్థ ప్రియతమ ప్రేమాస్పద పరమాత్మసంధానము నొందినవారు శాంత దాస్యాది సర్వభావములను సమముగాఁ బాలించియే యుక్తులు కాఁగలిగిరి. సాటిలేని యోగానందము ననుభవించిరి. కారణ మేమన, ఈ భావముతోఁదక్క మఱియొక భావముతో నాత్మను జేరలేమని వారెన్నఁడును దలంపలేదు. ఆత్మ యనునది మన సర్వస్వము.

"త్వమేవ మాతా చ పితా త్వమేవ
త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ,
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ॥"

కనుక నాత్మతో నాత్మీయత నెఱపుటే సర్వభావ మయము.

వైష్ణవ సంప్రదాయములు మధుర భావమునకు వ్రజ గోపుల నాదర్శముగాఁ జూపఁజూతురు. శ్రీకృష్ణుఁడొక్కఁడే పరమపురుషుఁడు; తక్కిన సమస్తము నతని ప్రకృతులు గనుక, స్త్రీలనెడి భావముతో నుపాసించువారు, తాము భగవంతునిఁ బ్రియతమ సఖునిఁగా భావింతురు. పురుషభక్తులు సయితము, ఈ సఖీభావము నుద్దీపింపఁజేయుటకు స్త్రీలవలెనే ముస్తాబయి హావభావములఁ జూపుచు నాటపాటలను జరుపుదురు. ఇది యస్వాభావికమని కొందఱు మన్నింపకున్నను నిందింపఁదగదు. భావుక రసికుల కాటపట్టైన యీ దేశమందు సర్వభావములతో నుపాసించువా రుండుటే దేశమునకు గొప్పఁదనమును గౌరవమును గలిగించెను. అగుఁగాక; పరమాత్మను బతిగాఁ గల్పించుకొని యుపాసించుట మధురభావ మైనటులే, పరమాత్మను బత్నీభావముతో నుపాసించుటయు మధుర భావమే కాని, వైష్ణవశాస్త్రము దీనిని జేకొనలేదు. పురుష భక్తుల పక్షమందిట్టి భావముతో నుపాసించుట సఖీభావమును బట్టి చూడ మిగుల సహజమని, యేగ్రంథమును స్పష్టముగా వ్రాయ సాహసింపలేదు. ఈ చండీ (సప్తశతీ) గ్రంథమందు శుంభుని మాటవలన నిది యాభాసించుచున్నది. ఇదిగాక ప్రాణతోషిణి మున్నగు మంత్రములందు బలుతావుల నీ సంకేతము కానఁబడును. ఇట్టి యుపాసనమును లక్ష్యమందుంచి

పలువురు పలువిధముల దోషాపత్తిని జూపిరి. కాని యిది సరియైనదే. ఆత్మ యనునది మన 'నేనే'. మన సర్వస్వమే. అది లేకున్నచో 'నేను' కస్తిత్వమే యుండదు. దానియందు సర్వభావముల నారోపించుట సహజమే. ఆత్మ నేవిధముగా నాదరించినను హాని యింతయు లేదు. ఆత్మను సఖుఁడనియో బంధుఁడనియో యెంచి, కవుఁగలించుకొనఁజూచిన నా యాత్మ మహత్త్వము తఱుఁగనటులే, ప్రియతమభార్యగా నెంచి మనసారఁ బ్రేమించినపుడును దాని మహత్త్వము వెత్తి పడదు. లోకమందుఁ బతిని బ్రాణముగా నెంచి యామెకు సుఖసంతోషములు కూర్చుటే మనుష్యుని జీవనలక్ష్యము. అట్టి పత్నీవ్రతము పరమాత్మయెడనే సమర్పితమైనపుడు వాని జీవనము ధన్యమే కాఁగలదు. ఈ మధురభావమే స్వాభావికము, శ్రేష్ఠము.

మన మిపుడు భావాతీతరూపసంధానము నొందితిమి. దానివంకనే యగ్రసరుల మగుచున్నాము. కనుక భావరాజ్య విషయాలోచనము చేసి పాఠక చిత్తములను వేఱొకవంకఁ దగుల్పఁబోను. అది యుండనిండు.

అమ్మ యన్నది —— నా పాణిని గ్రహించుటకు నన్ను గెల్చి - అనఁగా - ఏకను, అద్వితీయను, నిర్వికారను, సర్వభావాతీతను నే నయినటులే, నా పాణిగ్రహణము గోరువాఁడును, నా గుణములతో సంపన్నుఁడు కావలయును. 'నన్ను గెల్చి' యన దాని మఱియొక రహస్య మేమనఁగా నేనును జయించి యాత్మ నొందుట 'నేను' ఉన్నంతదాఁక ఆత్మప్రకాశము ఉండఁజాలదు.

## భేదజ్ఞానముతోడి భక్తి, భక్తిసాధనామాత్రమే.

అమ్మా! తెలిసినది. నిన్నొందుట కింద్రియసంగరమందు నిన్ను గెల్వవలయును. స్థూలేంద్రియమార్గములందు, నిన్నే ధరింపవలయును. సర్వమయము, నఖండము నైన నీ కర్తృత్వము నెఱింగి మా యహంకర్తృత్వమనెడి దర్పమును ద్రొక్కివేయ వలయును.

తరువాత బలవంతులమై, అనఁగా నీ సాటి బల్మి నొంది యేకత్వము, అవిక్రియత్వము మున్నగువాని నొంది, యపుడు నీ యెదుర నిల్వవలయును. అటులు చేయఁగల్గినపుడే నిన్నుఁ బ్రాణముతో బ్రేమింపఁగలము. అపుడే నీ వనినంత మైమఱవఁగలము. మఱి మా యహంత తలయెత్తదు. అపుడు నీ యద్వితీయస్వరూప మొక్కటే విరాజిల్లుచుండును. "మేము ముక్తి గల్గుటకు మున్నే ప్రాణముతో సమానముగాఁ బ్రేమింతుమని, మేము ముక్తిని గోరమని, మేము గోరునది భక్తియే యని" కొందఱందురు. వారు ముక్తినొందుటకు మున్ను యథార్థభక్తి నొందఁజాలరని యెఱుఁగరు. బద్ధజీవుఁడు ముక్తాత్మయెడ నెంత భక్తిఁ జేయఁగలఁడు? అసమానధర్మమందుఁ బ్రేమ ముదయించునా? అణుమాత్ర భేదజ్ఞానమున్నను బ్రేమఃముగల్గునా? జీవుఁడనన్యభక్తిని గూర్చిన ప్రార్థనమే చేయవలయును. భేదజ్ఞానముతో నగు భక్తి, భక్తిసాధనామాత్రమే. అది యుండనిండు.

## అస్మితను జేరిన సాధకుని యాశలు.

దూత యుపసంహారవాక్యముల యాధ్యాత్మిక రహస్యము :— "స్వేచ్ఛతో శుంభునికడకు నడువుము. కేశాకర్షణ

నిర్ధూతగౌరవవు కాకుము." ఆధ్యాత్మికార్థ మిది — కేశాకర్షణ శబ్దార్థము నెఱుంగునది. క్ + అ + ఈశ = కేశ = బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ఇటు లేకాక్షరకోశ సహాయముతోఁ జేసిన యర్థమునకుఁ బూర్వాచార్యులే దారి చూపిరి. కాళీ ధ్యానమందు 'ముక్తకేశీ, చతుర్భుజా' అనుచోటఁ గొందఱు ప్రాచీన పండితుల ప్రసిద్ధటీకలును నిట్లే యున్నవి. ముక్తాః కేశాః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః యయా సా ముక్తకేశీ = బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును ముక్తినిచ్చునది ముక్తకేశీ. తత్త్వప్రకాశికా టీకయు నిచట బ్రహ్మ విష్ణు మహేశ్వరులనియే తెల్పినది. అది యట్లుండె. కేశశబ్దార్థము బ్రహ్మాదులు ముప్పురు నమ్మయొక్క సృష్టి స్థితి ప్రలయ శక్తులనియే. ఇమ్మూడు శక్తులను నాకర్షింపఁ గల్గినపుడే చితిశక్తి హీనబల యగును. అపు డామె గౌరవము లోపించిపోవును. దూత యిటు లెంచియే యమ్మాట లనెను. ఆత్మయొక్క జగజ్జన్మ స్థిత్యాది వ్యాపారములు లాగికొనఁబడె నేని (అనఁగా నస్మితయే సృష్ట్యాది వ్యాపారములు చేయఁజాలె నేని) చితిశక్తి శక్తిత్వము హీనమగుననియు, అట్టియపు డామెను గ్రహించుట సులభసాధ్యమనియు నెంచెను, గాని, అయ్యో! దూతుఁడు అమ్మ కేశములను (సృష్ట్యాది శక్తులను) ఎవ్వఁడును లాగికొనలేఁడని యెఱుఁగఁడు. సాధకుఁ డెంత శక్తిమంతుఁ డైనను మాత్ర కేశాకర్షణ సమర్థుఁడు కాఁజాలఁడు. కనుకనే వ్యాసదేవుఁడును వేదాన్తదర్శనమందు "జగద్వ్యాపారవర్జమ్" (4-410) అని యొక విశేషసూత్రము నుల్లేఖించెను. అర్థ మేమనఁగా ముక్తపురుషులకుఁ దక్క శక్తులు కలుగవచ్చుఁ గాని జగజ్జననాది వ్యాపారసామర్థ్య మేనాఁడును గలుగదు. ఇది

కవి బ్రహ్మ యీశ్వరుఁడే చేయఁగలఁడు. ముక్తపురుషులు కోరినచో నీ జగత్తునందుండి దానిపై నాంశికాధిపత్యము చెలా యింపఁగలరు. కనుక మాతృకేశాకర్ష మెన్నఁడును అసంభ వమే. ఆ పని చేసెనా, మఱి తానే కానరాఁడు (ఉండఁడు). వ్యావహారిక జగత్తునందు సైతము, ఆడుదాని జుత్తుపట్టి యీడ్చి మర్యాదానాశముచేయువాఁడు తానే చెడుట కనుచున్నాము. వినుఁడు - అస్మితను జేరిన సాధకుఁడు తనను జగదీశ్వరునిఁగాఁ దలఁచును. కొన్ని వ్యష్టిపదార్థములపైఁ బెద్దఱికము చేయఁ గలఁడు. ఇంతో యంతో యీశ్వరధర్మ మాతనియందు వెల యును. కోరినవెల్లఁ దఱుచుగా నెఱవేఱుచుండును. కాని జాగత సృష్టి స్థితి లయములందు వ్రేలు పెట్టలేఁడు. కావునఁ దప్పక చితిశక్తివైపే-పరమాత్మవైపే జరుగుచుండును.సృష్ట్యాది సర్వకారణవస్తువే చేఁజిక్కినపుడు పూర్తిగా జగద్వ్యాపార ముపై నాధిపత్యమే లభించును. శుంభుని యాస యిట్టిదే. కాన నంబికను గ్రహించునెడ వాని కింత యాయోజనము.

## దేవి బదులు మాటల పరమార్థము.

"శుంభుఁడు మహాపరాక్రమశాలియే. ఏమిచేయుదును. అనాలోచితముగా మున్ను నాచేసిన ప్రతిన పట్టితిని. నీవుపోయి నా మాటల నాదర పూర్వకముగా నసురరాజుతోఁ జెప్పివే యుము. అపుడతఁడు యుక్తి సంగతము నెంచి యటులు చేయును."

శుంభాదులు బలవంతులనుటయందు, అమ్మకును సందే హాము లేదు. అమ్మ దూతతో నుపహాసముగా ననలేదు.

అమ్మ మనల నుపహాసము చేయుటే యెఱుఁగదు. అచట నుపహాసమన్నది యింతయు లేదు. సత్యమును ధ్రువమును మాత్రమే యచట వెలయును. నిజముగా బలపరాక్రమము ననునవి యస్మితగానే యొప్పును. మాతృబలము వాని బలము కంటెను విశిష్టమైనను శుంభుని త్రిలోకీవిజయమునెడ సందేహ ముండదు. అస్మితా సమష్టిక్షేత్రమందే సృష్టి స్థితి ప్రలయము లనెడి త్రివిధ ప్రకాశములును వ్యక్తమగుచుండును. సాధకుని ప్రత్యక్షానుభవము నట్టిదే.

"యదనాలోచితా పురా" యనుచోట నొక శంక.

పురా=మున్ను; సృష్టి ప్రారంభమందు, విశేషాలోచన చేయక ప్రతిన పట్టితిని. "నన్నెవఁడు యుద్ధమందు గెల్చునో" మున్నగు మాట. ఇపుడొక శంక—సృష్టి మాటను శ్రుతి, ఈక్షణపూర్వకము - ఆలోచనాపూర్వకమనియే యన్నదికదా; ఇపుడాలోచింపకయే యనుట యెట్లుచెల్లును? అని. దాని కుత్తర మిది— నిజముగాఁ దల్లి నొందుటకు (అంబికాపాణిగ్రహణము నకు) మును జెప్పిన సంగ్రామ విజయము, దర్పనాశము, సమ బలము గలవాఁడే కావలయును. ఈ విషయము లాలోచింపఁ బడ లేదేమి? అమ్మ యథార్థస్వరూపము, నిత్యమును స్థిరము నైనది. అమ్మ యెప్పుడు నేకాంతప్రాప్తవస్తువు. అమ్మ నొందుటకుఁ బ్రయత్న మావశ్యకమనుట యమ్మ విచారింపనే విచారింపదు. ఇంతేని ప్రయత్న మావశ్యకమనుట, జీవుఁడు తల్లి కంటె నొక వేఱైన సత్తను గల్పించుకొని భ్రాన్తికిఁ జిక్కి యుద్ధమువలన (సాధనమువలన) తల్లి నొందఁగోరును. తల్లి నిత్య

జ్ఞానమయి. నిత్యస్వచ్ఛస్వరూప. ఆమెయెడ నిట్టిభ్రాన్తి యెట్టు లుండును? అయినను జీవుఁడు తల్లియందీ భ్రాన్తి నారోపించును. కనుక నొక ద్రష్టృత్వము నారోపించును. ఇది మున్ను కల్పన చేయఁబడినది కాదు. కనుకనే యాలోచనమాట చెప్పఁబడినది. ఒకపక్షమునఁ జూచినచో నాలోచన యింద్రియ ధర్మము మాత్రమే. అమ్మ మనకతీంద్రియ గాన మున్ను (సృష్టికిఁ బూర్వము) యథార్థముగ ననాలోచితయే. (అనఁగా నాలోచనను మీఱిన స్వరూపముతో వెలయునదే.)

దేవి మఱొకమాట యన్నది. 'నేను శుంభుని వీర్యవత్త్వమునుగూర్చి సంశయమునుగాని, అవజ్ఞగాని యింతయుఁ జూపలేదు. మీ రాజుతో నుపేక్షాపూర్వకముగాఁగాక సమాదరపూర్వకముగాఁ జెప్పుము. అతఁడు నా ప్రతిబింబము. అతనియెడ నాకు స్నేహము, దయయుఁ దక్క నెన్నఁడును క్రోధావజ్ఞాదులు లేవు. ఉండవు.

శుంభు నిచట 'అసురేంద్రుఁడు' అన్నది. సమస్త సుర విరోధిభావములకును (అనాత్మభావములకును) నితఁడే యధిపతి. సంస్కారరూప వీర్యమునకు, అస్మిత యొక్కటే యధిష్ఠాన క్షేత్రము. కనుక ననురేంద్రుఁ డన్నది.

## సాధకుఁడా! తత్త్వమును దెలిసికొనుము.

సత్యప్రాణప్రతిష్ఠ చేసినపుడే, బుద్ధితత్త్వమును సాక్షాత్కరించుకొనునపుడే, యీ నిర్మలజ్ఞానక్షేత్రమందు క్షణకాలము నిల్వఁగలిగినపుడే తప్పక నీ యాత్మబోధము అస్మితను జేరినదన్నమాట. సర్వభావములతోఁ జేరియున్నను సర్వభావములకంటె

వెలుఁగనున్న నీ యహంతయే యాత్మగాఁ బ్రతీతమగుచున్నది. వాస్తవముగా నదియు నాత్మ కాదు. ఆత్మప్రతిబింబముమాత్రమే. నీ యస్మితయే యథార్థాత్మస్వరూపమును గప్పిపుచ్చుచున్నది. ఇచటఁ జేరి (అస్మితను జేరి) యాత్మవిభూతిదర్శనమందు నీవు ముగ్ధుఁడవు కాకుమా. దేని ప్రతిబింబమాత్రము నొంది నీవు నిన్నింత యున్నతునిగ నెన్నఁగల్గుచున్నావో, యా విశ్వపరమాత్మని వంక, ఆ యానందమయ చితిశక్తిరూపిణి తల్లి వంక నీ నిగాను బఱపుము. ప్రబలప్రయత్నముతో నగ్రసరుఁడ వగుము. ఇదిగో, రవ్వంత భేదజ్ఞానమున్నను, నింతయు నమృతప్రాప్తి యుండదనుట మఱువకు. యథార్థానందసంధానము నొందఁ జాలవు చుమా. గట్టి పట్టుదలతో స్థూల జడపదార్థములను దల్లిగా నెంచినటులే, సత్యమని గ్రహించినటులే, యా భావమును నీవు యాతనగాఁ దలఁచి సాధనరాజ్యమం దగ్రసరుఁడ వైనటులే, ప్రబలాగ్రహముతో 'ఏకమేవా ద్వితీయమ్' ఆనందమయ తత్త్వమువంక లక్ష్యముంచుము. అమృతము నొంది ధన్యుఁడ వగుము. జన్మ మృత్యు సంస్కారము పూర్తిగాఁ దొలఁగిపోవును అని భావము.

ఈ విధముగా నేర్వఁగల్గినపుడే, అమ్మ కృప
ననుభవింపఁగలవు.

అమ్మా! ఇంకెన్నాళ్లకు నా ప్రబల ప్రారబ్ధసంస్కారములనెడి యసురకులము నడుగంటించి, నిర్మల చిదానందమయ స్వరూపమునఁ గానవత్తువు. ఏ యనాదికాలమునుండియో యీ జీవత్వభారమును మోయుచు వచ్చుచున్నాను. భ్రాంతి

మరీచికలకు మోహపడుచున్నాను. ఎంతకాలమునుండియో, యెన్ని జన్మజన్మాంతరములనుండియో నీపైనే యాసపెట్టుకొని యున్నాను. నిన్నొందితినేని నీ ప్రకాశనేత్రములతో నా విశిష్ట ప్రకాశమనెడి మలినదృష్టులను జేర్చి, "అమ్మా! యనుచునే మైమఱతును. ఈ యాసతోనే నీ మొగమువంకఁ జూచుచుఁ గూరుచున్నాను. ఇటు రావమ్మా! అసురుల యత్యాచారము నుండి తప్పించి నన్ను నిర్మల బోధమాత్ర స్వరూపమందుఁ జేర్పుము. అచటఁ దల్లి కొడుకు ననెడి భేదములేదు. భావాతీత త్రిగుణరహిత స్వరూపము నుద్భాసింపఁజేయుము. ధన్యుఁడ నగుదును." అని యీ విధముగా నేడ్వుము. ఇటు లేడ్వఁగల్గి నప్పుడే మాతృకృప ననుభవింపఁగలవు. మాతృకృపానుభవ మయ్యేనేని, శుంభనిశుంభాసుర సంహారమునకు మఱి తడ వుండదు.

## దేవీదూత సంవాదగ్రాహ్య రహస్యాంతరము.

చండముండులు (ప్రవృత్తి నివృత్తులు) తొలుత నంబికా పరిగ్రహమునకై శుంభుని నానావిధములఁ బ్రోత్సహించిరి. మఱి శుంభుని యుత్కంఠవలన దేవిని శుంభునికడకుఁ దెచ్చు టకుఁ బలువిధముల నాసపెట్టిరి; భయపెట్టిరి. మన విధిశాస్త్ర ములన్నియు రోచక భయానక వాక్యములతో నిండినవి. "జన్నములొనర్చినచో స్వర్గము లభించును. హింసవలన నర కము గల్గును." మున్నగు నీ రోచక భయానక వాక్యముల యుద్దేశ్యమేమనఁగా బహిర్ముఖజీవులను ఆత్మవంకఁదగిల్చి క్రమ ముగా స్వరూపమును దెలియఁజెప్పుటే. శాస్త్రములందుఁజెప్పఁ

బడిన విధినిషేధములను పాలించుచు ముందంజవేయు జీవులు సాధారణముగా రోచక భయానక వాక్యముల ప్రభావము వల్లనే విధినిషేధములను పాలించు ఫలముగాఁ జిత్తశుద్ధినొందుచున్నారు. అవశ్యముగా, సవ్యయానందస్వరూపాత్మ సాక్షాత్కారముతో ధన్యులగుచున్నారు. అప్పుడు విధినిషేధములను నవి వారికి లేవు.

## వాచనిక జ్ఞానమాత్రమున ఆత్మలాభము కాదు.

### [ అదె సుగ్రీవుఁడు (దూత) విఫలుఁడై మఱలిపోవుట. ]

వాచనికజ్ఞానము ఎన్నఁడును ఆత్మలాభసమర్థము కాదు. ఇక్కాలమునఁ బలుతావుల, నాత్మతత్త్వ బ్రహ్మతత్త్వ జగత్తత్త్వవిషయములందు దార్శనికాలోచనములు జరుగుచున్నవి. మౌఖికాలోచనములవలన నేనాఁడును నాత్మప్రాప్తి కాదు. "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మమ నని యనేకు లనుచుందురు. ఈ నోటిమాటలతోనే బ్రహ్మజ్ఞానము కలిగిపోవుచున్నది. ఇది వాస్తవికమేకాదు. ఇట్టి జ్ఞానము జ్ఞానమేకాదు. జ్ఞానాభాసమే. జ్ఞానము అనుభూతిమయము కానంతదాఁక నది జ్ఞానమే యనఁబడదు. ఆత్మ స్వానుభూతిస్వరూపము. దాని నొందుటకై సాధనచేయుచున్నను, నింత యనుభూతి లేకున్నచో నది సాధనయే కాదు. సాధకా! నీవు సుఖదుఃఖములు, హర్షశోకములు, శీతోష్ణములు ననువాని నెఱుఁగుకొనుచున్నావా? ఎఱుఁగుట యనఁగా ననుభవించుట కాదా? అవి నీ యనుభవమునకు రానంతదాఁక, నీ వా మాటలను బలుసారు లనుకొనుచున్నను వాని యథార్థస్వరూపము నెఱుంగఁజాలవు. జాగతపదార్థసంబం

ధమునసే యిట్లుండ నిక ఁ గేవలానంద స్వరూపాత్మను హూఖ కాలోచనము:లతోనే యెట్లు సంధానింపఁగలవు ? 'నీరు నీరు' అని పలుసారులు నోట నన్నంతమాత్రమున యెన్నఁడేని నీ దప్పి తీఱునా ? (శుంభదూత సుగ్రీవుఁడు విఫలమనోరథుఁడై దేవీ సన్నిధినుండి మఱలివచ్చుట యనుదాని యాధ్యాత్మిక రహస్య మిదే.)

## అస్మితా విపర్యయజ్ఞానముల తత్త్వము, మఱికొంత.

శంభుని (అస్మిత) ప్రథమసేనాధిపతి ధూమ్రలోచనుఁడు. (విపర్యయ జ్ఞానము – దార్శనికులు భ్రాంతియందురు.) "నీవు పోయి బలప్రయోగముచేసి యీ దుష్టురాలి జుత్తుపట్టి యిటకు లాగుకొని రమ్ము." అని వాని కానతిచ్చెను.

ధూమ్రలోచనుఁడు (ధూమాచ్ఛన్నదృష్టి – పొగ క్రమ్మి నట్లుండు చూపు) అనఁగా విపర్యయజ్ఞానము దార్శనికులు భ్రాన్తి యందురు. ఈ భ్రాన్తి నాశ్రయించియే యస్మితకుఁ ద్రిలోకాధి పత్యము కలిగినది. అమ్మ (ఆత్మ) యొక్క యథార్థస్వరూపము నెఱుంగక, అహంత నే యాత్మగాఁ గైకొన్న కారణమున విపర్యయజ్ఞానము.

ఇమ్మాట విస్పష్టముగ వినుఁడు. ఆత్మను దొలుతఁ జేకొనుఁడు. అది బుద్ధికిఁ బ్రతిసంవేదివస్తువు. ప్రతిసంవేదన మనఁగాఁ బ్రతిబింబితమగుట. ఎచటినుండి ప్రకాశము వచ్చునో, మఱల నచటికే యది పోవునటులే, యాత్మ బుద్ధియనెడు యద్ద మందుఁ బ్రతిబింబితమై మఱలి యాత్మవంకకే పోవును. ఒక యద్దమందుఁ బ్రకాశము ప్రతిబింబము పడినంతనే యహంతా

బోధము లేచును. మఱల దాని కేంద్రమందే, అనఁగా నెచటి నుండి ప్రతిబింబము వచ్చి బుద్ధియందుఁ బ్రతిఫలిత మగుటచే నహంతాబోధ ముదికెనో యా కేంద్రమువైపే యా ప్రతిబింబము మఱలును. ఈవిధముగా ఆత్మ ప్రతిక్షణము బుద్ధియందుఁ బ్రతిఫలించును. దీనిపేరే ప్రతిసంవేదనము. ఈ ప్రతిసంవేదన కేంద్రముపేరే ఆత్మ. బుద్ధియందుఁ బ్రతిబింబించిన యాత్మపేరే అస్మిత. ఆత్మాస్మితలకుఁ గేవల విభిన్నత లేకున్నను, అస్మిత యథార్థాత్మస్వరూపము కాదు, గాని సాధకుఁడు, ఆ ప్రతిసంవేదనమును బట్టికొనియే యాత్మ నెఱుంగును. ప్రతిసంవేదన సహాయమువల్లనే ప్రతిసంవేదిని బట్టుకొనును. అగుఁగాక; సాధకుఁడు గురుకృపచే అస్మితయం దుపనీతుఁడగునపుడు, కొన్నాళ్లు దాని కేంద్రమును, అనఁగా బుద్ధియొక్క ప్రతిసంవేది వస్తుస్వరూపమును (ఆత్మను) ఎట్టులును గ్రహింపలేఁడు. ఆ యస్మిత (శుంభమహాసురుఁడు) ఇచ్చటనే సాధకచేష్టల నన్నిటిని వ్యర్థముచేయును. అస్మిత యనుచరుఁడు విపర్యయజ్ఞానము (ధూమ్రలోచనుఁడు) ఒక వస్తువుయొక్క అయథార్థస్వరూపము గ్రహింపఁజేయుటే పనిగాఁ గలవాఁడు. వీఁడు అస్మితనే యాత్మగాఁ బ్రతీతము చేసెను. తొలుత స్థూలదేహమును 'నేను'గాఁ దోపించి, యిచటను సటులే యస్మితను నేనుగాఁ దోపించెను; గాని వాస్తవముగా నస్మిత నేను కాదు. నేనుయొక్క ప్రతిబింబమాత్రమే. దీనిని బ్రతిబింబముగా గ్రహించుటయుఁ గష్టమే. ఏలన బుద్ధితత్త్వము దీని ప్రతిబింబరూపమును సులభముగా నెఱుంగఁజాలఁడు. నిర్మలమైన యద్దమందుఁ బ్రతిబింబము పడఁగాఁ దొలుచూపునందు ఆ యద్దమే పడును.

సరిగా నిశ్లే యస్మితను జేరి కానఁబడు 'నేను' యథార్థమైన నేను గాదు. దేని ప్రభావముచే నిటులగుచున్నదో యదే ధూమ్రలోచనుఁడు. (ధూమాచ్ఛన్నదృష్టి) విపర్యయజ్ఞానము (అవిద్య). దీనిచే నాత్మప్రతిబింబమే యాత్మగాఁ దోఁచును. ఇమ్మాటను జక్కఁగా నెఱుఁగలేని సాధకుఁడు ఉత్తమచరిత్ర మందుఁ బ్రవేశించు టతికష్టము. (ధూమ్రలోచనునే) విపర్యయ జ్ఞానమునే తొలుత దేవికడకు – అమ్మకడకుఁ బోఁబంచెను. ఉద్దేశ్యము కేశాకర్షణముచేసి దేవిని గొనివచ్చుట. (కేశాకర్ష ణార్థము వివరించితిని.) సృష్ట్యాదికార్యశక్తులను ఆకర్షింపఁగల్గిన నే చితిశక్తిరూపిణి అంబిక విహ్వల – శక్తిహీనరాయై పోవుననెడి పరామర్శమును స్థిరపఱచుకొనియే దేవికడకుఁ బంచెను.

## ధూమ్రలోచనసేన అఱువదివేలు; దాని రహస్యము.

విపర్యయజ్ఞానమువల్లనే, 'జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, క్షీయతే, నశ్యతి' యను నాఱు వికారములు గలుగును. అవి మఱల దశేంద్రియ ద్వారములఁ బ్రకాశిత ములై యర్వదియైనవి. (ఇచట షట్సహస్ర యనుచోటి సహస్ర పదము అసంఖ్యాబోధకము.) మఱల నవి యసంఖ్యావిషయ ములతోఁగూడి యఱువదివేలైనవి. సాధకులు "మున్ను మహిషాసురవధమందు, ఈ షడ్భావ వికారములే ఆయా యసురశక్తులుగ (సైన్యబలములుగ) వర్ణింపఁబడియుండఁగా, మఱల నిచట నిదే ధూమ్రలోచనసేన యనుట పునరుక్తిగాదా" యని శంకింపఁదగదు. మనుజెప్పినది స్థూలకార్యక్షేత్ర విష యము. ఇది యవ్యక్తమందును–సూక్ష్మకారణక్షేత్రమందును

నైనది. కారణక్షేత్రమందు షడ్భావ వికారబీజము లుండుట చేతనే, స్థూలమందలి కార్యరూపము నొందుచున్నవి. గానఁ దొలుతఁ గార్యభావములుగల వికారముల నాశము చెప్పఁబడి, యిపుడిచటఁ గారణత్వమునొందిన యరువదివేల వికారముల బీజములను నశింపఁజేయు నుపక్రమమైనది. ఇపుడు నిర్విశేషాత్మ స్వరూపము బయల్పడనున్నదిగాన, సూక్ష్మతమ వికార బీజ సమూహము ప్రలయాగ్నియం దాహుతియగుటకు సిద్ధమగు చున్నది.

## అవిద్య విద్యయెదుటఁ బడినంతనే నశించును.

చీఁకటి, వెలుగుచెంతకు రాఁగానే నశించిపోవునట్లు, విపర్యయజ్ఞాన మెంత బలవంతముకానీ; ఎంత సహాయముండనీ; ఒక్కసారి చితిశక్తి చెంత నిల్చినంతనే విలయమైపోవును. జ్ఞాన ప్రకాశము తనపై బడనంతనే యజ్ఞానముండును.

"నిన్ను బలాత్కారించికొనిపోదును జుమా" యని ధూమ్రాక్షుఁడన్నంతనే హుంకారమాత్రముచే వానిని నీఱు చేసె, ననుదాని రహస్య మిదే.

హుంకారము క్రోధమును దెల్పు నవ్యయము. తంత్రము లందిది ప్రలయబీజముగాఁ జెప్పఁబడినది. 'నేను' "నిత్యనిర్మల స్వరూపజ్ఞానమను. నాయెదుట విపర్యయ జ్ఞానమెటులునిల్చును? నాయెడ నెటులుపుట్టును?" అను నీ భావముచేత నజ్ఞానము నశించును. కనుకనే క్రోధభావము వ్యక్తమైనది. భస్మము చేసెననఁగా వినష్టమయ్యెనని మఱెన్నఁడును దలయెత్తదని రహస్యము.

నీ మంచిసెడ్డ లేవేని నగ్నశిశువువలెఁ దల్లియెదుట బెట్టుము.

"ఆత్మజ్ఞానులైనవారికిని అజ్ఞానము గల్గుట కను చున్నాము. జ్ఞానులు సైతము, అవిద్యాకార్యములైన లోక శిక్ష, శాస్త్రరచనము, విధినిషేధపాలనము మున్నగువానిని జేయుచున్నారు. అజ్ఞానమొకసారి వినష్టమై మఱలఁ దలయెత్త కున్న చో ననుష్ఠానము దేహధారణము నెటులు సంభవములు?" అను శంక కల్గవచ్చును. దాని కుత్తరము:— బాధితానువృత్తి న్యాయముగాఁ బూర్వసంస్కారవశమున, అజ్ఞానకార్యము లనుష్ఠింపఁబడఁగలవు. కుమ్మరి చక్రమునుద్రిప్పి కఱ్ఱను దీసి వేసినను బూర్వవేగవశమున గొంతసేఁపటిదాఁక జక్రము తిరుగుచుండునటులే జ్ఞానప్రకాశముచే నజ్ఞానము సమూల ముగా నశించినను మునుజెప్పిన బద్ధాజ్ఞాఫలముగా దేహమును దాని ననువర్తించు కర్మములును గొన్నాళ్లుండును. సాధకా! ఈ భావముతో, అమ్మ నీ విపర్యయజ్ఞానమును నీఱుచేయ నంతదాఁకఁ దల్లి నెట్లొందఁగలవు? కావున మంచిసెడ్డలేకానీ, పాపపుణ్యములే కానిమ్ము, జ్ఞానాజ్ఞానములే కానిమ్ము సమస్త మును దల్లి సముఖమునఁ బెట్టుము. ఆమెయే యుచిత విధాన మును జేయును. నీవు భ్రాంతినాశము, అవిద్యానాశము, చిత్త విలయము, వృత్తినిరోధము మున్నగు నస్వాభావిక వ్యాపార ములను బట్టుకొని జీవితమును క్షతవిక్షతము చేయుచున్నావు. నీ వశాంతుఁడ వెందులకుఁ గావలయును? నీవమ్మ ముద్దు బిడ్డఁడవు. తల్లిని దక్క నొండెఱుఁగవు. నీ మంచిసెడ్డ లేదేని నగ్నశిశువువలెఁ దల్లిచెంతనే పెట్టుము. అమ్మయే క్రమముగా

నీ సర్వభావములను విలయ మొనర్చి యాత్మస్వరూపమును బ్రకటించును. అజ్ఞానముచే నగు సర్వభ్రమములును బూర్తిగాఁ దొలగి, నీ యాసలన్నియుఁ బూర్ణమగును.

## శ్రీ దేవీవాహన సింహమైన సాధకుఁ డిపు డానంద క్రీడామూర్తి.

జీవభావము నడంపనెంచు సాధకుఁడే సింహము. విపర్యయజ్ఞానము (ధూమ్రలోచనుఁడు) నశింపఁగా జీవుఁడు విశుద్ధ జ్ఞానసంధానమునొంది పరాక్రమించి సంస్కారక్షయ మొనర్పఁగడఁగును. ఇదే వాహనసింహము అసుర సేనపైఁ బడి పలు విధములఁ గసిమసంగుట. కారణమేమనఁగా—మాతృస్వరూపాభాసము నొందుటచే సాధకుని కర్మోద్యమము అతిశయించును. అపు డభయచిత్తముతో, భీకర గర్జనముతో 'జయమాతా!' యనుచు ఆసురిక సంస్కారముల నశింపఁజేయ బద్ధపరికరుఁడగును. అపుడు తాను దేవీస్వవాహనమని తలంచును. మున్నును దాను పరంపరాసంబంధముచే మాతృవాహనమే, ఇపుడో విపర్యయజ్ఞానము లభించుటచే, మాతృస్వరూపము నెఱుంగఁగల్గుటే కారణము. ఆత్మస్వరూపమే యమ్మ, ఇచట మన కేవలానందమూర్తి కనుక సాధకుఁ డిపుడు సాక్షాత్కేవలానందమునకే వాహనమైనాఁడు. సాధకుఁ డెంత దిట్టయైనాఁడు! మహాసౌభాగ్యముచే శ్రీగురు నపారకృపచే సాధకుఁడు నిజముగా నిపుడానందక్రీడామూర్తి. మన మెపుడాయవస్థ నొందుదుమో కదా!

సింహముచే (సాధకునిచే) నైన యసురనాశ రహస్యము.

సింహమునకు శరీరమే శత్రుసంహారశాస్త్రము. సాధకా! ధూమ్రలోచనుని సేన యఱ్వదివేలు అనునది మున్ను జెప్పఁబడినది. వారెవరో, యీ జననాది షడ్భావవికారములను లక్షించియే చెప్పఁబడినది. సింహముసైతము, ఆయుపాయముల చేతనే దానిని క్షయమొనర్చినది.

మన మిచట షడ్భావవికారముల నెఱుంగఁజూతము. 1. జాయతే — మనము పుట్టుచున్నాము. ఈ భావము వాస్తవముగా మనయందు లేకున్నను, నిట్టి బోధమే మనకు సదా కలదు. ఇది మొదటివికారము. ఇపు డమ్మ కృపచే విపర్యయజ్ఞానము నశించినది. పూర్వోక్తప్రతీతి యనఁగా జన్మసంస్కారమనాయాసముగా లయమైపోయినది. దేవీవాహన సింహము యొక్క కరప్రహారముచే (పంజాదెబ్బచే) అనఁగాఁ బ్రథమాస్త్రప్రయోగముచే నైన యసురనిపాతమందలి రహస్య మిదే.

2. అస్తి — నేనున్నాఁడను. పుట్టినతర్వాత నేనున్నా ననెడి విశిష్టసత్తాప్రతీతి యగును. ఇది రెండవ వికారము. ఇట్టి బోధమును విపర్యయజ్ఞానఫలమే. నిజముగా మన సత్త నిత్యమును నిర్విశేషము నైనది. దానియందు జన్మాదిభావమున కన్వయము లేదు. సాధకుఁ డింతదాఁక నిమ్మాట నెఱుంగలేఁ డయ్యెఁ గాని యిపు డమ్మ కృపచే విపర్యయజ్ఞానము నశించిన ఫలముగా తన నిత్యసత్తాప్రకాశ మయ్యెను. పక్షాంతరమున — నోరితో సింహము దైత్యులను గ్రాస మొనర్చిన రహస్య మిదియే.

యథార్థముగా జీవరూపముకంటెను, జగద్రూపముకంటెను వేఱొక సత్తయే లేదు. మాతృసత్తయొక్కటే జగద్రూపముగాఁ బరిచితమగుచున్నది. ఈ యనుభవము లేకుంటచే జీవుఁడు మాటిమాటికిఁ బుట్టుసావులనెడి చెంపకాయలచే వెత నొందుచున్నాఁడు. కాని యీసారి యమ్మయే జీవు నుద్ధరించుటకు నావిర్భవించి జీవత్వపు సంకెళ్లను దనచేతితోఁ ద్రెంచి విడిపించినది, కనుక జీవజగత్తు నిశ్చయముగా మాతృసత్త ననుభవించి ధన్యమగును.

3. వర్ధతే — నేను వృద్ధినొందుచున్నాఁడను. నానాఁటికిఁ బెఱుగుచున్నాననెడి ప్రతీతియే మూఁడవవికారము. ఆత్మస్వరూపవిషయమున విపర్యయజ్ఞానమే యీ ప్రతీతికి హేతువు. అయిననిపుడది యమ్మచే విలయమొందినది, కనుక దాని నాశ్రయించిన వికారము శ్రమలేకయే లోపించును. అధరాక్రమణముచే (గుండెతో) నణచుటచే మఱికొంద అసురులు చచ్చిరను దాని రహస్య మిదే.

4. విపరిణమతే — నేను బరిణామము నొందుచున్నాను. పెఱుగుదల మెల్లెక్కుచున్నాను. నే నింక నున్నతి నొందలేను. అను నిట్టి ప్రతీతి నాల్గవ వికారము. విపర్యయజ్ఞాన వినాశముతోనే యది విలుప్తమైనది. ఇదే సింహము గోళ్లతోఁ గొందఱి డొక్కలను జీల్చి చంపిన రహస్యము.

5. అపక్షీయతే — నేను నానాఁటికి శీర్ణుఁడ నగుచున్నాను, అనెడి ప్రతీతి యైదవ వికారము. ఆత్మస్వరూపముద్భాసించుటచే నిట్టి యపక్షయ ప్రతీతి మఱియుండదు. విప

ర్యయ జ్ఞాన విలోపముతోనే యది లోపించును. సింహము కొందఱి తలలను జెంపకాయలతో విడఁగొట్టె నను దాని రహస్య మిా యపక్షయ వికారనాశ సూచకము.

6. నశ్యతి— నేను నశ్వరుఁడను. మృత్యుముఖమునందుఁ బడుదును; అనెడి ప్రతీతి యాఱవది. విపర్యయ జ్ఞాననాశముచే, అమృతమయి యమ్మ సాక్షాత్కరింపఁగా జీవుని మృత్యు భయము మొదలంటఁ దొలఁగిపోవును. ఈ యాఱవ వికారము కూడ నాయందు లేదనెడి నిశ్చయజ్ఞానముతో మృత్యుభయ మనెడి రాక్షసాక్రమణమువలన విడువఁబడును. ఇపుడు దేవీ స్వవాహనమైన జీవసింహము ధూమ్రలోచనానుచరులను ధ్వంసముచేసి యసురాత్యాచారమునుండి పరిత్రాణ మొం దెను. కేసరకంపన పూర్వకముగా నసురులకు బీతుగొల్పుటయు, డొక్కలుచీల్చి నెత్తురు త్రాగుటయు ననుదాని తాత్పర్యమిదే.

విపర్యయజ్ఞానము నశించుటచే దానివలన నాత్మకుఁ గలుగు స్వభావవికారములనెడి యసురసేనలు నశించుట కిపుడు తడవుపట్టదు. కనుకనే మంత్రమందు 'క్షణేన' యను మాట ప్రయోగింపఁబడినది. జీవుఁ డాత్మసంధానము నొందనంతవఱకే వాని మహత్త్వము మఱుగయియుండును. అతఁడు యథార్థ ముగానే 'మహానహం, విశ్వమహం విచిత్రమ్'గా నున్నాఁడు. ఇమ్మాట నింతదాఁక నెఱుంగలేఁడయ్యె. గాని యిపుడు మాతృ కృపచే భ్రాన్తి స్వప్నములు తుదముట్టినవి. పరమాత్మ సంధా నము లభించినది. గాన, ఆత్మమహత్త్వానుభవము చేయు యోగ్యత కల్గినది. కనుకనే 'మహాత్మనా' యను విశేషణము సింహమునకు లగింపఁబడెను. సాధకుఁడు దేవీవాహనముగాక,

ఆత్మసమర్పణయోగి కాఁజాలక యింత సులభముగ, నింత శీఘ్రముగ నీ దుర్జ్ఞేయమైన యసురకులము నశింపదు. ఆత్మ సమర్పణముచేయు సాధకుఁడే యీ దేవీవాహన సింహముగా (రెండవఖండమందు) మలుమూటయందు విశేషముగా వర్ణింపఁ బడెను.

## సంక్షిప్త బౌద్ధమతాలోచనము.

అస్మిత (శుంభుఁడు) కేశాకర్షణముచేసియో (ఈశ్వరత్వములను దూరముచేసియో), మీరు హతాశులగు పక్షమునఁ జంపియో ఆమెను దెమ్మని, చండముండులకు (ప్రవృత్తి నివృత్తులకు) ఆదేశించెను. మున్నిది వినుఁడు.

పరిణామరహితయు నప్రతిసంక్రమయి నైన చితిశక్తి నుండి యీశ్వరత్వములు దూరమైనచో, నామె హీనబల యైనపుడు, ఆమెను దెచ్చుట సులభసాధ్యమగును. ఒకప్పుడవి యస్మితయందు వెలయునను నాసతోఁ గేశాకర్షణపూర్వకముగా దేవిని దెమ్మని యాదేశము. దీని సఫలతవిషయమున శుంభుఁడు తానే సందేహించెను. ఏమని ? వాస్తవముగా నీశ్వరత్వమెన్నఁడును జితిశక్తిని విడిచియుండదు, కావున మఱి వెరవులేనపుడు చంపుమని యాదేశము. చితిశక్తిని (ఆత్మను) జంపుట యనుదాని తాత్పర్యము—శేషతత్త్వములను శూన్యతత్త్వములుగా నిర్ణయించుటే.

బుద్ధదేవుని తరువాతి కాలమందు బౌద్ధధర్మము ఈ శూన్యవాదమునకు వచ్చి నిల్చిపోయెను. తథాగతులైన (కథితులైన) బౌద్ధజను లాత్మనే నశింపఁజేయఁ బ్రయాసపడిరి.

బుద్ధదేవుఁడు స్వయముగాఁ జేసిన యుపదేశము కాలక్రమమున వికృతినొంది యట్టి వైనాశిక భావముగాఁ బరిణమించినది. ఆత్మవినాశిసాధనమును జేసి శూన్యతత్త్వమందుఁ జేర్చుటయును దానినే "ముక్తి నిర్వాణము" అని యర్థముచేసిరి. కాని, అకటా! ఆత్మ యశక్యప్రతిషేధమని వారెఱుఁగరు. ఆత్మ యెన్నఁడును ఆత్మహత్య చేయఁజాలదు. ఆత్మను జంపియు నెవ్వఁడుండునో వాఁ డాత్మగానే నిత్యముండును. ఇచట నీ యాలోచన మప్రాసంగికము కాదు.

"అసదే వేదమగ్ర ఆసీత్" అను శ్రుతియే బౌద్ధులకు ముఖ్యమైన యూఁత. దీని వాస్తవమైన యర్థమిది — ఈజగత్తు సృష్టికి మున్ను, అసత్ — అనఁగా నామరూపములచే నవ్యాకృతమై — బీజరూపమై — యనిర్వాచ్యమై యుండెను. కాని, బౌద్ధులుకాని బౌద్ధులు, దీనికి మఱియొక విధముగా నర్థము చేసిరి. వారు, ఈ జగత్సృష్టికి మున్నున్న దేదో యది 'అసత్'- అభావము-శూన్యము మాత్రమే యనిరి. కనుక శూన్యమే శేష తత్త్వమందురు. మఱియు వారు 'క్షణికవిజ్ఞానము' అని యొక మాటయందురు. బాహ్యజగత్తుగ నేమియు లేదు. అపుడు జగద్రూపముగాఁ బ్రతీతమగునది, మన సంస్కారమే — అనఁగా క్షణకాలస్థాయి విజ్ఞానమాత్రమే; ఆ విజ్ఞానము రెండువిధములు. ధారావిజ్ఞానము, ఆలయవిజ్ఞానము. మనము ప్రతిక్షణమును రూపరసాది విషయగ్రహణము చేయుచున్నాము. వానితోఁ బ్రత్యేకముగానుండు "నేను, నేను" అను భావమే ధారావిజ్ఞానము. నేను జూచుచున్నాను; నేను వినుచున్నాను; నేను జేయుచున్నాను మున్నగు విజ్ఞానముతోనే క్షణస్థాయిగా,

నింతో యంతో, 'నేను' అను ధార సాగుచున్నది. అదే ధారా విజ్ఞానము. ఈ ధారగాసాగు నేనునకు మీఁదుగా నొక యఖండ మైన 'నేను' అను విజ్ఞానమున్నది. పైనిజెప్పఁబడిన ఖండ ఖండమైన సర్వమందును క్షణక్షణము నేను ఉబుకుచునే యుండును, మఱల విలయమగుచుండును. దానికి నాధార భూతమైన విజ్ఞానమున్నది. ఇదే యాలయవిజ్ఞాన మనఁబడును. ఇట్టి సిద్ధాన్తమందు బౌద్ధులు, అన్నిటికంటె ముందు యోగాద్యు పాయములచే, ఆ ధారావిజ్ఞానమును నిరోధించుటకుఁ బ్రయ త్నింతురు. మఱియు నాలయవిజ్ఞానమును సైతము లయ మొనర్చి, శూన్యము, అభావమున నెడి పదార్థమందుఁ జేరి, అదియే ముక్తి (నిర్వాణ) స్వరూపమనుచు వ్యాఖ్యానించిరి.

శ్రీ శంకరాచార్యులు పలువిధముల యుక్తితర్క ములతో నీ మతమును ఖండించిరి. అవి వ్రాయుపని యిచట లేదు. బౌద్ధులు దేనిని 'నేను' యొక్క పూర్ణాభావమనిరో, ఆ యభావమును బ్రకాశింపఁజేయుటకును నొక 'నేను' మిగులు చుండును. అనఁగా 'నేను' యొక్క యభావమును నెఱుఁగు చుండువాఁడే 'యాత్మ' కనుక నాత్మయొక్క యభావ మసం భవము. మఱియొకపక్షమున నీ బౌద్ధమతముతో మనకింతయు విరోధములేదు. విరోధమని తోఁచున దింతయు కేవల శబ్ద ప్రయోగములతో నగు విరోధమే. వస్తుసత్తా విషయ మందింతయు విరోధములేదు. బౌద్ధ ధారావిజ్ఞానమే మన యహంకారము. మఱి బౌద్ధుల యాలయవిజ్ఞానమే మన యస్మిత. ఇఁక నీశ్వర సంకల్ప స్వరూపమైనది బాహ్యజగత్తు; అను నింతమాత్ర మొప్పుకొన్నచో, జీవభోగ్యజగత్తును, క్షణిక

విజ్ఞాన మన్నను హాని లేదు. తరువాతి శూన్యతత్త్వము మాట. యథార్థముగ నిరంజన స్వరూపమందింతయు విశిష్టత తెలియఁబడదు. కావుననే బౌద్ధులు పూర్ణమును లక్షించియే "శూన్యము, అభావము" అను మాటలను బ్రయోగించిరి. ఇంత చాలును.

ఉన్నతభూమికయందలి సాధకులే యిమ్మాట నెఱుఁగఁగలరు.

వినుఁడు. అస్మితను సైతము ప్రకాశింపఁజేయునది యొకటి యున్నది యనుటను శుంభుఁడు (అస్మిత) యంగీకరింపఁడు. ఆత్మ యను పేరితో నేదే నున్నచో నది యస్మితకుఁ బ్రకాశ్యరూపముగాఁ బరిచితము కావలసినదే; అనఁగా నదేదో కానరావలసినదే. ఇదే యస్మిత యభిప్రాయము. (అదె శుంభుఁడు అంబికను జంపినైనను దెమ్మనుట.) ఉన్నత భూమికయందలి సాధకులే యీ రహస్యమును దప్ప కెఱుంగఁగలరు. కాని బుద్ధితత్త్వ వికాసము లేని వారి కొఱకైన యిమ్మాట యెట్లు తోఁచునో కాని, పట్టుదలతో సత్యప్రాణ ప్రతిష్ఠామార్గమందు ముందంజ వేయఁగలవారు, వడిగానో తడవుగానో, బుద్ధితత్త్వమందుఁ జేరఁగల్గునపుడే, అస్మితకును ఆత్మకును సంబంధించిన యీ సర్వరహస్యములను అద్దమందువలె ననుభవింపఁగలరు. ఎట్టి యుపాసనాపద్ధతితోను నీ సత్యప్రాణ ప్రతిష్ఠకు విరోధము లేదు. ఎల్లరు తమ తమ విశిష్టతను బూర్ణముగా నుంచుకొనియే దీని ననుశీలింపఁగలరు. కొన్నాళ్లకుఁ దామే దీని సార్థకత నెఱుఁగఁగలరు. అవిద్య (విపర్యయ జ్ఞానమనెడి) భూ్రమలోచనుఁడు చావనంతదాఁక జీవత్వ బంధన

మెట్లును వీడదు. సత్యప్రతిష్ఠాసాధకుఁడు మాతృకృపచే నవిద్యానాశ మనఁగా నెట్టిదో తెలిసికొనఁగల స్థానమును జేరినాఁడు.

అమ్మ చరణములయం దేకాంత శరణాగతులైన బిడ్డల విపర్యయజ్ఞానమనెడి రాక్షసు నమ్మయే హుంకారమాత్రమున భస్మము చేసినది. రుద్రగ్రంథిభేదమున కిదియే బీజము. జ్ఞానమయగ్రంథి పేరే రుద్రగ్రంథి యని మున్నంటిమి. ఈ జగద్విషయక జ్ఞానము, ఈ యహంత యనెడి జ్ఞానము అను నివన్నియు నొక్క విపర్యయజ్ఞానము పైనే నిల్చియున్నవి. ఆత్మస్వరూపవిషయకమైన యనభిజ్ఞతపైనే యీ యజ్ఞానమనెడి జ్ఞానరాశి నిల్చియున్నది. ఇపుడు అమ్మ కృపచే నది తొలఁగిపోయినది. గాన నజ్ఞానకార్యములుగ మిగిలినవియు క్రమముగా నశింపఁగలవు.



సాధకా! మనము "జయ మాతా"! యనుచు ముందంజ వేయుదము. తల్లి యేవిధముగాఁ బ్రవృత్తి నివృత్తి జీవత్వాద్యులైన (చండముండ రక్తబీజాద్యులైన) యసురులఁ జంపి స్వరూపమునఁ బ్రతిష్ఠిత యగునో చూతము. మంగళమయి తల్లి చరణములకు మన యసంఖ్య ప్రణామములు.



ఇది (ధూమ్రలోచన వధమనెడి) విపర్యయజ్ఞాననాశము.



ప్రవృత్తినివృత్తులు లయమైనపుడే యమ్మ యావిర్భవించును.
ఆనందమయి యమ్మ దర్శనము చేతనే జన్మధన్యత.

(శుంభునాజ్ఞచే) అస్మితా ప్రేరణముచే (చండముండులు) ప్రవృత్తి నివృత్తులు చితిశక్తి దేవి నుద్దేశించి పరువెత్తిరి.

సాధకా! నీవు సైతము నిట్టులే ప్రవృత్తి సహాయముతోఁ దల్లిని బరిగ్రహింపఁ గోరితివేని, నివృత్తి సహాయముతో విషయ విరతిని బోషించుకొని మాతృముఖమైన ప్రవృత్తి బలమును బెంపొందింపఁ బ్రయాసపడుము. ఇంతేకాదు. ఈ ప్రవృత్తి నివృత్తుల యవస్థ లనేకములు. లెక్కలేనంత కార్యప్రణాళి తోడ్తోనే నడుచును. ఇదే బలుసేనలతోఁ గూడిన చండ ముండుల యెదురోళ్ళు. ఇపుడు వీరును నశింతురు. ప్రవృత్తి నివృత్తుల లయముచేసినపుడే యమ్మ యావిర్భవించును.

హిరణ్మయ హిమాలయముపై సింహవాహనను - మందహాస సుందరను - దేవిని - వారు చూచు రహస్యము.

హిరణ్మయ హిమాచల శిఖరముపై జీవసింహముచే మోయఁబడు మన యమ్మ చిర్నవ్వుతో నున్నది. ఏ శరీరము నాశ్రయించి యమ్మ శుంభవధలీల (అస్మితా నాశలీల) జరిపి నదో యా శరీర మవశ్యము హిరణ్మయము. హిరణ్మయ స్వరూపము నవలంబించియే యాత్మచే (చితిశక్తిచే) పలు విధముల లీలావిలాసములు జరుపఁబడును. మన యమ్మ చిఱు నగవు తోడిది. దుర్దాంతులైన చండముండాసురులు సమ్ముఖ సమరమునకై సిద్ధపడిరి. అయినను మన యమ్మ మందహాసము చేయుచున్నది.

సాధకా! నిజముగా నమ్మయొక్క యీ హాస్యమయా నందమయమూర్తి కేనాఁడును, నే యవస్థయందును, నన్యథా భావముండదు చుమా. కానవచ్చు జడ జగదాకారముతో నున్నను, అనవరత ద్వంద్వరూపముతో, సుఖ దుఃఖముల

ఘాత ప్రతిఘాత రూపముతో నున్నను, మన యమ్మయొక్క యానందమయావస్థ కేనాఁడును వ్యతిక్రమము గల్గదు. పంచ దారతోఁ జేయఁబడు మూర్తుల సర్వావయవములును మధు రము లైనట్టులే, ఆనందమయమూర్తియైన యమ్మయొక్క సర్వభావములందు నానంద మఖండముగానే యుండును. రోగ మం దానందము, శోకమం దానందము, ప్రలయమం దానం దము, ఆర్తనాదమునం దానందము - ఇట్టులే మన యమ్మ యానందమయి.

సర్వము నానందమువల్లనే ఘటితమగుచున్నది. "ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతి. సాధకుఁడా! నీ వెపుడీ యానందమయ సత్తాసంధానము నొంది చిఱునగవుతోడి యమ్మ మూర్తిని జూచి జన్మ ధన్యత నొందుదువో! సర్వమనోహర మందహాసముఖి మన యమ్మ, యంత టను వెలయుచున్నది. ఎచ్చటను మఱుఁగుగ లేదు. ఒక్కసారి యమ్మవంకఁ జూచునపుడు, నీ యహంత మొదలు నీ స్థూల దేహ ప్రత్యేక పరమాణువు వఱకు నానందరసముచే సంజీవి తము కాఁజొచ్చును.

## ప్రవృత్తి నివృత్తులు - ఆత్మలాభము.

ప్రవృత్తిదళము సశస్త్రము; నివృత్తిదళము నిరస్త్రము. ప్రవృత్తిదళము సశస్త్ర మనఁగా - ధ్యాన ధారణాది సహాయముతో నాత్మను లోఁబఱచుకొను ప్రయత్నము. నివృత్తిదళము నిరస్త్ర మనఁగా సర్వవిషయ పరిగ్రహమును విడిచిపెట్టి "నేతి, నేతి" యనుచు నాత్మను సమీపించు ప్రయత్నము. ప్రవృత్తిది

కార్యసాధనము, మఱి నివృత్తిది కార్యవైరాగ్యము. ఈ రెండిటి చేతను అమ్మను జేరవచ్చునని సాధకులు తలంచినను, సరిగాఁ దల్లి నొందలేరు. ఏమనఁగా సాధన వైరాగ్యములు రెండును, అంతఃకరణ ధర్మములే. మన యమ్మ యీ రెండిటికి మిగులఁ బైనున్నది. (ఈ మాటను దెలుపుటకే 'ఆదాతు ముద్యమం చక్రుః' అనియు, 'తత్సమీపగాః' అనియుఁ జండముండులు అంబికను బట్టి తెచ్చు ప్రయత్నము దేవీమాహాత్మ్యమున వర్ణింపఁబడినది.)

## ప్రవృత్తి నివృత్తి విషయమున మఱికొంత పరిష్కారము.

పాతంజలము, గీతయు రెండును అభ్యాసవైరాగ్యముల చేతనే చిత్తచాంచల్యము తొలఁగు ననినవి (వృత్తినిరోధమగు నన్నవి). ఈ వృత్తినిరోధము, ఆత్మలాభము ననునవి రెండు నొక్కటికాదు. ఆత్మలాభమైననే వృత్తినిరోధమగు ననునదే కేవల సత్యము. వృత్తినిరోధమైనంతనే యాత్మలాభము కాదు. ఏమనఁగా వృత్తినిరోధముతో నాత్మ కింతయు సంబంధము లేదు. ఆత్మ బుద్ధికంటెఁ బైది. వృత్తినిరోధఫలము బుద్ధివఱకే. సరే, చూడుము. ప్రవృత్తికార్యము సాధన – అనఁగా అభ్యాసము. నివృత్తికార్యము వైరాగ్యము. ఈ త్యాగవైరాగ్యముల వలన సాధకులు తల్లిని సమీపింపఁగలరు, అనఁగా ముందంజ వేయఁగలరు. గాని సరిగా నాత్మలాభము నొందలేరు. ఒక వంకఁజూడఁగా నీ యభ్యాస వైరాగ్యముల ఫల మంత గొప్పది కాదు. ఏమనఁగా, లక్ష్యము నుద్దేశించి విడువఁబడిన బాణము లక్ష్యమును వేధింపక, గుఱికి బారెడెడముగఁ బోయినచోఁ

గార్యసిద్ధి కానటులే, కేవల సమీపమునకుఁ బోయినంతనే యుద్దేశ్యము సిద్ధింపదు.

ఉద్దేశ్య మేమి? ఆత్మలాభము - పరమసుఖ ప్రాప్తి. అభ్యాస వైరాగ్యములు పరమసుఖమును దెచ్చిపెట్టఁజాలవు. దుఃఖనివృత్తిని మాత్రమే చేయఁగలవు. గాని పరమసుఖప్రాప్తి కాదు. దుఃఖనివృత్తిచేనైన సుఖము, ఒకవ్యక్తి తలపైనున్న బరువు దిగినంతనే కలుగు సుఖమువంటిదే; వాని బరువు దిగినందున సుఖము కల్గినదేకాని, పరమసుఖలాభము కాలేదు.

జీవమాత్రుఁడే సాధనా వైరాగ్య సహాయమున ముందంజ వేయును. అనఁగా నాత్మసమీపస్థుఁడు మాత్రమే యగును. (అదే చండముండ బలములు తల్లి నికటమువఱకుఁ జేరినవనుట.) ఇపు డమ్మ వీనిని వడిగానే కడతేర్చును. ఆత్మ—మన యమ్మ సర్వభావాతీత. కావున సర్వభావములతోను సాధనా వైరాగ్యముల విలయము చేసి, యపుడు స్వరూపముతోఁ ప్రకాశించును. చండీపాఠమందలి యీ రహస్యము నెఱింగి తప్పక వింతతో ముగ్ధులగుదురు. ఇదిగో—ఈ రహస్యము నెఱింగి సాధనా వైరాగ్యములను గేవల నిష్ప్రయోజనములుగఁ దలఁచువారు మహాభ్రాంతులన సంశయములేదు. తల్లిని సమీపించుటకై యీ రెండునుగాక వేఱొక వెఱవే లేదు. తొలుతఁ దల్లిని సమీపించునపుడే మాతృలాభము కాఁగలదు. సమీపమునకే పోలేనివారికి, అమ్మ నొందు నాసయుఁ గడుదూరమే. కనుక, సాధన వైరాగ్యములు నిష్ప్రయోజనములని తలంచుట భ్రాంతి.

చండముండుల ( ప్రవృత్తి నివృత్తులయెడఁ ) గోపించిన అమ్మ వదనము, మసిరంగు నొందెననుదాని రహస్యము.

యథార్థముగ వారు శత్రువులు కారు. అమ్మ తన స్వరూపమును జూపుటయం దిదే యంతరార్థము. అమ్మకు శత్రువు లెవరు ? మిత్రు లెవరు ? మన యమ్మ నిత్యనిర్వికార. ఆమెయం దెట్టి భావవికారమును లేదనుట పరమసత్యము. అయినను ఉపాధికృతములైన యీవ్యవహారము లగుచుండును. ఎవ రెట్టి భావముతో సమీపింతురో వారి కట్టి భావముతోనే కానవచ్చును. వీరు శత్రుభావముతో వచ్చిరి. కనుక, నవికార యైన యంబిక శత్రుభావాపన్న యైనది. కనుకనే మంత్రమందు 'అరీన్ప్రతి' అనఁబడినది.

అమ్మను సమీపించిన యసురగణము విలయము కావలసినదే. ఆత్మవస్తువు సన్నిహితముకాఁగానే యన్ని భావములును విలయమగును. "న తత్ర సూర్యోభాతి న చంద్రతారకమ్ । నే మా విద్యుతో భాన్తి కుతోఽయ మగ్నిః । తస్యభాసా సర్వ మిదం విభాతి" అని కదా శ్రుతి. ఆ ప్రకాశము సర్వతోభేదియు, సర్వభావవిలయకారియుఁ గదా. అసురగణము తనకు వాస్తవికసత్త లేదని యెఱుఁగదు. అంతయు నమ్మసత్తపైనే నిల్చియున్నది. కనుకఁ దల్లిస్వరూపము ప్రకాశించినంత, నసుర విలయము తప్పక కావలసినదే. చీఁకటి వెలుఁగును బట్టుకొనఁ బూనుచో, దాని కెట్టి గతి పట్టునో యట్టి దశయే యిప్పుడీ యసురులకు సమీపించినది. సత్తునం దసత్తు విలయమగుట యనెడి స్వాభావికప్రలయమునకుఁ బూర్వరూపమే యమ్మ

కోపము. జగత్తునందుఁ గోపించినవారి మొగము రంగెక్కఁ బడును. గాని, యిచటఁ దల్లి ముఖమండలము కోపభరమున మసిరంగు నొందినట్లు (శ్యామవర్ణము) ఋషి వర్ణించెను. మన యమ్మ వెంటనే ప్రలయంకర ఘోరతామసీమూర్తితో వెల యును. ఇదే దాని పూర్వసూచనము. సాధారణముగాఁ గోపము రాఁగానే రజోగుణము రేఁగుట తప్పదు. గాని యిచట నది కాదు. పరాప్రకృతియొక్క తమోగుణమే వ్యక్తమైనది. తమో గుణము కృష్ణవర్ణము గాన, మన యమ్మ కృష్ణవర్ణ యైనది. తమోగుణమందే సర్వభావ విలయమగును. ఈ విషయము మలుమూటలోఁ జదువరులు కాంచియుందురు. తమోగుణ చరమపరిణతి సర్వవృత్తులకు నత్యంతవిరోధి. ఈ విరోధమన్నను విలయమన్నను నొక్కటే. సర్వభావ విలయమైనపుడే మన యమ్మ విశుద్ధబోధరూపమునఁ బ్రకాశించును. వదనశబ్దార్థము సమ్ముఖభాగము. అమ్మయొక్క యీ యంబికామూర్తి సమ్ముఖ మందే సర్వభావ ప్రలయమగును.

## కాళీతత్త్వము.

కాళీ = కాలశక్తి. కాలబోధముతోఁ బ్రబుద్ధమైన చైతన్యశక్తినే 'కాళీ' యందురు. కాలాతీతసత్తయందు సర్వ సాధకులును గాళీమూర్తిలోనుండియే ప్రవేశింతురు. మన యమ్మ కాళి. భీషణసంహార మహాశక్తి. ఇంతవఱకు నీమూర్తిని జూపలేదు. విశుద్ధాత్మస్వరూపమందు సుస్థితుఁడగుటకుఁ బూర్ణ లాలసుఁడు కానంతదాఁక, అమ్మయొక్క యీ సంహారిణీమూర్తి ప్రత్యక్షముకాదు. ఇపుడు సాధకుఁడు జగద్భావమును దుచ్ఛము

చేసి, తన విశిష్టాహంతను బలియిచ్చి, యాత్మస్వరూపస్థితి నొందుటకై యుద్యుక్తుఁ డయ్యెను. ప్రవృత్తి నివృత్తులను ధ్వంసముచేసి, యిపుడు తల్లియొడిలోఁ గూర్చుండుట కతి లాలసుఁ డయ్యెను. గానఁ దల్లి దయఁదలఁచి సర్వభావములను విలయమొనర్చుటకై సంహారశక్తిస్వరూపమునఁ దాను వెలసినది. (శుంభుఁడు పంపిన చండముండులను సంహరింప నంబిక బొమల నడుమనుండి కాలి వెలువడుట యిదే.)

ఇపుడు కాలీ పూర్ణతత్త్వము వినుము.

మొట్టమొదటఁ జితిశక్తి కాలమును దిక్కులను గల్పించి క్రమక్రమముగ విచిత్ర జగత్సృష్టి చేసినది. చిత్తశక్తివల్లనే కాలశక్తి ప్రాదుర్భావమైనది. (కావుననే, అంబిక యాజ్ఞాచక్రమునుండి కాలి వెడలివచ్చుటయినది.) ఇక్కాలమే జగదాధారము. సర్వభావములను కలనము (సంహారము) చేయును. గాన 'కాలీ' యని పేరయ్యెను. కాలుఁడు (కాలము), కాలీ యభిన్నులు.

సాధకుఁడా! ఒక్కసారి నీ తెలివికన్ను విప్పి చూడుము. నీవును, జగత్తును గాలగర్భమునుండియే వెడలితిరి. మఱి కాలగర్భమందే యస్తమింతురు. సృష్టియొక్క ప్రథమక్షణము నుండియు కలనము (సంహార క్రియ) సాగుచునే యున్నది. ఎప్పుడో యొకనాఁ డది సమాప్తమగును. అనఁగాఁ బూర్ణ సంహారమై పోవును. సృష్టవస్తువులను సంహరించుకొనుటకైన యపేక్ష - అనఁగా సమయావశ్యకత; దాని యంతముపేరే స్థితి. వాస్తవముగా స్థితియనుచు నేమియు లేదు. సర్వము

మృత్యువువంకకే నడుచుచున్నది. స్థితి యన్నది సత్యస్వరూపమైన యమ్మయందే యున్నది. కాలమన్నను, గతియన్నను నొక్కటే. కాలవస్తువు యథార్థముగా భయంకరగతి శీలము. క్రియ కాధారము కాలము. క్రియా కాలము చంచలము కనుకనే కాలరూపాధారమం దేమియుఁ గానరాదు. అది యంతయు గతి శీలమే. వడిగాఁ బరుగెత్తు రైలుబండిలోఁ గూర్చున్నవా రనేకచేష్టలు చేయుదురు; గాని బండి గమనమున కడ్డులేదు. అటులే కాలారూఢ జీవజగత్తు పలురీతుల చేష్టలు చేయుచున్నను గాలగతి యడ్డగింపఁబడదు. ధ్వంసమువంకకే నడుచుచున్నది. ఱెప్పపాటుసేపైనను నిల్కడ గనదు.

నీ వా సంహారకారిణి కరాళకాళీమూర్తిని గనలేవా ?

ఈ విశ్వమం దెటు చూచినను, ఈ లెక్కలేని జీవులు ప్రతిక్షణము వడివడిగా మృత్యువువంకకే పోవుచున్నారు. నేఁడు శిశువై యున్నవాఁడు కొన్నాళ్లకు యువకుఁడగును. ఎల్లరును శిశువయోవృద్ధినే చూచుచున్నారు. కాని వాస్తవముగ నాయువు తఱుగుచున్నదనియు, ధ్వంసపురము వంకకే ముందడుగు వేయుచున్నాఁడనియుఁ జూడరు. ఇటులే చెట్లు, లతలు, పశువులు, పక్షులు, దేవ దానవ నరులు, గ్రహోపగ్రహములు, వేయేల! చీమ మొదలు బ్రహ్మవఱకు నన్నియుఁ దెలియకయే కడు వడి మృత్యువు వంకకే నడుచుచున్నవి. ఏదోయొక ప్రబలాకర్షణ శక్తి చేతనే యీ జీవజగత్తు స్వేచ్ఛతో ధ్వంసమువంకకే పోవుచున్నది.

"యథా ప్రదీప్త జ్వలనే పతంగాః
విశన్తి నాశాయ సమృద్ధవేగాః,
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥"

మండు నగ్గివైపు మిడుతలవలె సర్వజీవభూతములును సంహారాగ్నియం దాహుతి యగుటకే వడివడి నడుచుచున్నవి. చూడుము. నీ దేహమందలి ప్రత్యేకాణు పరమాణువును గాలీ కరాళాకర్షణముచే నీడ్వఁబడి సంహారశక్తి శరీరమందుఁ జేరి పోవుటకే వడివడి నడుగుపెట్టుచున్నది. నీ వే యవస్థయందైన నుండుము; నీ మీఁద, క్రింద, కుడి, యెడమ, ముందు, లోను, వెలిని సర్వత్ర మృత్యువు, సర్వత్ర కాళి; కేవల ధ్వంసము; కేవల వినాశము; మృత్యువు నోడిలోనే నీవు కూరుచున్నావు. నీవేకాదు, దేనిని 'నాది' యనుచుఁ గౌఁగిలించుకొని యున్నావో, చూడుము మఱియు నిన్ను వీడి మత్యువును గౌఁగిలించుకొనుటకే వడిగా ముందంజ వేయుచున్నది. ప్రతి శ్వాస ప్రశ్వాస మందును నీ మరణాభిముఖ గతియే తేఁటపడుచున్నది. నీవు నీ జీవన లక్షణముగాఁ దలఁచుచున్న నీ యూపిరి విడుపు సైతము, ప్రతి నిమేషమందును నిన్ను ధ్వంసపురమున కతిథిని జేయనే యాకర్షించుచున్నది. మృత్యువే నీ స్వరూపము. చచ్చుటకే పుట్టితివి. నాయనా! నీవు నిశ్చింతముగా నెట్లున్నావోయి! ఏమి నీ వా సంహారిణీ కరాళకాళీమూర్తిని జూడలేవా?

భయింపడకు; మృత్యువు మృత్యువనుచుఁ బరుగెత్తకు.

పరుగెత్తు వెరవు లేదు. దాని నమ్మగా నెఱింగి యాదరించి తరింపఁ బ్రయత్నింపుము. ఏ దిక్కునకుఁ బోయినను అది యమ్మ యొడిగాఁ దలఁచి, యందుఁ గూర్చుండఁ గడఁగుము. అపుడు నీవు కాలాతీత సత్తను, అమృతసత్తగా నెఱుఁగుదువు. మృత్యువనుచు నేమియు లేనిచోటికిఁ గాళి నినుఁ గొనిపోవుననియు, అది నిత్యము, అమృతము, ఆనందమయము నని తెలిసికొందువు. కాలి కాలవదన; మన యమ్మ ముఖమండల మతిభయంకరము. అనాత్మభావముల నన్నిటి నమ్మ మ్రింగివేయును. గాన మన యమ్మ కరాలవదన. మన యమ్మ ఘోర కృష్ణవర్ణ. ఎట్టి వర్ణములును, నెట్టి భావములును లేని చోటు ఎంత భయంకరమో, ఎంత కృష్ణమో, ఎంత యప్రకాశమో వర్ణింపగలమా? ఎవ్వనికైన నా ఘనకృష్ణ సంహారిణీ మాతృమూర్తి సాక్షాత్కరించినచో, వాఁడే "మనయమ్మ యెంత భీషణ!" యనుకొనును. ఔరా! అచట నెంతగా వెదకినను 'నేను' సైతము దొరకదు. ఇఁక దేహేంద్రియముల మాట చెప్పెడిదేమి? ఇదె యా స్థానము భయంకర మేఘా యమావాస్యనాఁటి యర్ధరాత్రమున ఘోర సుషుప్తియందుఁ గూడ ప్రాణక్రియ, దేహేంద్రియములు, మనస్సు, సంకల్పము, తుదకు 'నేను' అనునవి యుండవే. అట్టియపు డుండియుండి నేనులేని 'నేనును' సంభావింపఁ గల్గినపుడే, కాళి యెంత భీషణయో తెలిసికొనఁగలవు. ఆ భీషణతను నోటి మాటలతో, జెప్పు టెట్లు? "శుష్కమాంసాతి భైరవా, అతి విస్తార వదనా,

జిహ్వాలలన భీషణా, నాదాపూరిత దిఙ్ముఖా" మున్నగు నెన్ని యన్నను, ఆ భీషణతకు భాష చాలదు.

చిత్రపటమందు వ్రాయఁబడిన చతుర్భుజ కాళీమూర్తిని గాంచి మ్రొక్కుటకును భయపడువాఁడు మురళీధరుఁడై ద్విభుజుఁడైన రాధారమణుని బొమ్మను జూచి శరణాగతుఁడై పోవును. అకటా! వాఁడు మృత్యువు నావలిదరిఁ జేరక, అనఁగాఁ గాలశక్తి నతిక్రమింపక, యా హృదయరంజత శ్యామసుందర రూపమును గానలేఁడని యెఱుఁగఁడు. కాళీ యనునదే కాలాతీత స్వరూప; ఆనందమయ శ్యామసుందర; యని తెలియఁ గల్గిననాఁడే భయమన్నది లేకుండును. ఉండనీ.

### కాళీ మాతృవేషరహస్యమును దెల్పుట యప్రాసంగికము కాదు.

దేవీమాహాత్మ్యమందుఁ గేవల సంహారకారిణీమూర్తిగా వెలసిన యిక్కాలీమాత పేరే చాముండ. "చమూం దాతీతి చాముండా" – విశ్వసృష్టికైన ముప్పదియాఱు తత్త్వముల నెడి తన సేనను దనలోనికి లాగికొనునది చాముండా. అసుర సమూహమును దనలోనికి సంహరించుకొనునది కాఁగా 'చాముండ'. కాళీమూర్తి భేదము లనేకముగా నున్నవి. ఇక్కడి కాళీమూర్తి రహస్యమే యిచట వివరింపఁబడును.

మన యమ్మ, అసి పాశ విచిత్ర ఖట్వాంగములను దాల్చినది. అసి = తెగనఱుకు సాధనము. పాశము = జాఱుముడుల త్రాడు; ఇది యాకర్షించు సాధనము. ఖట్వాంగము = చూర్ణించు నస్త్రము. దీనికి యథాస్థితముగా నర్థము చెప్పి

మంచపుఁగోడు అనిరి. మఱియొకచోట ఇనుపయూఁచకు బిగించిన మానిసిపుఱ్ఱె యని కానవచ్చును. సరే రెండును జూర్ణించు సాధనములే. ఛేదనము, ఆకర్షణము, చూర్ణీకరణము అను మూఁడు విధములచే ననాత్మభావములు కాలకరాళవక్త్రము నందు విలయమొందును. పారమార్థికసత్తనాశ్రయించి దృశ్య వర్గముయొక్క వ్యావహారికాస్తిత్వము ప్రకాశించును. దాని నుండి యీ పారమార్థిక సత్తను విడదీయుటే కాలశక్తియొక్క మొదటిపని. అమ్మచేతి యాకర్షణకారి పాశాస్త్రరహస్య మిది. అసి దీనికిఁ బ్రతిభువు. కల్పితాంశము విచ్ఛిన్నమగుటచేఁ దెలియవచ్చిన పారమార్థికాంశము నాకర్షణపూర్వకముగఁ బరమాత్మసత్తయందుఁ జేర్చుట రెండవపని. అమ్మచేతి ఖడ్గపు రహస్య మిది. తక్కిన సర్వదృశ్యభావములను జూర్ణించుటయే (విలయ మొనర్చుటే) అమ్మ మూఁడవపని. కాళిచేతి ఖట్వాంగ మనెడి యస్త్రము ఈ విలయకార్యమునకుఁ బ్రతి భూ స్వరూపము. చూడఁగా మన యమ్మ యీ మూఁడువిధములుగానే, యనాత్మభావవిలయము చేయును. కనుకనే 'అసిపాసినీ విచిత్ర ఖట్వాంగధరా' అని వర్ణింపఁబడెను.

'నరమాలా విభూషణా' — నరముండమాల యని యెఱుఁగవలయును. మన యమ్మ యేబది నరముండముల మాలను గంఠమునఁ దాల్చినది. అనఁగా అకారాది క్షాంతము లైన యేబది యక్షరముల మాల. ఇదె ముండమాల. దీనిని వివరింపఁ గడఁగుదము.

ఇక్కడనవచ్చు జగత్తు కొన్నిశబ్దములు తక్క మఱే మియుం గాదు. 'సాధన సామగ్రి' మలుమూటలో నాద తత్త్వ

వివరణమందు విశేషించి చెప్పఁబడినది. చంద్ర సూర్య మనుష్య పశు వృక్ష లతాదులగు కొన్ని శబ్దములే జగదాకారముగాఁ గానవచ్చుచున్నవి. "ఘటము" అనఁగానే యొక నామమాత్ర ముగఁ గానవచ్చుచున్నది. నిజముగా మృత్తిక (మన్ను) తక్క ఘటమునకు వేఱొక సత్త లేనట్లే ఈ జగత్తు కొన్ని నామ ములు తక్క మఱేమియుంగాదు. కావుననే యుపనిషదృషులు ప్రశాంతకంఠముతో "వాచారంభణం నామధేయం వికారం, మృత్తికేత్యేవ సత్యమ్" అని గానము చేసిరి. ఈ జగత్తు వాచా రంభణమే—వాక్య మాత్రమే. అక్షరముల కూర్పే వాక్యము. వర్ణములే యసురులు. ఏమన నివియే సమష్టిభావము నొంది ఘటము పటము మున్నగు ననాత్మభావములను గల్గించు చున్నవి. విశిష్టభావములఁ దెలియఁజెప్పునంతవఱకే యీ వర్ణముల జీవితము. అయినను మన యమ్మ సర్వగ్రాసిని కాళీ మూర్తితోఁ దాను బ్రకటిత యైనపుడు, మును జెప్పిన ప్రకాశ వర్ణములు, ఎట్టి విశిష్టభావములను బుట్టింపఁ జాలవు. అపుడు వర్ణముల వర్ణత్వముండదు. మృతప్రాయము లగును. విశిష్ట పదార్థములను దెలియఁజెప్పు సామర్థ్యమే వర్ణముల జీవితావస్థ. భావము అనుట కింకేదియు లేనపుడు వర్ణముల వర్ణత్వము లోపించిపోవును. అనఁగా భావోత్పాదన సామర్థ్యము నశిం చును. కావుననే మృతప్రాయములు. అవె ప్రలయంకరీ మహా శక్తికంఠమందు ముండమాలగాఁ బ్రకాశించునవి. కాఁబోవు సృష్టి కవి బీజములుగా నుండిపోవును. కావుననే యమ్మ యొడలి కవి తొడవులుగ నున్నవి. సంప్రజ్ఞాత సమాధినుండి లేచిన సాధ కుల హృదయమందే యీ తత్త్వము తానుగ వెలయును.

'ద్వీపి చర్మ పరీధానా' — పులితోలు కట్టుకొన్నది. కాళీమూర్తి యెపుడును దిగంబర (నగ్న) గానే చెప్పఁబడును. సంహారిణీశక్తి కేనాఁడు నించుకంతయు సంకోచము లేదు. అనఁగా నావరణము లేదు. గాని, మనయమ్మ యిచటఁ బులి తోలు కట్టుకొన్నట్లు కనుచున్నాము. ఇంకను జండముండ రక్తబీజాద్యసురులు నిహతులు కాలేదు. అనఁగా నింకను గారణదేహముయొక్క సూక్ష్మతమ సంస్కార బీజములు విలయ మొందలేదు. కావున నా వైచిత్ర్యమయ భావబీజము లింతవఱకు మాత్రంగమందు వెలయుచున్నవి. అదె వ్యాఘ్ర చర్మము - అది మువ్వన్నె మెకము తోలు. నలుపు, పసుపు, ఎఱుపు మున్నగు విచిత్ర వర్ణములు గల పులి తోలువలె, నానా విచిత్ర సంస్కారము లమ్మకు నింతవఱకు వసనము (ఆచ్ఛాదనము) గా నున్నవి. కనుక నిపుడును మన యమ్మ చాముండామూర్తితో నావిర్భవించినది. మఱల సర్వభావ ములు విలయమై పోయినపుడే మన యమ్మ నగ్నమూర్తితో వెలయును.

సాధకుల నేకులు వ్యాఘ్రచర్మము, చిత్రాసనము(తివాసి) పైని గూర్చుండి జపసాధన భజనములు చేయుదురు. వైజ్ఞానికు లిది తడిచ్ఛక్తిస్థిరత్వమున కందురు. బాగే; కాదనము కాని, యది సూక్ష్మతమ సంస్కారముల బాహ్యలక్షణముగా వ్యవహ రింపఁబడును. అదియు మన్నింపఁదగినదే. వ్యాఘ్రచర్మమును జూచినంతమాత్రాన మన యనేక విచిత్ర కర్మసంస్కారములు తలంపునకు వచ్చును గాన, మున్ను గతపస్సాధకులు పులితోలు నుపయోగించుచుండిరనుట యప్రాసంగికము కాదు.

"శుష్కమాంసాతి భైరవా"–సర్వవిధ సంస్కారములను క్షయమొనర్చుటకు మున్ను, మన యమ్మ 'శుష్కమాంసా'= అస్థి చర్మావశిష్టయు శీర్ణయుఁగానే యుండినది. ఔరా! సర్వ సంస్కారముల నాహరించినపుడే, యమ్మ శరీరము బలియును. ఇపుడిట్టి యాఁకలిగొన్న మూర్తియే యావశ్యకము. ప్రలయమునకు ముందటి యవస్థయందలి శక్తిని, ఆఁకలిగొన్నదానిఁగానే యెన్నుదురు. సర్వభావములను గబళించుటకుఁ బూనినందుననే మన యమ్మయొక్క దుర్బల భీషణావస్థయే లక్షింపఁబడినది. సాధకా! ప్రలయంకరీ శక్తి నిజముగా నతి భయానక కదా.

"అతివిస్తారవదనా, జిహ్వాలలన భీషణా" – రక్తబీజ వధమునకై యిఁకఁ గొంచెముసేపులోనే, కడుఁ దెఱచిన నోరును, కడుఁ గీటు నాలుకయుఁ దప్పక కావలసినవే. దీని రహస్యము నా చోటఁ దెలిసికొందము.

"నిమగ్నారక్తనయనా, నాదాపూరిత దిఙ్ముఖా" — కోపోద్దీపనమే ప్రలయహేతువు. దాని బాహ్యలక్షణములే కను లెఱ్ఱవాఱుట, అఱపు. విశిష్టప్రకాశశక్తి విలుప్తప్రాయమైనది గానఁ గన్నులు తొఱ్ఱలలోఁ జొచ్చినవి. ఇదిగాక యమ్మ చేయు భీకరనాదము దిక్కుల నిండినది. ఇదంతయు ప్రలయంకర శక్తి స్వరూప వర్ణనము.

సాధకు లిది తెలియలేరు. జగద్భావములను అనఁగా స్థూల నామరూపములను విలయమొనర్చుటకే యిట్టి సంహారిణీ శక్తి ప్రయోజనము. ఇంచుకంత స్వచ్ఛ చిదాకాశ ప్రకాశన

మైనంతనే స్థూలభావములు కడు సులభముగా విలుప్తము లగును; గాని సూక్ష్మభావములను - జీవత్వ సూక్ష్మతమ బీజములను విలయమొనర్చుటకై యమ్మ యిట్టి విశేషభావముతో వెలయవలసివచ్చును. ఇట్టి ప్రలయంకరశక్తి యావిర్భవింపక జనన మరణమ్ము లనెడి సంసారగతికి హేతుభూతములైన సూక్ష్మతమసంస్కారములు నశింపవు. ఏ కేంద్రమునుండి సర్వభావములు వికసించునో, యా యవ్యక్తబీజమయ కేంద్రమును విలయమొనర్చుటకే యమ్మ యిట్టి చాముండామూర్తితో నావిర్భవింపక తప్పదు.

అమ్మయొక్క యిట్టి రూపమును జూచు టబ్బనివానికి సంసారగతి మళ్లు నుపాయము లేనే లేదని తెలియవలయును. నిజముగా నీ రూపమును జూచుటచేఁ బ్రలయంకరీశక్తి యెట్టిదో తేఁటపడును. అమ్మా! అమ్మా! యని యేడ్చుటచేతనే, మన యమ్మ యీ రూపమున దర్శనమిచ్చి జీవత్వముయొక్క సర్వసంస్కారములను విలయమొనర్చును. సాధకా! వీరసంతానమువలె నీ ప్రలయంకరీ కాళీమూర్తిని జూడఁగోరుదువా ?

గీతయందలి కాలుఁడే చండీపాఠమందలి కాళి.

భక్తప్రవరుఁడైన యర్జునుఁడును విశ్వరూపమును గాంచి—

"అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావని పాలసంఘైః,
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః॥"

"వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని,
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః॥"

— గీత. 11 - 26, 27.

అచ్చటను దంష్ట్రాకరాళ భయానక వదనమందు స్వపక్ష పరపక్ష యోధులను నమలివేయుట వర్ణింపఁబడినది. అచ్చటను బార్థుని ప్రార్థనమువలన భగవంతుఁడును దన స్వరూపమును జెప్పుచు "కాలోఽస్మి లోకక్షయకృత్" అని తనను బరిచయము చేసినాఁడు. గీతయందలి కాలుఁడే దేవీమాహాత్మ్యమందలి కాలి. గీతలందు స్థూలసంస్కారముల విలయమును దేవీమాహాత్మ్య ప్రథమ ద్వితీయఖండములందు (సాధనసామగ్రి తొలు మలుమాటలు చూడు) సూక్ష్మసంస్కారముల విలయమును వర్ణింపఁబడి, ఈ మూడవ మాటయందు (తృతీయఖండమందు) గారణ శరీరగత సూక్ష్మతమ బీజరూప సంస్కారముల విలయమును వర్ణింపఁబడుచున్నది. సాధకులు జ్ఞానోన్నత సోపానములం దెక్కుచున్న కొలఁది క్రమముగా సంస్కారముల భేదమును నట్టులే యగుచుండును.

ఈ యున్నతజ్ఞానభూమిక నెక్కుటకు సులభోపాయ మేది ?

శరణాగతభావమే సులభమైన వెరవు. అదె సునిర్దిష్ట మార్గము. సాధకు లెంతగా భగవంతుని శరణమునకు (ఆశ్రయమునకు) వత్తురో యంతగా జ్ఞానవికాస మగుచుండును. శరణా

గత భావముయొక్క పూర్ణత యాత్మజ్ఞానమందే యగుచుం డును. జ్ఞానపూర్ణతయే శరణాగతభావ ఫలము. అపుడు మఱి 'నేను' అనుట కేమియు నుండదు. 'నేను' మాత్రమే యుండును. అపుడే శరణాగతి పూర్ణ ఫలద మగును. ఆస్తిక్యబుద్ధి యొక్కచే యీ శరణాగతిపక్షమందుఁ బ్రధానసాధనము, ఆధారము. మను ష్యుఁడు భగవత్సత్తయం దెంతగా శ్రద్ధావంతుఁడగునో, యంతగా శరణాగతియం దున్నతుఁడగును. మనము దేవీభాగవతసాధకుల వలన సర్వథా శరణాగతుల మగుటకే ప్రోత్సహింపఁబడు చున్నాము. ఈ ప్రయత్నముచే మన యమ్మ ప్రలయంకర మూర్తితో నావిర్భవించి మన యనాత్మ సంస్కారములను (భేద జ్ఞాన బీజములను) దన నోర వేసికొనునని తెలిసికొని ధన్యుల మగుదుము.

ఇదే మన యమ్మ గజాశ్వ రథాదులను నమలి మ్రింగు టగాఁ గథావర్ణితము. ప్రవృత్తి నివృత్తులచేఁ బరిచాలితము లైన సూక్ష్మ క్లేశబీజములే యేనుఁగులు; కర్మములే యశ్వ ములు; కర్మాశయములే రథములు; కారణదేహమందలి యవ్యక్త బీజభావము నొందిన కర్మములును, గర్మాశయము లును బ్రలయకవలితము లైనవని తెలియవలయును.

## ఎట్టి సాధకులును జాత్యాయుర్భోగ ప్రతీతివలనఁ దప్పుకొనుట కష్టము.

ఎంతగా జ్ఞాన భక్త్యనుశీలనములు చేయనీ; ఎంతగా మాత్మస్వరూపమందు నిల్వనీ; విపాక ఫలమనెడి జాత్యా యుర్భోగ ప్రతీతివలనఁ దప్పుకొనఁజాలరు. విపాకము మాటి

మాటికి వికసించినను, అమ్మ యిపుడు ప్రలయమూర్తితో వెలసినది, గాన నొకవేళ నిట్టి జాత్యాది ప్రతీతి తలయెత్తినను, వెంటనే యాత్మసత్త దానిని గప్పివేయును. కాఁగాఁ గాఁగా దాని బలము క్షీణించును.

తఱుచుగా సన్న్యాసులు, పరమహంసలు జాతి ప్రతీతి విలయమునకై శిఖా యజ్ఞ సూత్రాది జాతీయచిహ్నములను వీడుదురు. మఱి యన్ని జాతులనుండి యన్నమును గ్రహింతురు. ఆయుఃప్రతీతి విలయముకొఱకే ప్రబలాధ్యవసాయముతో శారీరకాయువును బెరుగనీయరు. భోగప్రతీతి విలయమునకే సుఖదుఃఖ శీతోష్ణ క్షుత్పిపాసాదుల నోర్చికొందురు. అన్నియు జరుగుచున్నవి. గొప్ప మాటే. సన్న్యాసులు మనకు నమస్యులే. కాని యీ బాహిరమైన యుపాయములను జెప్పనలవికాని కఠోరతకును నలవాటు పడియు, నెందఱు పరమహంసలు జాత్యాయుర్భోగ ప్రతీతివలనఁ దప్పుకొనఁ జాలకున్నారో మన మెఱుఁగము. ఏలన శిఖా యజ్ఞసూత్రాదులను విడిచి సర్వజాతుల యన్నమును గొనుచున్నను లోలోపల 'నేనీ జాతివాఁడను' అనెడి ప్రతీతియు, ఆయుర్విషయ కాలోచన చేయకున్నను, బాల్యము కడచి జవ్వనము, అది దాటి వార్ధకము ననెడి ప్రతీతియు నుండనే యున్నవి. ఇఁక భోగమునకుజ్జ్వల ప్రమాణము స్థూలదేహమే. అద్వయాత్మ స్వరూపమొక్కటి ప్రకటితమైనపుడే, భేదప్రతీతులన్నియు విలయమగును. ఇతరము లెన్ని ప్రయత్నములును లాభకారులు కావు.

ఇపుడొక సందేహము—"జ్ఞానము ప్రాపించినను జాత్యాయుర్భోగము లుండనే యుండును కదా ? అపుడు కాలీ

మూర్తితో వెలసి యసురులను గ్రసించిన మాత్రాన నేమి సార్థకము?" అని. అట్టి యాశంకలు చేయవలదు. అమ్మ వానిని నిజముగా గ్రసించి వేయును. ఆత్మ స్వరూపముఁ బ్రకటిత యగును. అయిన తర్వాత సైతము దాని యను వృత్తి యగుచుండును. దానినే బాధితానువృత్తి యందురు. అపుడవి యున్నను లేనట్టులే. (ఇదే చండముండుల పదాతి బలము మ్రింగివేయఁబడుట.)

## చండీమూర్తియే సాధకులకుఁ బరమాభీష్టము.

మన యమ్మ చండి (కోపమయి) కాకున్నచో మన యీ బొమ్మరిండ్లెటులును భంగపడఁజాలవు. అమ్మ రెండిండ్లను గూల్చివేసినది. మూడవ యిల్లు గూల్చుటకు సన్నాహము చేసినది. ఇదె యమ్మ చండీమూర్తితో నావిర్భవించిన సార్థకత. ఔరా! భయ మెందులకు? సింగపుఁ గొదమ, వెఱపు గొల్పు తనతల్లి ముఖమండలమును జూచి భయపడునా? అదె దాని తల్లి భయంకరయే కానీ; ప్రలయంకరియే కానీ; అమ్మయే. అమ్మ కరాళదశనములను జూచి భయమగునపుడు, ఆమె వక్షమందు మొగము మఱుఁగుపెట్టి, ఆమె కంఠమును జుట్టుకొని మైమఱచుటకు మఱల నామెనే అమ్మా! యని పిలుచును. అచట మాతాపుత్రసంబంధము లేకున్నను బ్రలయ స్థాన పర్యంతము మాతృభావముతో నెడము కాము. తొలుతఁ బృథివీ జల వృక్ష లతాదులను, అమ్మా! యన నారంభించితిమి. మఱి యీ సర్వభావముల విలయపర్యన్తము మాతృ భావముతో విడిపోలేదు. అమ్మా! యని యఱచితిమి.

ఆ వెనుక మఱి 'నేను' లేనపుడు అమ్మా! యని యఱవము. అపుడే యీ యభూతపూర్వ మాతృలీల యంతమగును.

ఈ దినములందును నీ దేశమందుఁ బలుతావులఁ గాలీపూజ సాగుచున్నది. వాస్తవముగా నది కాళీపూజ కాదు. అమ్మపూజ. శ్యామాపూజ. కాలిని, అమ్మ యన్నచో మఱి కాళి యుండదు. శ్యామయై పోవును. మనము కాళీపూజ చేయనే లేము. పూజ చేయుచుఁ జేయుచుఁ గాలిని, అమ్మ యందుము. తరువాత మన సాధకపుత్త్రిత్వము వఱకు లోపించి పోవును. కావున భయపడుచునే 'అమ్మ' యనివేయుదుము. అమ్మయు మన ద్వైతప్రతీతి యుంచుటకై మాతృభావముతో వెలయును. బహుకాలమునుండి యనేకజన్మ సంస్కారము లున్నవి. గాన ద్వైతభావ మెట్టులును వడిగా వీడదు. గాని యిపు డుండదు. ఏమన, మన యమ్మ తానే చండియైనది. సర్వత్వమును జేర్చి యేకత్వప్రతిష్ఠ చేయుటకే మన యమ్మ ప్రలయంకరీమూర్తితో వెలసినది; కనుకనే మనమిపుడు తప్పక మాతాపుత్త్రిసంబంధము లేనివారమై, మనోవాగగోచరమైన పరమాత్మస్వరూపమందుఁ జేరిపోవుదుము. అమ్మా! అమ్మా! ఇమ్మాట తలంచినంతనే యొడలు పులకించును.

ప్రవృత్తి విలయసందర్భమున (చండవధ సందర్భమున) ఒక మంత్రశ్లోక రహస్యము.

"ఉత్థాయ చ మహాసింహం దేవీ చండ మధావత,
గృహీత్వా తస్య కేశేషు శిరస్తేనాసినాచ్ఛినత్॥"

"దేవి కోపించి మహాసి నెత్తి, చండునివైపు పరుగెత్తి, యా కత్తితో వాని తల నఱికెను."

ఇచట 'ఉత్థాయ' అను పదమునకు ఒరనుండి కత్తిని బెఱికి యనియు, 'హా' అను పాఠమునందుఁ బాదపూరణార్థ మనియు, 'హం' పాఠమునందుఁ గ్రోధావిష్కరణార్థమనియు నెఱుంగునది.

'మహాసి' – ద్వైతప్రతీతినాశకమైన యస్త్రము. 'హం' క్రోధసూచకమైన యవ్యయము.

మహా + అసి = మహాసి; ద్వైతప్రతీతి నాశకమైన యస్త్రము. అనఁగా నద్వయజ్ఞానము. జీవబ్రహ్మముల యేకత్వ మును బ్రతిపాదించు మహావాక్యమే మహాసి. "ప్రజ్ఞానం బ్రహ్మ" "అయమాత్మా బ్రహ్మ" "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" ఈ నాలుగు మహావాక్యములచేఁ బ్రతిపాదింపఁబడు విశుద్ధా ద్వయజ్ఞానమే దేవిచేతి మహా + అసి.

'మహాసి' పదమునకు మఱియొక యర్థము కావచ్చును. సామవేదోక్త మహావాక్యము, మంత్రమందలి యేకదేశమైన 'యసి'పదముచేఁ దెలియుచున్నది. అస్ ధాతువు నర్థము–సత్తా. మహాసి = మహాసత్తా యని తెలియును. మహతీసత్తా = పార మార్థికసత్తా; ప్రకాశించుటతోనే వ్యావహారికసత్త లోపించి పోవును. ప్రలయంకరి యమ్మ యిపుడు తన మహా అసి యెత్తి దాని వ్రేటుచేఁ జండుని తల నఱికెను. అనఁగాఁ బారమార్థిక సత్తను బ్రకాశింపఁజేసి ద్వైతప్రతీతికి మూలమైన ప్రవృత్తిని విలయ మొనర్చినది. ద్వైతజ్ఞానమే సర్వ ప్రవృత్తులకును

మూలము. అద్వయజ్ఞానము దృఢప్రతిష్ఠితమయ్యేనేని ప్రవృత్తి యనుట కింకేమియు నుండదు.

ఈ మంత్రమం దింకొకమాట — అమ్మ చండుని కేశములను బట్టుకొన్నది. కేశగ్రహణరహస్యము మును జెప్పితిమి. (క = బ్రహ్మ; అ = విష్ణువు; ఈశ = శివుడు) బ్రహ్మత్వ విష్ణుత్వ శివత్వముల నొందు నాశ నాశమొందుటే, దేవి చండుని కేశములను బట్టుకొను తాత్పర్యము. మన యమ్మ యీశ్వరత్వమునకైన యాసను సైతము దూరమొనర్చి, యపుడు ప్రవృత్తిని నశింపఁజేసినది. ఇఁక మఱెట్టికాంక్షయు లేదు. ఉండఁజాలదు. అమ్మ మహాసి నెత్తినపుడు, అనఁగాఁ గేవల మహాతీసత్త పూర్ణదృఢభావముతో బ్రతీతియోగ్య మగును. అపుడు మఱి ప్రాప్య ప్రాపక ప్రాపణములు, సాధ్య సాధక సాధనములు మున్నగు భేదము లేవియుఁ గానరావు. కనుకనే ప్రవృత్తి యొక్క సమూలోచ్ఛేదనమైనది. సాధకా! కేవల 'తత్త్వమసి' వాక్యార్థము విచారించుటతోనే ద్వైతప్రతీతి విలయమనెడి మోక్షపదము లభింపదు. అమ్మ 'అసి' ఖడ్గము నెత్తి, యీ మహాసుర నిధనము చేయనంతదాఁక మోక్షాశ యాశామాత్రముగానే యుండును.

సాధకా! ఇఁక నీవు ధన్యుఁడ వనుకో.

చండుఁడు (ప్రవృత్తి) పడిపోవుట చూచి ముండుఁడు (నివృత్తి) దేవిపైఁ బడవచ్చెను. అమ్మ, ఆ ఖడ్గముతోనే వ్రేసి పడఁగొట్టెను. ప్రవృత్తివిలయముతోనే నివృత్తి నివృత్తియు నైనది. ఈ రెండుం జేరియే యుండుననియు, ఒకటి నశించిన

రెండవది విలయ మొందక తప్పదనియుఁ జెప్పితిమి. వీరే తొలుత నస్మిత (శుంభుని) చెంతకు అమ్మవృత్తాంతముఁ దెచ్చినవారు. గాన, నిరువురు నాత్మ బలి యిచ్చి మాతృస్వరూప ప్రకాశముతోఁ బూర్వాయోజనమును సంపన్నము చేసిరి.

## మహావాక్యార్థమనెడి మహాసియే యమోఘోపాయము

సాధకా! ఆలోచించి చూడుము. విషయాభిముఖమైన యీ ప్రవృత్తిని బరమాత్మాభిముఖము చేయుటకై ఎంత ప్రయత్నము, ఎంత కాఠిన్యము, ఎంత సాధనము నైనదో! అయినను విషయాసక్తి దూరము తొలఁగలేదు. నివృత్తి ప్రకాశింపలేదు. ఎంత యోగకౌశలము చేసినను, నీ యాశ పూర్ణము కాలేదు. కాదు. అనేకకష్టముల కోర్చుకొని యెన్ని కన్నీళ్లు మాతృచరణములందు గానుక పెట్టితివో? ఆశ తీఱెనదా? ప్రవృత్తి సర్వతోభావముతో మాతృముఖ మైనది. నివృత్తి నిజముగా విషయవిరతిఁ దెచ్చిపెట్టినది. నీవు వేడి నిట్టూర్పులు విడువఁజొచ్చితివి. కనుకనే యమ్మ కాళీమూర్తితో వెలసి నీ కతిప్రియమైన నీ ప్రవృత్తి నివృత్తులను, నీ సాధనను, వైరాగ్యమును మ్రింగివేసినది.

ఇఁక నీవు ధన్యుఁడవైతి వనుకో. ఇన్నిరీతుల సాధనమును, త్యాగ వైరాగ్యములను అమ్మ క్షణములోఁ దన కరాళవదనమున గ్రహించినది. దీనిచే నీవు దుఃఖింతువా? లేదు లేదు. నీవు చండీతత్త్వ సాధకుఁడవు. నీవు జీవత్వమును జంపఁగోరిన వాఁడవు. నీ వద్వయజ్ఞాన తత్త్వప్రయాసివి. నీవేల దుఃఖింతువు? జయ మాతా! జయ గురూ! అనుచు ముందంజ

వేయుము. ప్రవృత్తి నివృత్తులు గతించినవి. మిగు లేమే నున్నచో, వానిని సైతము అమ్మ సమ్ముఖమునందుఁ బెట్టుము. అమ్మ తన చండమూర్తితో సర్వస్వమును మ్రింగివేయును. నిన్నద్వయతత్త్వమందుఁ జేర్చివేయును. కనుకనే చండీతత్త్వ మతిగహనమని పలుసార్లు ఘోషించుట. ఉపనిషత్తుకూడ "క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి" యన్నది.

పాము కుబుసము కళచుట మున్నగునవి చేయలేదు.

ఇదిగో ప్రవృత్తి నివృత్తులు నశించిన వెనుకను సాధకుఁడు స్థూలదేహముతోనే యుండును. అతనికి ఆహారనిద్రాదులతోను, లోకశిక్షణాది కార్యములతోఁ బ్రవృత్తియు, శాస్త్రవిహిత వాక్యములతో నివృత్తియుఁ గానవచ్చుచునే యుండును. ప్రవృత్తి నివృత్తు లుండుటచేతనే వారి యనుచరులు కొలఁదిగా నుందురు. ఈవిధముగాఁ బునరావర్తనము చేయువారిని గుఱించియే "దిశో భేజే భయాతురమ్" అని మంత్రమందుఁజెప్పఁబడెను. ప్రవృత్తినివృత్తులు (చండముండులు) చావఁగానే మిగిలినవారు దిక్కులఁ బట్టిరి అనుటచే, విలయ మొందక కొందఱున్నారనుటే. ఇపుడు, "అయ్యా! నశించిన ప్రవృత్తి నివృత్తులయు వారి యనుచరులయుఁ బునరావర్తనమే యైనచో, మఱి వారి విలయమైన దనుటెట్లు?" అను శంక కలుగవచ్చు. దాని కుత్తరము మున్నే యీయఁబడినది. ప్రవృత్తి నివృత్తుల వ్యవహారమున్నను వాని పారమార్థికత్వ బుద్ధి లయించుచునే యుండును. ఎంత యాలస్యముగా సాధకుఁ

డాత్మస్థుఁ డగుచుండునో, యంత యాలస్యముగా వాని వ్యవహారము లోపించును.

సారాంశ మేమన—ఆత్మకంటె వేఱొక్కసత్త యేదియు లేదనెడి జ్ఞానమందు నిల్చుటకై యే, సర్వాయోజనములు, యుద్ధవిగ్రహములు నగుచున్నవి. ఆ జ్ఞానము చక్కఁగా ననుభూతమైన తరువాతనే, యనాత్మప్రతీతి పునరావర్తితమగును. అది యసురభావము కాదు. ఏలన పాము కుబుసము కళచుట మున్నగునవి చేయలేనటులే యుండును. ఆత్మజ్ఞపురుషునకు జగద్వ్యవహార మగుచుండును. వెలి కాతఁడు ఆత్మస్వరూపము వలన విచ్యుతుఁడైనటులే తోఁచును గాని, దానివలన నాతనికి హాని లేదు. వాని యనాత్మజ్ఞానము (అజ్ఞానము) మఱుఁగువడి పోయినది.

ఈ చండికయే దేవీమాహాత్మ్యమందుఁ బ్రతిపాద్యవస్తువు.

కాలి చండముండుల శిరస్సులను జండికా చరణములందు ఉపహారముగా నిచ్చి, "శుంభ నిశుంభుల (అస్మితా మమతల) నిఁక నీవు స్వయముగాఁ జంపఁగలవు" అన్నది.

సాధకా! మును 'కౌశిక' యనుకొన్నదే, యంబికా రూపముతో హిమాచలమందున్నది. ఆమె క్రోధమే మేను దాల్చిన ప్రలయముగా—కాలీశక్తిగా వెలసి చండముండుల శిరముల నుపహార మిచ్చుటకై వచ్చినది. అమ్మ— అంబిక యిచట బహు కోపన, గాన నామె పేరు చండిక. ఇదిగో, యీ చండికయే ప్రతిపాద్యవస్తువు. పరమాత్మ ప్రకాశము కాఁగా సర్వభావములును దప్పక నశించును. ఆ విలయమే

అమ్మ క్రోధఫలముగా వర్ణింపఁబడినది. ఆ భావములను విలయ మొనర్చిన శక్తియే కాళి. ఇంత గొప్ప కాండము! ఇంత యసురః నిధనము! ఇంత భయానక సమరము! ఇన్ని వ్యాపారము లైనను మన యమ్మ నిర్వికారయు, నిత్యానందయు, హాసమయియునై యున్నది. అది లక్షించియే ఆమె సత్తచే సత్తావంతమయియే, యీ యసురకులయుద్ధము, క్షయము ఘటించినవి.

## అమ్మ సర్వాశ్రయ; అస్మితామమతలు నశించుటన నెంత?

సాధకా! ఆత్మస్వరూప ముద్భాసించుటకు మున్నే, యాత్మశక్తి, సంహారిణీశక్తి మూర్తితో నావిర్భవించి, స్వరూపప్రకాశమున కగు నంతరాయములఁ దొలఁగించును. ఇఁక మిగిలినవి అస్మిత, మమత. ఇవి యాత్మప్రతిబింబములు, అనఁగాఁ జిదాభాస మాత్రములే. అవి బింబమునందే చేరిపోవును. కనుకనే కాళి, యంబికతో "యుద్ధయజ్ఞమందు నీవే స్వయముగా శుంభ నిశుంభులను (అస్మితా మమతలను) జంపఁగల" వన్నది.

## చాముండా పూజాసాధన రహస్యము

చండముండులను (ప్రవృత్తి నివృత్తులను) జంపి వారి శిరస్సుల నుపహారముఁ దెచ్చి యిచ్చిన కాలిని (సంహారిణీ శక్తిని) జూచి చండికాదేవి (అమ్మ) "నీవు చండముండులను జంప వచ్చితివి గాన, నేఁడు గోలె లోకమున 'చాముండా' నామముతోఁ బ్రసిద్ధ వగుదువు" అన్నది.

ప్రలయంకరీశక్తి విశిష్టభావముతో వెలయుటచే అంబిక యిట్టి వరదానము చేసినది. చండముండశబ్దములకుఁ బైనున్న హననార్థకమైన 'ఆ' ధాతువుతోఁగూడి 'చాముండా' శబ్దము నిష్పన్నమైనది. పృషోదరాది సూత్రానుసారముగా 'చండ ముండ + ఆ = చాముండా' యని సాధువైనది. అది యుండనీ.

చండికా వరప్రభావముచే నీ చాముండారూపిణి ప్రలయ శక్తి ప్రవృత్తినివృత్తుల విలయమొనర్చుట కెల్లపుడును ప్రకటిత యగుచునే యుండును. ఇప్పటికి నేఁటేఁట దుర్గోత్సవవేళ మహాష్టమీ మహానవమీ సంధిసమయమందుఁ జాముండా పూజావిధానము జరుగుచునే యున్నది.

సాధకా ! లోకమునఁ జాముండా లీలలను జూచితివా ? జాగతికమైన శోకదుఃఖ హాహాకారములను గనుచున్నావు. అవి యన్నియుఁ జాముండా తాండవలీలలే. సాక్షాన్మృత్యురూపిణి యైన యీ ప్రలయంకరి కరాళకవలమువలన ముక్తి నొందఁ గోరుదువా ? మరణభయము తొలఁగి యభయామృతాంకము నాశ్రయింపఁగోరుదువా ? మఱలఁ గోలాహలపూర్ణమైన యీ మర్త్యధామమందుండి యమృతాశీర్వాదము నొందఁగోరుదు వేని ఈ చాముండాశక్తిని బూజింపుము. జీవాత్మ పరమా త్మైక్యమనెడి మహాసంధిక్షణమందు, ఈ సంసార మహాశ్మశాన మందు నీవు శవాసనమం దుండుము. పిదప విరాణ్మరణమందు నీ వొందు నస్తిత్వముపైని నీ 'నేనును' ఆ నగ్నమూర్తిపైని నెలకొల్పుము. తుదిని మహాసత్యమందుఁ బ్రతిష్ఠితుఁడవై కేవల విశుద్ధచైతన్యమందే లక్ష్యముంచి, ఆద్యాశక్తిబీజ సహాయ ముతోఁ బ్రాణపుష్పాంజలి నర్పింపుము. ఇటులు చేయఁగల్గి

నపుడే చాముండాపూజ సిద్ధించును. బ్రతికియుండఁగానే చావఁ
జాలనివారు చాముండాపూజ చేయలేరు. చాముండాపూజ
యందు సమర్థులు కానివారికిఁ జాముండ ప్రసన్న కాదు.
చాముండాప్రసన్నత లేకున్నఁ గరాలమృత్యుచ్ఛాయ తొలఁ
గదు. చాముండను దెలిసికొన్నవారు, చాముండ నాత్మశక్తిగా
నెఱింగినవారు, ఆమె భయంకరగ్రాసమును స్నేహమయ
మాత్రంకమునుగా ననుభవించువారు మాత్రమే, ఆనంద
మయాత్మ స్వరూపమందుఁ జేరఁగలరు.

అమ్మ వీరసంతానమవు. మృత్యుభయముతోఁ గ్రుంగకు.

అయ్యా! చూడు. జాగతికానందభండారమును గొల్ల
గొన్నది యీ చాముండ; జీవుని హృదయదళము నార్చివేసినది
యీ చాముండ; మనుష్యుని సర్వోత్సాహాధ్యవసాయముల
ధ్వంసముచేసినది యీ చాముండ. ఈ జగత్తునకు నిమిత్తోపా
దాన కారణము లానందమే. ఆనందమే జీవజగత్తుయొక్క
యథార్థస్వరూపము. అయినను జీవబృందము, ఆనందాభావ
జ్ఞానముతో 'ఆనంద మెక్కడ' యనుచు నిటునటుఁ బరుగెత్తు
చుండును. వీనికి హేతువు చాముండయే. అదె మృత్యు
కరాళగ్రాసము. ఆ వెన్క మన 'నేను' భయముతో సంకో
చించు జీవుఁడు మనసువిచ్చి యానందము ననుభవింప
లేఁడు. స్వాధీనతతో ముక్తప్రాణముతో నానందమయ
మాతయొక్క యక్షయానంద భండారమును గొల్లఁగొన
లేఁడు. ఇదె చాముండ. ఇదె మృత్యువు. ఇదే సర్వానంద
మూలముపైని గొడ్డలిపెట్టు పెట్టించినది. కాని నీవు సాధకుఁ

డవు. నీవు, అమ్మ వీరసంతానమవు. నీవు మృత్యుభయ ముతోఁ గ్రుంగకుము. వెనువెన్క మృత్యువు నడుచుట చూచి, దాని చేతినుండి తప్పుకొనుటకై బ్రతుకునాశతోఁ బరుగెత్త కుము. మృత్యువునకు వెను జూపకుము. దాని కెదురు తిరిగి నిలువుము. దానినే అమ్మా! అమ్మా! యనుచు నఱచుచు, దానికే యభిముఖుఁడ వగుము. అమ్మా! అమ్మా! యనుచుఁ గడుఁ దెంపుతో, గట్టి కడఁకతో నా ప్రలయంకరి కాలీశక్తి యొడియం దెగిరిపడుము. అపుడు నీవు మృత్యువనుచు నొకటి లేదనియు ఏ మృత్యువును దయ్యముగానో, పిశాచముగానో తలఁచి త్రుళ్ళిపడితివో, యా మృత్యువే మంగళమయ స్నేహ మయ మాతృమూర్తితో నిన్ను గుండెకు హత్తించుకొని యమరత్వమందుఁ జేర్చినదని తెలిసికోఁగలవు. కేవల సాధన జగత్తునందే కాదు, మృత్యుభయభీతుఁడైనవాఁడు వ్యావహారిక జగత్తునందు సైతము నెట్టికార్యమును సంపన్నము చేయలేఁడు.

సాధకా! రమ్ము.

"కాలి! కాలి! మహాకాలి! కాలికే! పాపహారిణి!
వరాభయకరే! దేవి! నారాయణి! నమోఽస్తుతే॥"

యనుచు మనము మాతృచరణములకుఁ బ్రణమిల్లుదము. ఆమె కృపచే మన యనేక జన్మసంస్కారములును, బ్రవృత్తి నివృత్తు లనెడి మహాసురులును విలయమందిరి. ఆమె చరణములందు సమ్యగాత్మనివేదనము చేసి, యా యమ్మ విచిత్రలీలను, రక్త బీజ వధముం దర్శింతము. మన శిరములపై మంగళమయా శీర్వాదము కురియుఁగాక.

## త త్త్వ సు ధా టీ క.

(చండీతత్త్వసాధన రహస్యమునుండి యుద్ధృతము.)

ఈ విధముగా నంతర్ముఖమైన లోభ మోహములతోఁ జేయఁబడిన సాధకకర్మకాండము, యోగమార్గానుష్ఠానము నను వాని యంశమును జగన్మాత తానే దయఁదలఁచి విలయ మొనర్చినది. చండముండులు నిహతులైరి. వారి పవిత్ర శిర ములు మాతృపాదముల కుపహారములు చేయఁబడినవి. అమ్మ ప్రీతితో వానిని గ్రహించినది. చండముండులను జంపిన కాళికిఁ జాముండానామమునుంచి విఖ్యాతముచేసినది. శ్రీ దుర్గా పూజాసమయమున మహాష్టమీ, మహానవముల సంధిక్షణ మందు దేవీమాహాత్మ్యమున వర్ణింపఁబడిన "ఓం, కాలీ కరాల వదనా ... నాదాపూరిత దిఙ్ముఖా" అనెడి ధ్యానముతోఁ గాలికాదేవి పూజ జరుగుచున్నది. ప్రతిపదాది పూర్ణిమాంత ముగా నగు నుత్సవమందు, అష్టమీ నవమీ సంధియందే, అనఁగా – భోగ త్యాగ మిలనభూమి యందే, చాముండా (కాలికా) ప్రలయమూర్తి పూజ జరుగును. మహాకాలీరూపిణి కులకుండలినీశక్తి యీ యనులోమ విలోమ భావ మధ్యస్థల మందే, అనఁగా జీవభావ పరంభావ మహాసంధి యనెడి మూలా ధార పద్మమం దధిష్ఠించిన కారణమున నీ ప్రథమచరిత్ర కామె దేవత. సాధకున కాత్మాభిముఖ విలోమగతి యగుటచేతనే, కులకుండలినీమహాశక్తి కాలిక, జాగృతయై పద్మమునుండి ... లేచుచు, మఱియుఁ బ్రతి భూమికయందును స్థూల సూక్ష్మ కారణముల యాసురీ భావములను దన

ప్రలయమూర్తియందు విలయ మొనర్చును. లలాట ప్రదేశ మందు ద్విదళమందుఁ జేరి సగుణ (సవికల్ప) భావమందు భక్తునితోఁగూడఁ బరమానందానుభవము చేయును. లలాట ప్రదేశమందే చతుర్దశచంద్రుని పంచదశ కలతోఁ గూడఁ గామకలా సామీప్యముచే విశిష్టానందము వెలయును. ఈ విధ ముగాఁ గుండలినీ శక్తి సాధకునకు, ద్విదళపద్మాధిపతియైన సుధాకరుని సుధను (కులామృతమును) బానము చేయించి యమరుని జేయును. తుదను సహస్రారమందునుఁ బూర్ణిమ యనెడి స్వరూపానందము (అమాకళ) అనెడి యమృతానం దము ననుభవింపఁజేసి, సాధకజీవునకు శివత్వమును (ముక్తిని- నిర్వాణమును) ప్రసాదించును. కనుకనే మన దేవీమాహాత్మ్యము యొక్క అష్టమీ, నవమీ, చతుర్దశీ పారశ్రవణముల విశేష ఫలము వ్రాయఁబడినది.

సాధకా ! రమ్మ. మనము జాగతిక దైహిక పారివారిక కార్యములందుఁ జాముండామాతయొక్క మంగళకర నిర్మాత నను, ఆమె స్నేహమయాశీర్వాదముగ గ్రహింప నేర్చికొం దము. రోగ శోక పరితాపాది ప్రలయ ప్రలయమూర్తియొక్క యాలింగనముచే, నమ్మ మన మాయామోహ స్వప్నమును భంగమొనర్చి జ్ఞాననేత్రమును విప్పును. మనము భ్రాంతులము గాన విషయరస విమోహితుల మగుటచేఁ బరమరసాస్వాద నము లేకపోయెను; కనుకనే జగదంబ దివ్య స్తన్యపానము చేయించి తన సంతానమును దనువుటకుఁ బూనుకొన్నది. బహిర్జగత్తునందంతటను దెలిపిలేక ప్రవహించు నానందమయా మృతధార, ఆ యమృతస్వరూప పరమరసాస్వాదనము చేయించి

కైవల్యదాన మొనర్చుటకే, కైవల్యదాయిని కాలి కరాలవేష ముతో విషయాసక్తిని ప్రబలయరూప తాండవాఘాతముచే భంగపెట్టి జీవునకుఁ జైతన్యసంపాదనము చేయును. ఇదె ప్రేమ లక్షణమైన ఛద్మవేషమునఁ జాముండామాత చేయు నపూర్వ చండలీల. ఇంతదాఁక దీనియందు అపూర్వకరుణామృతధారా దర్శనాస్వాదములను జేయఁగల్గితిమి. మన విశ్వనాటక యవనిక పడు శుభముహూర్తమందు శ్యామాంకాభయాంకమునం దధిష్ఠించి కాలుని జయించి మహానిర్వాణ మొందెదము.

"కాలి ! కాలి ! మహాకాలి ! కాలికే ! పాపహారిణి !
వరాభయప్రదే ! దేవి ! నారాయణి ! నమోఽస్తుతే॥"

అష్టక్లేశనాశనముగాక, అస్మితా మమతలు నశింపవు.

సర్వద్వైతప్రతీతిహేతువు విపర్యయజ్ఞానము (ధూమ్రలోచనుఁడు) నశించెను. ద్వైతప్రతీతికి ముఖ్యాధారములు ప్రవృత్తి నివృత్తులు (చండ ముండులు). అవియు నశించెను. అష్టక్లేశాది సర్వభావములు నశించినఁగాని, యస్మితా మమతలు నశింపవు. సాధకా ! మాతృకృప, మాత్రాకర్షణమే యిదంతయు ననుట మఱువకు. మున్ను వివరింపఁబడిన "యథా ప్రదీప్తం జ్వలనం పతంగాః" అనెడి గీతయందలి శ్లోకమును స్మరించుకొనుము. నీవు మాతృచరణములయం దాత్మార్పణము చేసి యుదాసీనుఁడవై యుండుము. అమ్మ స్నేహమయాకర్షణము నీ సర్వద్వైతభావములను విలయమొనర్చి నిన్నుఁ బరమానందమయాద్వైతస్వరూపమునం దుంచును. నాయనా! ఆత్మార్పణసీమకు వెల్పలనే యుండునంతదాఁక నీ యసురభావ

ములు స్వేచ్ఛతో నాత్మబలిదానమనెడి, యమ్మ కృపాను భవము చేయఁగలవా ?

అష్టపాశములే, అష్టాసురసంప్రదాయములు.

"ఘృణా లజ్జా భయం శంకా జుగుప్సాచేతి పంచమీ,
కులం శీలం తథా జాతి రష్టౌ పాశాః ప్రకీర్తితాః॥

— కులార్ణవతంత్రము.

జీవుఁ డీ యెన్మిది పాశములచే బద్ధుఁడు. ఇవి వీడిపోకున్న జీవుఁడు శివుఁడు కాఁడు. "పాశయుక్తో భవే జ్జీవః పాశముక్తో భవే చ్ఛివః" ఇదియుఁ దాంత్రికవాక్యమే. ఇన్నాళ్లును జీవుఁడు మాతృకృపచే శివత్వమునకుఁ జేర్పఁబడుచునే యున్నాఁడు. గాని శుంభుఁడు (అస్మిత) యిపు డీ యష్టపాశములను సైతము తల్లితోఁ బోర బురికొల్పెను. విశేషావలంబనము దూరమై పోవలయును. అవే, శుంభుఁడు పురికొల్పిన యసురసంప్రదాయ ములు ఎనిమిది. 1 ఉదాయుధ, 2 కంబు, 3 కోటివీర్య, 4 ధూమ్ర, 5 కాలక, 6 దౌర్హృద, 7 మౌర్య, 8 కాలకేయ.

వీని యాధ్యాత్మిక రహస్యమునకుఁ బోవుదము.

1. ఉదాయుధుఁడే 'ఘృణా'. ఇతరులయెడ నవజ్ఞాభావ మును బెంపొందించుటకే మన యహంకార ముద్యతమగును. 'నేను శుద్ధుఁడను, ఉన్నతుఁడను. వాఁ డశుద్ధుఁడు, హీనుఁడు' అను నిశ్చయముతోనే ఘృణ యుదయించును. కనుకనే వీరు ఉదాయుధాసురులు. ఎనుబది యార్గురు. జాగ్రత్కాలమందుఁ బదునాలుగు కరణముల నాశ్రయించి జరాయుజాది చతుర్విధ

భూతములతోఁ గుణింపఁబడి యేబదియాఱు భేదములైనవి. మఱల స్వప్నావస్థయందు అంతఃకరణచతుష్టయము నాశ్రయించి చతుర్విధ భూతములచే ఘృణాప్రకాశ మగును; గాన స్వప్నకాలమందు బదునాఱు భేదములు. మఱలఁ బరమాత్మ స్వరూపస్థితికై ప్రయాసపడు నస్మితకుఁ దన విభిన్నస్వరూపములైన చతుర్విధకరణములయెడ నగు నింత విద్వేషము (ఘృణ) పదునాలుగు విధములు. ఈ విధముగా సమష్టిఘృణ యెనుబది యాఱు భేదములుగా నగును.

2. కంబు — అనఁగా శంఖము. జీవుని రెండవపాశము. లజ్జయే దీని స్వరూపము. శంఖజాతీయ జలచరప్రాణుల హస్త పాదాద్యవయవములు ఆవరణము లోపలనే దాగియుండును. ఏదే నొక ప్రతికూలవేదన కాఁగానే యివి దాగికొనును. మనుజుని లజ్జయు నిట్టిదే. ఎట్టి దుర్బలతయు బయల్పడకుండుటకై సదా మనుజుఁడు సంకోచముతోఁ దన్నుఁ దా దాచికొనును. దీనిచే లజ్జావస్తువు నెఱుంగుటకు, ఈ కంబుజాతిజీవుని మాటయే మనకు ముందుగా మన మనసునకుఁ దట్టును. ఇదియు నొక విధమైన పాశమే (బంధనమే). భేదజ్ఞానముచేతనే యీ లజ్జ కలుగును. సాధకా! గుర్తింపుము. మున్ను "యా దేవీ సర్వభూతేషు లజ్జారూపేణ సంస్థితా" అని దీనిని మాతృరూపముగా నెంచి ప్రణామము చేయఁబడినది.

దీని ఫలముగా నిపు డీ భేదజ్ఞానమూలకమైన లజ్జ (ఆత్మ సంకోచము) కంబునామకాసురుల రూపమున నాత్మ బలిదానమునకై యమ్మ యెదురఁ బోర నిల్చెను. వీరిసంఖ్య యెనుబది నాలుగు కరణముల నాశ్రయించి షాట్కౌశిక

(6 కోశముల) దేహమందే వీని యభివ్యక్తి యగును. ఆ రెండు సంఖ్యలు గుణింపఁగా 14×6=84 అయ్యెను. ఇట్లు లజ్జా భేదము లగును.

3. కోటి వీర్యులు—అనఁగా నపరిమేయ వీర్యము. ఇది జీవుని భయ మనెడి మూఁడవ పాశము. నిజముగా భయ మమిత వీర్యము. తన యస్తిత్వనాశము వలని భయము మనసువిచ్చి జగదోద్యోగమును జేయనీయదు. సాధన భాగ్య మును సైతము జరుగనీయదు. పారమార్థిక సత్త్వప్రకాశ మొక్కటి లేకుంటచే, నిట్టి యాత్మవికాసమనెడి భయముచేఁ గోటి వీర్యాసురకులము పుట్టును. వీని సంఖ్య యేఁబది. దశేంద్రి యములు, పంచకోశములు, నీయసురకులము వెలయు చోటులు పై రెండుసంఖ్యలును గుణితమైనపుడు 10 × 5=50 అగును. ఇట్లు భయమనెడి పాశము 50 విధములు.

4. ధౌమ్రములు:- ధూమ్ర నామకాసురుల వంశము ధౌమ్ర వంశము. ఈ ధూమ్రుఁడు మనకుఁ బరిచితుఁడైన ధూమ్రలోచ నుఁడే.మఱెవ్వఁడునుంగాఁడు. విపర్యయజ్ఞానమువల్ల నే సర్వసంస్కా రములు నుదయించును. కనుక నే వీరికి ధౌమ్ర వంశీయాసురులని పేరు. వీరే శంక యనెడి నాల్గవపాశము (బంధనము). భయ శంకలకు భేదమేమన, భయమనఁగా అస్తిత్వనాశమునుగూర్చిన యాశంక. సంబంధముగల పదార్థములు నశించునేమో యను మానసికవికారము. సాధారణభాషలో భయమనఁగా మృత్యు భయమే. శంకా శబ్దార్థము ధన పుత్త్రాది వినాశమగునేమో యను ననుగు; కనుక నే బంధనవిశేషము. వీరి సంఖ్య నూఱు. దశేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచభూతములు ననువాని

నాశ్రయించియే శంకానామకాసురకులమును వెలయించును. ఈ రెండుసంఖ్యల గుణనఫలముగా $10 \times (5 + 5)10 = 100$ నూఱగును.

5. కాలక — ఇది కృష్ణవర్ణాసురగణము. కాలశబ్దము పైని స్వార్థమందు 'క' ప్రత్యయము చేరుటచే కాలక శబ్దము నిష్పన్నమైనది. ఇది జుగుప్స యనెడి యైదవపాశము. అజ్ఞానము కృష్ణవర్ణము. దానివల్లనే బహుత్వప్రతీతి. సాధకుఁ డెంతదాఁక, నేకత్వమందు (అద్వితీయ బ్రహ్మసత్తయందు) ఉపనీతుఁడు కాఁజాలఁడో, అంతదాఁక నిక్కాలకాసురులనెడి జుగుప్సచేతి నుండి బరిత్రాణము నొందఁడు.

6. దౌర్హృదులు — వీరు దుర్హృదుఁడను నసురుని వంశమువారు. దుష్టభావములను గలిగించుటచే వారి కా పేర య్యెను. ఇదియుఁ గులాభిమానమనెడి యాఱవపాశము. అద్వితీయ బ్రహ్మసత్త సాధకునకు వేయిసారులు ఉపదేశింపఁబడినను కులాభిమానమనెడి యజ్ఞానమువలన నొక్కసారి పరిత్రాణము లభింపదు. కనుకనే యసురభావము.

7. మౌర్య — వీరు మురనామకాసురుని సంతానము. ఆధ్యాత్మికదృష్టిచే నిది జీవుని శీలము. సప్తమపాశము. స్వభావ విషయక విశిష్టజ్ఞానమే శీలము. ఇది గొప్ప యంతరాయము. తమతమ ప్రకృతియే జీవుల తల్లియని మున్నంటిమి. ఈ సత్యము ననుశీలించువారే, యీ రుద్రగ్రంథిభేద క్షేత్రమందుఁ జేరఁ గలరు. ఆ ప్రకృతి తనంతనే జీవుని విడిచి యద్వయానందసంధానము చేయును. ఆ తన ప్రకృతిని 'అమ్మా' యనలేకుంటచే

నెన్నఁడును విశ్వప్రకృతిసంధానము నొందలేఁడు. విశ్వప్రకృతి సంధానము నొందక విశ్వాతీతక్షేత్రమందు - నిరంజన స్వరూప మందుఁ జేరలేఁడు.

8. కాలకేయు — కాలకనామాసుర సంతానమే కాల కేయులు. వీరే జీవుని జాతి యనెడి యెన్మిదవ పాశము. అజ్ఞానము (భేదజ్ఞానము) వల్లనే జాత్యభిమానము పెంపొందును. కావుననే కాలకుఁడు అనఁగా నజ్ఞానమనెడి కృష్ణవర్ణాసురుని సంతానము కాలకేయు లనఁబడిరి. ఈ జాతిజ్ఞాన సంబంధమున మున్ను విశేషించి చెప్పఁబడినది. గాని యిచట మఱలఁజెప్పట పునరుక్తి కాదు. మున్ను జెప్పఁబడిన జాత్యాయుర్భోగ కథ, బ్రాహ్మణత్వాది వ్యష్టిజాతికథ, వాస్తవముగా నీ కుల శీల జాత్యాది నిశ్చయజ్ఞానమును విడుచుట కష్టము. మాటిమాటికి విలయమగుచున్నను బలువిధములుగా మఱల యెత్తును. దీని నాశము చేయుటకే యిమ్మ యీ యోజనము.

ఇదిగో, బంధన ముక్తులు రెండును జ్ఞానప్రకార భేదమాత్రములే.

మును జెప్పిన ఘృణా లజ్జాద్యులైన యెనిమిది పాశములే జీవత్వముయొక్క గట్టి బంధనములు. అవి విడఁగొట్టబడనిచో విమలబోధమనెడి మాత్మసాక్షాత్కారము లభింపదు. అది లభింపక యీ యష్టపాశములు తెగవు. ఈ కట్లనుండి విడివడుటకై యనేకులు సాధకులు పలురీతుల యుపాయసాధనములు చేయుదురు; పలురీతుల ప్రతికూలప్రయత్నములు చేయుదురు. గాని, అక్కటా! వానివలనఁ బాశచ్ఛేదము కాదు, సరిగదా

ఆ విపరీత కర్మానుష్ఠానముచే నుఱికొన్న సంస్కారములు సంచితము లగును. ఇదిగో బంధనముక్తులు రెండును జ్ఞానప్రకారభేద మాత్రములే. విశుద్ధబోధ ముదయింపనంతకు నజ్ఞానమూలకములైన యష్టపాశములు సమూలముట్టఁ దెగిపోవు. భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు పార్థునితో సరిగా, నిమ్మాటయే యనెను.

"విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః,
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥"
—గీత. 2-59.

నిరాహారి యగుటచే (ఇంద్రియాదిసంయమనము చేయుటచే) విషయనివృత్తి తప్పకగును, గాని తద్విషయకరసము (అనురాగము) అనఁగా సూక్ష్మసంస్కారము మిగిలియుండును. పరమాత్మసాక్షాత్కారి యగుటనే, భేదజ్ఞానమూలక విషయరసము (సూక్ష్మసంస్కారానురాగము) నివర్తించును.

వినుము – సాధన ప్రథమావస్థనుండియే సరళబుద్ధితో, నిష్కపటహృదయముతోఁ. దమ సదసద్భావములను గూర్చి విచారింపక, యమ్మ సమ్ముఖమునఁ బెట్టఁగల సాధకులుమాత్రమే, మాతృకృపచే నతిసులభముగా, నీ పాశములవలన విడువఁబడి, పరమానందసాగరమందు మునుఁగఁగల్గుదురు. దేవీమాహాత్మ్య ప్రారంభమున ('సాధనసామగ్రి' తొలుమాటలలో) "అష్టమ" "మను" శబ్దముల రహస్యముఁ జెప్పునపుడు, అష్టపాశవిముక్తుఁ డగు కథయుఁ జెప్పఁబడినది. షట్చక్రగ్రంథిని భేదించు సాధకులు మాత్రంకమందు నిర్భయచిత్తముతో నిల్తురని తెలియఁగల్గితిమి. అమ్మ ప్రబలాకర్షణముచే లాఁగఁబడి పాశసమూహము ఆత్మ

బలి యిచ్చుటకై ప్రలయమువంక ముందంజ వేయును. ఏ పాశములవల్ల విడివడుట కెంతో కఠినప్రయత్నము తప్పదనుకొనిరో, విడివడుట మఱి కాదనుకొనిరో యా పాశములు తమకుఁ దామే తెగిపో సిద్ధపడినవి.

సాధకా ? ఏమి ? నీ విది నమ్మవా ?

అమ్మను నిజమైన సరళబుద్ధితో, అమ్మా ! యనుచుఁ బిలుతువేని, అమ్మ యడుగులయం దాత్మార్పణము చేయుదేని ముమ్మాటికిఁ దల్లియొడి నెక్కఁగల్గుదేని, నీ సర్వబంధనములు నిటులే యనాయాసముగా విడిపోవును. అమ్మ తానే వచ్చి ముద్దుబిడ్డలమైన మన కట్లను వీడ్చును. మనలను గుండెకద్దుకొని మోక్ష స్వర్ణ మందిరమందుఁ జేర్చును. మనము చిరకాలము నుండి యాత్మస్వరూపముతో నెడఁబడిపోయి స్వేచ్ఛతో జీవత్వ బంధనమును దెచ్చిపెట్టుకొన్నాము. నెయ్యముచేఁ గలఁగు నమ్మ, మనము తగిలించుకొన్న సంకెళ్లను దప్పక విప్పివేయును. మఱి బంధనమన్నది లేని, భేదజ్ఞానము రవ్వంత లేని, నిరానంద స్పర్శము లేని, నిరవచ్ఛిన్నానందమయ విశుద్ధచైతన్యమయాఖండ బ్రహ్మసత్తయందు మన విశిష్టసత్తను బూర్తిగాఁ జేర్చివేయును. మనమును 'బ్రహ్మోహమస్మి' యనుచు జీవత్వమును దాటిపోవుదుము. మన మానవజని పూర్ణచరితార్థత నొందును.

సాధకా ! అస్మితానాశము సమీపించుచున్నది.

సాధన భూమికల నెక్కుచున్నావు. సూక్ష్మ రహస్య గ్రహణమందు సావధానుఁడ వగుము.

పైని వివరించిన యష్టపాశముల నెడి (ఉదాయుధాదుల) యసంఖ్యసేనలతో అస్మిత (శుంభుఁడు), అమ్మ నెదుర్కొనఁ బయగిడెను. అమ్మ యదిచూచి ధనుష్టంకారము చేసినది.

ఈ జ్యానాదమే ప్రణవనాదమని మున్నెన్నో సారులంటిమి. ఆ నారిమ్రోత నింగి నేలల నిండినది.

సాధకా! మఱువకుమా — అమ్మ ప్రణవధ్వని చేయ నంతకు నసురులకు భయ సంభ్రమములు కలుగవు. మఱి మాతృచరణములం దాత్మసమర్పణము చేయఁబడిననాఁట నీ కర్తృత్వము తొలఁగిపోయినది. ఇఁకఁ దల్లి పనియే. జ్యానాద మారంభించినది. ప్రణవ జపసమయ ధ్వని నీ వాగ్యంత్రము నుండి వెడలినను—ఇది తెలిసికో—"ధ్వని నీదికాదు సుమా. మహాశక్తి చేయు ప్రణవాకర్షణనాదము. కనుక, ఆ ధ్వనివంక నవధానముంచినచో భూమి మొదలు నభముదాఁక (మూలాధారాది సహస్రారాంతము) మాఱుమ్రోగుట కన్గొనఁగలవు." దశదిక్కులు నాదమయము లగును. నాదము తక్క నెక్కడను నేమియు లేదు. నారాయణి నాదరూప. జగమంతయు నశ్రాంత నాదమయముగాఁ దలంపుము. జన్మము, మరణము, నానా యోని భ్రమణము, సుఖము, దుఃఖము, సంకల్పము, వికల్పము సర్వము నయ్యశ్రాంత ధ్వనితరంగములే.

అసురదళ మెంత లెక్కలేనిదే కానీ, ఎంత సన్నద్ధము కానీ, ఒక్కసారి యీ స్వాభావికనాదము లేవఁగానే భయ మింతయు నుండదు. ఆ నాదప్రవాహముచే సర్వభావములుఁ గొట్టుకొని పోవును.

అపుడు సాధకజీవుఁ డేమి చేయునో తెలియునా ?

జీవుఁడు (దేవీవాహన సింహము) యథాశక్తి పురుష కారము చేయ సిద్ధపడును. ఇదె తన (జీవుని) సర్వశేష ప్రయత్నమని తెలిసికొన్నపైని ద్వైతభావ ప్రతికూలతలు సంపన్నము చేయ సిద్ధపడెను. వాహనసింహముయొక్క యీ పురుషకారము, ఈ యుత్సాహమే సింహమహానాద కథ. అంబా చరణములయం దాత్మార్పణము చేయఁగలవాఁడు, మఱెట్టి ప్రయత్నమును జేయు నక్కఱలేదు. కాని నిజముగా నాదసమర్పణ యోగసిద్ధులైనవార లెన్నఁడును దామసిక జడతకు వశులు కారు. సాధకా! పురుషుఁడును అమ్మయే. అతని (కృతి) కారము – పురుషకారము. మాతాపుత్త్రుల సం బంధము లేని యొక యద్వితీయ నిరంజనక్షేత్రమును జేరి నపుడు, పురుషకార మనుట కేమియు నుండదు. ఇంద్రియములు, మనస్సు బుద్ధియు లేని యచ్చోట మఱి పురుషకార మెట్లుం డును? ఇందుచేతనే సాధనప్రథమావస్థయందే పురుషకారము యొక్క యావశ్యకత, అశేషప్రయత్నముహూర్తము వఱకు దానిని బట్టుకొనియుండుటే యగును. సర్వభావ విలయక్షణ మందే పురుషప్రయత్నము సమాప్తమై, కేవల పురుషస్వరూ పమునందే నిల్చును. పతంజలి దీనిని "ద్రష్టుస్స్వరూపావస్థాన" మనెను; గీతలందు భగవానుఁడు 'స్వరూపావస్థితి' యనెను. దీనినే భక్తిశాస్త్రము 'ప్రేమపరవశతాస్థితి' యనెను.

మనము సింహనాదమును బ్రస్తావించుచున్నాము. అసు రుల యత్యాచారములు మొదలగునపుడు, సాధకుఁడు జయ

గురూ! జయ మాతా! యనుచునో, మఱేదో తన యభీష్టశబ్ద ప్రయోగముతోనో సింహనాదము చేయును. అదియు సాధన రాజ్యమం దుపకారకమే. సాధకుని యా సింహనాదమే యంబికా ఘంటానాదముచే నుపబృంహితమైనదని వర్ణితము. అనాహత ఘంటాధ్వని సాధకుని కంఠయంత్రమునుండి వెడలెడి ధ్వనితోఁ జేరి మఱింత తుములముగఁ జేసివేయును.

## జ్యానాద ఘంటానాద సింహనాదములను దిరస్కరించు మఱియొక నాదము కలదు.

అదే కాళీధ్వని. ప్రలయకాలీన భీషణహుంకారము. సర్వధ్వనులను గప్పివేసినది. అవును సర్వధ్వనులును బ్రలయహుంకారమునందుఁ జేరిపోవును. అసురనాథుని సేన యెంత భీషణమో, అమ్మ విజయధ్వనియు నంత ప్రచండమే. కేవల సూక్ష్మముకాదు. ఇట్టి స్థూలనాదమునకును విశేషప్రయోజనము కలదు. ద్వైతభావమువలనఁ గల్గిన ప్రతికూలావేదనము సాధకుని దుర్బలునిగాను, హతాశునిఁగాను జేసివేయునపుడు, సర్వవిధముల నాదము నాశ్రయించును. మానసప్రణవధ్వని, అనాహతధ్వని, స్థూలముగానగు "జయమాతా! జయగురూ!" మున్నగు ధ్వని, సర్వభావ విలయస్వరూప మహాశక్తిహుంకారము అనునవన్నియు నొక్కసారి కలిసిపోయినవి. సాధకుని సర్వశ్రమము దౌర్బల్యము క్షణములోఁ దొలఁగిపోయినవి. అపుడు సాధకుఁడు క్రొత్తబలముతో సాధన యుద్ధమునకు దిగెను.

సాధకా! వినుము. మెల్లమెల్లఁగా సర్వభావాతీతము త్రిగుణరహితమునైన యా నిరంజన సత్త్వవైపు ముందంజ వేయు నపుడు, పలువిధముల లౌకికసంస్కారములు వచ్చి సాధకుని గతి నడ్డగించును. అద్వయమును నిరవచ్ఛిన్నమునైన యానంద రసము నేవిధముగాను గ్రోలనీయవు. అడుగడుగున సాధకగతి నడ్డుచుండును. అనేకజన్మసంచితములై ప్రబలములైన ద్వైత వాసనలు బలు వడివచ్చి యద్వయక్షేత్రమును జేరి యంతరాయ ములుగ నిల్చినవి. ఇదే దైత్యసేనలు నలువంకల నంబికను జుట్టుముట్టు రహస్యము.

## ఇపుడే గురుఁడు బహుకష్టగ్రాహ్య రహస్యముల నెదుటఁ బెట్టును.

అడుగడుగునకు శిష్యుఁడు తెలివిమెట్టు లెక్కుచుండును. శ్రీగురుని యుత్సాహకరవాక్కులే శిష్యుని ప్రగతికూఁతలు. కథను కొంత స్మరింపుము. అసురసేనలు దేవిని నలుదెసల ముట్టడించెను. అపుడు సమస్తదేవశక్తులు జేరి బాసటగా వచ్చెను. రెండవమూటలో (మహిషాసురవధమందు) దేవగణ ములు తమతమశక్తుల నర్పించి మహాశక్తిని విశేషించి ప్రబో ధించినవి. అది మీరు చదివినదే. ఆ శక్తులు మహామాయా శక్తులే యని తెలిసికొనుము. కనుకనే కొలఁది శ్రమతోనే మహిషుఁడు నిహతుఁడయ్యెను (రజోగుణము నశించెను). ఇపు డీ శుంభాసుర బలము (అస్మితాబలము) అంతకంటెను వీర్యవం తము, దుర్జయము.

ఇచట నొక సాధనరహస్యము సావధానముగా వినుఁడు.

మొదటఁ దమతమ శక్తుల నొక్కొక్కటిగా మహాశక్తి నుద్దేశించి యర్పించిరి. అనఁగా — కేవల మహాశక్తియొక్క విభిన్నప్రవాహమే మన దర్శన శ్రవణ గ్రహణ మననాది విభిన్న శక్తిరూపమున వెలయును. పిదప నమ్మహాశక్తి యొక్కటే యీ విశ్వాకారమున వెలయుచున్నదని యెఱుఁగుదుము. అనుభవింతుము. నిత్యానుభవమందు విభిన్నశక్తులు, మహాశక్తి యొక్క విభిన్నవిలాసములే యని తెలియక సర్వశక్తిప్రవాహము నొక్క యభిన్నచైతన్యముగాఁ దెలియుటెట్లు?

సాధకుఁడు తన విశిష్టశక్తులను జేర్పఁగలుగునపుడే, శక్తుల క్షుద్రతావిశిష్టతలు తొలఁగిపోవును. ఆ యవస్థలో జీవుఁడీశ్వరభావము ననుభవించును. మఱియు మహాశక్తియందు సమర్పింపఁబడిన విశిష్టశక్తులను బలపఱచి మఱలఁ దెచ్చికొని, యచ్ఛేద్య జీవత్వపాశమును ఛేదించును. మహాశక్తియం దర్పింపఁబడక మున్ను విశిష్టశక్తులు హీనబలములుగా నుండును గాని, యొక్కసారి యీశ్వరశక్తి సంస్పర్శము కలిగినంత, నవి యమితవీర్యవంతము లగును. అతివీర్యబలాన్వితములై యవి యసురనిధనమందుఁ జండికకుఁ దోడ్పడఁగలవు. శ్రుతియు — "పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే" పరమాత్మశక్తి 'పరా' అనఁగా మహాతియు విచిత్రమును విభిన్నమునైనది. మహాశక్తినుండియే వివిధశక్తుల వికాసమగుసని తెలియఁగల్గిననే చండికాశరీరము నుండి దేవశక్తుల నిర్గమరహస్యముఁ దెలియఁగలరు. దర్శన శ్రవణ గమన గ్రహణాద్యనేక శక్తులతోఁగూడిన యేకాధార

మునే 'మనుష్యుఁడు' అన్నట్లే, మన మనుభవించు వ్యష్టి సమష్టి శక్తుల ప్రకాశములన్నియు నొక్క పరాశక్తి (పరమాత్మశక్తి) యొక్క ప్రకాశముతక్క మతేమియుం గాదు.

"బ్రహ్మేశ గుహ విష్ణూనాం తథేంద్రస్య చ శక్తయః,
శరీరేభ్యో వినిష్క్రమ్య తద్రూపై శ్చండికాం యయుః॥"

బ్రహ్మ శివ కుమార విష్ణు శక్రుల యతివీర్యవంతము లైన శక్తులు, ఆ బ్రహ్మాదుల శరీరములనుండి వెడలి వచ్చి యంబికాదేవి సన్నిధిని జేరెను. అది సురవిరోధి వినాశనమునకు, సురసంఘమంగళమునకు నైయెనది. పై వివరణము దీనిదే.

దీని వ్యాఖ్య ముందు విశేషించి కందురు. ఇచట — "శరీరేభ్యో వినిష్క్రమ్య" అనుదాని యాలోచన మావశ్యకము. సాధారణముగా బ్రహ్మాదిదేవతల శరీరములనుండియే బ్రహ్మాణి మున్నగు శక్తు లావిర్భవించెనని తలఁపఁబడును. "శరీరేభ్యః" అను బహువచనమును జూచి, యీ యర్థమే సంగతముగాఁ దోఁచును. కాని బ్రహ్మాణ్యాదిశక్తులు దేవీశరీరమందే విలీనము లగుట చూతురు. ఏ కారణమువల్ల నే కార్యము పుట్టునో, యది యా కారణమందే మఱల లయించుట నిర్వివాద సిద్ధాంతము. ఇఁకఁ బక్షాంతరమున బ్రహ్మాదిదేవతల శరీరముల నుండియే వాని నిష్పన్నత నంగీకరించినను హానిలేదు. ఏమన, బ్రహ్మాది దేవతాశరీరములు వాస్తవముగా నంబికాశరీరము కంటె నేవిషయమందును వేఱుకావు. సరే; అంబికాశరీరము నుండియే బ్రహ్మాణ్యాదిశక్తుల నిర్గమమని తలంతము. అమ్మ

శరీర మొక్కటేయైనను దాని యసీమత్వమును లక్షించియే 'శరీరములనుండి' యని బహువచన ప్రయోగమైనది.

ప్రియతమ సాధకుఁడా! మును జెప్పినది యాకలింతకు వచ్చినదా? అమ్మయం దర్పింపఁబడిన యవే, మాతృశక్తిచే శక్తిమంతములై మఱల నర్పించినవారి కడకే వచ్చును. చూడుము; అసురనిర్జితులైన దేవతలు తమతమ క్షీణశక్తులను మాతృచరణములం దర్పించిరి. మఱల నేఁడా శక్తులే వీర్య బలాన్వితములై మేనుదాల్చిన దేవశక్తులుగా నంబికాశరీరము నుండి వెల్వడి యసురనిధనమునకై వచ్చినవి. ఈ విధముగా నీవును నిష్కపటచిత్తముతోఁ గొన్నిఁటిని మాతృచరణముల యం దర్పింపుము. అవి యెంత మలినములు, క్షుద్రములే కానిమ్ము. అర్పణము సరిగా నున్నచో నవి యెంత యుజ్జ్వల ములు, నెంత గొప్పవి, యెంత పవిత్రములునై నీకడకే వచ్చునో చూడుము.

## దేవశక్తివిషయము లింకను బరిష్కారభావముతో నాలోచింతము.

ఏ దేవత కెట్టి యాకారమో (ఎట్టి విశిష్టచైతన్యమో) ఎట్టి విశిష్టతాధిష్ఠానమో, యట్టి విశిష్టతతోనే యా దేవతల శక్తులు సమరక్షేత్రమునకు దిగును. భూషణ మనఁగా విభూతి (ఐశ్వర్యము). ఆ దేవతల కా విభూతియే భూషణము. వాహన మనఁగా శక్తిపరిచాలకాశ్రయము. తొలుమూట, మలుమూట లందుఁ గ్రమముగా వాహన భూషణ తత్త్వములు విస్తరించి చెప్పఁబడినవి.

ప్రత్యేక దేవతకు నేదోయొక విశిష్టత యున్నది. ఆ విశిష్ట తయే శక్తికార్యము. శక్తి యనునది, కారణస్వరూపమైన యదృశ్యవస్తువు. అది కార్యరూపముగా వెలయునపుడే, దాని యునికి యూహింపఁబడును. శక్తి యెన్నఁడును నింద్రియ గ్రాహ్యము కాదు. అగ్నికి దాహికశక్తి యున్నదనుకో, అది వేడిమి వెలుఁగు మున్నగు కార్యములవల్లనే తెలియఁబడును. మఱెట్లును దాహికశక్తిస్వరూప మింద్రియగ్రాహ్యము కాదు. ఈ శక్తితత్త్వవిషయకజ్ఞానమే జీవుని చరమజ్ఞానము. జగత్తు, దేహము, మనస్సు, బుద్ధి, యింద్రియములు ననెడి పేళ్లతోఁ గొన్ని కానవచ్చుచున్నవి. అనుభవింపఁబడుచున్నవి. అవ న్నియు నొక్క పరాశక్తియొక్క విభిన్నవికాసములే యని తెలియఁగల్గినపుడే జీవుఁడు ధన్యుఁడగును. జీవుఁడు సాధారణ ముగా శక్తికార్యమును గనుచున్నాఁడు; కాని శక్తియొక్క యథార్థస్వరూపము నెఱుంగఁగోరఁడు. కనుకనే శక్తిసాక్షాత్కా రము నొందలేకున్నాఁడు. మఱియొక సత్యము — శక్తిపట్టే లేకయున్నచో దేనికిని సామర్థ్యములేదు. ఏ కౌశలముతోనో, యుక్తితోనో దానిని బట్టుకొనఁగలము; కనుకనే మనయమ్మ తెఱుచుగా సర్వరూపములతో సర్వత్ర వెలయుచున్నను దాను నిత్య, అదృశ్య, అగ్రాహ్య, అలభ్య, అవాఙ్మానసగోచరయునై యున్నదనుచుందుము.

శక్తితత్త్వవిషయమున మఱొక్కమాట, ముఖ్యము.

బ్రహ్మనిరూపణ సూత్రమందు, "జన్మాద్యస్య యతః" యనియే పరమాత్మకు శక్తిస్వరూపము స్వీకరింపఁబడినది. "దేని

వల్ల నీ జగత్తుయొక్క యుత్పత్తి స్థితి లయము లగుచున్నవో యదే బ్రహ్మము.” అను నీ వాక్యముచేత నే బ్రహ్మమునకు శక్తిస్వరూపత్వము ప్రమాణితమైనది. కనుక నిర్గుణత్వభంగ భయముచే బ్రహ్మమునకు శక్తిస్వరూపత్వము నంగీకరింపని వారికిని మనకును బొత్తు కుదురదు. మన మెఱుఁగినంతవఱకు, శక్తిస్వరూపిణి అమ్మ (ఆత్మ) మన హృదయమున వెలయు నంతవఱకు, దానిని గూర్చి చక్కఁగాఁ జెప్పఁబడినది. “ఏక మేవా ద్వితీయమ్’’ వస్తువు చితిశక్తిగాక మతేమియుంగాదు. మఱి జగద్రూపకార్య మెప్పుడుండదో, సజాతీయ విజాతీయ స్వగత భేద ముండదో, కేవల విశుద్ధబోధస్వరూపమే ప్రకాశించునో, యపుడది శక్తిమయమని కాని, శక్తిహీనమని కాని చెప్పఁబడదు. మఱియుఁ బరమాత్మయందు శక్తిమయ స్వరూపము ప్రత్యక్షమగునంతదాఁక, దానియందు జీవత్వము, ఈశ్వరత్వము ననెడి రెండు విధముల మహత్త్వము కనఁబడు చునేయుండును. జీవభావమందు సజాతీయ విజాతీయ స్వగతము లనెడి ముత్తెఱఁగుల భేదము కానఁబడుచునే యుండును. ఈశ్వరత్వమందు సజాతీయ విజాతీయ భేదములుండక, కేవల స్వగత భేదమే తెలియఁబడుచుండును. జీవుఁడు సాధనము వలనను, జ్ఞానశక్తి ననుశీలించుటవలనను నియ్యాశ్వరత్వము నొందఁగలఁడు. అందుచే దాని ముందటిస్వరూపము సర్వ విధముల సాధనాసాధ్యముల కతీతమైనది గాన దాని విష యమున శాస్త్రములును మహాపురుషులును మూకత్వము నొందిరి. కాని, యిది మాత్రము నిశ్చయము—జీవుఁడు సాధన ఫలముగానో, అమ్మ కృపచేతనో యీ యీశ్వరుని శక్తిమయ

స్వరూపమున కుపనీతుఁ డగునపుడే నిరంజన స్వరూపమం దుద్భాసితుఁడగును. ఈశ్వరత్వము నించుకంతయు నాస్వాదింపకయే, కొందఱు నిరంజనస్వరూపవిషయమున నేదో పల్కుచుందురు. కేవల మహావాక్యార్థ విచారమును జేసి "అహం బ్రహ్మ" యనుచు బ్రహ్మత్వమును బలుచఁబెట్టుదురు. వారు యథార్థతత్త్వమున కింకను గడు దవుల నున్నారనుకొనవలసినదే. అచట — ఆ నిరంజనక్షేత్రమం దుపస్థితులైన పిదప దానిని శక్తిమయమన్నను క్షతి లేదు. ఉభయాభావరూపమన్నను హాని లేదు. ఉభయరూప మన్నను జెఱుపు లేదు. సర్వము నదే. అది యేదిగాను లేదు. సర్వము నంటనిది. అది యెంత మధుమయము! ఎంత యానందమయము! దానిని మాటలతోఁ దెల్పుటెట్లు?

సగుణ నిర్గుణావస్థల రెంటను బరమాత్మకు శక్తిస్వరూపము నెన్నునపుడే సాధనమార్గము సుగమమగును. మఱియు నీ రెండవస్థలకు నాధారభూతమైన యేదే నొక యజ్ఞేయసత్తను స్వీకరించినను మన కెట్టి యాపత్తియు లేదు. ఒక్కమాట మఱువకుఁడు — శక్తి కాశ్రయమైన దేదో యది శక్తిస్వరూపముకంటె భిన్నము కాఁజాలదు. ప్రత్యక్షానుభూతమగుదాని గూర్చిన విచారతర్కముల యక్కఱ లేదు గాన నిఁకఁ జాలింతము.

## యుద్ధక్షేత్రమున నిల్చిన దేవతాశక్తుల వివరణము.

1. బ్రహ్మాణి:— సృష్టిశక్తి. అఖండ చైతన్య సముద్రమందలి సృష్టిక్రియగా వెలయు నా చైతన్యాంశమే బ్రహ్మ

యను పేరఁ బరఁగును. అనఁగా ఆత్మయే సృష్టిక్రియ నభిమానించు చోట బ్రహ్మ యనఁబడును. ఆ చేతనాధిష్ఠానముతో వెలయు క్రియాశక్తి పేరే బ్రహ్మాణి. కనుక సాధనాదృష్టిచే బ్రహ్మ బ్రహ్మాణులయందు భేదము తోఁపదు. శక్తివస్తువు చైతన్యమునాశ్రయింపక సత్తామయమైనచో భేదముతోఁచును. మఱి యిటు లనుభవమును నగును. శక్తియొక్క సర్వావయవములును సత్తయే (చైతన్యమే) యైనపుడు, ఆ శక్తినే చైతన్యమన్నచో హాని లేదే. దాహికశక్తిని (కాల్చు శక్తిని) అగ్గి యన్నచో హాని యేమి? అగును. తర్కమూలక సూక్ష్మవిచారముచే దానియందును బలువిధములైన యాపత్తులు కాఁగలవు; గాని సాధకుల పక్షమున శక్తి శక్తిభావముల నభిన్నముగా నెన్నుచో హానిలేదు. రవ్వంత భేదము తోఁచినను దనంతటనే యనుభవమునకు వచ్చును. అందులకై యెట్టి శాస్త్రములను గాలింపనక్కఱ లేదు. ఆత్మ నితాంతప్రత్యక్షము సులభము నైన వస్తువు. గాన గ్రుడ్డివానివలెఁ దడవుకొన నక్కఱ లేదు.

బ్రహ్మాణిది హంసయుక్త విమానము. అక్షసూత్రకమండలువులు ధరించినది. హంస=జీవుఁడు; అక్షసూత్రము= అకారాది క్షకారాంత మాతృకావర్ణమాల. కమండలువు = సృష్టిబీజాధారము (విరాట్కర్మాశయము). సాధకా! వీని వివరణముం దెలియఁ బూనుకొనుము. నీది వ్యష్టిమనస్సయినట్టు గానే, ప్రత్యేక జీవునిది యట్టులే. ఆ వ్యష్టిమనస్సు సమష్టి మనస్సుయొక్క యంశము మాత్రమే. ఆ సమష్టిమనస్సు పేరే విరాణ్మనస్సు. అదే బ్రహ్మ. మనోధర్మము కల్పనము. ఈ విశ్వము విరాణ్మనస్సుయొక్క కల్పనము. కల్పన యొక శక్తి.

మనఃస్వరూపము. ఆ కల్పనాశక్తి పేరే బ్రహ్మాణి. ప్రతి జీవుని యందు గుములు గుములుగా సంకల్పములు కానవచ్చును. వానివల్లనే సమష్టి మనఃప్రకాశము తెలియఁబడును. గావున జీవుఁడే సృష్టిపరిచాలకుఁడు జరుపువాఁడు. జీవు నాశ్రయించియే సృష్టిశక్తి వెలయును. జీవుఁడే లేకపోయిన సృష్టిశక్తి నెఱుంగు నుపాయమే లేదు. దీనివలన సృష్టి శక్తిరూపిణి బ్రహ్మాణికి వాహనము జీవుఁడ నెడి హంసము.

జీవుని హంసమనినఁ దాత్పర్యము మఱొకటి. అతఁడు రేవగళ్లు సాధారణముగా 21600 హంసమంత్రము జపము చేయును. ఈ విషయము మున్ను విస్తరించి చెప్పఁబడినది.

అక్షసూత్రము — వర్ణమాల. కల్పము శబ్దముకంటె వేఱే మియుం గాదు. ఈ విశ్వము కొన్ని విశిష్టశబ్దములచేతనే యైనది. వర్ణసముదాయము శబ్దము. వర్ణములసంఖ్య యేఁబది. ఆ యేఁబదివర్ణముల మాలయే బ్రహ్మాణిచేతి యక్షసూత్రము. కాలీ ముండమాలనుగూర్చి చెప్పునపుడు వర్ణమాలావిషయము చెప్పఁబడినది. భావోత్పాదనమందు సమర్థము కాకుంటచే నది శవముండమాల.

కమండలువు — పూర్వాపూర్వ కల్పముల సృష్టిబీజముల ననుసరించియే క్రొత్తసృష్టి ప్రారంభమగును. ఈ సృష్టి బీజాధారమునే బ్రహ్మాణి చేతికమండలు వందురు.

2. మాహేశ్వరి — మహేశ్వరశక్తి. వాహనము వృషభము. ఆయుధము త్రిశూలము. కంకణములు సర్పములు. తలపూవు చంద్రకళ.

మాహేశ్వరి లయశక్తి. అఖండ చైతన్యసముద్రమునఁ బ్రలయభావమున వెలసిన యా చైతన్యాంశమే మహేశ్వరుఁడు. ఆత్మ ప్రలయక్రియ నభిమానించునపుడు, అదె మహేశ్వరుఁ డనఁబడును. ఆ చేతనాధిష్ఠానమునుండి వెలయు ప్రలయరూప క్రియాశక్తిపేరే మాహేశ్వరి. ఆమె వృషము నెక్కినది. వృష శబ్దార్థము ధర్మము. ధర్మము నాశ్రయించియే జ్ఞానశక్తి పరిచాలిత యగును. శాస్త్రీయ విధినిషేధములను నడుపుట యనెడి ధర్మమును యథారీతి సంగ్రహింపకున్నచో జ్ఞానశక్తి వికసింపదు. తొలుమాటయందో, నా "దేవపూజా రహస్య" గ్రంథమందో వాహనతత్త్వమును జూచునది.

త్రిశూలము—త్రిపుటి జ్ఞానము. రెండవ మాటయందు దీని వివరణమును జూచునది.

మహాహి వలయము — మహాసర్పము కుండలిని. ఇది స్వయంభూలింగమును వలయాకారముగాఁ జుట్టియున్నది. ఇదియు మును జెప్పఁబడినదే.

చంద్రరేఖా విభూషణ— రేఖా=కళ; చంద్రుని కళలు పదునాఱు. అందుఁ బదునైదు తిథిరూపమున వెలయును. (పంచదశ నిత్యలు.) మిగిలిన పదునాఱవది మహానిత్య. దాని పేరే ప్రమా. ఈ ప్రమయనెడి మహానిత్యాకళ జ్ఞానశక్తిరూపిణి యైన మాహేశ్వరి లలాటమున నొకచోట వెలయుచున్నది. ప్రమాశబ్దార్థమువఁ బ్రాచీనులు, "అఘటనఘటన పటీయసి మాయ"యని వ్యాఖ్యానించిరి. "మాతృత్వం యాతీతి మాయా" పంచదశనిత్యాకళలను దననుండి విడుచునదిగాన (మాతృత్వము

నొందినదిగాన) మాయ. ఇమ్మహా విసర్గమును (విడుపును) జేయునది కనుక నే, ఆ పదునాఱనచంద్రకళను "మహావైసర్గికీ" యనిరి. ఈ ప్రమా - మాయా యనునదే జ్ఞానశక్తియొక్క విశిష్టవికాసము. మహాజ్ఞానశక్తి నాశ్రయించియే మాయాలీల జరుగుచున్నది. అదియు ననుకనిధనము నుద్దేశించి మాహేశ్వరీ మూర్తితో "చండికకుఁ దోడ్పడవచ్చినది.

3. కౌమారి — అసురులను జంపు కుమారస్వామి శక్తి. "కుత్సితాన్ మారయతీతి కుమారః, తచ్ఛక్తిః కౌమారీ" ఇది దేవసేనను నడిపినది. దేవాసుర శక్తుల రహస్యము మలు మూటయందు విశేషించి వివరింపఁబడినది. ఆసురికశక్తుల నడంచుటకై, దేవశక్తులను నడిపించునదే అసురవిజయినీశక్తి. అదే కౌమారీశక్తి. దాని కధిష్ఠానమైన చైతన్యశక్తి కుమారుఁడు, కార్తికేయుఁడు, గుహుఁడు మున్నగు పేళ్లతో నొప్పును. అతని వాహనము మయూరము. అది సర్పములను దిను పక్షి. సర్పము కుటిలగతి. సాధారణముగా నింద్రియవృత్తులు కుటిల గతితో విషయములవంక కేగును. ఎవుడేని సాధకుఁడు దానిని జంపఁగల బలముగలవాఁడగునేని వాఁడు మయూరధర్మము గల వాఁడు. ఇట్టి మయూరధర్మిజీవుఁడే కౌమారీశక్తికి వాహనము. ఆసురభావముల నడఁచుటకై దేవభావములను నడుపు నాత్మ యొక్క యంశముపేరే కుమారుఁడు. ఆ యధిష్ఠాన చైతన్యము నాశ్రయించి దేవభావములను నడుపుశక్తియే కౌమారి.

4. వైష్ణవి — స్థితిశక్తి నభిమానించు చైతన్యసత్తయే విష్ణుఁడు. అతనిది పాలనశక్తి. శంఖ చక్ర గదా శార్ఙ్గము లనెడి

యాయుధవర్ణనము మున్నే చేయఁబడినది. శార్ఙ్గము ధనుస్సు. అదే ప్రణవము. ఖడ్గ శబ్దార్థము ద్వైతప్రతీతిని నశింపఁజేయు నద్వయజ్ఞానము. విష్ణుశబ్దము వ్యాపకత్వమును దెల్పును. గరుడ శబ్దార్థము వాహనతత్త్వమందు మున్నే వివరింపఁబడినది. వేద సమూహమే గరుడుఁడు. ఇది స్వకపోలకల్పితవ్యాఖ్య కాదు. వ్యాసదేవుఁడే శ్రీమద్భాగవతమందుఁ జెప్పెను. ఈశ్వరుఁ డన్నం తనే యొక విశిష్టమూర్తిగా భావించువాఁడును, భగవంతుని కాళియ దమనము, రాసక్రీడ, వస్త్రహరణము మొదలగు నలౌకికక్రీడలను విని, శ్రీకృష్ణుఁడొక విశిష్టమూర్తియని యెన్ను వాఁడును, శ్రీమద్భాగవతమును బరుగునఁ జదువుటఁజూచి, వ్యాసదేవుఁడే "ఇతిహాస పురాణాభ్యాం పరమార్థః ప్రకాశ్యతే" యని స్పష్టముగా ననెను. లౌకికలీలల నెపమున అభూతపూర్వ ములైన యాధ్యాత్మిక రహస్యములను బయల్పెట్టుటకే భగ వంతునికి విశిష్టమూర్తిని గైకొను పనిపడినది. అమూర్త స్వరూపరహస్యము తలకెక్కదు. కనుకనే విభిన్నమూర్తులను ధరించు మూలవస్తువు రహస్యము నెఱుంగుట తప్పదు. ఇక్కాల మందు వెలసిన ధర్మగ్లాని లక్షణమునకు ముఖ్యకారణము మూర్తామూర్త విషయకజ్ఞానము లేకపోవుటే. విజ్ఞానమయ గురుఁడును, సనాతన ధర్మప్రతిష్ఠాతయునైన భగవంతుఁడు తానే యీ యజ్ఞానము నెడపుటకై యీ ధర్మగ్లానిహేతువును దేశమునుండి తొలఁగించుఁగాక.

**5.** వారాహి — ఇదియు విష్ణుశక్తులలో నొకటిగాఁ బురాణములందు వర్ణింపఁబడినది. విష్ణుఁడు **తానే** వరాహ

రూపముఁ దాల్చి ప్రలయమునొందనున్న వసుంధరను గోఱతో నెత్తినపు డతనికి వరాహభగవంతుఁడని పేరయ్యెను.

వరాహ పదమున కాధ్యాత్మికార్థము కల్పపరిమిత కాలము. వర = శ్రేష్ఠము (ఆత్మ); దాని ఆహాననము చేయునది, అనఁగా ఆవృతము చేయునది — కప్పునది వరాహము; కాలసత్తయే యన్నిఁటికంటె ముందు ఆత్మ నావరించునది అనఁగా నాత్మయం దన్నిఁటికంటె ముందు, కాలసత్తయే పరికల్పిత మగును. ఇపు డీ భూమిపైని వరాహకల్పమనెడి కాల ప్రవాహము నడుచుచున్నది. పదునాలుగు మన్వంతరము లొక కల్పము. ఇపుడు శ్వేతవరాహకల్పమునం దాఱు మహాయుగములు కడచినవి. సప్తమ (వైవస్వత) మన్వంతరీయ సత్తయిక్కలియుగమున నడుచుచున్నది. ఈ వరాహకల్పమున బహుకాలము కడచుటకు మున్న మన వాసభూమియైన యీ వసుంధర సృష్టింపఁబడినది. సృష్టికి మున్నది ప్రలయజలమందు మునిఁగిపోయినది. కనుకనే మన పురాణకారులు విష్ణువరాహమూర్తివలన వసుంధర యుద్ధరింపఁబడినదని వర్ణించిరి. అతి దీర్ఘకాలరూపమైన వరాహకల్పమందలి యేకదేశమం దీ వసుంధర యుండును గావున వరాహదన్తముపైని — అనఁగా సువిశాలావయవముయొక్క యేకదేశమందు వసుంధర నిల్చినదనుట. లేదా దన్తమనఁగాఁ దేజస్సు — శక్తి; దానిపై నిల్చినదన్న యర్థమును సంగతమే. కాలీశక్తికిని వారాహీశక్తికినిఁ గల భేదమేమన — కాలి ప్రలయంకర సమష్టి మహాకాలశక్తి; వారాహి, ఒక్క కల్పమనెడి వ్యష్టికాలశక్తి. ఈ శక్తి జగదాధార స్వరూపమగుటచే దీనిని విష్ణుశక్తి యనిరి. పాలనశక్తియు

నాధారశక్తియు నొకటే; వేఱుకావు. మన యీ భూలోకము నిల్చుటకు (ధరింపఁబడుటకు) ఆధారభూతమగు విశాలకాలమే వరాహము. భూలోకమును ధరించు మహాశక్తియే వారాహి.

6. నారసింహి:— నారసింహము విష్ణుని విశిష్టశక్తులలో నొకటి. నృసింహస్వరూప జ్ఞానము (అనఁగా ఆత్మస్వరూప జ్ఞానము) ఉదయించుటచేతనే నరునకు శ్రేష్ఠత్వ మబ్బును. నృ=నరుఁడు; సింహము=శ్రేష్ఠార్థకము. నరశ్రేష్ఠుఁడు. ఈనృసింహముచేతనే హిరణ్యాకశిపుఁడు చంపఁబడెను. హిరణ్యం=ఆత్మ; ఇది శ్రుతిసిద్ధము. ("హిరణ్యం విష్ణు రాఖ్యాతం తస్య వర్ణస్తు వైష్ణవీ") హిరణ్యమనెడి నిర్వికల్ప పరమాత్మను, కశిత = నిగృహీతునిగాఁ జేయువాఁడు అనఁగా విషయాభిమాన రూపమునఁ బ్రకటితుఁడైనవాఁడే హిరణ్యాకశిపుఁడు. ఈ పేరి యసురుని, ఆత్మస్వరూపజ్ఞానమే నశింపఁజేయఁగలది, గాన నృసింహశబ్దార్థము స్వరూపజ్ఞానము. దీనిచేతనే హిరణ్యాకశిపుఁడు చచ్చును. నరుఁడు స్వస్వరూపమును దెలియనంతదాఁక నెన్నఁడును సింహము కాఁజాలఁడు. పురాణకారులు చేసిన హిరణ్యాకశిపు వధ వివరణము, అపూర్వ తత్త్వజ్ఞానపూర్ణ మనిరి. చూడుఁడు. తొలుతఁ దపస్సుచేసి, వాఁడు బ్రహ్మచే వరములనందెను. అది దేవ యక్ష నర కిన్నర రక్షో గంధర్వాదుల వేనివలనను జావులేకుండుట. తత్త్వముచే నెట్టి విశిష్టజ్ఞాన ముండునంతవఱకును హిరణ్యాకశిపుఁడు చావఁడు. నిర్వికల్పజ్ఞానము తక్క నింకేదియు సవికల్పజ్ఞానమనెడి యసురుని లయమొనర్పఁ జాలదు. హిరణ్యాకశిపుని కొడుకు ప్రహ్లాదుఁడు. అనఁగా నానందమయు బ్రహ్మజ్ఞానము. అది యెంతెంతగా వికసించుచుండునో అంతం

తగా దాని నశింపఁజేయు ననేకోపాయములు చేయును. క్రమముగా స్థలము, జలము, అగ్ని, వాయువు, ఆకాశము మున్నగు నన్నిటియందుఁ బ్రహ్లాదునకు, హరి దర్శనమనెడి సత్యజ్ఞాన ప్రభావముచే నృసింహమూర్తి యావిర్భవించును. అనఁగా - ఆత్మస్వరూప విషయక యథార్థజ్ఞానము పొడుచుకొనివచ్చును. అపుడు భేదజ్ఞానమనెడి హిరణ్యకశిపుఁడు చచ్చును.

సాధకా! నీవును నృసింహమూర్తి దర్శనము చేయఁగలవు.

నీలోనే బాలభక్త ప్రహ్లాదానందమయ బ్రహ్మసత్తా స్వరూపము నానాఁటికిఁ బెంపొందునపుడు, దాని నణఁచి వేయుటకు, నీ విషయాసక్త మనస్సనెడి హిరణ్యకశిపుఁడు ఎన్ని ప్రయత్నములో చేయును. నిర్యాతన లెన్నో యోర్చి కొని, నీ యానందమయ శిశు సత్యజ్ఞానము, సర్వత్ర సర్వదా సత్యదర్శనము చేయు నలవాటును దృఢపఱచి పెంపొందనిమ్ము. అదే యొకనాఁడు నీ జడత్వజ్ఞానమనెడి స్ఫటిక స్తంభమును (ఉక్కుకంబమే యనుము) వ్రక్కలించి విశుద్ధజ్ఞానస్వరూపమున వెలయును. నీ వా నృసింహమూర్తిని దర్శించి మైమఱతువు.

నృసింహ శక్తియే నారసింహి; బ్రహ్మవిద్యయే నారసింహి.

బ్రహ్మవిద్యా ప్రభావముచేతనే జీవుఁడు నరసింహుఁడగును. అనఁగా, ఆత్మస్వరూపమందుఁ బ్రతిష్ఠితుఁడగును. వీని యావిర్భావముచే విశిష్టజ్ఞానమనెడి యసురుఁడు నశించునని తెలుపుటకే మంత్రమందు "సటాక్షేప విక్షిప్త నక్షత్ర సంహతిః" యనువాక్యము. సటాక్షేపశక్తి తాత్పర్యము - స్వకీయ శక్తి

ప్రభావము. విశిష్టాత్మజ్ఞానమును నక్షత్రములనుటయం దుద్దేశ మున్నది. మనము ప్రతినియతముగా విషయగ్రహణము చేయు చున్నాము. అనేక విషయ (జ్ఞానము) ములందు విచరింతుము. వానియందు బహునీరసముగా (అల్పముగా) ఆత్మప్రకాశ మగు చుండును. ఆత్మప్రకాశమే లేకున్నచో నెట్టివిశిష్టజ్ఞానము నుండఁ జాలదు. నారసింహి (బ్రహ్మవిద్యాశక్తి) సమరక్షేత్రమం దవత రించి, సత్యజ్ఞానముయొక్క యా విశిష్టతను దొలఁగించినది. సాధకుఁడా! నీవు నిజముగా మాతృచరణములయం దాత్మా ర్పణము చేయుదువేని, నీ హృదయాకాశ మనెడి రణభూమి యందు నీవే స్వేచ్ఛతోఁ గల్పించుకొన్న సర్వవిశిష్టజ్ఞానము లను నెట్టివేసి, యా విద్యాశక్తి మెల్లమెల్లఁగా నేవిధముగా విశుద్ధజ్ఞానోదయము చేయునో తెలియఁగలవు.

7. ఇంద్రాణి:— ఈ శక్తిది యింద్రుని రూపమే. ఆయుధము వజ్రమే. కన్నులు వేయి. వాహనము గజరాజు.

ఇంద్రుఁడు దేవాధిపతి. వానిశక్తి యింద్రాణి. వజ్ర హస్త గజారూఢాది పదముల వ్యాఖ్య మలుమూటలోఁ గని యుందురు. "సహస్రనయనా" తాత్పర్యము.

అపుడే యింద్రుఁడు సహస్రనయనుఁ డైనాఁడు.

నయన మనఁగాఁ బ్రకాశశక్తి. ఎవని ప్రకాశభావము అనేక విశేషములతోఁగూడి పలువిధములుగా బయలుపడునో యతఁడే సహస్రలోచనుఁడు. అతని యా ప్రకాశశక్తియే యింద్రాణి. సమస్త దేవాధిపత్య మనఁగా — దేవశక్తులుగానే తన శక్తిని బయలుపెట్టుట. గురుపత్నీ గమనరూప మహాపాప

ఫలముగా, నింద్రుని శరీరమందు సహస్రక్షతము లైనవనియు, కఠోరతపస్సు చేయఁగా క్షతములెల్ల నేత్రములుగాఁ బరిణమించిన వనియుఁ బురాణవర్ణితము. గురుఁడు పరమాత్మఁడే. తన ప్రకాశశక్తిని, ఇంద్రియాధిష్ఠిత చైతన్యవర్గమున కధిపతియైన యింద్రదేవుఁడు యథార్థముగా నాత్మగానే చేసివేసెను. అపుడది యనేక విధములుగా నయి, ఆత్మయొక్క స్వప్రకాశమును గాంచెను. అపుడే యింద్రుఁడు సహస్రనయనుఁడైనాఁడు.

సాధకా! చూడు. నీ గురుశక్తిని నీ యింద్రియములు సదా యపహరించుచునే యుండును; గాన నొక్క ప్రకాశశక్తినే పలు విషయముల వలన ననేకవిధములుగా భోగించు నీవు, ఎంతగా క్షత విక్షతుఁడ వగుదువో చూచుకో. నీవు సత్యప్రాణప్రతిష్ఠా సహాయముతో, ఆ లెక్కలేని క్షతముల వలన నొక్క ప్రకాశశక్తియొక్క యసంఖ్య భేదములను జూడ నలవాటు పడుము. నీ క్షతములన్నియు నేత్రములుగా మాఱిపోవును.

శక్తిజ్ఞానము కల్గినపుడే జీవుని ముక్తిద్వారము తెఱవఁబడును.

పైని వివరింపఁబడిన యష్టశక్తుల పేర్లు — బ్రాహ్మీ, మాహేశ్వరీ, కౌమారీ, వైష్ణవీ, వారాహీ, నారసింహీ, ఇంద్రాణీ, మును జెప్పిన చాముండా యనునవి; బ్రహ్మ మహేశ్వరాది విశిష్టచైతన్యములు శక్తికంటె వేఱేమియుం గావు. ఈ విశేషమును దెలుపుటకే యుద్ధరంగమున మును జెప్పిన యష్టశక్తుల యావిర్భావము వర్ణింపఁబడినది. సాధకుఁడు తుట్టతుద కీ శక్తితత్త్వమునకే చేరును; కనుకనే శాస్త్రము "శాక్తా

ఏవ ద్విజాః సర్వే” యన్నది. ద్విజులు వైదికదీక్షాఫలముగా రెండవజన్మ నొందినవారు. శైవ వైష్ణవ గాణాపత్యాది సంప్ర దాయముల సాధకులెల్లరు, కార్యముచే నీ శక్తితత్త్వము నుపా సించువారలే. ఈ శక్తిజ్ఞానము కలుగనంతదాఁక — శక్తిజాడనే తెలియనంతదాఁకఁ దమ్ముఁ దాము శాక్తుల మనుకొనరు. క్రమముగాఁ దెలివికన్ను విడునప్పుడు తెలిసియో తెలియకో యెల్లరును శక్తినే యుపాసించుచున్నారని కనుగొందురు. ఈ శక్తిజ్ఞానము గల్గినపుడే జీవునికి ముక్తిద్వారము తెఱవఁబడును. శక్తి — శక్తిమంతుఁడు, అనఁగా నధిష్ఠానచైతన్యము, అధిష్ఠిత శక్తి యను రెండు సంపూర్ణముగా నభిన్నవస్తువులు. అధిష్ఠిత చైతన్యము శక్తికంటె వేఱు కాదు. అది యీ చండీతత్త్వ మందుఁ ప్రవేశించుటచేతనే యప్రశమముగాఁ దెలియును. ఆత్మను శక్తిస్వరూప వస్తువుగా నెఱిఁగికొన్నచో, సాధన మార్గము బహు సుగమమగునని మున్నుసైత మంటిమి. విశేష మేమన — నిర్వికల్పబోధ స్వరూపాత్మను, ఒక్కసారిగా శక్తి స్వరూపమని తెలిసికొనుట మిగుల దురూహము; గాన మహర్షి మేధసుఁడు తొల్త ఆత్మవిభూతులను, ఆత్మస్వాధీన విలాసము లను శక్తిస్వరూపములే యని తెల్పఁగడఁగెను. ఇందులకై యిచట బ్రహ్మాణ్యాది శక్తితత్త్వముల నవతరింపఁజేసినాఁడు.

## కాళి కాలిక్రింద మహేశ్వరుఁడు శవమువలె బడియున్న రహస్యము.

సాధకా! మఱవకుు. ఒక్కసారి నీ హృదయమువంకకే నీ చూపు మఱల్పుము. నీ జ్ఞానస్వరూప మహేశ్వరుఁడు, అప్పు

కాలిక్రింద శవమువలెఁ బడియున్నాఁడు. తన చేష్టనుగూర్చి కాని, తన కృషినిగూర్చికాని స్మరింపనే లేఁడు. రాజరాజేశ్వరి కాలిక్రిందఁ ద్రొక్కిపెట్టినది. అనేక విధముల శక్తులు ఇంత దాఁక విషయానుభవ (బహుత్వ) తాండవ నృత్యవిలాసమునే జరుపుచుండినవి. ఇపుడాశక్తులు విశేషించి సంక్షుబ్ధములు కాఁ జొచ్చినవి. ఆ బహుత్వము లయింపఁజేయుటకై, ఒక యఖండ శక్తియందు విలయమొందుటకై సిద్ధపడినవి.

సాధకా ! నీవు ధన్యుఁడవు. నీ సాధనము ధన్యము, నీ మానవత్వము ధన్యము. ఇపుడు నీలోని గురుఁడు ఈశానుఁడు తానే యసుర వినాశమునకై ప్రయత్నించుచున్నాఁడు. ఇంత దాఁక నీవే యసురాత్యాచారము నివారింపఁ బ్రయత్నించితివి. ఇపుడు నీ గురుఁడు సైతము నిన్ను విముక్తుని జేయఁబూనినాఁడు. మఱి నీకు భయములేదు. నీ విఁక వేగమే యఖండ రసాస్వాదము చేయఁగలవు.

యుద్ధవినోదమును జూచుచుండిన యీశానుఁడు యసుర విశసనమునకై చండికను ద్వరపెట్టిన రహస్య మిదే.

ఈశానుఁ డేమనెను ? "మమ ప్రీత్యా — నా ప్రసన్నత కొఱకు" అనెను. అసురకులము నిహతమైనపుడే యీశాను నకుఁ బరమప్రీతి. గీతయందు "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" అనఁగా శక్తిప్రవాహమంతయు జ్ఞానమందుఁ (ఈశానునందు) జేరి సమాప్తమైపోవును. అసురకులము నిర్మూలము కాఁగానే యీశానుఁడు సర్వశక్తి సమన్వితుఁడు కాఁగా, సర్వవిధముల స్వరూప ప్రతిష్ఠితుఁడు కాఁగలఁడు కనుకనే యతని కసురనిధనమం దేకాన్తప్రీతి.

మన కోరికల సఫలతావిఫలతలు, అమ్మచేతిలోనివి.

చితిశక్తిరూపిణి, అంబికాదేవి యపరిణామిని, నిర్వికార, విశుద్ధచైతన్య స్వరూప. ఆమె స్వయముగా నేమియుం జేయదైనను, ఆమెనుండియే సర్వభావముల యుత్పత్తి స్థితి లయములగును. ఎవ్వని కోరికయేని ఫలించుటయు ఫలింపకుండుటయు నామె చేతిలోనిది. ఆమె ప్రత్యక్షముగా నేమియుం జేయకున్నను, పరోక్షమున భూతపూర్వోపాయములతో సాధకుల కోర్కెల నేదే నొక విధమున నెఱవేర్చుచునే యుండును. చూడుము. ఈశానుఁడు, అసురశక్తులను వేగమ చంపఁగోరెను. దేవి దీనికి బదులీయలేదు. కాని యంబికాశరీరమునుండి భీకర చండికాశక్తియు వందలకొలఁది నక్కలును వెలువడినవి. ఈశానుని కోర్కి చెల్లింపఁ దా నేమియుం జేయకున్నను, పరోక్షమున నాతని కోర్కి తీర్పఁ బ్రయత్నించెను. ముందుగా నేమియుఁ దెలియనీయలేదు. అమ్మ యిట్టి ఛలమయి.

సాధకా! నీవు అమ్మా! అమ్మా! యని యెంతగా నెత్తి కొట్టుకో, ఎంత కలగుండుతోఁ గుండె తడుపుకో, నీ యభావాభియోగములు, కలిమిలేములు, నమ్మకు వినిపింప గట్టిగ నఱచు చుండుము. అయినను అమ్మ నీయొక మాటనైనను వినుచున్నటులు బయల్పడదు. నీవేయి మొఱ్ఱలు, నీవేయి కలఁతలు, నిర్వికారము ధీరము స్థిరమునైన యమ్మగుండెను రవ్వంతయైనఁ గదలింప లేవు. కలంపఁజాలవు. మన యమ్మ యెంతధీరయో, యంత నిశ్చలమూర్తితో నిల్చెను. తెలిసికొన్నదో లేదో తెలియదు హఠాత్తుగా నొకనాఁడు నీ కోర్కెలు కలఁతలు తీర్చివేయును

అమ్మ ఛలనామయి; మహాభారతమందలి యొక చిన్నకథ.

అది ద్వైతవనమందుఁ బాండవ వనవాస సమయము. డెబ్బదివేలమంది శిష్యులతో దుర్వాసముని వచ్చి వారి నాతిథ్యముఁగోరెను. సూర్యునివలన లభించిన యక్షయపాకస్థాలియు వట్టిపోయెను. ద్రౌపది భోజనశేషమును ముగిసెను. ఆమె భోజనము కాకయుండునేని స్థాలియం దక్షయాన్న ముండియే యుండును. ఎంత విపత్తు! బ్రహ్మశాప ముపక్రమించినది. ఇటులు ఘోరాపదలోఁబడి వారెల్లరు, కర్ణధారుఁడైన శ్రీకృష్ణుని స్మరింపఁబూనిరి. పాండవులు వ్యాకులతంద్రలోఁ గూరిరి. ద్రౌపది యొక్కతెయే మెలఁకువతో నుండెను. హఠాత్తుగా శ్రీకృష్ణుఁడు వచ్చెను. అమ్మా! ద్రౌపదీ! పలునాళ్లయినది. ధర్మరాజును జూడలేదు. ఈ దారినిబోవుచు నతని నొకసారి చూచి మాటాడిపోవ వచ్చితిని. గాని, ఒక్కమాట – కడు నాఁకలియగుచున్నది. కొంచె మన్నము పెట్టవా?

[సాధకా! అప్పటి ద్రౌపదీమానసావస్థను నీవూహింపుము. జగత్పతి, ప్రాణపతి, పరమప్రియతముఁడు, బ్రహ్మాండాన్నప్రదాత, శ్రీకృష్ణుఁడేవచ్చి "అమ్మా! కొంచెమన్నము" అని అడిగికొనెను. ఇంట నన్నములేదు. ద్రౌపదిగుండె విడిపోవుచుండెను. కంట నీరేకాదు, నెత్తురు కాఱుచున్నది. ఆమె కేమితోఁచును? ఎవ్వరికిని నోరులేవదు. "నేఁటితోఁ బాండవకులము బ్రహ్మశాపముచే నిర్మూలము కావలసినదే." యను మాటయు విచారింప లేకుండెను. ఉన్నదంతయు నూడ్చి యిచ్చి శ్రీకృష్ణునాఁకలిఁ బాపుదమన్నను, మెతుకు మిగుల లేదు. మఱి వెరవులేదు,

గతి తోఁపక మొదలు నఱికిన చెట్టువలె శ్రీకృష్ణు నడుగులం బడి, "జగన్నాథా! అంతర్యామీ! విశ్వాన్నదాత వీవు. కడుపు చేతబట్టుకొని వచ్చి మాకెట్టి మర్మపీడఁ దెచ్చిపెట్టితివి! ఈ నా వెత నీవు గాక మఱెవ్వ రెఱుంగఁగలరు? ప్రాణేశ్వరా! నేఁడు నీవాఁకలి గొనివచ్చి యన్నమడుగుచున్నావు. ద్రౌపది యిపు డన్నహీన." ఇఁకేమి వ్రాయుట]

శ్రీకృష్ణుఁడు తొణకఁడు బెణకఁడు. గంభీరముగా అమ్మా! యాఁకలి. నీకేమున్న నదే పెట్టుము. కేవల శ్రద్ధతోఁ బెట్టుము. అపుడామె వంట తబెల నంటుకొనియున్న యొక్క మెతుకే తెచ్చి శ్రీకృష్ణుని చేతఁబెట్టెనుగాని దారుణమర్మపీడతోఁ దెలివితప్పిపడెను. "తృప్తోఽస్మి"యనుచు శ్రీకృష్ణుఁ డంతర్హితుఁ డయ్యెను. కొంతసేపటికి ద్రౌపది తెలివినొంది లేచెను. ఔరా! ఏమయ్యెనో యామె యెఱుఁగదు. శ్రీకృష్ణుఁ డట లేఁడు. తుద కేమయ్యెను? దెబ్బదివేలమంది శిష్యులతో స్నానమాడివచ్చిన దుర్వాసుఁడు పరితృప్తుఁడై పాండవుల నాశీర్వదించి పోయెను. సాధకా! భగవంతుని యీ లీలారహస్యము నింత తెలియఁ గల్గితివా? ఇపుడీ దేవీమాహాత్మ్యమందును, ఈశానుని కోరిక కెట్టిబదులు నీయకున్నను, అంబిక కార్యరూపమున నాతనికోర్కి తీర్చెను. అదియుఁ గ్రమముగాఁ గందువు.

ఫలాశ లేక కర్తవ్యజ్ఞానముతోడి కర్మాచరణమే
యథార్థ శాన్తిమార్గము.

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" ఈ యపూర్వ గీతామంత్ర సంతతానుశీలనముచే బోధవంతుఁడ వగుము.

మఱొక్కమాట :— మన మెప్పుడేపని చేసినను మన హృదయమందలి వివేకరూపి యీశానుఁడు లోలోపలనే నీరవ భాషతో (ధ్వనిలేని మాటలతో) కర్తవ్యాకర్తవ్యములను గూర్చిన యాజ్ఞలను జేయుచునేయుండును. మనలోని యాగురు నాజ్ఞను బాలించునపుడే మనకభ్యుదయము సమీపించిన దన్నమాట. అటుచేయనిచో మనచెడుగే సన్నిహితమైన దన్నమాట.

అస్మితా మమతలు (శుంభ నిశుంభులు) యీశాను నవహేళనము చేసియే నశించిరి.

ప్రభూ ! నీ యాదేశములను నీ సంజ్ఞలను బాలించుటే మా శ్రేయస్సునకైన ముఖ్యోపాయము అని తెలియునుగాని నిర్విచారముగ నీ యాజ్ఞలను దలఁదాల్చువారు లోకమందెందఱున్నారు ? గురుఁడా ! నీ వీశానుఁడవు. సర్వభూతనాయకుఁడవు. నీ వొక్కఁడవే మా యిహపరములకు గతివి. కానీ; యిమ్మాట నెట్లును మా మర్మమర్మములందును నాటించుకొనలేకున్నాము. మా యీదౌర్బల్యమును దొలఁగించువాఁడవు నీవే. నీయెడ నమ్మకముఁ గలిగించు నుపాయమును నీచేతిదే. బహుదినములనుండి, యనేక జన్మములనుండి యీదౌర్బల్యమే కారణముగా నీయెడ కెంతో యెడమై పోయినాము. ప్రభువా ! యిఁక నిది యోర్వలేము. మమ్మలను గొనిపోయి యుపదేశింపుము. దారి సూపుము. మా పనిలోనికి మేము పోదుము. నిజముగా మేము నీచులము. అశక్తులము. కనుక నీవు మాకుపదేశించు ఫలమేమి ? నీవే రమ్మ. మాచేయి పట్టుకొని తీసికొని పొమ్మ. లోనుండియే చప్పుడులేని మాటలతో నాజ్ఞలను జేయకుము. చేసితే నా యాదేశములను బ్రతిపాలించు

సామర్థ్యముగాను నీవే యావిర్భవింపవలయును. ఇదిగో, సాధకా! యీ విధముగా నీశానుని పదములకు సరళబుద్ధితో నివేదింపుము. అతని కృపచే నీహృదయమునకు బలముగలుగును. అపుడా గురుని యాదేశములను బాలింపఁ గలుగుదువు. శ్రమ లేకే యీగహనతత్త్వమందుఁజొచ్చి జన్మమరణ పరపారమును జేరిపోదువు. నీవు పలుపుట్టువులందుఁ జేసిన కఠోరసాధనము ఫలవంతమగును.

## సాధకా! నీవు గురునిఁ జూడలేదా?

గురుని మంగళమయేచ్ఛ గల్గిన నేమగునో, ఏమైనపుడు గురున కట్టి మంగళమయేచ్ఛ పొడమునో యది ముందుగా వినుము—శిష్యున కిచ్ఛయనుచు నొకటిలేక, శిష్యుని హృదయ మందలి యిచ్ఛల నన్నిఁటిని గురుని యిచ్ఛ ననువర్తించు వానినిగాఁ జేయునపుడే యసురనిధనమునకైన గురుప్రేరణము నకు మఱి తడవుండదు. నీవు గురుని జూడలేదా? అయ్యో! అతఁడే బోధరూపముగాను, జ్ఞానరూపముగాను, హితాహిత విచారరూపముగాను, సదా లోలోపలనే వెలయుచున్నాఁడు. అయినను గానరాఁడందువేని, వినుము. ఇదిగో, స్థూలముగా విశ్వమూర్తియై, సూక్ష్మముగా జ్ఞానమూర్తియై, మఱలఁ బరమ కరుణతో విశిష్టమనుష్యమూర్తియై యావిర్భవించును. విజ్ఞానమయగురుఁడే ఘనీభవించి మనుష్యాకారమునుదాల్చును. గురుఁడెన్నఁడును మనుష్యుఁడుకాఁడు సుమా. గురుఁడు నిత్య మును గురుఁడే; నిత్యము నీశానుఁడే; నిత్యము సర్వభూత మహేశ్వరుఁడే; ఎవని హృదయమున మన యమ్మ శ్రద్ధా

మూర్తితో నావిర్భంచునో, వాఁడు మాత్రమే గురు స్వరూప
మును హృదయంగమము చేసికోఁగలఁడు.

సాధకా! చూడు. నిత్యానిత్య వస్తువివేకము, విచా
రము, మున్నగు పేళ్లతో నీకు వినపచ్చునదంతయు గురుకృపా
విశేషమే సుమా. కేవల శ్రవణమువల్లను, గేవల మూఖికా
లోచనమువల్లను, నిత్యానిత్య వస్తువిషయకమైన యథార్థ
జ్ఞానము కలుగదు. నిత్యవస్తువునందు నీవు విచరింపఁగల్గినందప్ప,
ననిత్యవస్తు స్వరూపానుభవము కాదు. వస్తుస్వరూప విషయ
మున యథార్థజ్ఞానము గలుగక, దాని విషయమునఁ బట్టు
విడుపు లింతయుఁ బట్టుబడవు. నిత్యానిత్య వస్తుస్వరూప లాభ
మునకు గురుకృపయొక్కటే యుడివోని హేతువు. హృదయ
మున గురునాసనము ప్రతిష్ఠింపఁబడుటచేతనే జీవుఁడు నిజముగా
నిత్యానిత్య వస్తువిచారము చేయఁగలవాఁడగును. అదియుండనీ;

(హితోపదేశమును మూటగట్టుకొని యీశానుఁడు
శుంభునికడ కేగినాఁడని కనుగొంటిమి.) సాధకా! నీవును
నీ ప్రత్యేక కార్యమందును, నిటులే యీశానుని యావిర్భావ
మగుచున్నదో లేదో చూడుము.

## కాత్యాయనిపై నసురు లస్త్రములను గురియు రహస్యము.

అంబికయే కాత్యాయని. "కాత్యాః = బ్రహ్మజ్ఞ పురు
షులు దేనిని అయనము చేయుదురో (ఆశ్రయింతురో) యదే
కాత్యాయని" ఆమెయే మన యమ్మ.

యుద్ధక్షేత్రమందుఁ దొలుదొల్త నస్త్రప్రయోగము
చేయువారినే, ఆతతాయి పక్షమువా రందురు. పిదప నస్త్ర

ప్రయోగము చేయువారిని ఆత్మరక్షా పక్షమందురు. యుద్ధశాస్త్ర సంకేతము లివి. కురుక్షేత్ర యుద్ధమందును వొల్లొల్లఁ గౌరవపక్షమే శంఖధ్వనిచేసి యుద్ధారంభముఁ జేయుటచేతనే, దుర్యోధనపక్షము నాతతాయి పక్షమనియుఁ బాండవపక్షము నాత్మరక్ష పక్షమనియుఁ జెప్పఁబడెను. ఇచ్చటను (శుంభ యుద్ధమందు) నసురులే తొల్త నమ్మపై నస్త్రములఁ గురియఁ గడఁగిరి. వారాత్మను జంపఁగోరిరి, కనుక నే యాతతాయులు.

ఆతతాయులను ముందువెనుకలఁ జూడకయే చంపుమని యున్నది. గాన మన యమ్మ వడిగానే వారినిజంపి తన ముద్దు సంతును, అభయపదమందు నిల్పును.

## అసురాస్త్రప్రయోగ రహస్యము.

ఘృణా, లజ్జా, భయ, జాతి, కులాది సంస్కారములు అస్మితయొక్క వ్యూహములే. అవి తమతమ విశిష్టభావముల వలన, ఆత్మబోధమును విశేషింపఁజేయనే ప్రయాసపడును. ఇదే యసురులు మాత్రంగముపై నస్త్రములు వఱపుట. మును జెప్పిన ఘృణా లజ్జాది విశిష్టభావములు ఆత్మబోధతో నిటులు బిగిసిపోయినది. పునః పునర్విచారమువలన, ఆత్మ కసంగత్వ మున్నను, ఆ భావములు మాటిమాటికి నాత్మబోధమును బెంపొందించును. ఎప్పుడును అసంగుఁడైన యాత్మ నేదో విధముగా విశేషితుని జేయుటే యసురుల యస్త్రప్రయోగము.

ఇట్లు (ఉదాయుధాద్యసురులు) పాశసమూహము విశుద్ధ చితిశక్తిపైని బలుసారు లనేకభావముల నెడి యస్త్రశస్త్రములు ప్రయోగింపఁ గడగెను. అపుడు మనయమ్మ, ధ్వనించు ధనువు

నుండి తీక్ష్ణబాణములను బఱపి యసురులను నశింపఁజేసెను. ధ్వనిచేయు ధనువుపైని, ఆత్మబోధమ నెడి మహేషువును సంధించి విడుచుటే యుపనిషత్ప్రతిపాదితమైన యుపాసనా రహస్యము. ప్రణవమనెడి వింటియందు, ఆత్మబోధమనెడి యమ్మును సంధించి బ్రహ్మమనెడి లక్ష్యముపై జిమ్ముటచేతనే యాత్మ బ్రహ్మ స్వరూపమందు నిల్చును. కనుక ఘృణా లజ్జాదులైన విశిష్టభావములు కానరాకపోవును. ఆత్మ బ్రహ్మస్వరూప మగుటచేఁ దనను వేఱుగాఁజూచును; గనుక నెన్మిది పాశము లనెడి యస్త్రముల దెబ్బలను సైఁపవలసి వచ్చుచున్నది. మును జెప్పిన శరప్రయోగముచేతనే, అనఁగా, ఉపాసనారూప తీవ్ర ప్రయత్న ఫలముగానే యాత్మయొక్క నిర్విశేషస్వరూప మను భూతమగును.

సాధకా! నీవును బహుజన్మసంచితములైన యష్ట పాశములనెడి యాసురీభావములను బట్టుకొని యమ్మశరీరముపై వేయుము. అమ్మ కృపచే నీవు వేగమే పాశముక్తుఁడ వగు దువు. జీవత్వము తొలఁగి శివత్వము లభించును. నీవు సర్వ భావములను, మాతృచరణములం దర్పింతువేని, మఱి నీవు చేయవలసినదే యుండదు.

అరినిర్మూలనమును (ప్రలయంకరీశక్తి) కాలియే చేయవలయు.

ఇపుడు వినుము, దేవశక్తులచేతనైన యసురక్షయ వర్ణనము—తొలుతఁ గాలీ (చాముండా) కథ. ఆమె కొందఱను శూలపుఁ బోటులచేఁ జీల్చి, కొందఱను ఖట్వాంగముతో సలియఁగొట్టినది. కాలీశక్తి విక్రమణవేళ శూలాస్త్ర విష

యము వ్రాయఁబడలేదు. అసి పాశ ఖట్వాంగములు మూడే చెప్పఁబడినవి. అయినను, ఈ యష్టశక్తులు నీశానుని విభిన్న ప్రకాశములే యైనపుడు, ఈశానుని విశేషాస్త్ర శూలములు ప్రత్యేకములే. వీని వ్యాఖ్య మలుమూటలోఁ జూడఁదగును.

శూలమనునది సాధారణముగాఁ ద్రిశూలమే.

## ఇచటి త్రిశూలాస్త్ర రహస్యము.

త్రిశూలమే త్రిపుటీజ్ఞానము. అసురవధ విషయమునఁ ద్రిశూలాస్త్రమును బోలిన యస్త్రము మఱిలేదు. మహిషాసురుఁడు మొదలు శుంభుఁడువఱకున్నైన (రజోగుణము మొదలు అస్మితవఱకున్నైన) ప్రధానాసురులెల్లరును శూలాఘాతముచేతనే మడిసిరి. మలుమూటలోఁ ద్రిశూలమనఁగాఁ ద్రిపుటీజ్ఞాన మని తెలిసికొనిరి. మఱి యిచట దాని నానందత్రిపుటిగాఁ దెలుంగునది. ఆనందము, దాని యనుభవము, దాని ననుభవించువాఁడు ననెడి యిమ్మూటి నానందత్రిపుటి యందురు. ఆనందవస్తు వొక్కటే యీ త్రివిధస్పందనములతో వెలయును. ఈ త్రిపుటిని జక్కఁగా దెలుంగునపుడే యసురకులనిర్మూలన మగును. గానఁ ద్రిశూలమే యసురకుల నిర్మూలనమందుఁ గార్యకారి యనఁబడెను.

## జీవుని యష్టపాశ విముక్తి క్రమము.

శుంభుని యాదేశముచే యుద్ధమునకు వెడలిన యెనిమిది యసురసంప్రదాయములను మనము ఘృణాలజ్జాదులైన యష్ట పాశములనుగా నెన్నితిమి. ఇపుడా పాశములనెడి, యసుర సంప్ర

దాయములు, అంబికా శరీరమునుండి వెడలిన యష్టశక్తులచేఁ గ్రమముగా నిహతములగును.

అందు మొదటిది చాముండాశక్తి, ఉదాయుధుల నెడి - అనఁగా ఘృణానామక ప్రథమపాశమును విలయమొనర్చినది. అఖండానందసత్తాతక్క నెక్కడను నేమియు లేదు. దాని ననుభవింపఁ గల్గునపుడే జీవుని భేదజ్ఞానము పూర్తిగాఁ దొలఁగును. అపుడే ఘృణానామక సంస్కారము పూర్తిగా లోపించును. ఇటులు సాధకుఁడు ప్రథమపాశమువలన విముక్తుఁడై శివత్వము నొందు దారి నగ్రసరుఁడగును.

2. బ్రహ్మాణి కమండలు జలమును జల్లి యసురుల వీర్యమును వారి యుద్యమములను హతమొనర్చినది. సృష్టియొక్క యవ్యక్తబీజములు మఱల సృష్టికార్యమునకై యే శక్తియొక్క ప్రభావముచే నుపయోగపడునో, యదే స్రష్టజీవుల జీవనము. ఇదే బ్రహ్మాణి (బ్రహ్మశక్తి) కమండలువునందలి జలము. ఈ జలమును జీవనశక్తిని జల్లి బ్రహ్మాణి యసురులను హతవీర్యులను, హతోద్యములను జేసినది. అనఁగా ఆ పనిచే బీజములు మఱల భావోత్పాదనముచేయు శక్తి (బీజ బీజత్వము) నష్టమయ్యెను. అమ్మ యీ బ్రహ్మాణీమూర్తితో నావిర్భవించి జీవనశక్తిని దొలఁగింపనంతదాఁక, జన్మమృత్యు ప్రవాహము నిలువదు. ఇమ్మాట సాధకులు మఱవకుందురుగాక. ప్రయత్నముచే నది సంపన్నము కాఁజాలదు. పుంజీకృతమైన మన యిచ్ఛలలో నడుగున నెచ్చట నెట్టి సంస్కారములు దాగియున్నవో మన మెఱుఁగము. ఎఱుఁగఁజాలము. కాని యమ్మ తీవ్రదృష్టిచే నవియన్నియు మఱల లేచును. దాగియున్న సంస్కా

రముల నామె బయల్పెట్టి వాని జీవనశక్తిని నశింపఁజేయుటే బ్రహ్మాణీశక్తి పని.

సాధకా! లక్ష్యముంచి వినుము. సాధనామార్గమం దెంతగా ముందంజవేయుదువో, యంతగా నడుమ నడుమఁ బలువిధముల ప్రతికూల సంస్కారములు కదువడిగా నంకు రింపఁ జొచ్చును. వాని ప్రభావముచే ననేకులు సాధకులు, ఒక్కసారిగా హతాశులును భగ్నోద్యములు నగుదురు. ఇట్టి వేళ గురుసమీపమున జేరుటావశ్యకము. అపుడతఁడు "ఈఘట నముచే హతాశుఁడవు కావలదు. ఇది యసురకుల జీవనమును అమ్మ నశింపఁజేయు పూర్వకథ" అని నచ్చఁజెప్పును. బ్రహ్మాణి కమండలు జలమును జల్లుటయందలి రహస్యమును దెలియఁ గల్గినచో సాధకులు హతాశులగుదురనెడి శంకయే యుండదు. ఈ మంత్రమందు విశేషించి మఱియొక్కమాట. బ్రహ్మాణీ శక్తిచేతనే యెన్బదినాలుగు కంబువులనెడి యసురకులములు నిహతములైనవి. అమ్మ యీవిధముగా భేదజ్ఞానమూలకమైన లజ్జ "ఆత్మసంకోచము" అనెడి ద్వితీయపాశమును ఛేదించినది. మొత్తముపైని జెప్పెడిదేమనఁగా – విపర్యయజ్ఞానము లోపిం చిన పిదప సాధకుఁడెంతగా ముందంజవేయునో యంతగా భేద జ్ఞానమును దానివలనఁ గలుగు నానావిధ సంస్కారములును విలయమై పోవుచునే యుండును. ఇది యసంభవము, నస్వాభా వికము ననరాదు.

మాహేశ్వరి త్రిశూలమును, వైష్ణవి చక్రమును, కౌమారి శక్తిని బ్రయోగించి, యథాక్రమముగాఁ గోటివీర్య, ధౌమ్ర, కాలకులనెడి యసురులను జంపిరి. ఈ వీరి యాయుధముల

వ్యాఖ్య మున్నే చేయఁబడినది. పైని జెప్పిన మువ్వురసురులును భయ శంకా జుగుప్సలనెడి జీవుని మూఁడవ నాల్గవ యైదవ పాశములు మున్నే చెప్పఁబడినవి. మన యమ్మ మాహేశ్వరీ విజ్ఞానమయమూర్తితో నావిర్భవించి, త్రిశూలము అనఁగా నానందమయత్రిపుటిని ప్రయోగించి మృత్యుభయమనెడి యతి ప్రబల సంస్కారమును విలయ మొనర్చినది.

వైష్ణవి ప్రాణమయశక్తి (స్థితిశక్తి) రూపముతో నావిర్భవించి సుదర్శనచక్రము—అనఁగా దివ్యదృష్టిని ప్రయోగించి శంకయనెడి నాలవపాశమును ఛేదించినది. ప్రియతమ వస్తువు యొక్కగాని, ప్రియవ్యక్తి యొక్కగాని, వినాశముచేనగు చింత యున్నతభూమిక నొందిన సాధకులయందును గానఁబడును. అమ్మ వైష్ణవీమూర్తితో వెలసి దానివిలయమును సాధించెను.

అటులే కార్తికేయశక్తి (కౌమారి) అనఁగా దేవసేనను సఁడుపుశక్తి యావిర్భవించి, భేదజ్ఞానమూలకమైన జుగుప్స యనెడి సంస్కారమును నశింపఁజేసెను. ఎంతగా భేదజ్ఞానము క్షీణించుచుండునో యంతగా గోపనేచ్ఛ, ఆత్మసంకోచము క్షీణించుచుండును. సాధకా! చూడుము. అమ్మ పాశవిముక్తునిఁ జేసి శివత్వము నొసఁగునటులే, బంధనమును దనచేతితోనే త్రెంచును. మాతృచరణములందు సర్వతోభావమున శరణాగతులు కాఁగలవారికే యిట్టిసుయోగము, సౌభాగ్యము లభించును కాన నగును. కనుకనే ప్రియతమ సాధకుఁడా! మాతృచరణములయందు సర్వథా సర్వదా శరణాగతుఁడ వగుటకే సాధ్యమైనంత ప్రయత్నించుచుండుము.

ఇఁక ఇంద్రాణీ వారాహీ నారసింహాశక్తులు చేసిన యసురకులక్షయమును వినుము. శుంభుఁడు యుద్ధమునకై పంపిన ద్వార్సృదులు, మహార్యులు, కాలకేయులు ననెడి యసుర సంప్రదాయములు మిగిలినవి. ఇవే కుల శీల జాతుల నెడి యాఱవ యేడవ యెన్మిదవ పాశములు.

వినుము సాధకా! పాశవిముక్తులగుటకే సాధకజనులు శిఖా యజ్ఞ సూత్రత్యాగము, సన్న్యాసగ్రహణము యథేచ్ఛా విహారము మున్నగు నెన్నో యుపాయములు చేయుదురు; గాని కొలఁదిమంది మాత్రమే యథార్థముఁగా నా బంధనము వలన విముక్తులగుదురు. బంధనార్థకమైన 'పశ్' ధాతువు వలన 'పాశ' శబ్దమైనది. కనుక, పాశముక్తుఁడన్నను బంధనముక్తుఁ డన్నను నొక్కటే యర్థము. అమ్మ విడిపింపఁగోరినవారి పాశములే విడును. కావున మన యమ్మ యనేక మూర్తులతో, ననేక భావములతోఁ దన సంతానమును బాశముక్తము చేయుటఁ గనుచున్నాము.

ధన్యసాధకుఁడా! యిపుడు నీవు పాశముక్తుఁడవై శివత్వము నొంద యోగ్యుఁడవైతివి. నీ మాతృచరణ శరణాగతి ధన్యము.

పాశమోక్ష విషయమునఁ బ్రారబ్ధమే గొప్ప యంతరాయము.

ప్రారబ్ధ సంస్కారమువలన నీ యష్టపాశ సంస్కారములు నతిప్రబలములై, నాగామి సంచిత సంస్కారములుగా నుండునుగాని యింతకుమున్నే యివి యమ్మ కృపాశ్లేషముచే నశించినవి. (మధుకైటభ మహిషాసురవధ కథలు, అవే

యాగామి సంచిత కర్మనాశము — అవే బ్రహ్మగ్రంథి విష్ణుగ్రంథి భేదము.) విశుద్ధాద్వయజ్ఞానమందు నిల్చు విషయమున నీ ప్రబలప్రారబ్ధమే గొప్పయంతరాయముగాన నమ్మ వీని ననేక రూపములతో నశింపఁజేయును. కొన్నిఁటిని భోగముచేతను, గొన్నిఁటిని సంయమముచేతను గొన్నిఁటిని స్వప్నముచేతను, ఏ సంస్కార మేవిధముగా క్షయించునో యది నిశ్చయించి చెప్పుట యసంభవము. అమ్మ మహతీచ్ఛ బహుభావములతోఁ బ్రకటితమై యనేకవిధములుగాఁ దన ముద్దుబిడ్డలఁ బాశముక్తులం జేయును. దానిని సాధకులు సామాన్యముగా గుర్తింపఁగల్గుదురు. అది యుండనిండు. అమ్మ విభిన్న సంస్కారములను క్షయింపఁజేయునని కనుగొంటిమి.

## భేదభ్రాంతు లైదు విధములు.

1. జీవబ్రహ్మములు భిన్నులనెడి భ్రాంతి. 2. జీవేశ్వరులు భిన్నులనెడి భ్రాంతి. 3. జీవునితో జీవునకు భేదమనెడి భ్రాంతి. 4. జీవ జడ భేద భ్రాంతి. 5. జడముతో జడము భిన్నమనెడి భ్రాంతి. ఈ భేదభ్రాంతులనెడి యసురులొక్కసారి యద్వయజ్ఞానాలోకముచే వెంటనే మూర్ఛితులై పోదురు. (అదే శివదూతి చండాట్టహాసముచే యసురులు తెలివితప్పి నేలఁ బడిపోవుటగా వర్ణింపఁబడినది. శివుని దూతగాఁ బంపినది కావున చండికాదేవికి శివదూతి యని పేరు.) "ఏకమేవా ద్వితీయమ్, తత్త్వమసి" మున్నగు మంత్రముల యుచ్చారణమును, దోడనే యద్వయజ్ఞానముయొక్క క్షణిక ప్రకాశమనెడి యుజ్జ్వలహాసము భేదభ్రాంతులనెడి యసురులను క్షణములో నశింపఁజేసినవి. తొలుత

వారు జ్ఞానమయసత్తపైనే నిల్చినవారు. అపుడు భ్రాన్తులను అజ్ఞానముగా గ్రహింపలేకపోయిరి. గాని యిట్టి యఖండ జ్ఞానమయ సత్తాప్రకాశముచే మూర్ఛితులైరి. వారిని శివదూతి మ్రింగివేసినదని చెప్పఁబడినది.

సాధకా! చూడుము. ఎంతగా జ్ఞానప్రకాశము వచ్చి పడునో యంతగా అజ్ఞాన – భేద భ్రాన్తులనెడి యసురులు నిర్మూలమగుచుందురు. కనుకనే మొదటినుండియు "అయ్యా! నీవు అజ్ఞానముం దొలఁగింపఁ బ్రయత్నింపకుము. జ్ఞానోదయము వంకనే లక్ష్యముంచుము. అజ్ఞానమును దొలఁగించుటే జ్ఞానోద్దేశ్యముకాదు. ఆలోకదర్శనము (జ్ఞానప్రాప్తి) చేయుటే జీవన ముఖ్యోద్దేశ్యము. జ్ఞానప్రాప్తియైనంతనే యజ్ఞానాంధకారము తనంతనే తొలఁగును అని చెప్పవలసివచ్చుట. ఇందులకే భగవంతుఁడు పరశురాముఁడు కల్పసూత్రములందు 'శివోఽహమ్మని' నిరంతరము స్మరింపుమని యాదేశించుట.

ఇపుడమ్మ నిన్నెక్కడినుండి యెక్కడకుఁ దెచ్చినదో చూడు.

"నేశు ర్దేవారి సైనికాః" అదర్శనార్థకమైన 'నశ్' ధాతువువలన 'నేశుః' అయినది.

అమ్మయొక్కతె యద్వితీయ యయ్యు బ్రహ్మాణ్యాది విభిన్న శక్తిరూపముతో నసురులను (సర్వాద్వైత ప్రతీతులను) బాఱఁద్రోలెను.

సాధకా! చూడుము. ద్వైతప్రతీతులు విశుద్ధబోధోదయముచే నొక్కటొక్కటే నశించినవి. అమ్మ కృపచే నైదు

విధములైన భేదభ్రాన్తులును, ఎనిమిది విధముల పాశములును నంతరించి యదృశ్యమైపోయినవి. బోధవస్తువు స్వప్రకాశ రూప మున భాసింపఁగానే, అనఁగాఁ గేవలము దన్నుఁ దాఁ బ్రకటించు కొనఁగానే భేదజ్ఞాన మూలకమైన సర్వసంస్కారములు తమంతనే లోపించిపోవును. సాధకా! ఇపుడు చూచుకో, అమ్మ నిన్ను మెల్ల మెల్లఁగా నెక్కడినుండి యెక్కడికిఁ దెచ్చి నదో. మనోరాజ్యమునుండి విజ్ఞాన రాజ్యమునకును, అక్కడ నుండి భావాతీత క్షేత్రమునకును దెచ్చిపెట్టినది. ఈ తెచ్చి పెట్టుటయందు నీవేమియుఁ జేయు నక్కఱపడలేదు. నీవిపుడమ్మ యొడిలోఁగూర్చున్న నగ్నశిశువవు. సరళప్రాణముతో, అమ్మా! అమ్మా! యంచు నిశ్చింతముగానుండుము. ఆ తర్వాత నేమి చేయవలయునో, ఏ విధముగా నీ బహుజన్మ సంచితములై తొలగింపరాని సంస్కారముల నెట్లు విలయ మొనర్చుటో, యను వానియెడ లక్ష్యముంచు నక్కఱ నీకులేదు. అమ్మయాటల ననుభవించుచుఁ బోవుటే నీపని. నీ కఠోరసాధనచేతను నీ దృఢ భక్తిచేతను నిట్లయినదని, పొరపాటుననైనను దలంపకుమా. ఇటులైనపుడే సాధకుఁడు ముక్తినొందఁగలఁడు. "నాయమాత్మా ప్రవచనేన, న మేధయా, బహుధా శ్రుతేన, యమేవైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మావృణుతే తనూంస్వామ్॥ అనుమాట స్మరించుకో. ఎవ్వఁడాత్మను వరించునో, జీవనలక్ష్య మాత్మయే యని తెలిసికొని యాత్మపాదములయం దాత్మసమర్పణము చేయునో, వానియెదుట మాత్రమే యాత్మ తన స్వరూపమును వెలయించును."

అతిచిత్రము రక్తబీజాసురవధ రహస్యము.

కొంచెము ధీరముగా నీ తత్త్వమును దెలిసికొనవలయును.

అమ్మా! ఆనందమయి! మహాశక్తి! నీవు ధీరూప గాను, ధారణావతీ మేధారూపగాను వెలయుము. అమ్మా! నీ యతి గహన రహస్య లీలలు మా యీ క్షీణబుద్ధులయందు దేనిచే నుద్భాసించునో యా నీకృపచే, దానినిమించిన నీస్నేహముచే, నానందమయ విజ్ఞాన మధుపానముచేసి మేము ధన్యుల మగుదుము. లోకులు నీ యపూర్వ లీలారహస్యముల నెఱింగి, నిన్ను సరళప్రాణముతో, అమ్మా! యనుచు స్మరింపనేర్పుము. ఈ దురంత సంతాపమయ విశ్వమును మఱల నానందమునఁ బ్రతిష్ఠింపుము.

సాధక సోదరా! నీ వీ రక్తబీజుని జూడలేదా?

"మేము జీవులము" అనెడి భావముపేరే రక్తబీజుఁడు. 'నేను' అనఁగా నాత్మ, అనెడి బీజము జీవత్వమనెడి విశేషముచే రంగువేయఁగా నపుడే యది రక్తబీజుఁ డనఁబడును. పరమాత్మ — అమ్మ యొక్కఁతే బీజము; దానియందు జీవత్వమనెడి ద్వైతజ్ఞానరంజన మగునపుడే విశుద్ధబోధవస్తువు, సజాతీయ విజాతీయ స్వగతభేద విశిష్టమగును. నిరంజన బీజమునకైన యీ యభిరంజనభావముపేరే రక్తబీజుఁడు. రక్తబీజుని విశిష్టత యేమనఁగా — వీని శరీరమునుండి యొక్కరక్తపుఁ జినుకు నేలఁబడఁగానే, యది రక్తబీజుని వలెనే యైపోవును. అటులే వెంటనే మఱలఁ బుట్టును. రక్తము —

అనఁగా రంజన మనెడి భావము ఎపుడు మూర్తిపైనే పడి పార్థివభావము నొందునో — స్థూలభావము నొందునో యపుడే మఱల బీజభావము తలయెత్తును. ఈ రంజితావస్థ యుండు వఱకు వేయిసాధనలు, వేయి జ్ఞానాలోచనములు, వేయి యనుభవములునైనను "నేను జీవుఁడను" అనెడిభావమును బూర్తిగా నణఁపఁజాలవు. అద్వైతతత్త్వప్రతిపాదకములగు "ఏకమేవా ద్వితీయమ్, అయమాత్మా బ్రహ్మ, తత్త్వమసి" మున్నగు వేదమహావాక్యములను సరిగా ననుశీలించు ఫలముగా సాధకుఁడు జీవబ్రహ్మముల భేదభ్రాంతి తొలఁగి గట్టెక్క నుద్యమించు నపుడే అనఁగా నద్వయబ్రహ్మస్వరూపము ననుభవింపఁ గడఁగు నపుడే యాక్షణమందే యీ రక్తబీజుఁ డావిర్భవించి "నేను జీవుఁడను" అనుచు నిట్టె లేచుచుండును. ఈ జీవత్వమనెడి యజ్ఞానమే సాధకుని యద్వయగతి కడ్డువచ్చి నిల్చును. సాధకులు తమతమ జీవనమందు రేవగల్లు ననుభవించుచున్నదే. అమ్మ (ఆత్మ) యొక్క విశేషకృపలేక యీ భయంకరాసురుఁడు నిహతుఁడు కాఁడు. యథార్థాద్వయ తత్త్వానుభవమును సమీపించినవారే యస్మితను — అనఁగా బుద్ధియందు నిల్చిన చిదాభాసుని సైతము నసురునిగా నెన్నఁగల్గుదురో, వారు మాత్రమే యీ రక్తబీజరహస్యము ననుభవింపఁ గల్గుదురు. ఔరా! "నేను జీవుఁడను" అనెడి భావమును విచారసహాయముచే వేయిసారులు నశింపఁజేసినను అది యటులే మఱలఁ దలయెత్తును. విచారము మాటకేమి? యోగబలముచేఁ జిత్త నిరోధముచేసియు నీ రక్తబీజుని బారితప్పదు. నిరోధమునుండి లేచు ముహూర్తమందే "నేను జీవుఁడను" అనెడి భావ

మన్నిఁటికంటె మున్నే తలసూపును. మఱల ఈ నేనె ఆ నేను. పరాభక్తి (నిష్కపటప్రేమ) బలముచే నాత్మసంగత మైనను, మైమఱచినను, మళ్లీ యీయుత్తరక్షణమందే యీ భావమే మొలకెత్తును. ఎంతగా "నేను జీవుఁడ" ననుచు నాత్మకుఁ గడు దవ్వగుచుండునో — తాను బ్రహ్మమునకు దవ్వగుటగునో యంతగాఁ దాను బ్రహ్మముకంటె వేఱువస్తువనెడి ప్రతీతి మెండగుచుండును. ఇదే రక్తబీజుని యత్యాచారము.

సాధకా ! నీవు విచారమార్గమందే ముందంజవేయుము; లేదా యోగబలముచేఁ జిత్తనిరోధమే చేయుము; లేదా పరాభక్తి సహాయముచేఁ బ్రేమమందే మైమఱువుము; ఈ రక్తబీజుని యత్యాచారమును సర్వత్ర సమముగానే కనుగొందువు. వాఁడు నశింపఁడు; ఎటులును నశింపఁగోరఁడు. రుద్రగ్రంథి భేదసాధకుఁడు మాత్రమే యీ రక్తబీజాసురుని చెప్పరాని యత్యాచారమును మర్మమర్మమునందు ననుభవింపఁ గలఁడు. ఇతరులచెంత నీ మాటలు సమస్యలుగానే తోఁచినను అస్వాభావికముకాదు.

ఈ రక్తబీజుఁ డెపుడు విలయమొందునో చెప్పనా ?

వినుము. నీవు నీ యలవాటు మాటలలో 'జీవాత్మ, పరమాత్మ' యనుచుందువు. వాస్తవముగా ఆత్మ, ఆత్మయైన యమ్మకాదు. దానియందు 'జీవ, పరమ' యను నెట్టి విశేషమును లేదు. ఈ యాత్మయందు జీవభావము పరికల్పితమగునపుడే యది రంజితము (రక్తము) అగును. రంజితముగాఁ దోఁచును. మఱెట్టి భావరంజనమును లేనపుడే యది శుద్ధ

నిరంజన పరమాత్మ యనఁబడును. గాని వాస్తవముగ నాత్మ కెట్టి పేరుగాని, విశేషణముగాని యుండదు, ఉండఁజాలదు. ఆత్మ జీవభావముతోఁ బ్రకాశించునంతదాఁక రక్తబీజుఁడు చావఁడు. దేహము, మనసు ఇంద్రియములు నుండునంతదాఁక రక్త బీజుఁడు నుండును. చెప్పెడి దేమనఁగా, అది కేవలము సత్యమే యైనను, అద్వయజ్ఞానరూపిణియైన యమ్మ ఱొమ్మున లెస్సగా నైమఱచునపుడు రక్తబీజుని పారమార్థికసత్త యొక్కసారిగా విలుప్తమైపోవును. వాఁడు క్షీణరక్తుఁడై విలయమొందును.

ఈవిధముగా నేద్వగల్గునపుడే, అమ్మ రక్తబీజుని జంపును.

అమ్మా! ఇంతవఱకు మేమీ రక్తబీజుని జూడలేదు. ఇంతదాఁక వీఁడు మాకుఁ దెలియకయే, మా గుండెమీదనే యుండి, మా రక్తమునే పీల్చుచు బలియుచున్నాఁడని తెలియ లేక పోతిమి. "నేనే యమ్మ; నేనే నీవు; నేనే యాత్మ;" యనెడిమాట నీకృపచే నెంత స్పష్టముగా దెలియఁగల్గుదుమో, ప్రజ్ఞాలోకముచే మా హృదయమెంతగా వెలుఁగునో, యంతగా నీ యసురుని యత్యాచారము విశేష మర్మపీడను గల్గించుచునే యుండును. "నిర్మలుఁడను, శుద్ధుఁడను, బుద్ధుడను, నిత్యముక్తుఁ డను, మహాత్ముఁడను, విశుద్ధబోధ స్వరూపుఁడను, ఎట్టి గుణ ములతోను నాకు సంబంధములేదు; నాయందెట్టి విశిష్టతయు లేదు; మలినత లేదు; రోగ శోక జన్మమృత్యువులు నాకు లేవు; నాకు సంసారము స్వర్గనరకములు, ధర్మాధర్మములు నేవియు లేవు; బ్రహ్మమే నాయథార్థ స్వరూపము; నేను బ్రహ్మమనే మఱేమియుంగాదు'' అని వేయిసారులు శ్రవణమననములు చేసి

నను, మఱల జీవుఁడుగానే ప్రతిభావితుఁడ నగుచున్నాను. ఇంత చేసియు స్వరూపమునుండి విడిపోవుచున్నానేమి ? తల్లీ !

అమ్మా ! ఇట్టి యసురాత్యాచారము నెట్లోర్చు చున్నావు ? నేను బ్రహ్మమనయ్యు క్షుద్రతా మలినతలతో నుండుటేమి ? నేను బూర్ణజ్ఞానమయుఁడనయ్యు నల్పజ్ఞజీవుఁడు గానే యుండుటేమి ? అమ్మా ! తెలియనంతకాలము నీ యాతనానుభవమే లేదు, గాని యిపుడొక-క్షణమైనను సహింప లేకున్నాను. నా తల్లీ ! జీవత్వ బ్రహ్మత్వముల యింత యభిన్న తను జూచి తెలిసికొని, యనుభవించి, యిపుడొక్క క్షణ మైనను నిచటనుండు నిచ్ఛ లేకున్నది. అమ్మా ! మా యమ్మా! నీ పూర్ణానందమయ భావాతీత నిరంజన స్వరూపము నిత్యము విరాజిల్లు నచటికే పోవుటకు, నచటనే స్థిరముగా(శాశ్వతముగా) నుండుటకు నడ్డురాని యిచ్ఛ కలిగినదమ్మా ! నన్నుఁ దీసికొని పో; పద; ఈ యత్యాచారమునుండి, యీ జీవత్వబంధనము నుండి; మమ్ము శాశ్వతముగా విడిపింపుమమ్మా ! ఇఁక నేను జెప్పవలసిన దేమియు లేదు. నా కెవ్వఁడును లేఁడు; ఎవ్వనికి నెవ్వఁడును లేదని తెలిసినదమ్మా ! మా యమ్మవు, ఒక్క తెవు నీవే మా సర్వస్వము; నీవే మా నేను; మమ్మలను దీసికొనిపో; ముందడుగు మఱి పెట్టలేము. బహుకాలమునుండి మేమీ రక్త బీజుని యత్యాచారము నోర్చుకొనుచు, మే మాతనికిఁ బ్రియుల మనుకొంటిమి. నిన్ను విడిచి యీ రక్తబీజుఁడే మాకుఁ బ్రియు డగుట మాకలవాటైపోయినది. అమ్మా ! నీవు మఱికొంచెము దిగిరా. నీవే వచ్చి మా చేయి పట్టుకొని తీసికొనిపో; అపుడు మే మా రక్తబీజుని బారినుండి పరిత్రాణము నొందుదుము.

బ్రాహ్మీస్థితినొంది ధన్యులమగుదుము. తల్లివని నిన్నే తలపించుట సార్థకమగుఁగాక.

సాధకా! నిన్ను నీవు నిజముగా రక్తబీజుని యత్యాచారముచేఁ బీడింపఁబడినవానిగాఁ దలఁచితివేని, ఇట్లే యేడ్వుము. ఏడువఁగలిగినపుడే, అమ్మ స్వయముగవచ్చి రక్తబీజునిజంపును.

## గీతోక్త బ్రాహ్మీస్థితి.

"విహాయ కామాన్ యః సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః స శాన్తి మధిగచ్ఛతి."

భోగించువిషయములయందైన కాంక్షలే కామములు. మనుష్యమాత్రుని సమ్ముఖమందు భోగ్యవిషయము లుండును. మఱి సాధనమందొకింత ముందడుగు వేసిన సాధకులకు భోగ్యవిషయములు (విభూతులు) లభించును. వానియందు మనసుంచినచో - అనఁగాఁ గాముకుఁడైనచో, గీతలోని యీ మంత్రము ననుసరించి శాన్తి లభింపదు. బంధనమందుఁ జిక్కుకొనుటే కాని, యున్నతి మఱి యుండదు. సర్వవిధముల భోగవిషయములను విడిచి యాకాంక్షారహితులై యుండువారు "ఆత్మానో నతథా భిన్నం విశ్వమాత్మ వినిర్గతమ్" అనెడి విచారానుష్ఠానమందు "సర్వం బ్రహ్మమయం" అని తెలిసి మమతారహితులై యంతమందు "సోఽహం" జ్ఞానముతో మైమఱచి (నా "సోఽహం సమాధి" గ్రంథమును జూడుడు.) మమత్వమును నశింపఁజేసి, యహంకారవిహీనులై విచరించువారే నిత్యానందశాన్తుల నొందుదురు. ఈ యవస్థయే కర్మముయొక్క చరమావస్థ; చరమఫలము. సిద్ధిస్వరూపము.

"ఏషా బ్రాహ్మీస్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి,
స్థిత్వాస్యా మంతకాలేఽపి బ్రహ్మనిర్వాణ మృచ్ఛతి."

ఇదె బ్రాహ్మీస్థితి. అనఁగా బ్రహ్మజ్ఞానావస్థ. ఈ స్థితి యందు సర్వము బ్రహ్మమయమే యగును. బాహ్యేంద్రియ వ్యాపారము తోఁచినను, భేదబుద్ధి లేమిచే బహిరంతరము లొక్కటియే యైపోవును, గాన మోహితుఁడు కాఁడు. ఈ యవస్థయందు విషయములయం దున్నను శరీరత్యాగవేళ "యత్ర యత్ర మనోయాతి తత్రైవ బ్రహ్మ లక్ష్యతే" సమస్తము బ్రహ్మమయలక్ష్యమగుటచే నపునరావృత్తిగతి యనెడి బ్రహ్మనిర్వాణప్రాప్తి యగును.

ఇది బ్రాహ్మీస్థితి వివరము.

అష్టమాతృకాశక్తులతో రక్తబీజ యుద్ధము, విను.

ఇంద్రాణితోనే వీని పోరు మొదలయినది. ఆమె తన వజ్రాయుధముతో నసురుని గొట్టెను.

పాణీంద్రియమున కధిపతి యింద్రుఁడు. పాణి యనఁగా ఆదానశక్తి. వజ్రము విద్యుచ్ఛక్తి. "నేను జీవుఁడను" అనెడి భావము పాణి మున్నగు నింద్రియములతో విశిష్ట సంబంధము కలదై వెలయును. సాధనాబలముచేతను, అమ్మ కృపచేతను, సాధకులు పాణ్యాదీంద్రియశక్తులు పరమాత్మ భావముగ భావింపఁబడుట ప్రారంభమగును. అపుడే వారి జీవభావము క్రమక్రమముగా సడలిపోవును. ఇదె యింద్రాణి వజ్రప్రహారముచే రక్తబీజుని దేహమునుండి రక్తస్రావముగ వర్ణింపఁ

బడినది. సర్వేంద్రియములమాట చెప్పఁబడకున్నను, ఒక్క ప్రాణేంద్రియము అన్ని యింద్రియముల కుపలక్షకము. ముఖ్యమైన మాట— ఇంద్రియముల నాశ్రయించియే జీవభావము పోషింపఁబడుచుండునుగాని యమ్మ కృపచే నెంతగా సత్తాహీన మగుచుండునో యంతగా జీవభావబలము తగ్గిపోవును. ఇచట లక్షింపవలసిన దేమనఁగా, నెంత దుర్బలముకానీ, యెంత రక్తపాతము కానీ, యది మున్నున్నటులే సిద్ధమగుచుండును. కేవల మింద్రియ విలయముచే (సంహరణముచే) జీవభావ మింతయుఁ దొలఁగదు. ఒక్కటే యను మాటేమి? సర్వేంద్రియ విలయమైనను — అనఁగాఁ బ్రజ్ఞాలోకముచే జీవభావము ముక్కముక్కలైనను 'నేను జీవుఁడ' ననెడి ద్వైతప్రతీతి నిశ్శేషము కానొల్లదు.

అసురశరీరమునుండి యెన్ని నెత్తురుబొట్లు నేలఁబడినవో యందఱు తత్సమాన బలవీర్యసంపన్నులు పురుషులు పుట్టిరి.

ఏక్షణమందుఁ బాణ్యాదీంద్రియ శక్తులు పరమాత్మ సత్తయందు విలీనములు కాఁజొచ్చునో, యప్పుడే యింద్రాణ్యాది శక్తులతోఁ బ్రలయశక్తి యావిర్భవించెను. కనుక ననేక విధముల రక్తబీజుని జంపుట కుద్యమించెను. ఇంద్రాణీ వజ్రప్రహారముచే (ఆదానశక్తియొక్క సంపూర్ణ హరణముచే) రక్తబీజుఁడెంతగా నాహతుఁడగునో, అనఁగా జీవభావ మెంతగా దుర్బలమగునో, యంతగా రుధిరస్రావము — అనఁగా రంజిత భావము తెగిపోవును. ఇంతకుమున్ని విధముగా రంజితుఁడను కా లేదన్నమాట లేదు, గాని యీ బహుభావ రంజనమనెడి పని, యపుడు గుర్తింపఁబడలేదు. ఇపుడు ప్రజ్ఞాప్రకాశ ముద్భా

సించినది. కావున నీ సూక్ష్మతమ దోషరాశి యనెడి యసుర కులమును లక్షించు శక్తి కలిగినది. కలుగును. ఒక్క రక్త బిందువునుండి తత్సమాన బలవీర్యసంపన్ను లసురులు పుట్టు చెట్లయ్యెనో, యది మున్నే చెప్పఁబడెను. వీర్యశబ్దార్థము ప్రభావము, బలము, శారీరకశక్తి, విక్రమము - ఉత్సాహాము, అగుఁగాక. "నేను జీవుఁడ" ననెడి భావము బహూపాయములచే మాటిమాటికి సడలుచున్నను, మఱొక్క క్షణముతర్వాత సరిగాఁ దొంటివలెనే బలవీర్య విక్రమసంపన్నమై బయలు దేఱుట కానఁబడును. "నేను జీవుఁడ" ననెడి విశిష్టభావము పుట్టుటతోనే, సాధకుఁడు బ్రహ్మక్షేత్రమునకు దవ్వుండుటకు బాధ్యుఁడగును. ఈ యొక్కమాటయెడ లక్ష్యముంచుటచేతనే, రక్తబీజ యుద్ధరహస్యము సులభముగ బోధపడును.

## వైష్ణవ్యాదులతో రక్తబీజుని యుద్ధము.

ఇంద్రాణి వజ్రముతోనువలె, వైష్ణవీశక్తియు వానిని జక్రముతోఁగొట్టి, గదాప్రహారములతో వితాడితుని జేసినది. దానిచే రక్తబీజుని శరీరమునుండి, ఎన్ని రక్తబిందువులు నేలఁ బడెనో యంతమంది మహాసురులు లేచి జగత్తున నిండిపోయిరి.

తరువాతఁ గౌమారీ శక్తిప్రయోగముతోను, వారాహి కత్తివ్రేటులతోను, మాహేశ్వరి త్రిశూలపుం బోటులతోను రక్తబీజుని గాయపఱచిరి.

ఆధ్యాత్మికార్థమును వినుము:— చితిశక్తియొక్క విభిన్న ప్రకాశములు జీవభావమునకుఁ బ్రతికూలముగా నిల్చునపుడు,

దాని ప్రబలాకర్షణముచే జీవభావము ముక్కముక్కలు కాక తప్పదు. కాని యనాది సంచిత జీవత్వ విశిష్ట సంస్కారములు ఏవిధముగాను నొక్కసారి తొలఁగిపో నొల్లవు. వీని నాశ్ర యించియే యస్మిత తన విశిష్టసత్త నఖండముగాఁజేసి నిల్పు టకు ప్రయాస పడుచుండును.

ప్రజ్ఞాప్రకాశముచే "నేను జీవుఁడ" ననెడి భావమెంతగా సడలిపోవునో యంతగా జీవభావము ప్రబలమై సర్వవ్యాపియై వెలయును. ఏమన — ఇంతవఱకు జీవభావమున కతిరిక్తమైన మఱియొక భావము ప్రత్యక్షముకాలేదు. విశోకాజ్యోతి — బుద్ధి తత్త్వమే యనుము; మహత్తత్త్వమే యనుము, సర్వభావము లును జీవభావముతోఁగూడి వెలయును కనుక నింతవఱకు జీవ భావ మొక్కవిధముగానే లక్షింపఁబడెను. కాని మాతృకృపచే నిపుడు కొంచెకొంచెము విశుద్ధబోధము భాసించినది. మెఱుపుఁ దీవవలె నరూపజ్ఞానాలోకము వచ్చి యస్తమించి అప్పపాటులో జీవభావమును విలయమొనర్చును. కనుక నిపుడు జీవభావము పైని లక్ష్యము పడినంతనే, యవి యసంఖ్యములును, సతి బల వంతములునుగాఁ బ్రతీతమైనవి. వాస్తవముగా జీవభావ మొక్కటియే యైనను, అది క్షణక్షణము నుదయించుచునే యుండును. గావున దానిని 'అసంఖ్యము, జగద్వ్యాపి' యనిరి. లోకములో నెందేనిం జూడుము, జగత్ప్రసందేభావము నేనిం జేకొనుము. అన్నిఁటియందు "నేను జీవుఁడ' ననెడి భావమే ముందుగాఁ దలసూపును. కనుకనే రక్తబీజు లసంఖ్యులుగా వెలసిరనఁబడెను.

## ఇదే మాతృమాతృత్వము.

జీవత్వ ముత్తరోత్తరాభివృద్ధి నొందుచున్నను మన యమ్మ దానిని (రక్తబీజులను) నశింపఁజేయుటకు గౌమారీరూపమున శక్తియనెడి యస్త్రమును, వారాహియై యద్వయజ్ఞానమనెడి నిశితఖడ్గమును, మాహేశ్వరీరూపమున ఆనందమయ త్రిపుటిపేరి త్రిశూలముతోఁ బొడిచియు మహాప్రయత్నమును జేసినది. ఇట్లనేక శక్తిమూర్తులతో వెలసి యనాదిజన్మసంచితమైన జీవభావమును సడలింపఁ బ్రయత్నించినది. అమ్మ దయ ధన్యము. ఈ దయను మాటలతో వెల్లడింపఁజాలము. ఇదె యథార్థమైన మాతృమాతృత్వము. మనయందెట్టి భేదజ్ఞానము నుండనీ, మనకెందెట్టి క్షతముకానీ, వానిని దొలఁగించుటకే, మనలకు ఆనందమయ మాత్రంకమునఁ జోటిచ్చుటకే, ఇప్పించుటకే యింత ప్రయత్నము. ఇంత ప్రయత్నము చేయువారు ఇంత ప్రయాసంపడువారు, మనయమ్మతక్క నింకెవ్వరున్నారు ? మన యమ్మ యొడిలోని నగ్నశిశువులము.

## రక్తబీజుని గదాప్రయోగ రహస్యము.

అష్టమాతృకాశక్తుల ప్రబలాకర్షణముచే విశుద్ధజ్ఞానమయస్వరూపమువంక లక్ష్యముంచు ఫలముగాఁ గొంతసేపు జీవభావ మవ్యక్తక్షేత్రమునకు మఱలిపోవుట తప్పదు. కాని క్షణములో మఱల 'నేను జీవుఁడ' ననుచు బయల్దేరును. అదే రక్తబీజుని (జీవత్వపు) గదాప్రహారము. 'గద్' ధాతువు సర్థము వ్యక్తవాక్యము. ప్రాచీన టీకాకారుఁడు, గోపాలచక్రవర్తియు నొకచోట గదాశబ్దార్థము వ్యక్తవాక్యమనియే వ్రాసెను.

మాతృకలు వేర్వేఱుగా రక్తబీజుని ధ్వంసము సేయఁగడఁగిరి. రక్తబీజుఁడును వారియెదుటఁ దన వ్యక్తభావమును మాటి మాటికిని బ్రకటించెను. సరే; రక్తబీజుని జంపుట చాలదూరపు మాట. మాతృకాశక్తుల యస్త్రాఘాతముచేనైన రక్తప్రవాహము నుండి లెక్కలేని యసురులు పుట్టిరి. అసురులు పట్టు రహస్యము మున్నుఁ జెప్పితిమి.

చెప్పవచ్చెడి దేమనఁగా, జీవభావవిలయమునకై యెంత ప్రయత్నము చేయనీ; అది యెట్టులును బూర్తిగా విలయ మొందదు. మఱింత బలవీర్యసంపన్న మగుచుండును. పురుష ప్రయత్నముచే జీవత్వవిలయ మసంభవము. ఆత్మయే యెచ్చటఁ బురుషకార రూపమున వెలయునో యచటి మాట వేఱు.

అపుడే సాధకునియం దమిత భయ నిరాశలు గల్గును.

దేవతలు (ఇంద్రియాధిష్ఠిత చైతన్యబృందము) జగమున వ్యాపించిన రక్తబీజాసురుల (జీవత్వపు) సత్తనుజూచి భయార్తులైరి. ఎటఁ జూచిన, నెట ధ్యానించిన నచట నసంఖ్య రక్త బీజాసురులు (జీవత్వస్ఫురణములు) 'నేను జీవుఁడ' ననెడి ద్వైతభావమును, విశుద్ధచైతన్య మొందు పీడయుఁ గానఁబడు చున్నది. వేయిప్రయత్నములు చేసినను దొలఁగింపరాని జీవ భావము చేతినుండి యెట్లును బరిత్రాణము నొందలేదు. అపుడు యథార్థముగా నమితభయమును నిరాశయుఁ గల్గును. దీనిచే సాధకుని హృదయమందుఁ దీవ్రవిరహ మొక్కింత యుదయించును. అయిన నా విరహము యథార్థముగా నైఁపరానిదే. "ప్రియతమునితోఁ జేరు టెట్టులుం గాకున్నదే. ఎట్టులును

బరమ ప్రేమాస్పదుని గుండెతో గుండెచేర్చి నన్ను నేమఱచు నైనది కాదే" యని కనుఁగొనును. సాధకుని కష్టము నిజముగా సైపరానిదే యగును. అది స్వచ్ఛబుద్ధి యనెడి ప్రాకారము చాటుననుండియే ప్రియతముని జూచుటగుచున్నది. బుద్ధి వంక నుండియే ప్రియతముని యలౌకికరూపమును జూచియే ముగ్ధుఁడ నగుచున్నానేయని తెలిసి నొచ్చుకొనును. "ప్రియతముని జూచు నాస నానాఁటికి బలియుచున్నది. కాని చుట్టుగోడను విరుగఁ గొట్టి యాప్రియతముని చరణములందు 'నేనును' విడుచుట కాకున్నది. ఇక్కారణమున నానాఁటికి విరహవేదన పెరిగి పోవుచున్నది. ఆ జీవత్వమును గూర్చిన యాతనను దలంచుటే పనియైనది."

ఆ ప్రియతము నెట్లు చేరికొంట? చేరికొనఁగలమా?

అయ్యా! అతిపవిత్రమును, అతిశుద్ధమును, సర్వభావా తీతమును, నిరంజనమునైన మన పరమప్రేమమయాత్మ, మన యానందమయ జీవనవల్లభుఁడు, మన మధుమయ జీవనసర్వ స్వము, దానినెట్లు చేరుకొనుట? చేరికొనఁగలమా? అది శుద్ధ బ్రహ్మము. మనము అశుద్ధజీవులము. మన మెట్టులు దానితోఁ జేరిపోఁగలము? రెండు సమానవస్తువుల మేలనము కేవల మసంభవము. 'నేను జీవుఁడ' నను బోధము పూర్తిగాఁ దొలఁగనంతదాఁక బుద్ధి కావలనున్న పరమప్రియతమునితో నెటులు చేరికొనుట?

ఆధునికులు కొందఱు వైష్ణవ సంప్రదాయ సాధకులు భగవంతునితో భక్తుఁడు చేరుకొనుట కేవల మసంభవమనియు

కేవలాన్వాయమనియుఁ జూపుచురు ! వారు వేదమందలి "తత్త్వ
మసి" మున్నగు నాలుగు మహావాక్యముల యర్థమం దించుక
విశేషప్రణిధానము చేసినచో, ఆ నాలుగు మహావాక్యముల
వల్లనే పరమప్రేమ సూచితమైనదని నిజముగా నెఱుంగఁగలరు.
ఆ ఋషిగణము ధన్యము. వారి హృదయమం దన్నిఁటికంటె
మున్ను, ఈ యపూర్వ సంవేదనమే వికసించినది. వారు పరమ
ప్రేమాస్పదుని చరణములందుఁ దమ్ము సంపూర్ణభావముతోఁ
జేర్చివేసి ప్రేమయొక్క పరపారమును జేరిరి. భేదజ్ఞానము
రవ్వంతయున్నను ప్రేమకుఁ బూర్ణత్వమే లేదు. ఉండఁజాలదు;
అని తెలియఁగల్గుటచేతనే యా ఋషులు "అయమాత్మా
బ్రహ్మ" యనుచు బ్రహ్మసముద్రమందుఁ దమ పృథక్సత్తను
బూర్తిగాఁ గలిపివేసిరి. ఇపుడు వారినోర వెడలిన యా పవిత్ర
మహావాక్యములనుషిని వారి యడుగుజాడలనే నడచి, యనేక
యుగయుగాంతరముల పిదప సైతము జీవుఁడు పరమప్రేమ
పరమ జ్ఞానముల సంధానమునొంది బ్రతుకు ధన్యము చేసికొను
చున్నాఁడు. వైష్ణవ శాస్త్రములందు వర్ణింపఁబడిన గోపీ ప్రేమ
మును రాధికాప్రేమమును నెట్టివస్తువో, దానివఱకుఁ బోఁజా
లనివారి కిది యేవిధముగాను బోధపడదు.

## అద్వయజ్ఞానమే మేలనము, భేదజ్ఞానమే విరహము.

సాధకా! 'నేనును' (అమ్మను—ఆత్మను) యథార్థముగా
ననుభవింపనంతదాఁక, అమ్మ స్వరూప ముద్భాసించుటఁ గనఁ
జాలవు. అంతదాఁక విరహవేదన మెట్లునుఁ దొలఁగదు. "నేను
జీవుఁడ" ననెడి ద్వైతప్రతీతి యుండునంతదాఁక దానిఁ జేసు

యెట్టులునుఁ గాదు. అద్వయజ్ఞానమే మేలనము, భేదజ్ఞానమే విరహము అనుట మఱవకుమా. ఒకప్పుడును ప్రియతమునితోఁ జేరుట జరుగనివారికిఁ ప్రియతమునితో విరహమననేమో యెట్లు తెలియును ?

## ఉత్తమ భయము, అధమ భయము.

ఉపనిషత్తులు " ద్వితీయాద్వై భయం భవతి " ద్వైత జ్ఞానముచేతనే భయము (భవ భయము) వచ్చిపడును. అదె దేవతలు లెక్కలేని రక్తబీజులనుజూచి భయభీతుఁడై రక్తబీజ రణమం దుపస్థితుఁడగు సామర్థ్య మొందినపుడే ఆ యుపనిష ద్వాక్యార్థరహస్యమును దెలిసికొనఁగలఁడు. భయమననేమో దాని యనుభవ మగును. అయ్యా ! లోకమందు నీవు 'భయము భయము' అనుచు సంకుచితుఁడ వగుచున్నావు. అదేపాటి భయము ? అది భయాభాసము మాత్రమే. భయమునకు గడు దూరమందున్న ఛాయామాత్రమే. యథార్థభయమనునది, యిచటఁ జేరినపుడే తెలియఁబడును. ఈ భేదమన్నది, ఈ ద్వైత మన్న దేదో యది యెట్లునుం బోలగదు. కనుక భయము సైతము బోలఁగదు.

దేవతలు, ఉత్తమ భయము నొందిరట. అందును గొంత రహస్యమున్నది. ఇచటిభయ ముత్తమము. జాగతికములైన భయము లన్నియు నధమములు. ఈ జీవబ్రహ్మ మేలన సంధి సమయమందు జీవస్వరూప భేదజ్ఞానముచే వచ్చిపడు భయమే యుత్తమ భయమని ప్రసిద్ధము.

సాధకా! నీవు ప్రియతముని తీవ్రాకర్షణముచే దేహము, మనస్సు, ఇంద్రియములు మున్నగువానిని విడిచి, విజ్ఞానక్షేత్ర మం దెపుడు చేరుదువో కదా! విజ్ఞానపరపారమందున్న పరమాత్మయొక్క లీలాతీత స్వరూపమును జూచి యెపుడు పరమ ముగ్ధుండ వగుదో కదా! ఎన్నాళ్లకు నీ వభయమును స్మరించి యీ యుత్తమభయమును స్మరించి యా యభవపదమునందు నిల్తువో కదా!

జ్ఞానమయావస్థ యెటు లెపుడు సహజమైపోవును ?

ద్వైతప్రతీతి యనెడి యసురకులము విశుద్ధజ్ఞానాలోకముచే దక్క మఱియొకదానితో నిర్మూలితము కాదు. ఒక్క గడెసేపు జ్ఞానము ప్రకాశించినంతనే యజ్ఞానమంతయు విధ్వస్తమగునని నీ వెఱుంగుదువు.

"స+తు దీర్ఘకాల నైరంతర్య సత్కారాసేవితో దృఢభూమికః" పాతంజలి.

"బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాంప్రపద్యతే" గీత. జ్ఞానవంతుఁడు, అనగా — "ఆత్మయే సత్; తక్కినదంతయు అసత్" అనెడి ధ్రువసత్యము నెఱింగి పరమాత్మ సేవారతుఁడగు పురుషుఁడే జ్ఞానవంతుఁడు. ఈ సత్యము ననుభవము చేసికొని యాత్మస్వరూపలాభము నొందఁగోరువాఁడు జ్ఞాని. కనుకనే ఆర్తుఁడు, జిజ్ఞాసువు, అర్థార్థి యనువారలు జ్ఞానవంతులు. జ్ఞానవంతుఁడే కొన్ని జన్మములకు జ్ఞానియగును. జ్ఞానియగుటయే యీ శ్లోకమందు "మాం ప్రపద్యతే" యను నవస్థ. అనఁగా నన్నుఁబొందుట యను నవస్థనొందినపైని "వాసు

దేవః సర్వం” అయిపోవును. ఇట్టి మహాత్ముఁ డతి దుర్లభుఁడు. అనఁగా “కశ్చిన్మాం వేత్తి తత్త్వతః” అను వాక్యమునను సరించి కొలఁదిమంది మాత్రమే, అనఁగా వేయింట నొకఁడు మాత్రమే నన్నుఁ బొందును. కనుక నీ యవస్థనొందు మహాత్ముఁ డతి దుర్లభుఁడు.

## ఉపాసశీలుఁడు కాడేని మాయావిపాకమందుఁ బడిపోవును.

జ్ఞాన మతిదుర్లభవస్తువు. భక్తి లేక లభింపదు. మనుష్యుఁడు తక్క మఱియొక జీవుఁడు జ్ఞానము నొందలేఁడు. మనుష్యులందునుఁ జాలఁ దక్కువ. ఆజ్ఞాచక్రమందు స్థిరముగా నిల్చుటయే సిద్ధి. ఈ సిద్ధియే కర్మకాండ శేషము. కర్మములు సిద్ధించిన క్షణమందే జ్ఞానప్రాప్తి కాదు. ఇఁక నుపాసనమునందుఁ బ్రయత్నశీలుఁడు కాఁడేని మాయావిపాకమందుఁ బడిపోవుటగును. మఱి యత్నశీలుఁడగుటనే జ్ఞానప్రాప్తి – పరమాత్మ తత్త్వ (విష్ణుపద) ప్రాప్తి యగుననుటయు లేదు. ఏమనఁగాఁ జిత్తలయము కానంతదాఁక, మాయాదేవి మోహజాలమును బన్నియుంచి సాధకుని మోహింపఁజేయుటకే చూచును. ఆ మోహినీశక్తి నతిక్రమించుటకుఁ దీవ్రవైరాగ్యము నొందకున్నచోఁ దలయందుఁ బడిపోవును. గనుక ‘నేకొలఁదిమందిలో నొక్కఁడెవ్వఁడో తత్త్వాతీత నిరంజనపురుషుఁడ నైన నన్ను నా స్వరూపము నవగతము చేసికొనును’ అన్నాఁడు. అందుఁ జేరిపోయి “సపసత్పరం యత్” అయిపోవును. మఱియు సద్గురు చరణములయం దాత్మసమర్పణము చేసి భక్తుఁడగుటచే మాయా శక్తి తనంతనే యంతరించును. సాధకుఁడైన యర్జునుఁ డిపుడు

భక్తుఁడును సఖుఁడు నైనాఁడు. "భక్తోఽసి మే సఖా చేతి" కర్మము నతిక్రమించి యుపాసనమందుఁ బ్రవృత్తుఁడైనాఁడు. దీనిచే శ్రీగురుదేవుఁడు కూటస్థ చైతన్యరూపముగ నాతని సమ్ముఖమందు, ఆతని సారథియై సర్వసంశయములఁ దొలఁగించు పనిఁ బూనినాఁడు.

కొంచెము కొంచెముగానే జ్ఞానవికాసమగును. కొంచెము కొంచెముగానే యజ్ఞానము తొలఁగును. వేయేండ్లు మూయఁబడి చీఁకటిగానే యుండిన యిల్లయినను, లోపలి కొక చిన్న దివ్వెం గొనిపోయినచో గదియంతయు వెలుఁగుట కనుచున్నాము. దీని తాత్పర్యమేమనఁగా — ఒకసారి విశుద్ధ జ్ఞానాలోకప్రకాశము నొందినపుడు జీవుఁడు మరెన్నఁడు నజ్ఞానాంధకారమునందు మునుఁగక నానాఁటికి నా క్షణమందు గాంచిన జ్ఞానాలోకమువైపే ముందంజవేయు తీవ్రప్రయత్నము చేయుచుండి భ్రాంతిజ్ఞానమువలన ముగ్ధుఁడుకాఁడు అనుటయే.

"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురు తేఽర్జున"

ఇమ్మాటయందు మనము గుర్తింపఁదగిన దేమి? అజ్ఞానము మెల్లమెల్లఁగాఁ దొలఁగుననున్నది భగవద్వాక్యముచేఁ బ్రమాణితమైనది. సమిద్ధాగ్ని కట్టెలప్రోవును బూడిద చేయునటులే జ్ఞానాగ్ని సర్వకర్మములను (అజ్ఞానమును) భస్మము చేయును. ఇమ్మాటయందు మనము గుర్తింపఁదగిన విషయము— ఇంధనములతో నగ్నికి సంయోగ మగును. అది భస్మముగాఁ బరిణమింపక, యొకవస్తువు భస్మీభూతమగునంతదాఁకఁ దప్పక యుండును. జ్ఞానాగ్నితోఁ గూడుటచే నజ్ఞానేంధనమును నట్లులే

క్రమముగా నశించును. ఇది కాదనువారు కొంచెము విచారించి చూచునది. దేహజగత్తులు వెలయునంతదాఁక, నించుకంత యాభాసమున్నను బాధితానువృత్తిగా నజ్ఞానముండును, విలయమైనను అని యంగీకరింతురుగాని; జ్ఞానమున కొక సముజ్జ్వలతావస్థ యున్నది. దానిని జేరినచో మఱెన్నఁడును దేహాద్యనాత్మవస్తుభాన ముండదు. యోగవాసిష్ఠమందు దీనినే పదార్థభావిని యనెడి తుర్యగావస్థ యనిరి. ఇక్కాలమున నిట్టి యుచ్చభూమిక కెక్కిన సాధకు లతిదుర్లభు లయినను పైనిజెప్పిన జ్ఞాన మసంభవము కాదు. అమ్మ కృపచేతను, సాధకుని తీవ్ర పురుషకార వైరాగ్యముల ఫలముగాను, నట్టి సముజ్జ్వల జ్ఞాన ప్రకాశమగుట కడుసంభవమే.

☞ పాఠకుల కొక మనవి :- ఉత్తమ చరిత్రమందలి శుంభవధమ నెడి యస్మితానాశ కథాభాగమే రుద్రగ్రంథిభేదము. ఇదే యానందప్రతిష్ఠ. ఈ సాధనమునకైన సాధనసామగ్రి సాధనోత్తమభూమికల నందుకొను నధికార మొందినవారికే యందుబాటులో నుండును గాన నవధానమందదగు జాఁఖనీకుందుముగాక. ఇటుపైని కథాభాగము నందిచ్చుచు, నాధ్యాత్మిక వివృతితోఁగూడిన సామగ్రినే కనఁగలరు.

ప్రసంగవశమునఁ గడు దవ్వోగితిమి. అమ్మ శూలపుఁబోటులతో రక్తబీజుని గాయపఱచినదనియు, ప్రలయంకరి కాలి తన నోరు తెఱచి గాయపు నెత్తుటిని ద్రాగివేసినదనియుఁ జెప్పఁబడినది.

సాధకా ! నిజముగా నిటులే జరుగును జుమా. ఒకవంక నద్వయ జ్ఞానప్రకాశము క్షణకాలమయి, భేద భేదజ్ఞానమును

జీవత్వబుద్ధిని క్షతవిక్షతము చేయుచున్నది. మఱియొకవంకఁ గాలీశక్తి సర్వగ్రాసినీమూర్తితో, సర్వభావములను (జీవభావమును) మ్రింగివేయుచున్నది. జీవత్వమనెడి రక్తమున్నచో, మఱలమఱల రక్తబీజుఁడు పుట్టుచునే యుండును. కాని, అమ్మ తానే యిపుడు కాలీమూర్తితో నా రక్తమును గబలించుచున్నది. కనుక రక్తబీజవధ మవశ్యము కాఁగలదు. ఆసన్నమైనది.

కథ—రక్తబీజుఁడు చండికాదేవిపై సైతము గదాస్త్రప్రహారముచేసెను. కాని యా గదాఘాతము దేవి కింతయు వేదనను గలిగింపలేదు.

మున్ను మాతృశక్తులను, ఇపుడు దేవిని సైతము గదతోఁగొట్టినట్లును దెలియును, గాని దేవికి గదా ఘాతవేదన మింతయుఁ గల్గలేదు.

**విను**—ఆసురికభావము లెంతగా వెలసినను "నేనుజీవుఁడ" నెడిమాట యెంతగా నెన్నిసారు లుబుకుచున్నను వానివలన, అమ్మ శరీరమందు — అద్వయక్షేత్రమందు — ఆ విశుద్ధ చిన్మయ స్వరూపమందు, ఎట్టి విశేషానుభూతియు లేదు. వేదన మన్నదే తెలియఁబడలేదు. మన యమ్మ నిత్యశుద్ధ, నిరంజన, నిర్వికార గానే యుండును. రవ్వంతయు వికారమంటదు. బుద్ధిమను క్షేత్రమందెట్టి విశిష్టతలున్నను నవి చిత్ క్షేత్రమం దెన్నఁడు నుండఁజాలవు. సమీపింపఁజాలవు. వేదనాశబ్దమ్మున కర్థము విశిష్టానుభూతి. జీవభావమెంత బలవంతము కానిమ్ము. ఆత్మను జీవత్వమోహముచే ముగ్ధముఁజేయ యత్నింపనిమ్ము. దానివలన విశుద్ధపరమాత్మ క్షేత్రమందు రవ్వంతయు క్షోభము కల్గదు.

కనుకనే "గదాఘాతముచే దేవికి రవ్వంతయు వేదన లేదని" మూలమందుఁ జెప్పఁబడినది.

సాధకా ! అనుభూతిమాట మఱికొంచెము వినుము.

మొదటినుండియు నీ యనుభూతిమాట చెప్పఁబడుచునే యున్నది. అనుభూతి సహాయముతోనే సాధనమార్గమం దగ్ర సరులగుదురు. అనుభూతియే ఆత్మ (అమ్మ). తొలుత విశేష భావముల సాయముతోనే విశేషానుభూతి నవలంబించి యగ్ర సరుఁడగును. మఱల నీ రుద్రగ్రంథి భేదన క్షేత్రమునందుఁ జేరుటచే, నీ విశిష్టానుభూతి తొలఁగిపోవును. అనుభూతి కేవల నిరవచ్ఛిన్నానందమయము. దానియందెట్టి విశిష్టతయు నుండదు.

వినుము. సత్యప్రాణప్రతిష్ఠ యలవడినచో, వేదన (యనుభూతి) యనెడిదే తెలియఁబడదు. సరే యిపుడు దర్శన శ్రవణ మననములు మున్నగు నింద్రియ వ్యాపారములు, భూమి జలాగ్నులు మున్నగానైన తత్త్వములు, రూపరసాది విషయములు సర్వము నొకొ్కక్కవిధమైన యనుభూతులే. వీనిని జక్కఁగా నొందు సులభోపాయము చూడుము. అనుభూతిని బట్టి విషయములవంకకు వచ్చుచున్నాము, విషయములనుబట్టి యనుభూతివంకకుఁ బోవుదుము. కొన్నాళ్లిట్టి యలవాటగుటచే గ్రాహ్యగ్రహణములు అనఁగా నింద్రియములు విషయములు ననుభూతిమ్మయము లగును. అపుడు దర్శనమనఁగానే బోధము యొక్క దర్శనము, శ్రవణమనఁగానే బోధముయొక్క శ్రవణము, అను నిట్టి యనుభవమగుచుండును. ఆ యవస్థ మఱింత పరిపక్వము కాఁగా, దర్శన శ్రవణాదులను విడిచి కేవలాను

భూతిని - కేవల బోధమును బట్టుకొని యుండుటకై ప్రయ త్నించుటగును. తొలుదొల్త నే సర్విశేషబోధమును బట్టుకొను టచే వెనుకకు నెట్టివేయఁబడుటగును. ఒక వైద్యుతికశక్తి దెబ్బ (Electric Shock) తగిలినపుడు ఆ చోటినుండి త్రోసివేయఁ బడును. అయినను మాటిమాటికిఁ బ్రయత్నింపుము. "అమ్మా! నన్నొడిలోనికిఁ దీసికో, అమ్మా! నన్నొడిలోనికిఁ దీసికో" అని యిటు లేడ్చుచుండుము. అప్పుడమ్మ కృపచే క్షణకాల మచట నిల్వఁగల్గుదువు. కేవల జ్ఞానమూర్తి గురుఁ డెట్టి వస్తువో తెలియఁగలవు.

మును జెప్పిన యనుభూతియే జ్ఞానగ్రంథి. ఈ గ్రంథిని భేదించుటకే, యిట్టి తీవ్రప్రయత్నము పైని, అమ్మ కృపపైని నిర్భరంపడుము. ఈ రుద్రగ్రంథి భేదముచే నేమగునో యది మఱల వ్రాసి తెల్పనక్కఱలేదు. సాధకా! అది నీవే యెఱుంగఁ గలవు. సంక్షేపముగాఁ జెప్పిన యిది చాలును. జీవన్ముక్తియను పేర నీవు వినుచున్నదియు, జదువుచున్నదియు నిదే యని నీవే యెఱుంగఁగలవు.

అమ్మ రక్తబీజునిపైఁ బ్రయోగించిన యైదస్త్రముల రహస్యము

చాముండాదేవి రక్తబీజుని నెత్తురుచుక్క నేలఁబడకుండ నోర నందుకొని త్రాగఁజొచ్చినది. చాముండా ముఖమందును భూతత్త్వాంశమున్నది కనుక, ఆమె నోటియందును నసురులు పుట్టఁదొడఁగిరి. వారి నామె యక్కడనే చప్పరించి మ్రింగివేయు చున్నది.

ఇప్పుడు రక్తబీజుఁడు (జీవత్వము) ధ్వంసముఖమునకు వచ్చెను. ఒకవైపు ప్రజ్ఞాలోక సంపాతమనెడి శూలపుఁబోటుల ప్రయోగము. ఒకవైపు భావరంజనమగుచుండ దానిఁ గానీయక ప్రలయంకరీశక్తి సర్వభావములను మ్రింగివేయుటగుచున్నది.

మంత్రమందు శూలము, వజ్రము, బాణము, అసి, ఋష్టి యని యైదస్త్రములు వ్రాయఁబడినవి. వాని యాధ్యాత్మికార్థము వినుము. విశ్వాసము, అనుభవము, యుక్తి, శాస్త్రము, కృప యను నీయవే (అయిదే) రక్తబీజుని (జీవత్వమును) నిజముగాఁ జంపఁగల యస్త్రములు. వీనిలో నొక్కొక్కదానిచే రక్తబీజుఁడు చావఁడు. అన్నియు నొక్కపెట్టునఁ బ్రయోగింప ఒకవంక నస్త్రప్రయోగము, ఒకవంక సంహారిణీశక్తి యాకర్షణము, ఇట్లు రెండువైపులనుండి వాని నాక్రమింపఁగల్గినపుడే వాఁడు తప్పక చచ్చుటగును. ఇఁక విను.

సాధకుఁడా! నీ వన్నిఁటికంటె ముందు "జీవో బ్రహ్మైవ నాపరః" యనెడి జ్ఞానమందు వజ్రమువంటి దృఢవిశ్వాసము నిల్పుము. అదె మొదటి యస్త్రము. తరువాత విశిష్టానుభూతిని బట్టుకొని, నిర్విశేషానుభూతియందు నిల్వఁ బ్రయత్నింపుము. ఇదె రెండవయస్త్రము. పిదప యుక్తిసహాయముతోను, విచార సహాయముతోను, వాస్తవిక సత్త చితిశక్తిదే యనియు, దృశ్యముగాను, జ్ఞేయముగాను, విశిష్టరూపముగాను గానవచ్చునదెల్ల వ్యావహారికసత్తావిహీనమైన యొక విధమగు వ్యవహారమాత్రమనియు, దానికి వస్తుత్వముండజాలదనియు, వ్యావహారికాస్తిత్వము మూఁడుకాలములందును నుండఁజాలదనియు నెఱుంగుము. ఈ విధముగా మఱి యనేకయుక్తులతోను విశిష్ట

సత్తాప్రతీతిని నశింపఁజేయ బ్రయత్నింపుము. వేదాన్తశాస్త్ర ప్రతిపాద్యమైన బ్రహ్మవిచారము నిచటఁ జేసినచో నుపయోగించును. అటుగాక తగు నధికారము రాకమున్నే విచారక్షేత్రమందుఁ బ్రవేశించుటచే ననర్థము వాటిల్లును. సాధకుఁ డున్నతి నొందు దారియు, యథార్థ సత్యవస్తువునొందు దారియు విఘ్నకంటకములతో నిండిపోవును. కనుకఁ గేవల రక్తబీజవధము కొఱకై బ్రహ్మవిచారమనెడి యమోఘాస్త్ర మావశ్యకమే; ఇది మూడవయస్త్రము. తరువాత శాస్త్రప్రమాణ సహాయముతో నద్వయానుభవము చేయఁ బ్రయత్నింపుము. ఉపనిషదాది శాస్త్రోక్తలక్షణములతో నా యనుభవము సరిపోయినదా ? లేదా ? యను లక్ష్యము చేయుట తప్పక ప్రయోజనీయము. తత్త్వమస్యాది మహావాక్యచతుష్టయమును, "ఏకమేవా ద్వితీయమ్, నేహానానాస్తి కించన" మున్నగు నేకత్వప్రతిపాదకములునగు శాస్త్రవాక్యములయూఁతతో నీయద్వయస్వరూపమును జక్కఁగాఁ బరిగ్రహింపఁ బ్రయత్నింపుము. ఇదె నాల్గవయస్త్రము. ఇఁక నైదవది కృప. అమ్మయొక్క విశిష్టకృప నొందుటకై గట్టి యూఁతగాఁ గాతరప్రార్థనము నే తుది దాఁక విడువకుండుము. శరణాగతభావమువలన నవశ్యముగ నగు ఫలము కృపయే. ఆత్మలాభవిషయమునఁ గృపయే ప్రధానావలంబము. కృపయే లభించినంత నున్నదంతయు ననాయాసముగా లభించును గాన, మును జెప్పిన దైయేను దలుగ, విపరీత క్రమమున ఫలమిచ్చుట కనుచున్నాము. అన్నిఁటికంటె మున్ను అమ్మ కృపయే యనుభూతమగును. పిదప విశ్వాసము దృఢప్రతిష్ఠితమగును. తరువాత శాస్త్రార్థప్రతీతియు నగును. పుట్టును.

చిట్టచివర కనుభూతిని లక్షించి నిర్విశేష స్వరూపమందుఁ జేరు యోగ్యత కలుగును. అగుఁగాక; ఈ ప్రక్రియలన్నియు మును జెప్పిన శూలాద్యస్త్రరూపములుగ, యథాయోగ్యముగఁ దెలిసి కొన్నపుడే దీని రహస్యము యథార్థముగ నెఱుంగఁగల్గుదురు.

మఱి ముఖ్యమైన మాట – చూడుము. చాముండాదేవి (ప్రలయంకరీశక్తి) రక్తబీజుని రక్తమును ద్రాగకున్నచో, వాని నిర్మూలించుటకు నెవ్వరికినిదరముకాదు. కనుక నెంతకష్టపడియైనను ప్రలయంకరీశక్తి కృపకే యాసపడి లక్షించుచుండవలయును. అమ్మ కృపవల్లనే సాధకుని పురుషకారము ప్రకటమగును.

## జీవభావ సమాప్తియే రక్తబీజ వధము,

పైనిజెప్పిన విశ్వానానుభవాది శస్త్రములచేఁ గొట్టఁబడి రక్తబీజుఁడు నేలఁబడిపోయెను. (జడత్వముగాఁ బరిణమించెను.) జడత్వమన్నను దృశ్యత్వమన్నను నొక్కటే. ఇంతవఱకు జీవ భావము చేతనముగాను, ద్రష్టగాను (నేననెడి చేతనముగాను) ప్రతీతమగుచుండెను; గాని యిపుడు చైతన్యముయొక్క యథార్థ స్వరూపము బయల్పడఁగానే యదిదృశ్యత్వముగాఁ బరిణమించి నది. నేననెడి వస్తువిపుడు దృశ్యమేకాని జీవుఁడుకాఁడు. 'నేను' అనఁగా ద్రష్ట, చేతనము, జీవుఁడుగాఁ ప్రతీతమగుచుండెను గాని, దీనికి విపర్యయజ్ఞానమే హేతువుగాన, బీజమైన యాత్మ విపర్యస్తభావముతో జీవుఁడుగాఁ బ్రతీతమగుచుండెఁగాని,యిపు డమ్మ మొట్టమొదటనే (ధూమ్రలోచనుని) విపర్యస్తజ్ఞానమును జంపివేసినది. దానివల్లనే తప్పనిఫలముగా నిపుడు జీవభావము సమాప్తినొందెను.

సాధకా ! విను, "జీవుఁడనుచు (దృశ్యమనుచు) నొకటి లేదు. ఉండలేదు. ఉండఁజాలదు. విశుద్ధబోధరూప వస్తు వొక్కటే నిత్యమున్నది. ఇది పూర్ణానంద స్వరూపము; చిర మధుమయము; అమృతమయము; పూర్ణజ్ఞానస్వరూపము; నిరవచ్ఛిన్నానందమయ స్వరూపమైన వస్తువునందు అజ్ఞాన మును, నిరానందమును నెన్నఁడును లేవు. ఉండఁజాలవు" అనెడి జ్ఞానము దృఢప్రతిష్ఠిత మగుటయే రక్తబీజవధము. ఏమనఁగా నిట్టిభావ ముదయించినచో మఱి జీవుఁడనుట కేమియు నుండదు. అపుడు బీజరూపమైన 'నేను' అనెడి వస్తువు జీవత్వముచే నభిరంజితము కాదు. అజ్ఞానతావశమున నే యిట్టి జడచేతన సమ్మిశ్రణరూపమైన ప్రతీతి యగును.

సాధక సోదరా ! అమ్మకృపచే నిన్నాళ్లకు నీ యజ్ఞా నము తొలఁగినది. చైతన్యము నీ స్వరూపముగాఁ బ్రతిష్ఠిత మైనది. కనుక జీవరూపముగా నిపుడేదియు వెలయదు. కేవల చైతన్యవస్తువవు నీవే భావించుచున్నావు. కర్తృత్వ భోక్తృ త్వము లనెడి వ్యవహారము నీయందెన్నఁడు నుండలేదు. ముం దెన్నఁడు నుండదు.

## జడత్వసంబంధము తెగిపోయినపై నేమగును ?

బహుకాలమునకు సంచితజీవత్వ మనెడి మాలిన్యము నుండి ముక్తమయి జడత్వసంస్పర్శము తెగిపోయి, నిర్మలాత్మ జ్యోతి వెల్గినది. కావున విశిష్టచైతన్యసమూహము (ఇంద్రియా ధిష్ఠిత చైతన్యవర్గము — దేవబృందము) నిర్విశేషమును ఆనంద మయమునైన సత్తాసంబంధము నొంది నిస్సీమ హర్షము నొంది

నది. విభిన్నశక్తులు నిర్మలబోధస్వరూపమున నభివ్యక్తమైనవి. ఇదే దేవత లానందముతోఁ దాండవించుట.

ఇఁక విను. 'ఆనందస్వరూపబ్రహ్మమందే జీవభావ మున్నది. అనఁగా బ్రహ్మమే జీవుఁడుగాఁ బ్రకటితమగుచున్నది.' సాధకా! ఇప్పటికి నిట్టి జ్ఞానముతోనే మెలఁగుచున్నావు, గాని యిపుడమ్మ కృపచే వెదకినను జీవత్వమన్నది లేనిచోట వచ్చి చేరితివి. జీవభావీయ పరిచ్ఛిన్నతచేత, ఆనందమునకైన సీమాబద్ధస్థితి యనెడి రక్తబీజుఁడు చచ్చెను. గాన నది పూర్తిగాఁ దుదముట్టినది. ఇపుడు వేర్వేఱుగా బొట్టుబొట్టుగా వృష్టిభావములలో నానందసంధానము కాదిది. సర్వవిధముల విశిష్టత విడిపోవుటచేత నానందస్వరూపాత్మయే సర్వవిధముల వెలయుచున్నది. అపుడానందమయమే. విశ్వమయ కేవలానందమే. అసీమానందమే. నిరవచ్ఛిన్నానందమే. అదితక్క నెచ్చటను నేమియును లేదు. "ఆనందస్వరూపమగు నేను, పరమప్రియమగు నేను, అమృతమయమగు నేను సర్వత్ర యుద్భాసించుచున్నాను. నా యానందమునకు మొదలులేదు; తుదలేదు; ఉద్వేలనములేదు. నేను మహాప్రశాన్తుఁడను; ధీరుఁడను; స్థిరుఁడను." అను నిట్టి యనుభవము లభించును. ఆ యవస్థయందు జీవుఁడు, జగత్తు, జనన మరణములు, రోగ శోకములు, చంద్ర సూర్యులు, ఆకాశనక్షత్రములు, సర్వము నొక ఘనానందసత్తచే నిండినవనెడి బోధము గల్గును. కనుక దేవతలకు — ఇంద్రియాధిష్ఠాన చైతన్యబృందమునకు సాటిలేని యానందము గల్గదా?

సాధకా! రారమ్మ. నీవును నీ యానందసంధానము నొంది యానందమయుఁడవై ధన్యుఁడవగుము. సత్యప్రాణము

లందుఁ బ్రతిష్ఠితుఁడ వగుము. నీ నిరవచ్ఛిన్నానందము ననుభవించి జగత్తునం దానందమును వెదజల్లుచుఁ దిరుగుచుండుము.

శ్రీ గురుని మంగళమయాశీర్వాదము నిన్నుఁ ధన్యునిఁ జేయుఁగాక.

## అమ్మ యచింతనీయ లీలారహస్య మెంత ధన్యము !

దేనిని విడిచిన నేమియు లేదో, నిత్యమై వెలయున దేదో, ఏకాంతసులభ మేదో, దాని నెఱుంగుటకై, దాని నొందుటకై యిన్ని విపరీతావస్థలం బడి సాధకుఁ డగ్రసరుఁడగును. ఇది విచారించి చూడఁగా వింతయేయగును. ఔరా! 'నేనున్నాను' అనున దెంత సహజమో, ఎంత వెల్లడియో ఆ యానందమయు మాతయు నంత సహజ; అంత స్వాభావిక; అంత స్వప్రకాశ; అయినను దన స్వరూపము నుద్భాసింపఁ జేయుటకు మనలనుబట్టి మనకై యెంత లీలావైచిత్ర్యమును జూపవలసి వచ్చినది. ఎంత ప్రకటగా నుండునో, యంత మఱుఁగుగా నుండును. ఈ నిత్యసిద్ధ వస్తువును వెల్లడించుటకై యెంత విచిత్రలీల నడుపవలసి వచ్చినది ! ఈ ప్రత్యక్షవస్తుస్వరూపమును జేయుటకై మనగురువులు పలుతెఱఁగుల యుపదేశములు, పలువిధముల శిక్షలు నడుపుటగుచున్నది. వారు వస్తువిచారమందును విస్మితులగుచున్నారు. అమ్మ యచింతనీయలీలారహస్య మెంతగొప్పది ! ఎంతధన్యము. భగవంతుఁడే ——

"ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవ చాన్యః

ఆశ్చర్యవచ్చైన మన్యః శ్రుణోతి
శ్రుత్వాప్యేనం న వేద కశ్చిత్॥ —గీత.

శ్రుతి — "ఆశ్చర్యో వక్తా కుశలాఽస్య లబ్ధా".

ఇంత విచిత్రములు సాటిలేని కోపమును వెల్లడించి రనుదాని రహస్యము. ఇపటి గీతాగురు వాక్యమును వినఁదగినదే.

అస్మితా మమతల సర్వము విలయమొందినది. జీవత్వము తజ్జన్యాసుర భావములు నశించినవి. వాని నాశ్రయించియే యున్నారు. ఉండఁగలరు. ఇపుఁడూత లేకున్నను వానికి సాటిలేని కోపము దుఃఖము గల్గుటయు నుచితమే. కోపము ఆత్మ స్వరూప ప్రకాశమునకైనపు డది సాటిలేనిదే. భగవంతుఁడు "కామాత్ క్రోధోఽభిజాయతే" అన్నాఁడు. కామన వలనఁ గ్రోధము గల్గును. అనఁగాఁ గామము నెఱవేఱకున్న మనసునకుఁ గల్గు వికారమే కోపము. ఆత్మప్రకాశమునకైనపుడది సాటి లేనిదే. ఈ కోపమే సర్వవిధముల వానినడుగంటించును. అదియు భగవంతుఁడు స్పష్టముగా నన్నాఁడు. "క్రోధాద్భవతి సమ్మోహః" క్రోధమువలన సమ్మోహము (మతిచెడుట) యగును. ఆత్మ యొక్క స్వప్రకాశత్వమును ఆనందమయత్వమును జూచి యస్మిత కేవల ముగ్ధమయ్యెను. తన యస్తిత్వమునకు స్వస్తి చెప్పియు, నాత్మప్రాప్తికే వేడుకపడినది. దీనిపేరే సమ్మోహము. "సమ్మోహాత్ స్మృతి విభ్రమః" ఈ మోహముచే స్మృతి విభ్రమమగును. పరమప్రేమమయ పరమాత్మస్వరూప మందుఁ గేవల ముగ్ధుఁడగుటచేఁ దన పృథగస్తిత్వ విషయమున

స్మృతి లోపించిపోవును. "స్మృతిభ్రంశాద్ బుద్ధినాశః" తన యునికి విస్మరింపఁబడుటచే (ఉనికి-సత్త) బుద్ధినాశమగును. బుద్ధి తనకడ కింద్రియములచేఁ గొనితేఁబడిన విషయములను ప్రకాశింపజేయునది మాత్రమే. చిత్తమం దింకెట్టి వృత్తిప్రవాహము ను లేనపుడు ప్రకాశింపఁజేయుట కేమియు నుండదు. అపుడు ప్రకాశకమగు బుద్ధియు నవసన్నమగును. ఇట్టులు స్మృతి భ్రంశముచే బుద్ధినాశమగును. "బుద్ధినాశా త్ప్రణశ్యతి" బుద్ధి నాశముతోనే తాను బూర్తిగా నశించును. అస్మిత తన కాత్మ కంటె నతిరిక్తమైన పృథక్సత్త కలదనుకొనుచున్న దేదో యది పూర్తిగా లోపించిపోవును. బుద్ధియు నస్మితయు నొక్కటే (అభిన్నము) అని మున్నే చెప్పఁబడెను గాన, బుద్ధినాశమన్నను అస్మితానాశమన్నను నొక్కటే యర్థము. క్రోధమువల్లనే యీబుద్ధినాశము సూచింపఁబడినది. అహంతను లోపింపఁజేయు కోపమునకు సాటి జగత్తునం దేదియుండును ? "నేను జీవుఁడను" అనెడి భావము విలయమైపోయిన వెంటనే ఆత్మనాత్మ స్వరూపముఁ జేయుటకై (ఆత్మగానే చేయుటకై) అస్మితా క్షేత్రమం దొక్కసారి మిగిలిన యుద్యమములన్నియుఁ దల సూపునపుడు దాని వెలిగుఱుతు క్రోధము. కాని, ఫలము విప రీతము. ఆత్మ యస్మితను దనముగానే చేసివేయక, అస్మితయే యాత్మగా నయిపోవును. క్రమముగాఁ జూతుఁడు.

ఆత్మలాభమునకై ముందడుగు వేయునది మమతయే.

'నా యాత్మ' యనుచు నంబికను బట్టుకొనఁబూనినది మమతయే (శుంభునితమ్ముఁడు నిశుంభుఁడే). నిశుంభునకు (మమ

తకు) ముందువైపు ఆత్మలాభ వాసన, వెనుకవైపు జగద్భోగ వాసన; ఇరువైపుల బహుళైశ్వర్య వికాసవాసన. వీరే ముఖ్యాసురులు.

ఇచట— "రక్తబీజుని వధసందర్భమున జీవభావము దాఁక విలయమైపోయెనే; మఱల ముందువెనుకలఁ గుడి యెడమల నీ యసురు లెటనుండి వచ్చిరి?'' అని శంక కలుగవచ్చును. దానికి సమాధానమిది - మధుకైటభులు (మూలబహుత్వసంస్కారములు) మొదలు రక్తబీజుఁడు (జీవత్వము) వఱకుఁ జెప్పఁబడిన యసురుల కథలలో జీవభావీయ సంస్కారవిలయము చెప్పఁబడినది. ఇచ్చట నీశ్వరభావీయ సంస్కారముల నాశము మాట చెప్పఁబడినది. కనుక నిశుంభుని (మమత) నలువైపుల నున్న యసురుల నీశ్వరభావీయ సంస్కారములుగాఁ గైకొన్నచో నెట్టి సంశయము నుండదు. ఈ (నిశుంభ శుంభ) మమతాస్మితా (వినాశ ప్రసంగమున) ఈశ్వరత్వ విషయక సంస్కారముల క్షయము వర్ణింపఁబడును. పరమాత్మ స్వరూపమందుఁ జేరు పక్షమున జీవభావీయ సంస్కారములును బ్రతిబంధకములే. జీవత్వము ఈశ్వరత్వము అను రెండిటి విలయమును సాధింపఁ గల్గినపుడే యంబికాప్రాప్తి యగును. ముక్తిని గోరువారు యథార్థముగా, ఇహాముత్ర ఫలభోగవిరాగము (అసఁగా నీశ్వరత్వమువఱకు నైన యుపేక్ష) గలవారును మాత్రమే, ఈ యద్వయామృతమయాత్మ స్వరూపమును సాక్షాత్కరించుకొనఁగలరు. మమత (నిశుంభుఁడు) "నా యాత్మ" యనుచు, నాత్మతో నాత్మీయతనుగూర్చి, తన విశిష్టతను నిల్పుకొన నుద్యమించెను. ఉద్దేశ్యమేమనఁగా, ఆత్మ నాత్మీయముగాఁ

జేసికొనఁగల్గుటచేతనే యీశ్వరత్వప్రాప్తి యగును. స్వాధీన బుద్ధితో ముక్తప్రాణముతో జగద్రూపమైన యైశ్వర్యవిలాసము ననుభవించుటగును. స్వాధీన భావముతో—ఇదే నిశుంభుఁడు—యుద్ధాభిమానముతోఁ బయలుగెత్తు రహస్యము.

ఆత్మతో నాత్మీయతను గూర్చు సామర్థ్య మెపుడు గల్గును?

సాధకుఁడా! ఇచటికి వచ్చి నిల్వఁగల్గుదువేని ఈశ్వరత్వ మన నేమో, ప్రేమభక్తి యన నేమో తెలియఁగల్గుదువు. ప్రేమ భక్తిస్థానమని నీవు దేనిని దలంతువో, యది ప్రేమ భక్తిస్థానము కాదు. నీవును నిశుంభునివలెనే 'నా యాత్మ' యనుకొని దానితో నాత్మీయతను గూర్పలేనంతదాఁక, ఆత్మ స్వరూపాభాసము నొందనంతదాఁకఁ బ్రేమ భక్తి విషయ మాలోచించు నవసరమేది? 'నా యాత్మ' యని పలుకుటకును దెలియుటకును దగు సామర్థ్యము నాది యనుట కేమియు లేన పుడే కలుగును. సర్వభావ విలయము కానంతదాఁకఁ జిత్తము నందు భావప్రవాహమునిల్వనంతదాఁక (అరికట్టఁబడనంతదాఁక) "నా భగవంతుఁడు – నా యమ్మ – నా యాత్మ" యనను, దలఁ పను దగు సామర్థ్యము, నాది యనుట కేమియు లేనపుడే – అనఁగా నాత్మీయతను దెల్పువాక్యముల సార్థకత యనుభవము కానంతదాఁకఁ గలుగదు. సాధకునకు నాత్మయొక్కటే లక్ష్య మయి మఱొకటి బోధమయ క్షేత్రమున నుబుకనపుడే, యాత్మతో నాత్మీయతను గూర్చు సామర్థ్యము గలుగును.

చూడుమయ్యా! నిశుంభున కాయువు పూర్తిగాఁ జెల్లి పోయినది గాని, "నా యంబికను నేను గోరుచున్నాను"

(ప్రేమించుచున్నాను) అనుచు వాఁడెటులు తీవ్రవేగముతో
ముందడుగు వేయుచున్నాఁడో, అటులే నీవును బట్టుదలతో
ముందంజ వేయుము. ఈశ్వరత్వమునందును లాలసుఁడవు
కాకుము. హాని లాభముల విచారింపకుము. కేవల ప్రేమలో
మునుఁగుటకే మైమఱచుటకే ప్రయత్నింపుము. తప్పక యమ్మ
నొందుదువు. 'నాది' యనుమాట నొక్కసారిగా మఱచి
పోదువు. కేవలాత్మ స్వరూపమందే నిల్తువు.

ఆ నేను ఈ నేనులోఁ జేరి యొక్కటైపోవును. ఈ నేను ఆ
నేనులోఁ జేరిపోయి శాశ్వతముగా నొక్కటైపోవును-ఎప్పుడు ?

వినుము. అంబికకంటె వేఱుగా ఆత్మనామముతో
నొకఁడున్నాఁడు. అతఁడే యథార్థముగా ఈశ్వరుఁడు. అతనిని
లోఁబఱచుకొనఁగల్గినచో యథార్థముగా నీశ్వరత్వములభించును
అని తెలియును. కనుకనే యస్మిత కింత పట్టుదల, ఇంత తీవ్ర
ప్రయత్నము. అస్మిత (శుంభుఁడు) తననే యీశ్వరుఁడుగాఁ
దలఁపఁజూచినది, గాని యప్పుడప్పుడు విశుద్ధాత్మ స్వరూపము
భాసించుటఁ జూచు కారణమునఁ దన స్వరూపముయొక్క
యపూర్ణతను విశేషించి యనుభవించుచున్నది. కనుక నాత్మ
లాభమునొంది తన యపూర్ణతను దొలఁగించి తాను పూర్ణత
నొందఁగోరినది. అభిప్రాయమేమనగా— నేనుగాక మఱియొకఁడు
నేనునకు సత్తగాఁ గానవచ్చు దానినెట్టులైన వేఱుగా నుండ
నీయ నొల్లదు. ఆ నేను ఈ నేనులోఁ జేరి యొక్కటయిపోవును.
కాకయున్న, ఈ నేను ఆ నేనులోఁ జేరిపోయి శాశ్వతముగా
నేకమైపోవును: రెండు నేనుల యునికి (సత్త) యెట్టులు

నేనాఁడును నుండదు. అస్మితాక్షేత్రమును జేరిన ముముక్షు సాధకుఁడు గాకున్న నీమాటలు బోధపడునా? పడవు. ఆత్మ స్వరూపాభాసము నొందనంతదాఁక నస్మితయే యాత్మగా భాసించుచుండును. వాస్తవముగా నది (యస్మిత) యాత్మకాదని తొల్త నెట్టులును దెలిసికొనఁజాలదు. క్రమముగా నాత్మ సాన్నిధ్య లాభమగుచున్న కొలఁది, దానిని లోఁబఱుచుకొను పట్టుదల గలుగును.

(ఇదే శుంభుఁడు నిశుంభునితోను, ఈశ్వరవిభూతియొక్క సంస్కారముల నెడి యసురదళముతోను, క్రోధముతో యుద్ధ రంగమున దిగి, యంబికా శరీరమునుండి వెడలివచ్చిన మాతృ శక్తులతోఁగూడఁ జండికాదేవిని జంపఁగల్గినపుడే యంబికాదేవి యొంటరియైపోవును. అపుడే సంభవము అనుట.)

ఇదే శుంభనిశుంభుల (అస్మితామమతల) సంగరరహస్యము.

మమత 'నాయాత్మ' యనుచు, ఆత్మ నాత్మీయముగాఁ జేసికొనఁ బ్రాణములొడ్డి ప్రయత్నించెను. మఱి యస్మిత 'నేనే యాత్మ' ననుచు యథార్థాత్మసత్తను నిరసింపఁ బ్రయత్నించెను. ఇదే రహస్యము.

సముద్ర సమీపమును జేరబోటనే ప్రవాహవేగ ప్రబలత.

'తత్త్వమసి' మున్నగు మహావాక్యముల మననము చేయుచు నిదిధ్యాసముల నభ్యసించువారు, ఈ యస్మితా మమ

తల యతిసూక్ష్మ భీషణాక్రమణమును గుర్తింపఁగలరు నిజ
ముగాఁ బరమతత్త్వమును బరమధామ రూపమును దెలియఁ
గలవాని కెట్టులును విశ్రాంతి (శాంతి) లేదు. కనుకనే సాధకు
లీక్షేత్రమందుఁజేరి యాత్మలాభము నొందుటకై బహుళ
ప్రయత్నమును జేయుటగుచున్నది. పాతంజల యోగసూత్రము
లందు, "తీవ్రసంయోగానా మాసన్నః" సంయోగము=అస్మిత
కోరినటులు పూర్ణముగాఁ జేరిపోవుట. తీవ్రసంయోగ సంపన్ను
లైన సాధకులకు, నాత్మలాభ మాసన్నమగును. వాస్తవమైన
యనుభూతియందును నిట్టి తీవ్రసంయోగము కేవలస్వాభావికము
గానే వచ్చునని కానఁబడుచున్నది. సముద్ర సమీపమునఁ
జేరుచోటనే ప్రవాహవేగము ప్రబలమగును. సాధకుఁ డాత్మ
నెంతగా సమీపించునో యంతగా వాని యధ్యవసాయమును
ప్రబలమగును.

ఇదే శుంభ నిశుంభులచేనైన యత్యుగ్ర శరవర్షము
యొక్క రహస్యము.

మూలమంత్రమందు, వారిని వర్షించు మబ్బులతో
నుపమించెను. ఇందును గొంతయుద్దేశమున్నది — మేఘములు
తెంపులేక కురిసి వట్టిపోయి క్రమముగా సత్తను గోల్పోయి,
తుదకుఁ గానరాకయేపోవును. అటులే యస్మితా మమతలును
దీవ్రవేగముతో నధ్యవసాయ ప్రయోగమనెడి బాణములను
గురిసి యంతలోనే తమ సత్తను గోల్పోయెనని భావము, అపు
డాత్మసత్తయే మిగిలియుండును. అస్మితా మమతల పేరైన
నుండదు. క్రమముగా నదియుఁ జూతము.

జీవభావీయ పృథక్సత్త యెటులు నశించునో వినుము.

మున్నొకసారి చెప్పినదే చెప్పుచున్నాను.

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే,
అప్రమత్తేన బోద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥"

ఉపనిషత్తునందుఁ జెప్పఁబడిన యీ శరప్రయోగము యొక్క చరమోత్కర్షత, యీ యస్మితామమతల (శుంభ నిశుంభుల) యుద్ధమందే కానఁబడును.

సాధకుఁ డెంతగాఁ బ్రణవధనుస్సును బూని బ్రహ్మ లక్ష్యమం దాత్మశరమును వేయుచుండునో, యంతగా నతని శక్తి-పృథక్సత్త తఱిగిపోవుచుండును. యథార్థ సత్తానుసంధాన మెంతగా నగుచుండునో యంతగా జీవభావీయ పృథక్సత్త నశించుచుండును.

ఇదే యసురాధిపతుల శరపరంపర, అమ్మ శరపరంపరచే వ్యర్థమగుట, వారి యంగములు క్షత విక్షతములగుట యను దాని తాత్పర్యము, చితిసత్తాప్రకాశము మాటికిని క్షణస్థాయి యగుటను దెలిసికొనుటచేతనే, యీ రహస్యము చక్కఁగా ననుభవమునకు వచ్చును. అమ్మ నిత్యస్వస్థ; నిర్వికార. ఆమెను (ఆత్మను) దనదిగాఁ జేయ నెంతగాఁ బ్రయత్నించునో, యంతగా "నేను-అహమ్" క్షీణించుచుండును. ఆత్మయొక్క యీ నితాంత నిర్మల స్వరూపాభాస ముజ్జ్వలతరమై సాధకు నెదుట వెలయుచుండునో, యంతగా నస్మితామమతలు క్షీణకరము లగుచుండును.

ఈ శుంభ నిశుంభ (అస్మితా మమతలతోడ) యుద్ధమందుఁ
ప్రయోగింపఁబడిన కొన్ని యస్త్రముల రహస్యము.

ఇచట—అమ్మ యుత్తమవాహనమైన సింహము మాట తెలిసికొనవలసియున్నది. మాతృశక్తిని నడుపు యంత్రమైన జీవుఁడే సింహము. ఇమ్మాట మున్ను రెండవమాటయందుఁ జెప్పఁబడినది. ఆ సింహము మఱలఁ బనికిరాకుండఁ జేయు నభిప్రాయముతోనే దాని తలపై ఖడ్గముతోఁ గొట్టెను. ఇటులు చేసినచో నంబిక తన కధీనయగునని వాని యుద్దేశ్యము.

ఇక్కడ నొక యాపత్తి—ఇచట మఱల జీవసింహ మెట నుండి వచ్చినది ?—రక్తబీజవధమందే జీవసింహము నశించినది కదా; విశేషము—"బుద్ధియందుఁ బ్రతిబింబితమైన చిత్తే జీవుని యథార్థ స్వరూపము. అదె యిచట శుంభాసురుఁడుగా వర్ణింపఁ బడినది. అపుడు మఱల దేవీవాహనసింహ మెటనుండివచ్చును?" అను నిట్టి యాపత్తి సత్యమే. దీని కుత్తర మిది. - వాస్తవ దృష్టితోఁ జిదాభాసుని కంటెను నతిరిక్తుఁడు జీవుఁడగుట కేమియు లేదు. ఐనను అస్మితామమత లుండునంతవఱకు నిట్టి యొకశక్తి, దానియందు 'నేను జీవుఁడ' ననెడి యభిమాన మింతయు లేకున్నను జీవుఁడాత్మయొక్క యొక విశిష్టప్రకాశమే. ఇమ్మాట త్రోసివేయరానిది. ఆ విశిష్టతాంశమే దేవీవాహన సింహము.

ఇచట వాహనమున కొక విశేషణ మున్నది. 'ఉత్తమ'. దీనిచే మును జెప్పిన దేవీవాహన సింహము స్థూలాభిమాని. ఇదియో - ఆనందమయ కోశమునం దతిసూక్ష్మతమ శక్తి

ప్రవాహము. ఇచట నెట్టిను స్థూలత్వము వ్యక్తము కాదు. కనుక నే దీనిని 'ఉత్తమ' మన్నాఁడు. వినుము – సుషుప్తికాల మందు జీవుఁ డానందమయకోశమం దుండును. అపుడు స్థూల సూక్ష్మ విషయకమగు నెట్టి జ్ఞానము నుండదు. కాని యపుడుండునట్టి యజ్ఞానవిషయక జ్ఞానాంశమును బట్టుకొనుటచేత నే దేవియొక్క యీ యుత్తమవాహన సింహపు రహస్యము నెఱుంగఁగలరు. అస్త్రరహస్యము వినుము.

క్షురప్రము – మంగలికత్తివలె నేయుండు నొక బాణాస్త్ర విశేషము. దీని యాధ్యాత్మికార్థ మేమనఁగా – ఆత్మస్వరూపమును ప్రకాశింపఁజేయు నొక శక్తివిశేషము. ఏ శక్తి లేకపోవుటచేత నీశ్వరభావీయ విక్షేపము నివారితమగునో యదే క్షురప్రాస్త్రముగా వర్ణింపఁబడినది.

అసి – కత్తి. ఈ శబ్దముచే నిచట భేదజ్ఞానము అనఁగా నీశ్వరభావీయ విక్షేపశక్తి.

చర్మ – డాలు. ఈ శబ్దముచే ఆత్మస్వరూపావరకశక్తి. (స్వరూపమును గప్పిపుచ్చునది.)

ఈ డాలు ఎనిమిది చంద్రచిహ్నములు గలదిగాఁ జెప్పఁబడెను. దీని రహస్య మేమనఁగా – ఇంతకుమున్నే అష్టపాశవిలయము చెప్పఁబడినది. వాని శేషచిహ్నముల నెడి సూక్ష్మతమ బీజములే యష్టచంద్రచిహ్నితమైన డాలుగాఁ జెప్పఁబడినది. సాధారణముగాఁ జర్మాస్త్రమును 'డాలు' అందురు. ఇది యావరణశక్తికి మాఱు పేరే. స్వయంప్రకాశాత్మశక్తి మమతను (నిశుంభుని) విలయ మొనర్చుటకుఁ బూనినపుడు, ఆ సూక్ష్మ

తమ బీజమనెడి యావరణశక్తి ప్రభావముచేఁ దన్ను మఱుఁగు పఱచుకొనఁ బ్రయత్నించును. ఇది మమతాస్వభావము. అమ్మ యిపుడు దానిసైతము నాశమొనర్చినది.

శక్త్యస్త్రము — మును జెప్పిన విక్షేపావరణ శక్తులను గల్గించిన మూలాజ్ఞాన మనెడిదియు శక్తివిశేషమే. దీని వివరణము విపులము. అజ్ఞానము సైతము శక్తివిశేషమే యనుట వేదాన్తశాస్త్రమందును స్వీకరింపఁబడినది. ఉండనీ. అజ్ఞానమనెడి మూలశక్తిచే నగు నావరణ విక్షేపములనెడి రెండుశక్తులును నశింపఁగానే నిశుంభుడు (మమత) ఇదే తుదిసారి దెబ్బ యనునట్లు, తన యధ్యవసాయముల నన్నిఁటిని బ్రయోగించి, యా మూలాజ్ఞానశక్తిని బట్టి యుంచుటకే ప్రయత్నించెను. ఇదే శక్త్యస్త్రముగా వర్ణింపఁబడెను. అమ్మ దానిని గూడ వమ్మొనర్చినది.

చక్రమనగా — సుదర్శనము. సుదర్శనమనెడి చక్రము అదె జగచ్చక్రము. మున్నీ చక్రరహస్యము విశేషించి చెప్పఁబడెను. మమత తననే యాత్మగా నెంచి యాత్మను బరిగ్రహింప ముందడుగు వేయఁగానే మన యమ్మ జగచ్చక్రము నెదుటఁ బెట్టి మఱపించివేసెను. అనఁగా సాధకుఁడు అజ్ఞానవశుఁడై "మమ" నాది యంచు నాత్మను బట్టుకొనఁగడఁగునపుడు, సరిగా నాత్మను బట్టుకొనలేఁడు. తుట్టతుదకు ఆత్మవిభూతులు—అనఁగా నీశ్వరభావీయ సంస్కారములు, ఎదుటఁ బడును. వానిపైనే మమత చేరుకొనును — పుట్టునని యర్థము. కాని యనాత్మభావములయెడ నైన మమత్వము మున్నే లోపించిపోయినది. పరవైరాగ్య ప్రభావముచే జీవభావీయములును, ఈశ్వరభావీ

యములు నైన సంస్కారములు వచ్చి యెదుర నిల్చినవి. సర్వవిభూతుల త్యాగమునకును గ్రహణమునకును అయోగ్యములై పోయినవి. అవి పూర్తిగా ననుభవింపఁబడినవి. మమత యాత్మనే కోరుచున్నది. దానిని మఱెద్దియు లోభపెట్టి ముగ్ధముఁ జేయఁజాలదు. కనుకనే యమ్మ యెంతగ జగచ్చక్రమును, ఆత్మవిభూతిని జూపి లోభపెట్టి మమత్వముయొక్క ప్రగతిని నిరోధించుటకుఁ బ్రయత్నించినదో, యంతగా మమత్వముల్లాసముతో (ఉత్సాహముతో) అమ్మవంకకే ముందడుగు వేయుటకుఁ బ్రయత్నించుచున్నది. ఆత్మ నాత్మీయముగాఁ జేసికొని, మమత్వమెందు నీప్రయాసము నిష్ఫలమేయైన నీ ప్రయత్నము వలనఁ గొంత యుపకారమున్నది. సాధకుఁడు మూలాజ్ఞాన ప్రభావముచే నెన్నిసార్లు ఆత్మ నాత్మీయముగాఁ జేయఁగడఁగునో, యన్నిసార్లు నింతో యంతో మమత్వబోధ క్షీణించుచునే యుండును. గనుకనే, అమ్మ చక్రప్రయోగముచే నిశుంభుని శక్తిహీనతా విషయవర్ణనము, సాధకమాత్రునికే సూక్ష్మానుభవయోగ్య విషయమగును.

సాధకా! ఇది నిల్కడతో నాలోచింపుము.

మమత పలుసారులు పెక్కు లుపాయములతోఁ దన విశిష్టతను రక్షించుకొని యాత్మ నాత్మీయముగాఁ జేయఁ బ్రయత్నించెను. (ఇదె దేవీ నిశుంభుల పరస్పర యుద్ధము.) నిశుంభ క్షిప్తశూలమును దేవి పిడికిటితోఁ బిండిచేసినది. నిశుంభ క్షిప్తగదాస్త్రమును దేవి త్రిశూలముతోఁ జూర్ణించినది. వాఁడు వేసిన పరశువును దేవి బాణప్రయోగముచేఁ

బడఁగొట్టినది. (వానిని మూర్ఛిలఁజేసినది.) శూలము—స్వరూప విషయక జ్ఞానము; గద—వ్యక్తవాక్య ప్రయోగము. (స్తోత్రపాఠ మహత్త్వ కీర్తనాదికము.) పరశువు—ద్వైతప్రతీతి. ఈ యస్త్ర శస్త్రముల యాధ్యాత్మిక వ్యాఖ్య మాటిమాటికి నిష్ప్రయోజనము.

సారాంశమేమనఁగా—"నేనున్నాను, నాది యనుటకు నీవు మాత్ర ముండుము" అను నీ భావమే నిశుంభుని పలు విధముల యస్త్రశస్త్రములుగా వర్ణింపఁబడినది. ఎవ్వనికైన నీ భావము సాధనజీవనమందు సత్యముగా నున్నట్లు తెలియఁబడి, యీ స్థానమందతడు చేరఁగల్గుచో, నతఁడే ధన్యుఁడని గొంతెత్తి చెప్పవచ్చును. ప్రేమ భక్త్యనుశీలమున కిదియే తుదియవస్థ. ఇది సత్యమే కాని, యిచట నిల్చినను బని సాగదు. ఇంకను ముందడుగు వేయవలయును. గనుక (నిశుంభుఁడు) మమత యెంత ప్రయత్నింపనీ, ఎంత ప్రేమభక్త్యనుశీలనము చేసి యాత్మరసాస్వాదము చేయనీ, తన విశిష్టతను జూడ నెంత ప్రయత్నింపనీ, అమ్మ వానిని వమ్మే చేయుచుండును. కనుకఁ జండికాదేవియు ననేకాస్త్ర ప్రయోగముచే అనఁగా—అద్వయ జ్ఞానాలోక ప్రదానము చేసి, మమతయొక్క యా విశిష్టతను దొలఁగింపఁ బ్రయత్నించినది. దాని ఫలముగానే, యనఁగా—ఆత్మయొక్క స్వప్రకాశ శక్తి ప్రభావముచే మమతయొక్క విశిష్టప్రకాశము క్రమముగా క్షీణబలమై మూర్ఛితమైనది. ద్వైతప్రతీతి కొంతసేపు విలయమైనది. మమతకుఁగల యొక ప్రధాన సత్తను దాననుభవింపలేక పోవుటచే నది మూర్ఛనొందినది. వైష్ణవ శాస్త్రమందును

ప్రేమ ధర్మానుశీలన ఫలముగా నిట్టి మూర్ఛాకథ వర్ణింపఁ బడినది. భక్తిశాస్త్రమందుఁ జెప్పఁబడిన యెనిమిది సాత్త్విక భావములందును దుదిని మూర్ఛావస్థ "నాది, నాది" యనుచు నాత్మను బట్టుకొనునపుడు 'నాది' యను బోధము లోపించి కేవలాత్మస్వరూప ముద్భాసించినపుడే యథార్థప్రేమ ముదయించును. సాధకా! ఇచట మూర్ఛా శబ్దముచేఁ జైతన్య లోప మనుకొనకుమా. చైతన్యస్వరూపమును సమీపించు నపుడు జీవుఁడెప్పుడును జైతన్యహీనుఁడు కాఁజాలఁడు. ఎచట నైనను జూడు. జీవుఁడెన్నడైన భగవన్నామ స్మరణమునో, కీర్తనమునో చేయఁగాఁ జేయఁగా, అచేతనుఁడై పడిపోయి నపుడు, వాఁడింకను జైతన్యవస్తుస్వరూపమును దెలిసికొనఁ జాలఁడయ్యెనని తెలిసికొమ్ము. దానిని సమీపించుట యనునది దూరపుమాట. చైతన్యస్వరూపమును స్మరించుచునే, అచే తనుఁ డయ్యెనేని, వాఁడు మనోమయ క్షేత్రమును విడిచి రవ్వంతయుఁ బైకి లేవలేదని యెఱుంగుము. ఇది నిల్కడతో నాలోచింపుము.

మమత యేయవస్థనుండి యెన్నిమెట్లెక్కెనో చూడు.

సాధకా! ఈ మమతయే యొకప్పుడు (స్థూలమందు) సంసారమందు – కామినీ కాంచనములయెడ నాకృష్టమైనది. అనేక కఠినవ్రతములు, ప్రయత్నములు కాఁగా బహుకాలము నకు దానినుండి విడిపించి విధ్యుక్తధర్మములయెడకుఁ దెచ్చినది. అపు డీ మమత ధర్మమునే తనదిగా నెంచి చేకొన్నది. మఱి యెంతో కాలమునకు బలుపుట్టువుల తర్వాత, అమ్మ కృపచే

శ్రీగురుని యహైతుక ప్రేరణముచే ధర్మసంస్కారములను విడిపించి యథార్థ సాధనరాజ్యమందు నిల్పినది. అపుడా సాధనమునే తనదని నలిపివేసెను. పిదప మహాసుకృత ఫలముగా నిన్నాళ్లకు, ఆత్మస్వరూప సంధానము నొంది తననే తనదిగా నెంచెను. చూచితివా; యీ మమత యెక్కడినుండి యెక్కడకు వచ్చినదో! ఆసపెట్టి విడిచి, స్థూల సూక్ష్మభావముల నన్నిటిని విడిచి కారణతత్త్వమునకు వచ్చి చేరినది. ఎంత నీచావస్థనుండి, యెంత యుచ్చావస్థకువచ్చినదో చూడుము. అయినను మమత స్వభావమును వీడలేకపోయినది. అది యిపు డాత్మను విడిచి మఱి దేనిని గోరదు. జగత్సంస్కారముల నన్నిటిని విడిచి, యాత్మలాభమునకై ప్రయాసపడుచున్నది. కాని యిదియు భేదజ్ఞానమాత్రమే, గాన మన యమ్మ దానిని సైతము చంపును.

సాధకా! ఈ రుద్రగ్రంథి భూమిక కెక్కినపుడు, భేదజ్ఞానమని వ్రాయుచోట, స్వగతభేదమాత్రమే గుర్తింపఁబడునని తెలియుము. మఱువకుమా – సజాతీయ విజాతీయముల మాట యిట నుండనే చాలదు. అది యుండనిమ్ము. ఇపుడు మమత (నిశుంభుఁడు) అమ్మ యద్వయ స్వరూపప్రకాశముచేఁ గొంత వడి మూర్ఛిల్లెను. అనఁగా మమత్వము మఱి వికసింప లేదనుట. దీనిచే (శుంభుఁడు) అస్మిత తానే వడిగా నంబికను జంపఁ గడఁగెను. ఆత్మను జంపఁగల్గినచో అస్మితామమతలు (అన్న దమ్ములు) నిరుపద్రవముగా నుండఁగలరు కాని, అకటా! అది యసంభవము.

శుంభయుద్ధ రహస్యమును సూక్ష్మబుద్ధితో గ్రహించునది.

శుంభుఁడు తన యెనిమిది చేతులందు నెనిమిది యాయుధములను దాల్చి రథమెక్కి, ఆకాశమండలమందుఁ జేతులను వ్యాపింపఁజేసి శోభించెను.

శుంభుఁడు రథస్థుఁడు. దేహమే రథము. అది స్థూలసూక్ష్మ కారణములని మూఁడు విధములు. శుంభుని రథమనఁగా నిచటఁ గారణదేహమనియే తెలియవలయును. ఏమనఁగా స్థూలసూక్ష్మ దేహములయం దుండిన యాత్మాభిమానము మున్నెన్నఁడో నశించినది. అష్టభుజములు – ఎనిమిది సాత్త్వికభావములు. ఆకాశమండలము–విజ్ఞానమయ వ్యాపకాకాశము. అస్మిత కారణ దేహము నాశ్రయముతో నెనిమిది సాత్త్వికభావములనుగూడి శోభనొందెను. విజ్ఞానమయాకాశము వీనితో నిండినది. ప్రేమ భక్త్యనుశీలనము కాఁగా రోమాంచ కంపాదులైన యెనిమిది సాత్త్వికభావములు ప్రకాశించెను. సాధకా! ఇది స్థూల మందుఁగాదు. అప్రాకృత క్షేత్రమందేసుమా. పూర్తిగా నభో మండలమును వ్యాపించి శోభించెను. ఇదే శుంభుని (అస్మిత) యొక్క యథార్థస్వరూపము. అస్మితాక్షేత్రమందుఁ జేరిన పైనే సాధకున కీ దశ సిద్ధమగును. అతిస్వచ్ఛ చైతన్యమయ వ్యాపకాకాశము అహంతామయమై ప్రకాశించును. అపుడు స్థూలసూక్ష్మదేహముల ప్రతీతియేయుండదు. సాటిలేని చెప్ప రాని యానందబోధమందు మునిఁగిపోఁగోరును, గావున సాత్త్విక లక్షణములు వెలయును. ఇచటజేరి నిలుచుటచేతనే యస్మితకు, అస్మ్యరూపము దూరమునుండియే ప్రత్యక్షమగును. సర్వభావ

ములతోఁ గూడియుండిన 'నేను' ఏనాఁడు నీ యంబికా స్వరూపమును బ్రత్యక్షము చేసికొనఁజాలదు. సర్వభావములతోఁ బూర్తిగా విడిపోయి 'నేను' నగ్నము కాకున్నచో భావాతీతయు దిగంబరయునైన యమ్మ యెడి నెక్కడు కాదు.

## శుంభుని జూచి యమ్మ శంఖ ఘంటానాద ధనుష్టంకారము లను జేయు రహస్యము.

శంఖ ఘంటాధ్వనులు అనాహతనాదములు. ధనుర్గుణ నాదము ప్రణవనాదము. ఇచటి నాదము వైఖరి కాదు. పశ్యంతీ మధ్యమము లనెడి సూక్ష్మ సూక్ష్మతర నాదముల మాటయే యిది. ద్వైతప్రతీతి యుండునంతదాఁక నాద ముండనే యుండదు. భేదము కేవల స్థూల సూక్ష్మముల నంటినదే. (దైత్యసేనల) అసురసంస్కారముల తేజోవీర్యములను నశింపఁజేయుటకు నీ మూఁడునాదములు విశేషావలంబము లగును. ఆసురీ భావములచేఁ బీడింపఁబడునపుడే, యనాహతనాదమునం దభినివేశము నొంది తదేకచిత్తముతోఁ బ్రణవాది మంత్రజపము చేయుటచే వాని యత్యాచారము శాంతించును. దేవీ మాహాత్మ్యమందుఁ దొలినుండియు నిది చెప్పఁబడుచున్నది. స్థూలాసురులు — కామక్రోధాది వృత్తులు; సూక్ష్మాసురులు — అస్మితాదులు; ఇవన్నియు ననాహతనాదముతోఁగూడిన ప్రణవ ధ్వనిచేఁ దిరస్కరింపఁబడును. అమ్మ తానే యుద్ధము చేసినదని మునుఁ జెప్పఁబడినది. లోపలినుండి యమ్మయు సమయానురూప సాధనము చేయును. అనఁగా సర్వోపాయములను

దమంతఁ దామే తోఁచును. సాగిపోవును. ఇదే దేవి చేయు ప్రతీకారము. మాతృసమరము. అది సాధకులు మఱవకుందురు గాక.

## సింహనాదము, కాళి మిన్నంటి కెగిరి రెండు చేతులతో నేలను గొట్టుట, యనువాని రహస్యము.

అనాహతనాద ప్రణవధ్వనులతోఁ గూడిన సింహనాదము — జీవుని యుల్లాసమును సూచించు జయజయధ్వనితోఁ జేరి భూమ్యాకాశమండలము నిండెను; అనఁగా క్షితితత్త్వము మొదలాకాశతత్త్వమువఱకు నైన తత్త్వముల విక్షోభితములయ్యెను. ఇచట స్థూలక్షిత్యాది పంచభూతముల మాట కాదు. అస్మితయొక్క యశేషవ్యూహములనెడి క్షిత్యాదుల యతి సూక్ష్మావస్థలను లక్షించియే యిచట భూమ్యాకాశమండలము మాట చెప్పఁబడినది.

సాధకా! సూక్ష్మతమానాహతనాదముతోఁ బ్రణవధ్వని పరమసూక్ష్మముగా నుబుకుట కాంచునపుడే నీవును మహోల్లాసముతో నగు జయధ్వని చేయుదువు. నీవు జీవసింహమవు. నీలోనుండి వెడలు నానాదముతో మనస్సనెడి మదపుటేనుఁగు చాంచల్యమడఁగి నీ యాసలు పండును.

ఈ విధముగా వేర్వేఱు నాదములు చేరి రోదసి నిండునపుడే, కాళి — సంహారశక్తి · తన రెండు చేతులతో నేలఁ గొట్టెను. అనఁగా క్షితితత్త్వాత్మక వికాసమును విలయమొనర్చె ననుట.

శివదూతి యట్టహాసము - దాని మహిమ.

శివదూతి - ముక్కంటిని దూతగానియోగించి, శుంభుని యుద్ధమువలన నడ్డగించుటకుఁ బ్రయాసపడిన చండికాదేవియే, యసురుల కమంగళకరమైన యట్టహాసమును జేసినది. ఆ భీషణ హాస్యధ్వనికి అసురులు భయపడిరి. శుంభుఁడు కోపించెను.

**హాసము** ఆనందమయాత్మ వికాసము. మనసునకు మాటకు నందని పరమాత్మసత్త మెఱుపుఁ దళ్కువలె క్షణ వికాసము నొందుటే శివదూతి నవ్వు. ఇది యసురులయెడ నమంగళకరమే. ఏమనఁగా - ఈ నవ్వే యసురభావములను విలయమొనర్చునది. ఈ విధమైన పరమాత్మ క్షణికవికాసము చేతనే వారు కేవల భయవిహ్వలులైరి. ఏమనఁగా క్షణకాలము లోనే తమ విశిష్టసత్తను గోల్పోయిరి. అది యెట్టి భయంకరా వస్థయో చూడుఁడు. అసురుల కీ దశ కల్గఁగానే ప్రాణము లొడ్డియైన దన విశిష్టసత్తను నిల్పుకొనఁ బ్రయత్నించెను. సాధకుఁ డొక్కసారి యీ హాసవికాసము నొందుటచేతనే జీవుని పృథక్సత్తాప్రతీతి లోపించిపోవును. మఱి యాసురీభావములు సంత్రస్తములై పోవును. ఆసురిక భావములకెల్ల కేంద్రస్వరూప మైన శుంభుని (అస్మిత) కోపము పెంపొందెను. తన విశిష్ట సత్తను నశింపఁజేయఁగడఁగిన యాత్మప్రకాశమును ధ్వంసము చేయ నడుము కట్టెను.

సాధకుఁడా! అప్పుడే నీ యాసలు నెఱవేఱును.

సాధనామార్గమందు ముందంజ వేయుచుఁబోఁగా శుభ లక్షణములు కానవచ్చిన తర్వాతనే నీ యాసలు నెఱవేఱును.

ఇంకెంతో తడవు లేదని తలంపఁదగును. దేవతలు ఆత్మాభిముఖులు కానంతదాఁక, ఆత్మప్రాప్తికైన యాశ విడంబనమాత్రమే. అనఁగా నింద్రియాధిష్ఠిత చైతన్యవర్గము అమృతానుభూతిని గోరనంతదాఁక యని భావము. ఇంద్రియ మనః ప్రాణ బుద్ధులు, ఒక్క స్వరముతోఁ జేరి మహోల్లాసముతో నాత్మవంకఁ బరుగెత్తునపుడే నీకు మాతృలాభము తప్పకగునని తలంపుము. విడువక "అమ్మా! నా దరికి రమ్మా, నా చేయి పట్టుకొని నీవే యింటికిఁ గొనిపొమ్మా, నేను రెండు చేతులెత్తి 'అమ్మా! అమ్మా!' యనుచున్నాను. నన్నెత్తుకొని యింటికిఁ గొనిపొమ్మా." అని నిష్కపట ప్రాణముతో నేడ్వఁగల్గినపుడే యమ్మ నొందఁగలవు. దేవతలు నీకు సాయపడుదురు. నీ యహంత కవలితమగును. మాతృవక్షమందు శాశ్వతముగాఁ జేరిపోదువు.

## అమ్మకును అస్మితకును జరిగిన యుద్ధరహస్యము.

క్షణకాలస్థాయియైన యాత్మప్రకాశముచే అస్మిత దుర్బలమైపోయినది. తన యస్తిత్వమందు సంశయము కల్గినది. "నేనున్నాను" అనఁగా 'అస్మి' (అస్తి) యను నొక ప్రతీతి యగును. ఈ యస్తిత్వము నాదికాదు, అమ్మదే యను నిట్టి జ్ఞానము భాసించుచుండును. ఇట్టి తెలివి యెంతగా భాసించునో యంతగా నస్మిత దుర్బలమై పోవుచుండును. క్షణకాలమైనను నిత్యమైన దాని యస్తిత్వము ప్రకాశించునపుడు, ప్రతిబింబము యొక్క యస్తిత్వము దుర్బలము కాకుండఁజాలదు. సాధకులే యిమ్మాటల మర్మము నెఱుంగుదురు.

దేవితో యుద్ధము; శుంభుఁడు మూర్ఛిల్లుట.

(దేవీ శుంభులు ఒండొరులపైఁ బఱపుకొన్న యమ్ముల నొండొరులు ఖండించిరి. చండికాదేవి కోపించి శూలముఁతోఁ గొట్టెను. దానితో వాఁడు మూర్ఛిల్లెను.)

సాధకా! ఇఁక వినుము. ఆత్మకు నస్మితకు నైన యుద్ధము బింబప్రతిబింబ యుద్ధము. సాధకా! గుర్తింపుము. సర్వభావములతోఁ గూడిన నీ యహంత తానెట్లును దన స్వరూపమును గోల్పో నొల్లదు. ఎన్ని యుపాయములచేనైన 'అహమ్' ను (తనను) రక్షించుకొనఁ బ్రయాసపడును. ఇదె శుంభుఁడు వందలు వేలుగ నమ్ములు చిమ్ముట. ఇఁక దేవియు (చితిశక్తియు) మాటి మాటికిఁ దన స్వరూపమును బ్రకటించి యస్మితయొక్క యీ విశిష్టాశ్రయమును నశింపఁజేసెను. ఇదె యమ్మ శుంభునిపై లెక్కలేని బాణము లేయుట. ఇదె వీరి యుద్ధరహస్యము.

తర్వాతఁ జండీశూలపుఁ బోటుతో శుంభుఁడు మూర్ఛిల్లెను. శూలాఘాత శబ్దార్థము జ్ఞానమయ సత్తాప్రకాశము. ఇది మున్నెన్నిసారులో చెప్పఁబడినది. "నేను" జ్ఞ స్వరూపవస్తువు. దీనియందు జ్ఞాత జ్ఞేయము నను విశిష్టభావములు లేవు. ఇట్టి యుపలబ్ధిని గుర్తించియే యిచట శూలాఘాత శబ్దప్రయోగ మైనది. ఇట్టి యనుభవము వెలయు ముహూర్తమందే యస్మిత మూర్ఛిత మగును. అనఁగాఁ గానరాదు. క్షణములో దాని విభుత్వ వ్యాపకత్వాది ధర్మములు తిరస్కరింపఁబడును. మన యమ్మ యాత్మవికాస మిట్టిది. ఆ వికాసముచే సర్వభావములును విలయమగును. మఱేమియు మిగులదు. ఏమన, ఆ మిగిలి

నది నోటిమాట కందదు. అది నేనులేని 'నేను' అనగా 'నేను' యొక్క యథార్థ స్వరూపము. ఆ యథార్థమైన నేనే "సోఽహమ్." అదే యాత్మ. అచటం జంద్ర సూర్యుల వికాస ముండదు. గ్రహనక్షత్రాదుల వికాసములేదు. అక్కడ మెఱుపుల కాంతిలేదు. అచట నంతయుం గాంతిహీనమే. ఇట్టిది 'జ్ఞ' స్వరూపము. ఇది కేవలానందమయ స్వరూపాత్మయైన 'నేను'. ఇది మెఱుపువలె వికసించినంతనే యస్మిత మూర్ఛిల్లెను.

న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః।
యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ॥ గీత.

తత్ (పరమాత్మధామ) కీదృశమ్? తదుచ్యతే—నేతి. తత్పరమాత్మనో ధామ సూర్యో న భాసయతే। న శశాంకః। న పావకః ప్రకాశయతి। ఏతే జగద్భాసకాః పరమాత్మని పదే విలయం యాంతీత్యర్థః। కేతావదత్ర సూర్యచంద్రపావకాః పరమాత్మని పదే యేన ప్రకాశతాం యాంతీత్యర్థః। ఉచ్యతే వాక్ప్రాణ మనాంసీతి; బ్రహ్మణస్త్రివృద్భావ ప్రకాశః యేన హి కారణభూతేన సంసారాశ్వత్థోఽయంప్రాదుర్భూతః,సూర్యా దయశ్చ యస్య స్థూలాః జ్యోతిరూపా ఉచ్యన్తే। శ్రుతౌ యథా తస్యైవ వాచః పృథివీ శరీరమ్। జ్యోతీ రూపమయ మగ్నిః ఏతస్య ప్రాణస్య ఆపః శరీరమ్। జ్యోతీరూప మసౌ చంద్రః" । ఏతస్య మనసో ద్యౌః శరీరమ్ జ్యోతీరూప మసావాదిత్యః।

పునః కీదృశమ్? యద్గత్వా ప్రాప్య, న నివర్తన్తే న పునః ప్రత్యావర్తనం కుర్వన్తి, తన్మమ పురుషోత్తమస్య పరమం

ధామ, గతాగతి ధర్మకో, హి త్రివృత్ప్రకాశః। తస్య ఆత్మని విలయాత్ స్వయంప్రకాశ ఆత్మా కుత్ర గచ్ఛేత్? కుత్ర వా ప్రత్యాగచ్ఛేత్; ఇతి, అస్య యౌగికార్థః॥

ఆ పరమాత్మ భూమి యెట్టిది? దాని విజ్ఞానమేమి? అను మాటను సారభావముతో నీ శ్లోకమందు అమ్మ వర్ణించు చున్నది. సూర్య శశాంక పావకులనెడి జ్యోతులచటఁ బ్రకాశింపవు. వాని జ్యోతి పరిమ్లానమైపోవును. ఇట్టి సంకీర్ణార్థమిచట గ్రహణీయముకాదు. సూర్యశశాంక పావకుల యర్థము వాక్ప్రాణమనస్సులు. "తస్యైష వాచః పృథివీ శరీరమ్। జ్యోతీ రూపమయ మగ్నిః అథైతస్య మనసో ద్యౌః శరీరమ్। జ్యోతీ రూప మసావాదిత్యః। ఏతస్య ప్రాణస్య ఆపః శరీరం। జ్యోతీ రూప మసౌ చంద్రః॥" అగ్ని వాక్కుయొక్క జ్యోతీరూపము. అటులే సూర్యుఁడు ప్రాణముయొక్కజ్యోతీరూపము. పరమాత్మ రసఘన ప్రజ్ఞానభూమిని వర్ణించుచున్నాఁడు. సూర్యచంద్రాగ్నుల యర్థము నిందుచే వాక్ప్రాణ మనస్సులని గ్రహింప వలయును. వాక్ప్రాణ మనోరూపములతోనే మొదటి త్రివృత్తులు, ఈ సంసారరచనము చేయును. ఇది శ్రుతిగత విజ్ఞానము, కనుక వాక్ప్రాణ మనస్సులనెడి (త్రివృత్తు) వాని విలయమైన తర్వాత నున్నది పరమాత్మపదము, వెలయునని సునిశ్చితము. ఎచట నీత్రివృత్తు ఏకీభూతమగునో దానిపేరే పరమాత్మ. కనుకనే, అమ్మ — 'అచట సూర్యచంద్రాగ్ను లుద్భాసింపరు' అని చెప్పెను. అనఁగా వాక్ప్రాణ మనస్సులు తమతమ స్వాతంత్ర్యమును గోల్పోయి, యచట నేకరసఘనమైపోవును. ఆ భూమి కది యొక ప్రధానలక్షణము, మఱి రెండవ ప్రధానలక్షణము

"గత్వా న నివర్తంతే" పోయి మఱలిరాదు. త్రివృత్ప్రకాశముచే రచింపఁబడిన యీ విశ్వలీలయందుఁ బోవుట (చేరుట) మఱలి వచ్చుట యనునదే ప్రధాన ధర్మము. ఇచట గతాగతి స్వభావ సిద్ధము. ఆత్మానాత్మము విపరీత ద్వంద్వములతోనైన యీ విశ్వమందు, ఆత్మ అనాత్మలోనికి, అనాత్మ ఆత్మలోనికి మాటి మాటికి గతిశీలమై యున్నది. కనుకనే తమతమ క్షేత్రములకు మఱలివచ్చు స్వభావము — విపరీతధర్మము కలది యగుటచే నెవ్వఁడును నచట నైతము శాశ్వతముగా నుండలేఁడు. ఎచట రసము తక్క మఱేదియు లేదో, ఎచటఁ బరమాత్మ ఆత్మ చేతనే తన్నుఁ దా నిత్యము చూచుకొనునో, ఈ చూచుట యెచట స్వభావసిద్ధమై వెలయునో, క్రియ లేదో, యచట నెవఁ డెచ్చటికిఁ బోవును ? ఎవఁ డెచటికి మఱలును ? స్వయం ప్రకాశమైన యీ భూమి తన ప్రకాశముతోఁ దానే భాసించు చున్నది. తనచేతఁ దానే యెల్లప్పుడు (జ్ఞాత) తెలియఁబడు చున్నది. కనుకనే క్రియాహీనము (శక్తిత్వమునఁ బ్రకాశింప లేనిది) శక్తిత్వ ప్రకాశము లేనిది. ఏమన—అది స్వయంసిద్ధము. స్వయంశక్తి, సర్వవిధక్రియల విజ్ఞానము. యాతాయాతక్రియ దాని యర్థమే. కారణమునుండి కార్యమునకును, గార్యము నుండి కారణమునకుంబోయి వచ్చుట (యాతాయాతక్రియ) సుమేరువునుండి కుమేరువునకు, కుమేరువునుండి సుమేరువునకుఁ బ్రతిక్షణవ్యాపియైన గమనాగమనము, దాని బాహ్యప్రకాశము పేరే క్రియ. విద్యుత్తునందు ఋణము ధనము (Negative & Positive) అనెడి రెండు విపరీత మేరువులు కానవచ్చునటులే సర్వవిధశక్తిక్రియయు నుండును. కనుక నీ పరమాత్మభూమి

యనిర్వచనీయము. ఆ భూమియందు యాతాయాతముల నెడి లక్షణము తెలియఁబడదు. మఱి గతాగతిమయుఁడైన జీవుఁడు అక్షరత్వమువలనఁ దన్నుపస్థితుని జేసి, అవ్యభిచార భక్తియోగముతో సేవించునపుడు, ఆ యాత్మత్వము తక్క మఱెట్టి ద్వంద్వమును దోఁచదు. స్వస్థుఁడగును. ఆత్మకాముఁడు (ఆప్తకాముఁడు) అగును. సర్వకామములును దన యాత్మత్వమందే పర్యవసితములగును. కనుక నా భూమినుండి మఱలివచ్చుటకైన కామమ నెడి కారణము అంతరించిపోవును. కనుక నతఁ డచటి నుండి మఱలివచ్చుటకు బాధ్యుఁడు కాఁడు. తన పరమార్థ స్వరూపము నొందును. మఱి మఱలివచ్చుటన నెట్టిది ? కనుక నా పరమధామమున కీ రెండును ప్రధానలక్షణములు.

అస్మితా మమత లీ విధమునసనే సాధకుని బీడించును.

కథాచిత్రమును గమనించుచు నిందలి రహస్యమును గుర్తించునది. విను; మూర్ఛిల్లిన నిశుంభుఁడు లేచెను. అమ్మ శూలాఘాతముచే శుంభుఁడు మూర్ఛిల్లెను. అస్మితా మమత లీ విధముగానే సాధకుని బీడించుచుండును. ఒకటి తొలఁగనో లేదో, రెండవది తన ప్రభావమును జూపును. "నా యాత్మ" యనుచు నాత్మవైపు ముందడుగు వేయుటే మమత చేయు శరప్రయోగముయొక్క రహస్యము. నిశుంభునకు (మమతకు) సంహారశక్తియెడను (కాళిక) వాహనసింహము నెడను విశేష క్రోధము. ఏమనఁగా సర్వస్వమును మ్రింగివేసినది కాళి. మఱి సింహమో కేవలము జీవభావమును జంపఁగడఁగినది. కనుకనే వీరియెడ శుంభుని శరప్రయోగమ నెడి యాక్రమణము.

నిశుంభుఁడు దనుజేశ్వరుఁడఁట - విను.

మూలమంత్రమందు దితిజుఁడని మఱియొక విశేషణ మున్నది. ఇదిగో - దనువు, దితి యను నీ రెండును నొక్కటె పేళ్లే. ఇరువురు కశ్యపుని భార్య లందురు. కాని ఖండనార్థకమైన 'దా' ధాతువునుండి పుట్టిన పేళ్లే. దితి - దను శబ్దములు అఖండ బోధమును ఖండించు శక్తి - అనఁగా భేదజ్ఞానమును బట్టుకొని యున్న వే - దనువు, దితి. కశ్యప శబ్దార్థము పశ్యకుఁడు. అనఁగా ద్రష్ట - (చూచువాఁడు). వ్యాకరణవిధి ననుసరించి యక్షర విపర్యయమై పశ్యక శబ్దము కశ్యప యని ప్రయోగింపఁబడును. (వశి - శివః, హింసా - సింహః, బీజ - జీవః యైనటులే) ఇది మా కపోలకల్పిత వ్యాఖ్యకాదు. వైదిక నిరుక్తికారులే యిట్టి వ్యాఖ్యను జేసిరి. కశ్యపుని భార్యలు దితి (దనువు), అదితి యను వార లిరువురు. సర్వభావ ప్రకాశక బ్రహ్మశక్తులు రెండు విధ ములు. ఒకటి బహిర్ముఖి; రెండవది అంతర్ముఖి. దను - దితి సంతానము దానవులు, దైత్యులు; అదితి సంతానము ఆది త్యులు. వారినే దేవత లందురు. ఒకదళము బహిర్ముఖము. రెండవది యంతర్ముఖము. ఒకదళము ఆత్మభావమును ఖండించు నది. రెండవది ఆత్మభావముతోఁ గూడియుండునది.

'నాది' యను జ్ఞానమే (మమత) భేదజ్ఞానమును గల్గించు నది. అన్నిఁటికి మొదటిబీజము. "వాస్తవముగ 'నేను' గాక మఱేమియు ఎక్కడను లేదు" అనునదే సత్యజ్ఞానము. కాని, యేదే నొక కారణమున నఖండమైన యా 'నేను'నందు 'నాది' యను నొక బోధము రేగునపుడే 'నేనును' విడిచి మఱేదో వస్తువుయొక్క భాణము (హాస్యనాటకము) అగుచుండును.

అనఁగా అనాత్మవస్తుసత్తను గూర్చిన ప్రతీతి యగుచుండును. ఇదె సర్వాసురభావముల స్వరూపము. కనుకనే యసురులను దితిజులు – దనుజులు అనిరి. మమత 'నాది' యను బోధము సర్వభేద జ్ఞానములకును ఆశ్రయము. కనుకనే నిశుంభుఁడు దనుజేశ్వరుఁ డనఁబడెను.

ఆత్మయెడ నగు మమతాబోధమే తుది యాక్రమణము.

ఈ మమత (నిశుంభుఁడు) పదివేలబాహువులను జాచి, చక్రాయుధములచేఁ జండికను (అమ్మను) గప్పివేసెను. ఇది విచారింపఁదగిన విషయము. ఈ మమత్వబోధముచేతనే ఆధునిక వైష్ణవధర్మమునకుఁ బ్రతిష్ఠకల్గినది. "నా ప్రభువు – నా తండ్రి – నా సఖుఁడు – నా బంధువు – నా పతి" మున్నగు నెన్నో విధములుగాఁ బరమాత్మతో ముందుగా సంబంధమును స్థాపించుకొని చేయు సాధనముయొక్క సమాప్తి, యీ నిశుంభవధమందేయున్నది. 'నాది' యనుట కింకేమియు నుండదు. సర్వము 'నేను' అయిపోవును. ఎంతదాఁక 'నాది' యనుమాట పలుకుటకు, ఆత్మకంటె మఱియొకటి యుండునో యంతదాఁక సాధకుని 'నాది' యనుమాట సరికానేకాదు. సర్వభావవిలయమై పోవునపుడే, యెదుట స్వప్రకాశాత్మస్వరూపము భాసించునపుడే, ఆత్మయెడ యథార్థమమత్వజ్ఞానము వికసించును. వికసింపఁగలదు. అంతకుమున్నే కానఁబడు మమత్వజ్ఞానము ప్రవర్తకావస్థామాత్రమే. ఈ యథార్థమమత్వబోధమే పదివేల చేతులతోఁ జక్రాస్త్రమును బ్రయోగించి చండికను గప్పివేయఁ గడఁగినది. దశేంద్రియ మార్గముల లెక్కలేని భావముల సహాయముతో నాత్మయెడ మమత్వబోధమును స్థాపించుటకుఁ

ప్రయత్నించును. ఇట్టి మమత్వజ్ఞానసహాయముతో నాత్మ యం దర్పింపఁబడిన భావములు, మఱలఁ దమంతనే మమత్వ బోధము వైపు తిరిగి వచ్చును. ఈ చక్రాకార గతిని లక్షించియే, మంత్రమందు "చక్రాయుధేన" అని చెప్పఁబడినది.

సరియైన ధ్యానావస్థ వచ్చునపుడే యిమ్మాటల యందలి సత్య మనుభవమునకు వచ్చును. ఆత్మస్వరూపదర్శనము, ఆత్మా హ్వానశ్రవణము, ఆత్మసుగంధగ్రహణము, ఆత్మరసాస్వాదనము మున్నగు నింద్రియవ్యాపారములు చేయకే "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" శబ్దహీనము, స్పర్శహీనము, రూప హీనమునైన పరమాత్మ కెదురై ముందడుగు వేయుచు న్నాఁడు. ఇటులు పదివేల బాహువులను జాచియే భావాతీత స్వరూపము నాక్రమించుచున్నాఁడు. కాని, సాధకా! ఇవ న్నియు వైష్ణవుల భాషయందు, అప్రాకృతక్షేత్రమునకుఁ జెందిన మాటలు; అస్మితా మమతాది సూక్ష్మతమ తత్త్వములును ప్రకృతి కంతర్గతములే యైనను, అవి యప్రాకృతికము లనుచో హాని లేదను నంతటి యధికచైతన్యధర్మము గలవి. ఈ క్షేత్ర మును గనుట, వినుట మున్నగు వ్యాపారములు సాధారణే న్ద్రియవ్యాపారములు కావు. ధీమంతులైన పాఠకుల కిది చెప్ప నక్కఱ లేదు.

## చండికా నిశుంభులు (ఆత్మ మమతల) త్రిశూలయుద్ధ రహస్యము.

"ఏకమేవా ద్వితీయమ్" అనెడి తత్త్వ ముద్భాసిం చుటచే సర్వ భేదజ్ఞానములును నిరస్తములగును. ఈ దశనొందిన

పైని మమత గతిలేక తన తుట్టతుది యస్త్రమైన శూలమును బట్టెను. ఏ జ్ఞానసత్త్వపైని మమతయనెడి యజ్ఞానము నిల్చియున్నదో, యా జ్ఞానమే యిచటఁ ద్రిశూలముగాఁ జెప్పఁబడినది. త్రిపుటీజ్ఞానమే త్రిశూలము. "నా యాత్మను నేను సాక్షాత్కరించుకొందును" (అనుభవింతును) అనెడి భావము వలనఁ దోఁచు స్వగతభేదమయ త్రిపుటీజ్ఞానమే నిశుంభుని శూలాస్త్రము.

నిశుంభుని శూలమును (త్రిపుటీజ్ఞానమును) వ్యర్థమొనర్చి యమ్మ చండిక తన శూలముతో (అద్వయాత్మ ప్రకాశముతో) వాని గుండెను బొడిచెను. ద్వైతజ్ఞానమును జీల్చివేయుటతక్క, అనఁగా నీవిధముగా హృదయవేధ చేయుటతక్క (ద్వైతజ్ఞానమును విదీర్ణము చేయుటతక్క) అనఁగా నద్వయతత్త్వము నుద్భాసింపఁజేయుట తక్క మఱి నాకొక్క యుపాయమే లేదన్నది.

సాధకా ! నా యేడ్పును నీవు ననుకరింపుము.

అమ్మా ! నీ వీ ముక్తిమందిరద్వారమునఁ జేరి దేనితో భేదజ్ఞానము గుండెచీల్చితివో, ఆ యద్వయజ్ఞానశూలాఘాతము కడచిన యెన్నియుగములనుండి యారంభమైనదోకాని, నేను మాత్రము మేల్కొనలేదు. అమ్మా ! 'నేను, నావి' యనుచు ధనైశ్వర్యములను గట్టిగా బట్టుకొనియుంటిని. అపుడే ధనైశ్వర్యరూపముగాను, మా యమ్మవు నీవే యని తెలియలేకపోతిని. ఈ భేదజ్ఞానముచే జడపదార్థమనుచునే పట్టుకొంటిని. మఱి నీవును సరిగా నీవిధముగానే తీవ్రయాతన గల్గించుదానవైనను,

జ్ఞానమయ శూలాఘాతముతో వానిని నా యెదుటనుండి తొలఁగించితివి. అపుడు నేను "హా! హతోఽస్మి" యనుచు నేడ్వఁజొచ్చితిని. మఱల ఆలుబిడ్డలు, చుట్టాలు మున్నగువారిని 'నావి' యనుచు నెంచి పట్టుకొని యేడిచితిని. అప్పుడైన నివన్నియు నీవే యని తెలియలేకపోతిని. నీవు తక్క మఱేమియు లేదు; కనుక నీ వా యన్నిఁటిని సైతము శూలాఘాతముతోఁ దొలఁగించితివి. నా గుండెను తూంట్లు పడఁజేసితివి. అప్పుడు పరమ ప్రియతమమైన నా యాత్మ యిటు లొఁర్చియు, నా విశీర్ణ హృదయమందొక మూలఁ జేరి కూర్చుండెను. ఈ విధముగా నొకనాఁడుకాదు; బహుజన్మములు గుండెపై నీశూలాఘాతము నోర్చుకొని యేడ్చుచునే, యీ యసహ్యానుమతనే భోగించితిని. అయినను మఱల నీ భేదజ్ఞానము నెడ మూర్ఖుఁడ నగుచున్నాను. నిన్ను మఱచిపోతిని. తూంట్లువడిన నా గుండెపై మఱల నీ శూలపుఁబోటుల నోర్చుకొనుచున్నాను. ఆ నీ కృపా కఠోర మూర్తి నపుడు చూచియుఁ జూడలేకపోతిని. తెలిసియుఁ దెలియలేకపోతిని. జడత్వమోహముచేఁ గప్పఁబడి నీ కృప నుపేక్షించి యెంతయో బహిర్ముఖముగానే పరుగెత్తుచు వచ్చితిని. అపుడు నీ శూలపుఁబోట్లు కడుఁ బీడాకరములుగా నుండెను. గాని యిపు డవే నాకుఁ గావలయునని కోరికొంచు, గుండెతో నందుకొనుచున్నాను. అమ్మా! యిపు డనవలసినది యేమియు లేదు. అమ్మా! అమ్మా! యనుచునే నా గొంతు బిగిసిపోయినది.

ఉండనీ — తొలుత జడవస్తురూపమున వెలసెను. క్రమముగా జడాశ్రితచైతన్యముగాను, ఆపైని విశుద్ధచైతన్యముగాను

బర్యవసించెను. ప్రేమ ధర్మముల యనుశీలన మగుచున్నది. క్రమముగా నాత్మప్రేమ మెంత పాదుకొనెనో, యంతగా మమత్వబోధము (నాది యను తెలివి) అణఁగిపోవును. కేవల విశుద్ధజ్ఞానరూపమైన యాత్మసత్త ప్రకాశించునపుడే యీ మమత నిహతమగును. చండికాశూలాఘాతముచే నిశుంభుని హృదయవిదారణ రహస్య మిదే.

## నిశుంభుని విదీర్ణహృదయమునుండి మఱియొకఁడు మహాబలుఁడు వెడలిన రహస్యము.

ఆ పురుషుఁడు మఱెవ్వఁడుగాఁడు. మమతాధిష్ఠిత చైతన్యమే. మమత్వమనెడి యొక విశిష్టభావముతోఁ బ్రకాశించిన విశిష్టచైతన్యమే, నిశుంభుని గుండెనుండి వెడలిన పురుషుఁడు. మమత్వమనెడి విశిష్టభావము నశించిన పైనిగూడ దాని నధిష్ఠించిన చైతన్యము విలయమొందలేదు.

పైపెచ్చు, వాఁడు వెడలివచ్చి దేవిని 'నిలునిలు' మని యఱచెను. అభిప్రాయ మేమనఁగా — "నేనుండునంతవఱకు దేవీ! నీ వెందఱు నిశుంభులనైనఁ జంపుకో, నేను సంకల్పించితినా — ఇట్టి వేవుర నిశుంభులను బుట్టింపఁగలను." సాధకా! విత్తనముచావకున్నపుడు మొలకెత్తుట కెంతతడవుకావలయును.

## ఏకాకి కాకున్న నేకమును—పరమమును బట్టుకొనలేఁడు.

అమ్మ యట్టహాసముచేసి యీ పురుషుని తలతెగవేసినది. అనఁగా నద్వయ జ్ఞానలోక సంపాతముచే మమతాధిష్ఠిత చైతన్యము నుత్తమాంగము తెగిపోయెను. "నేను మమతా

మయుఁడను” అనెడి యభిమానమును నశింపఁజేయుట పేరే నిశుంభుని గుండెనుండి లేచిన పురుషుని తలనఱకుట. నిశుంభుని (మమత) యెడ శుంభునకుఁ (అస్మితకు) గల యభిమానము సరిగా నిటులే తొలఁగిపోవును. అనఁగా శుంభుని లోపల “నిశుంభుఁడు నా తమ్ముఁ” డనెడి యభిమానము దూరమై పోయెను. మమతయును అస్మితయొక్క విశిష్టభావమే. అమ్మ స్వరూప ప్రకాశము – అద్వయ జ్ఞానోదయమనెడి వాడి కత్తి వ్రేటుచే నీ విశిష్టతయు నడఁగిపోయెను. మమత పూర్తిగా విలయమొందెను. ఇపుడు శుంభుఁడు కేవల నిస్సహాయుఁడు. సాధకా! మునుజెప్పినదేమి? సంపూర్ణముగా నేకాకికాకున్నచో నా “పరమము – ఏకము” నైన దానిని బట్టుకొనఁజాలఁడు. చూడు. ఇపుడిన్నాళ్లకు, శుంభుఁడు నిజముగా నేకాకిగాఁగల్గెను. కనుక నద్వయతత్త్వమందుఁ జేరుటకు మఱి తడవుకాదు. మమతయే సర్వభేదజ్ఞానమునకును, అనఁగా నిరానందమునకు మూలము. అది యిపుడు మూలముట్టుగా నశించినది. కనుక, ఆనందమయస్వరూపమును జేరుట కేవల సంభవమే. ప్రియతమ సాధకుఁడా! ఇఁక నుల్లాసముతోఁ బాడుము. చూడు, మాయమ్మ యానందమయి; మే మాయమ్మ ముద్దుబిడ్డలము. ఆనందమయ మును గనుగొన్నాము. భువనమందు నిరానందము తొలఁగినది.

ఇపుడు మమతాశ్రిత సర్వసంస్కారములు
ననాయాసముగా నశించును.

మమత పడఁగొట్టఁబడినది. దాని నాశ్రయించిన యసుర కులమును నమలివేయుట జీవసింహమున కొకశ్రమ మనిపించ

లేదు. అణిమాదికాష్టవిభూతుల నొందు వాసనారూపమైన సూక్ష్మసంస్కారము లనెడి యసురులను సైతము, బ్రహ్మాణ్యాది శక్తులు విలయము నొనర్చినవి. యథార్థాత్మ జ్ఞానవిషయమున, ఈశ్వరత్వాభిమానము కూడ గొప్ప యంతరాయమే. తరువాత వైరాగ్యము కలుగకున్న నిశుంభుఁడు చావఁడు

పలువురు సాధకులు, ఇంతవఱకువచ్చి యష్టైశ్వర్యముల యాశతో; ఈశ్వరత్వాకాంక్షతో ముగ్ధులైపోవుదురు. విశుద్ధాత్మజ్ఞానమును సుషుప్తివంటి యొక మూకావస్థగా నెంచి, యక్కడితో మఱలిపోవుదురు. బహుసుకృత బలముచేతను, శ్రీగురు నవ్యాజకరుణ చేతను, సాటిలేని యమ్మ నేయము చేతను, సాధకుఁ డీ యైశ్వర్య సంకటమునుండి తప్పుకొనును. మమత యున్నంతదాఁక నీశ్వరత్వ ప్రలోభమునందు ముగ్ధుఁడగుట స్వాభావికము. అమ్మ కృప విశేషించి కలుగకున్న, నామె యిట్టి యష్టమూర్తిశక్తులతో వెలయకున్న, సాధకులకీ యష్టభూతులయెడ నైన మోహము తొలఁగదు. జీవభావమునెడ వైరాగ్యము కేవల దుర్లభముకాదు. ఏలన, నది యనాది జన్మములనుండియు ననుభవింపఁబడుచున్నది. బహుకాలమునుండి యుపభోగింపఁబడుదానియెడ వైరాగ్యము తనంతనే వచ్చును. ఒక్క వస్తువునే తినుచురాఁగాఁ గొంత సేఁపటికి — కొన్నాళ్లకు, అరుచి పుట్టుననుట మన మనుభవించుచున్నదే. కాని యీశ్వరత్వ మతిదుర్లభము. సమష్టిబుద్ధియందు (మహత్తత్త్వమందు) నిల్వఁగల్గక యీశ్వరత్వ స్వరూపమైనను దెలియదు. సాధకుఁడు తీవ్రమైన పట్టుదలతోఁ గేవల పర

మాత్మ సత్తవంక లక్ష్యముంచి యగ్రసరుఁ డగునపుడే యపూర్వమైన యీ యీశ్వరత్వమును భోగించు సుయోగము గల్గును. ఇట్టి సాధకులు లోకమందుఁ గడు నరిది. ఇయ్యీశ్వరత్వ ములను గడ్డిపోఁచవలె నిరసించి ముందడుగు వేయఁగలవాఁడు (ఇదిగో భృగుమహర్షి — ఈ యీశ్వరత్వమును దుచ్ఛముగాఁ దలంచెను, కనుకనే యాతఁడు భగవానుని గుండెపైఁ దన్నినాఁ డనిరి.) మహాశక్తిస్వరూపిణి నమ్మ నొక్కతెనే తన హృదయమందుఁ బ్రబలవైరాగ్యముతోఁ బ్రతిష్ఠించినవాఁడు మాత్రమే, యీ యణఁపరాని యీశ్వరత్వ లోభమునుండి తప్పుకొనఁగలఁడు. తొలినుండియు శ్రీమాతృచరణములందు శరణాగతులైన బిడ్డలు సర్వకాల సర్వావస్థలయందును జీవ త్వము, భూతులు ననునేమో యెఱుఁగక కేవలము 'అమ్మా' యనుచు నమ్మ యొడియందే కూర్చున్న నగ్నశిశువులు కనుక, మన యమ్మ విశిష్టభావముతోఁ బ్రకటితయైనపుడు, అష్ట శక్తి మూర్తులతోఁ దన్ను విడఁదీసికొని మహోల్లాసముతోఁ బరమా నందమయ పరమాత్మక్షేత్రమువంక నగ్రసరులగుదురు. చండీ తత్త్వమం దిదే స్పష్టముగా వర్ణింపఁబడినది.

## సాధకా ! సారాంశము వినుము.

శుంభుఁడు (అస్మిత) తక్క నసురులెల్లరు ధ్వంస మొం దిరి. కొందఱు నిహతులు; కొందఱు పాఱిపోయిరి, కొందఱు కాళీ శివదూతీ సింహములచేఁ దినఁబడిరి. చచ్చినవారు మఱి రారు. అనఁగాఁ గొన్ని సంస్కారములు తలయెత్తవు. కొన్ని (యాహార విహారాదులు) పునరావర్తనములు కావచ్చును.

వీరే పాఱిపోయినవారు. ఇదిగో — ఇది యద్వయోపలబ్ధి, కనుక నీ విషయములను బలుసారు లాలోచించుట యావశ్యకమే.

అద్వయతత్త్వమం దుపనీతము లగుటచే సర్వసంస్కారములును లోపించిపోయినవి. మఱల లేచినపుడు, కొన్ని జీవభావీయ సంస్కారములు బయల్పడును. స్థూలదేహ ముండువఱకు నవి తప్పవు. కాని యిపు డవి యనిష్టమును గల్గింపఁ జాలవు. అనఁగా భ్రాంతిజ్ఞానమును గలిగింపవు. ఏలన, వాని పారమార్థికబుద్ధి యొక్కసారిగా నశించిపోవును. ఇఁక మిగిలిన కొన్ని సంస్కారములు (ధర్మప్రతిష్ఠా జ్ఞాన దాన లోకశిక్షణాదులు) సర్వవిధముల నమ్మ యిచ్ఛనుబట్టి, అమ్మ కనుసన్నను బట్టి నడుచుచుండును. అమ్మ విశిష్టప్రేరణము లేక వానికి విశేష కార్యకారిత యుండనే యుండదు. ఆవశ్యకమైనచో అనఁగా మహాతీశక్తియొక్క విశిష్టప్రేరణమైనచో మఱలఁ దల యెత్తఁగలవు కాని, వానివల్ల ననిష్ట మేమియుఁ గాఁజాలదు. ఏలన నవి సర్వవిధముల మహాతీచ్ఛ ననుసరించియే యుండును. కనుక సాధకులను సైతము ముగ్ధులను జేయఁజాలవు.

సారాంశ మేమనఁగా — ఒక్కసారి యద్వయతత్త్వ సాక్షాత్కారమైనచో సాధకుని భేదభ్రాంతి, బంధన భయము, మృత్యుభయము నెప్పటికిని దొలఁగిపోవును. ఆ వెనుక స్థూల దేహముండునంతదాఁక సాధకుఁడు ప్రారబ్ధ సంస్కారక్షయము నపేక్షించు చుండును. ప్రారబ్ధక్షయము కాఁగానే విదేహ కైవల్యము నొందును.

సాధకా! రమ్ము. ఇపుడు మన మమ్మ యడుగులను బట్టుకొని శుంభవధ రహస్యము నెఱుంగఁజూతము. ప్రబల

ప్రారబ్ధ సంస్కార ముండునంతదాఁక శుంభవధము కాదు. యథార్థముగా నద్వైతతత్త్వ ముద్భాసింపదు. రమ్మా, మన మమ్మను స్మరించి యేడ్తము. రమ్మా, మన మమ్మను జూచు పట్టుదలతోనే యుందము. రమ్మా, మన యీశ్వరత్వవాంఛ యడఁగునంతదనక నమ్మకు నిష్కపటముతో నాత్మసమర్పణము చేసి యత్నింతము. కృపామయి తల్లి మనలను స్నేహమయ వక్షమునందుంచుకొని, తప్పక యొడిలోనికి లాగికొని తన యా నిరంజన పదమునకుఁ గొనిపోవును. మన యాసలెల్లఁ దీఱును.

## సంకలిత తత్త్వసుధాటీక.

దేవీమాహాత్మ్యమున మొదటి శ్లోకమందు జ్ఞానగురుఁడు (ఋషి), అష్టమమనుత్వము (మహామానవత్వము) నొందు కథ నుల్లేఖించెను. అనంత సాధనసముద్రమును మథించి యా యమృతఘటముంగొని యిట నుంచెను. సుదీర్ఘ సాధన మార్గమును గడచిన సాధకుఁడిపుడు పరమాత్మ సాన్నిధ్యమును జేరుకొనెను. ఇపుడు సాధకున కబ్బిన యైశ్వర్యమును బరమాత్మ రూప మాతృచరణములం దుంచివేసి, మహాయజ్ఞమందుఁ బూర్ణాహుతి యిచ్చుటగును. ఇట్లగుటచేతనే మహామాయా మహాపూజ సుసంపన్నమగును. భక్తుఁడు భగవంతునితో నేకమైపోయి మహారాసలీల సుసంపన్నము కాఁగా మహామానవత్వము నొందును.

భక్తులారా! యిపుడు రండు, మన మా భక్త భగవానుల పరమశ్రేష్ఠలీల నాస్వాదించుటకై మహామాయా మాతృచరణములకుఁ బ్రణమిల్లుదము.

ఓం నమశ్చండికాయై; ఓం దక్షయజ్ఞ వినాశిన్యై; మహా ఘోరాయై, యోగినీ కోటిపరివృతాయై, భద్రకాళ్యై ఓం హ్రీం దుం దుర్గాయై నమః॥

ఇంక నస్మిత నశించును, రుద్రగ్రంథి విడిపోవును.

అస్మిత కేకాంత సహాయమైన మమత నశించెను. ఇపుడస్మిత యేకాకి; అయినను హతాశము కాదు. అవసాదము లేదు. ఉత్సాహము పోదు.

శుంభుఁడు నిస్సహాయుఁడై ననుఁ గోపించివచ్చి దేవితో "నీవు బలావలేపదుష్టవు (బలగర్వితవు). ఇతరుల బలముఁ బ్రాపునఁ బోరుచున్నావు" అనెను.

ఇమ్మాటల భావముఁ దెలిసికొమ్మ.

"నీవు సర్వభావ సత్తామయవు. నీ చైతన్యముచేతనే సర్వభూతములు సంజీవితములు, కనుక గర్వించు నధికారము నీదే" యని భావము.

గీతయందు భగవానుఁడును, ఈ పరబలము (ప్రకృతి) నాశ్రయముఁగొనుటను గూర్చి —

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్,
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా॥"

అనెను. నిర్గుణ నిరంజనాత్మ, భావరంజనావస్థకు వచ్చుటకై తాను తన ప్రకృతిని (శక్తిని) ఆశ్రయించుటగును. ఆ శక్తులు, ఏదేనొక వస్తురూపమును గ్రహించుటకు దృక్ఛక్తిని,

శబ్దగ్రహణమునకై శ్రవణశక్తిని ఆశ్రయింపవలయును. ఈ శక్తులు అమ్మ నాశ్రయించియే వెలయును. మఱి తన (ఆత్మ) వల్లనే కలిగినవి. ఇమ్మాట యింతకుమున్ను దేవీశరీరమునుండి చండికాదిశక్తులు వెడలిన ప్రస్తావమునఁ జెప్పఁబడినది.

మన యమ్మ సర్వశక్తిసంభవ స్వరూపము. సర్వశక్తులకు నాశ్రయ స్వరూపమైన యమ్మ యభిమానిని యేలకాదు? 'మాన' ధాత్వర్థము=పూజ. మన యమ్మ యతిశయపూజ్య, అతిశయ గౌరవాన్విత. అమ్మకుఁదక్క నెవ్వరికిని గర్వించు నధికారములేదు. గర్వమనునది 'నేను' అనుదానిని బట్టియే యగుచుండును. 'నేను' అనునదే తల్లియై మఱియొక 'నేను' లేనపుడు, ఇంకెవ్వరికి 'నేను' అను నధికారము లేనపుడు, ఆ 'నేను' అనునదే గౌరవిణి. అతిమానిని.

చదువరీ! తల్లి నెఱింగినవాఁడే ఆత్మజ్ఞపురుషుఁడు. ఆతని కహంకారముండదా? యథార్థాహంరూపిణి యైనదాని సాక్షాత్కార మగుటచేతనే (మిథ్యాహమ్ = ప్రతిబింబితమైన అహమ్) సర్వవిధముల వాఁడహంశూన్యుఁడయియే యుండును. అమ్మను దర్శింపక యెవ్వని యహంకారమును దొలఁగదు. అహంకారమును దొలఁగించుటకై నీవు దీనుఁడు, హీనుఁడు, పతితుఁడుగాను నైపోవఁ బ్రయత్నింపకు. అట్టి భావమందును నహంకార మున్నదనుట మఱువకుమా. యథార్థమైన 'అహమ్' (నేను) ను జూడుము. మిథ్యాభిమానము తనంతటనే పాఱిపోవును.

అమ్మ "అత్ర జగతి" — ఈ జగత్తునందు. "ఏకైవా హమ్" — నే నొక్కతెనే యున్నాను. "ద్వితీయా కా మమా పరా" — నేనుగాక రెండవది మఱేమున్నది? అన్నది.

'అత్ర జగతి' ఈ యధికరణ బోధకపదమును జూచి యనేకు లనేకవిధముల వ్యాఖ్యానించిరి. మన మా సూక్ష్మ విచారరూప కోలాహలములోఁ బడవలదు. సులభమైన మాట లతో మన కేమి తోఁచునో యది తెలియుటకే ప్రయత్నింతము.

'అత్ర జగతి'— ఈ జగద్రూపముగాఁ దోఁచునదంతయు నొక్క "నేనే" (అమ్మయే). జగత్ప్రతీతి యుండునంతఁదాఁక, దాని వేఱుగాఁ దలంపక 'నేను' గానే (అమ్మగానే) తలంపుము. వాస్తవముగా 'నేను' అనుదాని సత్తగాక, జగత్తునకు వేఱొక సత్తయే లేదు. ఈ జగత్తు 'నేను' అనుదాని స్థూల రూపమే. సాధకా! జగత్తనఁగానే మనోబుద్ధీంద్రియాదులను గూడఁ దలంపుమా.

"ద్వితీయా కా మమాపరా" — ఈ వాక్యముచే సర్వవిధ ద్వైతము నిషేధింపఁబడినది. "ఏకమేవా ద్వితీయమ్" అనెడి శ్రుతివాక్యము, సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమైన యొక యద్వితీయ వస్తువును బ్రతిపాదించుటకే. అటులే, అమ్మ పల్కిన "ఏకైవాహం జగత్యత్ర ద్వితీయా కా మమాపరా" అను వాక్యము సైతము సరిగా నట్టిదే. మఱియు నిందొక విశేషము — పై శ్రుతివాక్యము నర్థము నాలోచింపఁగా, నెట్టి భేదములులేని యొక వస్తువుయొక్క సత్తమాత్రమే తెలియఁ బడును. ఆ వస్తువుయొక్క స్వరూపమేమి? యనునది సరిగాఁ

దెలియరాదు. వస్తుస్వరూపము నెఱుంగుటకు మఱల 'అస్థూలమనణు' 'సత్యం జ్ఞానమనంతం' మున్నగు పరోక్షవాక్యముల సాయము గైకొనఁబడును. మఱియు, "అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి" మున్నగు ప్రత్యక్షవాక్యముల సాయమును గైకొనఁబడుచున్నది. కాని దేవి పల్కిన యాత్మపరిచయవాక్యములందు (తన పరిచయము గల్గించుమాటలందు) "ఏకా–ఏవ–అహమ్" అను నట్టి ప్రత్యక్షతను దెలుపుపదము లుండుటచే, సత్తయు స్వరూపమును నొక్కనాటియే వ్యక్తమైనవి. అమ్మను గేవల మనోవాగగోచర యనుచు విడిచి నిశ్చింతతోఁడవైనచోఁ బని నడవదు (ఉండిపోవును). సంతానము తల్లిని జూడఁగోరును, తల్లిని దెలియఁగోరును, పట్టుకొనఁగోరును, గనుక "అస్థూల, అనణు, అహ్రస్వ" అనునంతనే సంతానముకోరిక తీఱదు. గాన మనయమ్మ నమ్మకముగా, ఆత్మ (తన) స్వరూపమును 'నేను' అనుచు నెదుటఁ బెట్టినది. అతిదురాచారి వ్యక్తియు దీని నెఱింగి యనుభవింపఁగలఁడు. అమ్మ యెన్నఁడు నెవ్వనియెదుటను దన్ను దాఁచికొనదు. ఆమె యెల్లరకుఁ బ్రత్యక్ష కనుక నే, గీతయందు – దురాచారివ్యక్తికిని భగవద్భజనమం దధికార మున్నదను యోగ్యత స్పష్టముగాఁ జెప్పఁబడెను (9–30). అది యుండనీ.

సాధకా! దేవీసూక్తప్రారంభమున "అహం రుద్రేభిః" అను మంత్రమందు, అనేక భావములతో సత్యజ్ఞానానందప్రతిష్ఠలతోఁ జేయఁబడిన, అహం వస్తుసూచనమందుఁగల ఆ 'అహం' అను దానికే అనేకవిధముల విశ్లేషణవ్యాఖ్య నడచినది. (నా దేవీసూక్త పరమార్థమును జూచునది.) కాని,

ఆ అహంపదార్థ స్వరూపమేమి? యనునది యింతవఱకు సరిగాఁ దెలియలేదు. గాన మన యమ్మ, తానే దయచేసి ఆ యజ్ఞానమును తొలఁగించినది. తన స్వరూపమును దానే ప్రకటించు కొన్నది. "ఏకం ఏవ" అని శ్రుతి యనినదానినే 'ఏకా-ఏవ' యని స్త్రీలింగ పదప్రయోగముచే స్పష్టపఱచెను. తోడ్తోనే 'అత్ర-జగతి' పదముచే దాని శక్తిస్వరూప మంతయు విశేషించి సమర్థింపఁబడినది. ఇది మనమే యనలేదు. శాస్త్రములు సైతము దీనిని జీతిశక్తి యను పేరితో స్వీకరించినవి. ఈ సంబంధమున నింతకుమున్నె యెంతో విచారింపఁబడినది.

సాధకుఁడా! రమ్ము. మనము విచారమువంకఁబోక, మాతృవాక్యమునే కైకొందము. మనము 'అత్ర-జగతి' – ఈ జగత్తునం దున్నాము. అనఁగా జగత్తనుచు జగద్రూపమగు నొక జ్ఞానమున్నంతదాఁక, అమ్మను శక్తిరూపిణిగానే యెఱింగి మన్నింపవలయును. ఈ శక్తి యనేకము కాదు. 'ఏకా – అద్వితీయా' – ఈ జగత్తునం దెచ్చటఁ జూచిన నచ్చటనే యమ్మ ఏక అద్వితీయమై యున్నది. ప్రత్యేకజీవునందు నామె 'అహం' రూపమున నిత్యము వెలయుచున్నది. ఆ అహమ్ అద్వితీయ. దానికి ద్వితీయము మఱియొకటి లేదు కేవల జీవుఁడే యను టేమి? ప్రత్యేక వృక్షము, పత్రము, ప్రత్యేక సికతాకణము (ఇసుక రేణువు)ను జూడుము. అవన్నియు నొక యద్వితీయమే. స్థూలము మొదలు భేదజ్ఞానము వఱకును అమ్మయొక్క యేకత్వము, అద్వితీయత్వము నించుకంతయు ఖండితము కాలేదు. జడక్షేత్రమును విడిచి చైతన్యరాజ్యమునఁ బ్రవేశించినచో, నచట భేదము లేశమైన ననుభూతము కాదు. కనుక స్థూల

దేహామందే యనుము; సూక్ష్మ దేహామందే యనుము; కారణ దేహామందే యనుము, అంతటను మన యహ్మ, ఏకయు నద్వితీయయునై 'అహం' స్వరూపముతో నిత్యము విరాజిల్లుచున్నది. ఇది యహ్మ స్వరూపము.

నిజముగా నీ జగత్తునకు వాస్తవిక సత్త యెట్టిదియు లేదు.

"ద్వితీయా కా మమాపరా" ఇచట మఱియొక విధమగు నర్థమును దోచును. "మమా పరా ద్వితీయా కా" నాకంటె నపరము ద్వితీయముగాఁ బ్రతీతమగునది, కా = తుచ్ఛము – పరిహార్యము. అనఁగా, అకించిత్కరము. అహం తక్క నేది ప్రతీతమైన నది సర్వవిధములఁ బరిహరింపఁదగినదే. ఏలన, నది యొక వస్తువుకాదు. అది అహంయొక్క వ్యవహారమే. అహమ్మన్నదే వస్తువు. అహంతోఁగూడి ప్రకాశించునదేదియు వస్తువుకాదు; వ్యవహారమే. వ్యవహారమెన్నఁడును వస్తువు కాఁజాలదు. నీ యాహారవిహారాది వ్యాపారము, ఒక వస్తువుకాక యొకవిధమైన నీ వ్యవహారమైనటులే, కానవచ్చు నీ జీవజగత్తు, 'నేను' యొక్క (ఆత్మయొక్క – అహ్మయొక్క) వ్యవహారము మాత్రమే. కనుకనే వేదాన్తవాదులు జగత్తు యొక్క పారమార్థిక సత్త నంగీకరింపరు. వ్యావహారిక సత్త మాత్రమే యందురు. నిజముగా నీ జగత్తునకు వాస్తవిక సత్త యెట్టిదియు లేదు.

ఇపుడు మనము దేవీవాక్యమునందలి రెండవ భాగము నర్థము గ్రహింతము. దేవి "పశ్యైతా దుష్టమయ్యేవ విశన్త్యో మద్విభూతయః" ఓరీ! దుష్టుఁడా! చూడుము. నా విభూతులు

నాయందే ప్రవేశించుచున్నవి – అన్నది. అస్మిత ప్రతిబింబ స్వరూపమయ్యు విశ్వధర్మమును దనదిగాఁ జేయఁగోరినది. 'అహమ్' కాకయున్నను 'అహమ్' గాఁ బరిచితము కాఁగోరినది. అదే దాని దుష్టత్వము. కనుకనే శుంభుని 'దుష్ట' యన్నది.

మద్విభూతి – నా విభూతి. ఆత్మవిభూతి. ఎంత బహుత్వమో, ఎన్నివిధముల శక్తులో అవియన్నియు ఆత్మవిభూతులే. విభూతి యెప్పుడును ఆశ్రయసత్తలేక, వేఱుగా విశిష్టసత్తగల వస్తువు కాదు. ఎవ్వఁడేనొకపురుషునకుఁ గల వక్తృతాశక్తి, ఆ పురుషుని సత్త లేక పృథక్సత్తావిశిష్టమైన వస్తువు కాదు. అది యొకవిధమైన వాని విభూతి. అది వ్యవహారమాత్రమైనటులే, యీ జగత్తు, అనంతశక్తియైన యాత్మవిభూతితక్క మఱేమియుం గాదు. దాని యొకవిధమైన వ్యవహారము మాత్రమే. ఏక, అద్వితీయ, అమ్మ విభూతిమయియై వెలయునపుడే, ఆమెయందు బహుత్వము కానవచ్చును. గాని, వాస్తవముచే నామె "ఏకైవాహం జగత్యత్ర ద్వితీయా కా మమాపరా".

అస్మిత వేఱొక్క 'నేనెట్లును' గాదు. శుంభుని సంశయనివృత్తి యెట్లయ్యెనో చూడు.

దేవీవాక్యమువలన 'నే నొక్కతెనే నేను; నాకంటె వేఱొక్క నేను లేదు. కనుక, శుంభుఁడా! నీవు వేఱొక్కనే నెట్లగుదువు' అనుట విస్పష్టము.

బ్రహ్మాణ్యాదిశక్తుల వికాసమును జూచి యంబికయొక్క బహుత్వమును సంశయించెను. అపుడమ్మ కృపాపూర్వకముగా

విభూతుల నుపసంహరించికొని, 'చూడుము, శుంభుఁడా! నా విభూతులు నాలోనే ప్రవేశించినవి' యన్నది.

అమ్మ తలంచినంతనే యష్టశక్తుల నెడి విభూతులు దేవీ శరీరమందు లీనమైనవి. చితిశక్తినుండి ప్రసరించిన యనేకశక్తులు తమ కారణచైతన్యమునందు లీనమైనవి. వ్యవహారనివృత్తి యైనది. ఇపు డమ్మ, ఏక – అద్వితీయ – సర్వభేదరహిత – పూర్ణానందస్వరూప. స్వస్థయైనది. కాని యింకను (అస్మిత) శుంభుఁడున్నాఁడు. దేవీవాక్యమున్నది.

పాఠకా! ఈ విషయమున ద్వైతభావమును శంకింపవలదు.

అమ్మను భావలోనికిఁ దెచ్చుటకుఁ దెలిసికొనుటకుఁ దెలుపుటకుఁ బ్రయత్నించుటచేతనే యీ ద్వైతభావ మగును, గాని వాస్తవముగా ద్వైతభావ మేమియు లేదు. ఒక యఖండానంద స్వరూపవస్తువు, ఏవిధముగాఁ దన యేకత్వము నఖండముగానే యుంచి, అనేకరూపములుగాఁ (విశ్వరూపముగా) బ్రకటమగుచున్నదో, యది యింతకుము న్నెన్నిసారులో చెప్పఁబడినది. ఆధునికమాయావాదులతో మన కైకమత్యము కుదురదు. వారు, ఈ (మద్విభూతిని) ఆత్మవిభూతిని భ్రాంతి, మిథ్యా – మున్నగు పేళ్ళతోఁ బ్రచారము చేయుదురు. ముందు మనము ఆత్మవిలాసము, ఆత్మమహత్త్వముగాఁ దెలిసికొందుము. ద్వైత ప్రతీతి యుండునంతదాఁక, వేయిసారులు వారు భ్రాంతి మిథ్యా యన్నను, అది యెగిరిపోదు. అద్వయస్వరూప ముద్భాసించునపుడు మిథ్యా, భ్రాంతి యనుట కేమియు నుండదు. కనుక సాధన మనుచు, ఉపలబ్ధి యనుచు, మహావాక్యార్థ విచార

మనుచు, నేదో యుండునంతదాఁక, దానిని భ్రాంతి యనక లీలావిలాసముగా నెన్నుటచేతనే సర్వము సమంజసమగును. ఉపనిషత్తులు వేదాన్తసూత్రములు సైతము, ఈ బహుత్వమును లీలాకైవల్యముగాఁ దెలుపుటకే ప్రయత్నించినది, గాని యది, 'మిథ్యా, భ్రాంతి' యను మాటలను బ్రయోగింపనే లేదు. నిర్గుణవస్తులీల నెట్లు చెప్పఁగల్గుట ? అది యెట్లుండును ? అను నిట్టి యాశంకలు ఋషుల మనస్సులం దెన్నఁడును నుబుక లేదు. దానియం దేమున్నదో, లేదో, ఏమి యుండఁజాలదో యెవరు చెప్పఁగలరు ?

సాధకా ! అపూర్వమైన యీ దేవీమాహాత్మ్యవాణిని దలఁచుచుగాఁ దలంచుకొందువేని నీ సాధనామార్గము సుగమ మగును. ఈ జగత్తును, ఈ బహుత్వమును, మద్విభూతిగా నెఱుంగునది. నా యిచ్ఛయే యనేకరూపములుగా నభివ్యక్త మగును గాన నేను బహుత్వదర్శినిని. నాకు మఱల నేకత్వాభిలాషము గల్గునపుడు మఱి చెప్పుట కేమియు లేదు. సర్వభేదములును నాయందే లీనమైపోవును.

అదే మాతృవాక్యము - అదే మాతృయుద్ధాభినయము.

ముందుగా దేవి వాక్యమును విను :— " నేను విభూతి విశిష్టనై పొందిన యీ యనేకరూపముల నాలోనికే యుపసంహరించుకొన్నాను. ఇపుడు నేను (ఏక) ఒక్కతెగానే యున్నాను. శుంభుఁడా! నీవు యుద్ధమందు స్థిరముగానిలువుము."

దేవి ఏకా, అద్వితీయా - యైయున్నపుడును మాటలు అసంభవము కావు. ఆవాక్యము లెట్టివియో తత్త్వదర్శు లగువారే తెలియఁగల్గుదురు. మన యమ్మ "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్, తథా రసం నిత్య మగంధవచ్చయత్" అయినను, మన యమ్మ 'మహత్, పరం, ధ్రువమ్' అయినను, ఆమెకు శుంభునితో యుద్ధము కేవల మసంభవము కాదు అతి స్వచ్ఛమైన బుద్ధితత్త్వమందు, ఆత్మబోధ ముపసంహరింపఁబడి, చిచ్ఛక్తిరూపిణియైన యంబికవైపు లక్ష్యముంచినపుడు, దాని నుండి ప్రజ్ఞాలోకమువచ్చి, మహత్తత్త్వమందుఁ బ్రతిబింబించిన చిదాభాసునిపైఁ బడును. అదె మాతృవాక్యము - లేదా మాతృయుద్ధాభినయము. ఒక్కొక్కసారి ప్రజ్ఞాలోక సంపాత మగునపుడు, అనేకభ్రాంతులు గల్గుచుండును. అసురులనేకులు నిపతితులగుదురు. మున్నెన్నఁడులేని యెన్నోతత్త్వము లావిర్భవించును. అది యుండనీ.

## మన యభిలాషానురూపఫలమే, అమ్మ బహుత్వమో, ఏకత్వమో ?

దేవి శుంభునితో "నేను విభూతి విస్తారపూర్వకముగా ననేకరూపములతో విరాజిల్లితిని. ఇపుడు వాని నుపసంహరించుకొంటిని. చూడు; ఇపుడు నేనొక్కతెనే. గాని సావధానముగా నీవీ యుద్ధమందు స్థిరముగా నిల్వవలయును." ఈ మాతృవాక్యముల తాత్పర్యము స్పష్టము. అమ్మ యన్నది: 'అబ్బాయీ! నీవు నా బహుత్వమును జూడఁగోరితివి. నేను నీ కోర్కెచొప్పున విభూతిమయినై బహురూపములతో వెలసితిని. ఇంతవఱకు

నీవు నన్నునే కోరక, నా విభూతులనే కోరియుంటివి. కల్పిత మైన నీ "నేనును" ముస్తాబు చేయఁగోరితివి. కనుక నేను బహు రూపములతో నవస్థితనై యుంటిని. నీ యభిలాషము నెఱవేర్చుటకే నేను బహుత్వవిభూతి నొందవలసి వచ్చినది. ఇపు డిన్నాళ్లకు నీ కోరికలన్నియుఁ దీఱినవి. బహుత్వమును భోగించు వాసనయుఁ దొలఁగినది. ఇపుడు నీ వీశ్వరత్వమును సైతము తృణముగా నెంచి నన్నే కోరుచున్నావు. నీ మనసున నింక నింత మోహమా ? ఇంత ప్రేమమా ? నీవు ధన్యుఁడవు. నా కొఱకే నన్నుఁ గోరుచున్నావు. రమ్మి. చూడుము. ఇదిగో – ఏకము, అద్వితీయమునైన స్వరూపముతో నున్నాను. నా బహుత్వము సంహరింపఁబడినది. చూడుము. నీ విపుడు స్థిరుఁడవై యుద్ధము చేయుము."

'స్థిరోభవ' యను నమ్మ మాటయందు రహస్యమున్నది. ఈ ఏకత్వము నెదుట స్థిరముగా నుండుట బహుదుస్సాహమైన పని. విశిష్టతలు నిందు విలీనములై పోవును. సర్వత్వ బహుత్వము దూరమైపోయినను, అస్మిత యనెడి విశిష్టత మిగిలిపోయినది. అది యింకను విలయ మొందలేదు. ఆత్మ సన్నిహితమగుటచేత, ఆ విశిష్టతాంశము సైతము విలుప్తమైపోవును. కనుక నిపుడు స్థిరముగా నిల్చుట సులభసాధ్యము కాదు. కనుకనే యమ్మ యాదరపూర్వకముగా 'స్థిరోభవ' యన్నది. అస్మిత యుండఁ గల్గునంతదాఁక, అమ్మయొక్క సాధన యుద్ధాభినయము సాగుచునే యుండును. కనుక శుంభుఁడును స్థిరముగా నిల్చుటావశ్యకమే, కాని యది యిపు డింకెంతసేపు ?

అంబికా శుంభుల (ఆత్మాస్మితల) యుద్ధము, బింబ ప్రతిబింబ యుద్ధము సర్వలోక భయంకరము.

వీరి యుద్ధము తప్పక సర్వలోక భయంకరమే. అస్మిత తన విశిష్టతలను అఖండముగా నుంచుకొనఁ బ్రయాస పడు చున్నది. రెండవది ఆత్మప్రకాశము, ఆ విశిష్టతలను విలయ మొనర్పఁ గడఁగినది. ఒకటి ప్రతిబింబము, రెండవది బింబము. ఈ రెండిటి యుద్ధము దారుణమే యగును. ప్రతిబింబము తాను బ్రతిబింబమని తెలియనంతదాఁక, బింబముతోఁ బ్రతిఘటించి తానే పృథక్సత్తా విశిష్టవస్తువుగా సిద్ధమగుటకుఁ బ్రయత్నించును గనుక దారుణయుద్ధము కాకమానదు.

దేవీ శుంభుల యుద్ధము సర్వలోకభయంకర సర్వరూప ములుగా నాలోకింపఁబడినదే (ప్రకాశించినదే) సర్వలోకము. అస్మితాసత్తచేతనే సర్వలోకములసత్త. అస్మితయే లేకున్నచో 'సర్వ' యనుట కేమియు నుండదు. ఇంతకుమున్ను సర్వాసుర భావ నిధనము వర్ణింపఁబడినది. అస్మిత యఖండముగా నున్నచో, వినష్టమైన సర్వాసురభావములు మఱలఁ బుట్టుటకుఁ దడవుండదు. ఏలన – అవి యస్మితయొక్క భిన్నభిన్నస్ఫురణములు గాక మఱేమియుంగావు. ఇంతవఱకు నసురభావములు చచ్చుట చేతనే వానికెట్టి విశిష్టసత్తయు లేదని స్థిరపడినది. విభిన్నస్ఫురణము లన్నియు నశించి యఖండాస్మితారూపమునఁ జేరిపోయినవి. కాని, యస్మిత మిగిలినచో మఱల స్ఫురణము లేచుట యగును. పాతంజలదర్శనము ఈయవస్థను లక్షించియే, "ప్రకృతి యందు లీనమైనవి. మఱల నావిర్భవించును. ప్రకృతి పర్యంతము

విలయము కాకున్నచో యథార్థాత్మరూపము తెలియఁబడనే తెలియఁబడదు. జీవునకు ముక్తియే దొరకదు." అన్నది. అస్మితా విలయమన్నను, ప్రకృతి లయమన్నను నొక్కటే. మహత్తత్త్వముయొక్క అతిసూక్ష్మతమ బీజావస్థయే, సాంఖ్య దర్శనము చెప్పిన ప్రకృతి. సర్వభావములును సూక్ష్మముగాఁ బ్రకృతియందే యుండును. ఇపుడు మనము చూచుచున్న యీ యస్మి తా రూ ప ము త్రిగుణసమావస్థారూపప్రకృతి యన్నను, హానిలేదు. సాంఖ్యులభాషలో శుంభ దేవీ యుద్ధము, పురుషుని యెదుటనుండి ప్రకృతి పాఱిపోవు నుద్యమ మనఁబడును. వేదాన్తభాషలో మాయయొక్క యధ్యాస నివృత్త మగుట యనఁబడును. భక్తులభాషలో భక్త భగవంతులు కేవలము చేరిపోవుట యనఁబడును. ఏది కానీ — ఇది యతి దారుణము, సర్వలోక భయంకరము ననుమాట సత్యము.

ఇదే దేవీ శుంభుల పరస్పరాస్త్రప్రయోగ రహస్యము.

అంబికాస్త్రములు దివ్యములు, స్వప్రకాశములు. ఆత్మ సత్త యెంతగాఁ బ్రకాశించుచుండునో, యంతగా నస్మిత తన విలయమగునను శంకతో సన్నద్ధుఁడగుచుండును. ఇట్టి యవస్థయందతఁ డనేకోపాయములతో ననేకవిధములుగాఁ దన విశిష్టత నఖండముగా నుంచుకొనఁ బ్రయాసపడుచుండును. అనఁగా, ఆత్మస్వప్రకాశము ననేకోపాయములచేఁ గప్పఁ బ్రయత్నించును. కనుకనే దేవి యస్త్రప్రయోగములు వ్యర్థమగుచున్నవి. ఔరా! జీవుఁడు సాహసించి బ్రహ్మత్వము నొందఁగోరునా? ప్రాణము లొడ్డియైనఁ దన విశిష్టతను, దన భేదప్రతీతిని రక్షించుకొనఁ జూచును. అంబిక (ఆత్మస్వరూపము) వంక లక్షించినపుడు

క్షణకాలము ఆత్మ స్వయంప్రకాశభావమును బ్రత్యక్షముచేసి వాని విశిష్టాస్తిత్వమును మఱపించును. మఱలఁ దన విశిష్టసత్తను లక్షించునపుడు, ఆత్మయొక్క యీ స్వప్రకాశభావము తిరస్కరింపఁబడుచుండును. ఇదే దేవీ శుంభుల యుద్ధరహస్యము.

మొత్తపుమాట యేమనఁగా – ప్రతిబింబము=(అస్మిత) బింబమును = (ఆత్మప్రకాశమును) లక్షించినపుడు తన సత్త మఱుఁగుపడును. మఱలఁ దన విశిష్టసత్తను లక్షించినపుడు బింబస్వరూపము దాని యెదుట నావరింపఁబడును. ఇదె యిరువురల యస్త్రప్రయోగ రహస్యము.

దేవీ శుంభుల వివిధాస్త్రప్రయోగతత్త్వము వినోదకరము.

1. అస్మితా ధనుఃప్రయోగము:– అస్మిత ప్రణవధనుస్సునందుఁ దన విశిష్టాత్మబోధమనెడి శరము నెక్కిడి బ్రహ్మలక్ష్యమును జేసెను. ఇది సర్వశ్రేష్ఠసాధనగాఁ బలుసారులు చెప్పఁబడినను, ఇచట నిదియు నసురాస్త్రప్రయోగముగా వర్ణింపఁబడినది. ఇట్లు ప్రణవధనుస్సువలన, ఆత్మశరవిక్షేపవ్యాపారముగా ద్వైతప్రతీతి వచ్చినది. కనుకఁ బ్రణవాది మంత్రోచ్చారణమును, ఆత్మశరవిక్షేపమును అసురాత్యాచార మాత్రములే. ఆత్మ (మన యమ్మ) యింతయు భేదజ్ఞానము నుండనీయదు. కాన స్వప్రకాశశక్తియనెడి శరప్రయోగమునుజేసి క్షణములో వాని ప్రణవధనుస్సును ఛేదించెను. శుంభు నుద్యమము వితథమైనది. సరిగా నిటులే ముముక్షుసాధకుఁడు విశిష్టసాధన సహాయముతోఁ దన పృథక్త్వము నిల్పఁగోరునపుడు మన యమ్మ యీ విశిష్టతను సైతము నాశ మొనర్చును.

2. శుంభుఁడు శక్త్యస్త్రమును గైకొనెను—'నేనే ఆత్మను' అనెడి బోధశక్తిని దృఢప్రయత్నముతో ధరించి యుంచుటపేరే శుంభుని శక్త్యస్త్రగ్రహణము. కాని, అకటా! దేవి దానిని గూడ ఛేదించెను. యథార్థముగా, ఆత్మప్రకాశము సరిగా నిల్చే సర్వతోభేది. ఏమన రవ్వంతైన భేదజ్ఞాన మట నుండఁజాలదు.

3. దేవి సుదర్శనమును — దివ్యదృష్టియనెడి చక్రమును బ్రయోగించెను; అనఁగా సర్వతోభేది ప్రకాశ సత్తాప్రభావముచే, అస్మితయొక్క విశిష్టాత్మబోధము పూర్తిగా మఱుఁగువడఁ జేసెను. ఈ యవస్థయందు శుంభుఁడు హతాశుఁడై —

4. ఖడ్గ చర్మములను ధరించెను — దేవి వింట బాణములను బఱపి వానిని ఛేదించెను.

ఖడ్గము - భేదజ్ఞానము; చర్మము - ఆవరణము. అస్మిత ఆత్మప్రకాశము నెదుటఁ దన విశిష్టతతో నిల్వఁజాలనపుడు, గతిలేక భేదజ్ఞానమును ఆవరణమును నాశ్రయించును. ఒకవంక ఆత్మాభిముఖలక్ష్యమును విడుచుచున్నాఁడు. రెండవవంకఁ దన పృథక్త్వమును బట్టుకొని నిల్చుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. ఇదె శుంభుని ఖడ్గ చర్మ ప్రయోగ రహస్యము. అస్మిత భావమిది — "ఆత్మ ఆత్మగా నున్నది. దాని ప్రకాశముచేతనే, నేను బ్రకాశించుచున్నాను. దానినిసైతము స్వీకరింతును. అయినను నా విశిష్టసత్తాంశము నెందులకు విడువవలయును? నేను సరిగా నున్నాను. దూరమునుండి యంబికా సర్వమనోహరరూపమును జూచి యానందముతో ముగ్ధుఁడనగుచున్నాను. దానిని సమీపించుటచేతను, దానియందు నా సత్తను జేర్చివేయుటచేతను బ్రయోజనమేమి?" యని. ఇట్టులే యనేకులు వైష్ణవ సాధకు

లును నింతదాఁక వచ్చి మఱలిపోవుదురు. వారేవిధముగాను భగవంతునితోఁ జేరిపోవఁ గోరరు. సాన్నిధ్యమాత్రము నొంది భగవద్రసాస్వాదనమునే పరమపురుషార్థముగా దలఁతురు. గాని, రసాస్వాదము సైతము వాస్తవముగా ముక్తిమార్గమునందు విఘ్నమే. శాస్త్రమందు ఆత్మజ్ఞానమునొందు దారియందిది విఘ్నమే. అంతరాయము లెట్టివో రసాస్వాదము నట్టిదే. నిశుంభవధమందిది చెప్పఁబడియున్నను నిచటఁ బునరుక్తి కాదు.

## అద్వైతజ్ఞానమందుఁ బ్రతిష్ఠితుఁడుగాక ముక్తి నొందలేఁడు.

శుంభ నిశుంభులు (అస్మితా మమతలు) ఒక్క విశిష్ట బోధముయొక్క ద్వివిధప్రకాశములే యగుఁగాక. విశేషించి భగవద్రసాస్వాదమును బరమపురుషార్థముగా నెన్నినచో శీఘ్రముగా నద్వయతత్త్వము ఉద్భాసింపదు. "మేము ముక్తిని గోరము. మాకు భగవద్రసాస్వాదమే కేవల వాంఛనీయము." అనువాఁడు ముక్తుఁడు కానంతసేపు యథార్థప్రేమ కానే కాఁజాలదు. అనన్యభక్తియే యథార్థప్రేమ. సరే, అదియుండ నిండు. మొదటినుండియు ఆత్మసమర్పణయోగమును వీడని వారు, ఇచటఁజేరి యీ చిదాభాసుని రూపమున – అస్మితా రూపమున – నిల్చి తమ విశిష్టత నఖండముగా నుంచుకొన దృఢప్రయత్నము చేసినను, నెయ్యముతో మఱిపోయిన మన యమ్మ యీ ప్రయత్నమును వ్యర్థముచేయును. తన ముద్దు బిడ్డల కాత్మసాక్షాత్కారముఁ గలిగింపక, యీమె యెట్లును విడువదు. శుంభుని పునఃపునరస్త్రప్రయోగమును వితచేసినదను రహస్య మిదియే.

5. శుంభుఁడు పట్టిన శతచంద్రమనెడి డాలు — సూర్య కిరణమువలె నిర్మలమఁట. అవును, అస్మితయొక్క యాత్మ స్వరూపమును గప్పివుచ్చు భేదజ్ఞానము మహోజ్జ్వలము. మున్ను మహిషాసురాదులును ఈ శక్తి ఖడ్గ చర్మములను జేపట్టిరి కాని, శుంభుని ఖడ్గచర్మము లంతకంటె నుజ్జ్వలములు, నిర్మలములు. ఏలన నస్మితతో నాత్మకుఁ గడుసామాన్య భేదము. అనఁగా, భేదాభాసము మాత్రమే. సాధారణముగా నభేద రూపముతోనే ప్రతిభాసించును. గాన నిది నిర్మలము ఉజ్జ్వలము ననఁబడినది.

చూడుము. గాజుకుప్పె (చిమ్నీ) ఆధారముగా లోపల నున్న దివ్వెకు ఆవరణముగాఁ గానఁబడును. దీపశిఖయొక్క ఉత్తాపాలోకములచే స్వచ్ఛమైన కాచాధారము సైతము (చిమ్నీ) మిగుల నుజ్జ్వలాలోకితముగా నుండును. ఇటులే దూరమునుండి యీ గాజుకుప్పె యనెడి యావరణము సైతము అగ్నిరూపముగానే ప్రతిపన్న మగుచున్నది. ఇట్లే పరమాత్మ యొక్క కేవలసాన్నిధ్యముచే మిగుల స్వచ్ఛమైన యస్మితయు నిపుడధికముగా నాత్మధర్మము గలది యగును. మఱి తానే యాత్మరూపముగాఁ బ్రతిపన్న మగుటకుఁ బ్రయాసపడును. సాధకా! కొంచెము ధీరముగా నీ యనుభవమువైపు లక్ష్య ముంచినపుడే యీ రహస్యము హృదయంగమ మగును. అస్మితాలక్షణము మున్ను వివరించినది మఱొక్కసారి చూడుము.

సాధకా! ఇప్పుడు శుంభునవస్థను (అస్మితావస్థను) జక్కఁగా గుర్తింపుము.

హతాశ్వుఁడు, ఛిన్నధన్వుఁడు, విసారథియు నైన శుంభుఁడు అంబికను జంపఁగడఁగి ఘోరముద్గరమును గైకొని వచ్చుచున్నంతలోనే, దేవి తన వాడియమ్ములతో దానిని ఛేదించెను. శుంభుఁడు పిడికిలిపట్టి చేయెత్తి దేవివైపు పర్వెత్తెను.

'పరమార్థము వినుము :—

ఇంద్రియములు-అశ్వములు; ప్రణవము-ధనుస్సు; బుద్ధి-సారథి; ఇవన్నియు నష్టమైపోయినవి. అస్త్రప్రయోగములు వ్యర్థములైనవి. అస్మిత కింద్రియములు విశేషవిశేషములైనను ఇపుడవి యస్మితకుఁ దోడుకాలేదు. ప్రణవాది మంత్రోచ్చారణమును నిరుద్ధమైపోయినది. తర్వాత సారథి - నిశ్చయాత్మిక వృత్తియనెడి బుద్ధియుఁ బ్రకాశింపలేదు. విషయము లున్నంగదా - బుద్ధిప్రకాశము మాట. ఇపుడు విషయముల పేరే లేదు. కావున బుద్ధి విలుప్తమైపోయినది. ఇపుడు కేవలము నిరుపాయుఁడై ఘోరముద్గరమును బట్టుకొనెను. అనఁగా నస్మిత మూఢభావముచేఁ గ్రమ్మఁబడి, "నే నెట్టులును ఆత్మాభిముఖిని గాను; ఆత్మ చెంత నెట్టులును నాత్మసమర్పణము చేయను. ఎటులున్నానో యటులే యుందును. అయినను నా సత్తను ఆత్మసత్తయం దేనాఁడును విలీనము కానీను." అనెడి యస్మిత యొక్క యీ దృఢవిశ్వాసమును గుర్తించియే ముద్గరధారణము చెప్పఁబడినది. ఇట్టి మూఢావస్థయం దుండఁగల్గుటచేతనే తన విశిష్టసత్త యఖండము కాఁగలదు. ఆత్మస్వరూపమునైతము

ఆవృతమైపోవును, అను నిట్టి యస్మితభావములను గుర్తించియే "అంబికా నిధనోద్యతః" అన్నాఁడు. ఆత్మస్వరూపము నావరించి యుంచుటకైన యుద్యోగమే అంబికా నిధనోద్యమ మనఁబడెను.

ఇదే చండీతత్త్వముయొక్క విశేషరహస్యము.
ఇదే చండికాదేవియొక్క విశేష కృప.

అస్మిత తా నజ్ఞానావృతుఁడుగా నుండ నెంచినను, అమ్మ వానిని విడువదు. తన వాడియమ్ములతో - అనఁగా సర్వద్వైత ప్రతీతుల విలయమొనర్చు ఆత్మస్వరూప ప్రకాశముచే శుంభుని యా ఘోరముద్గర మనెడి మూఢభావమును నశింపఁజేసెను మన యమ్మ చండిక. అతి కోపన. ఇప్పుడామెకుఁ గోపము వచ్చినది. కనుకనే అస్మితను (అహంతను) వేఱుసత్తగా నుండ నీయదు. అస్మిత తన విశిష్టతను రక్షించుకొన వేయి వెరవులు పన్నినను, అమ్మ చండిక వానినన్నిఁటిని వ్యర్థమే చేయును. ఏలన ఈ నేనే - అస్మితయే యొకనాఁడు మాతృచరణములయందు ఆత్మసమర్పణమున కుద్యమించినది. ఆ సమర్పణము సమాప్తము కానంతదాఁక నామె యెట్టులును విడువదు. సాధకా! గొడవలలోఁ బడియో, తెలిసియో, యొకనాఁడు "మామేకం శరణం వ్రజ" అను మాటను జేకొని యమ్మకు శరణాగతుఁడవై యుంటివేని, ఆ యథార్థమైన నేను ప్రకాశించి నీ కల్పితమైన 'నేనును' ఏ విధముగానైనను నష్టమొనర్చును. ఇదే చండీ తత్త్వముయొక్క విశేష రహస్యము. ఇదె చండికాదేవియొక్క విశేష కృప. దీనిచే నస్మితయొక్క మూఢావస్థయనెడి ముద్గర

ప్రయోగము సైతము చండికా స్వప్రకాశశక్తి ప్రభావముచే వ్యర్థమైపోయెనని తెలిసికొంటిమి.

శుంభ చండిక లన్యోన్యము గుండెలపై గ్రుద్దుకొను రహస్యము

కథ — శుంభుఁడు తన పిడికిటితో దేవీహృదయమందుఁ గొట్టెను. దేవియు వాని గుండెపై నఱచేతితోఁ జఱచెను. ఆ దెబ్బతో వాఁడు నేలఁగూలి మఱల నిట్టె లేచెను.

వినుము. ఆత్మాభిముఖమైన తీవ్రాకర్షణము నుపేక్షించి విక్షేపశక్తి నాశ్రయించి, అనాత్మబోధమనెడి యస్మిత తన సత్తను రక్షించుకొనఁ బ్రయత్నించుచు, దేవీ హృదయమందాతఁడు పిడికిటితోఁ గొట్టుట. ఆత్మను దవ్వించుటే యస్మిత యుద్దేశ్యము. కాని యా పని కాలేదు. ఆత్మను దూరము చేయుటకు నుత్పీడించుటకు నస్మిత యెంతగాఁ బ్రయాసపడెనో, యంతగా నాత్మ సన్నిహితమగుచున్నది. శుంభుఁడు దేవిని గుండెపై గ్రుద్దెను. దేవియు శుంభుని గుండెపైనే చఱచినది. హృదయమనుటచే నది కేంద్రస్థానమని తెలియునది. అనంత శక్తుల కేది కేంద్రస్థానమో, యది యమ్మ హృదయదేశము. మఱి యస్మిత యే సూక్ష్మకేంద్రమునుండి బయల్పడునో యదె శుంభుని వక్షము (హృదయము). ఈ రెండు హృదయములు నొక్క హృదయముగాఁ బరిణమింపనంతసేపు, నెట్టి భేదప్రతీతియుఁ దొలఁగదు. వేదాన్తదర్శనమందు హృదయ శబ్దము నర్థము, ఆత్మగానే చెప్పఁబడినది. "హృది అయమ్ ఇతి హృదయమ్" ప్రత్యక్షానుభూతమైన యాత్మ, హృదయమందే విశేషించి ప్రకటమగును, గావున ఆత్మపేరు హృదయము. కనుక

హృదయములు చేరుట యనఁగా, ఆత్మమేళనమే యని తెలి యును. ఆత్మ సాక్షాత్కృతము కానంతసేఁపు హృదయ మిలనము కాదు. అది కానంతసేఁపు, అనాదిజన్మ విరహజ్వాల తొలఁగదు.

సాధకా! ఇటులొక్కసారి హృదయపూర్వకముగా నేడ్వుము

అమ్మా! యెన్నాళ్లనుండి, యెంత స్మరణాతీతకాలము నుండి, నీ హృదయముతో హృదయమును జేర్చివేయుటకుఁ బరుగెత్తివచ్చుచున్నామో! ఒక్కసారి, అమ్మా! యనుచు నీ హృదయదేశమందుఁ జొత్తును. ఇందులకై లక్షలకొలఁది జనన మరణముల, రోగ శోకముల యాతన నోర్చుకొంచు వచ్చు చున్నాను. గాని, చోటులేకపోయితిని. అమ్మా! మా చిరవిశ్రామమా! మా చిరశాన్తీ! ఎట్టులఁను నీయందుఁ జేరలే కున్నాము. కేవల విరహదావానలము బగ్గునమండి యీ సం సార సంతప్తహృదయమును మఱింత కాల్చివేయుచున్నది. నీ గుండెతో గుండెనుజేర్చు శాన్తి యెట్లుఁలభించునో, దాని ననుభ వించు యోగ్యత లేదా? అమ్మా! ఇపుడు సంపన్నము చేయుము. ఎన్నాళ్లనుండియో సంచితమైన యీ మిలనవాసన పూర్తి చేయుము. ఇంతకాలమైపోయినది. ఇపుడైనను రా; నీవు నేను నొకటైపోవుదము. నీ యెడఁబాటును మఱి నే ననుభవింపఁ జాలను. అమ్మా! నీ విరహ మెంత మర్మభేదిపీడయో పూర్తిగాఁ దెలిసినది. ఇపుడు శంభుని గుండెపైనివలె నాగుండె పైని నీయడుగులెత్తఁ జఱువుము. దానితో నాహృదయమునంటిన మాలిన్యములన్నియు నశించును. నీ పవిత్రాంగమును దాఁకి నా హృదయమునుఁ బవిత్రమైపోవును.

ఔరా! శుంభుఁడు ధన్యుఁడు. శుంభుని సమరాభినయము ధన్యము. తల్లివి నీవు కరతలప్రహారమిచే శుంభుని హృదయ మంటితివి. శుంభుఁ డిపుడు విశిష్టభావముతో మఱి ప్రకాశింపఁడు. నీ పవిత్రస్పర్శముచే వాఁడును బవిత్రుఁడై నీలోఁ జేరిపోవును. శుంభుఁడు యథార్థముగా నీకొఱకే నిన్నుఁ గోరినాఁడు. సర్వస్వము నిచ్చియు నినుఁ గోరినాఁడు, కావుననే వానియెడ నీ కంత విశిష్టకృప.

సాధకా! ఈ తత్త్వము కడు నపూర్వము సుమా.

అస్మిత వాస్తవముగా నాత్మనే కోరుచున్నది. ఆత్మలోఁ జేరఁగల్గుటచేతనే దానికి యథార్థశాంతి చేకూరును. గాని, యది మాటిమాటికిఁ జేయు నస్త్రప్రయోగమనెడి యుద్ధాభినయ మనునది. పూర్వసంచితమైన, భేదజ్ఞానమూలకమైన తొలఁగింపరాని సంస్కారముల సూక్ష్మతమవికాసమే కాని, మఱేమియుఁ గాదు. ఈ పార్థివజగమందును బలుసారు లనేక సమయములందు మనము కనుచున్న దేమి? ఎవని కేది యేకాన్త ప్రియమో, యది వేళనుబట్టి వానికి సన్నిహితమైనను బ్రాణప్రాణముగా దానితోఁ జేరు వాసన పూర్తిగా నున్నను, గార్యముచేఁ దా నొకింత దూరముగా నుండనే చూచును. ఈ విధముగానే (శుంభుఁడు సుమనోహరమైన యంబికారూపము నెడ ముగ్ధుఁడు.) అస్మిత సత్యముగా నాత్మకే యాత్మసమర్పణము చేయఁగడఁగినది. కాని బహుజన్మసంచితాభ్యాసవశమునఁ దన యా విశిష్టతను విడుచుకోలేకపోయినది. కావున నాత్మప్రేమ యాత్మయుద్ధముగాఁ బరిణమించినది. ఈ తత్త్వము కడు నపూర్వము.

సాధకుఁడా ! చూడుము; నీవును శుంభునివలెనే అమ్మ గుండెపై నెన్నిగ్రుద్దులో గ్రుద్ది యమ్మను మఱలింపఁ బ్రయాసపడుము. అయినను, ఆమె యించుకంత తగ్గి మార్గోన్ముఖమైనచో, అమ్మవంకనుండి మొగము మఱలించుచో, నీ హృదయమం దెట్టి చెప్పరాని జ్వాల పుట్టునో చూడుము. మఱి మాత్రాకర్షణము ననుభవింతువా ? మఱల నామెను వింతగాఁ జూచుటకే వేడుక పడుచుందువా ? కోపించి యభిమానించి, ప్రహరించి దూరము గెంటుము. 'ఇపుడు నేను నిన్నుఁ జూడను' అనుచు రెండు కన్నులు మూసికో. కాని మఱలఁ జూచుటకే వ్యాకులంపడుదువు. మఱల నొక్కసారి చూడకుండ లేవు. ఎందుల కిట్లగును ? అమ్మ యాకర్షణమే. అమ్మ నిన్ను విడువదు. నీవు పీడినను, ఆమె నిన్నుఁ దనయందు లీనమొనర్చుకొనఁ గోరును. అందువల్లనే యిట్లగును. ఉండనీ.

అస్మితపైని ఆత్మస్వప్రకాశమును, స్వరూప విశేషోద్భాసమును లక్షించియే దేవి వాని గుండెపైఁ జఱచుట చెప్పఁబడినది.

ఇచట నొక సాధనావిషయము — గురుని హృదయముతోఁ దన హృదయమును జేర్పఁగల్గునపుడే యీ దేవీ శుంభులు పరస్పరము గుండెలపైఁ గొట్టుకొను రహస్యము తెలియఁగలదు. ఆ మిలనానందము నిజముగా సైపరానిదగును. ఆనందము యాతనగాఁ దోఁచును. అపుడు దానిని, ఆనంద ప్రహారమని, పీడనమని చెప్పకుండ లేము. అనుభవసంపన్నులగు సాధకులే దీనినిఁ దెలియఁగల్గుదురు.

దేవీ శుంభుల యాకాశయుద్ధరహస్యము వినఁగోరుదువా ?
ఇచట శూన్యవాద తత్త్వమును వినఁగల్గుదువు.

కథ :— శుంభుఁడు దేవిని బట్టుకొని మింటి కెగిరి నిల్చెను గాని, చండికాదేవి యచటఁగూడ వానితోఁ బోరెను. మింట నిరాధారముగా నిల్చి పోరుచున్న వారియుద్ధమును జూచి సిద్ధమునులుసైతము వింతపడిరి.

ఇఁక వినుము — అస్మిత, యే యుపాయముచేతను ఆత్మను దనదిగాఁ జేసికొనలేకపోయె; సరిగదా, "నేనే యాత్మకుఁ దనవాఁడనై పోవుచున్నాను" అని తెలియఁగానే మఱి తెరవుగానక దేవిని బట్టుకొని శూన్యమున కెగిరి; అనఁగా ఆత్మయొక్క శూన్యత్వము ననుభవింపఁబూనెను. వాస్తవముగా నాత్మ కెట్టిరూపమును లేదు. ఆత్మ శూన్యమాత్రమే. అభావమే యాత్మకు స్వరూపము. అది అస్థూలము, అనణువు, అహ్రస్వము, అదీర్ఘము ఇత్యాది 'నేతి నేతి' ముఖమునఁ బ్రతిపాదింపఁదగినది. సర్వభావముల యభావమే స్వరూపమైన యది శూన్యముగాక మఱేమగును ? ఇది యాధునిక బౌద్ధవాదము. మున్ను దీని విచారముచేసి చూచితిమి.

యథార్థముగాఁ బలువురు సాధకులు, ఇంతదాఁకవచ్చి, యాత్మను గాఢసుషుప్తివలె నొక యభావస్వరూప వస్తువుగాఁ దలంతురు. మఱియు సర్వభావవిలయముచేసి శూన్యముగా నుండుటే జీవుని చరమపురుషార్థ మనుకొని, యభావస్వరూపముగాను శూన్యరూపముగాను నుండుటే, ఆత్మసిద్ధి బ్రాహ్మీస్థితిగాఁ దలంచుచున్నారు. ఈ యవస్థను లక్షించియే మంత్రమందు

శుంభుఁడు దేవిని బట్టుకొని యాకాశమున కెగురుటగాఁ జెప్పఁబడినది. కాని, అకటా! శూన్యమందు నిల్చినను శుంభునకుఁ బరిత్రాణము లేకపోయెను. ఇచ్చటికి వచ్చియు దేవి శుంభునితో యుద్ధము చేసినది. శూన్య(అభావ) రూపమైన యాత్మను మాటిమాటికి నిషేధించినను ఆ యభావభావమును సైతము తెలియునదిగా (అభావవిజ్ఞాతగా) నున్న దేదో యదే యాత్మగాఁ దాను బ్రకాశించుచున్నది. కనుకనే శూన్యమని చెప్పికొన్నను బరిమాణము దొరకలేదు. 'శూన్యము' అని పలుకువాఁ డగుటకే ఆత్మాయోజన మైనది. అస్మిత యాత్మను బ్రతిషేధింపఁ గోరెను. మఱి యాత్మయో - శూన్యమునుగూడ నెఱుంగఁ గలట్టిదయి (శూన్యవిజ్ఞాతగా మిగులునదే యాత్మ) స్వయం పూర్ణమై శూన్యవాదమును నిరాకరించుచున్నది. ఇదే దేవీశుంభుల మింటిపోరు రహస్యము.

ఈ యాకాశయుద్ధము సిద్ధముని విస్మయకారకమఁట.

అవును. నిజమే. ఆత్మ యొకవైపు నిషేధింపఁబడియు, శూన్యమాత్రముగాఁ బర్యవసించియుఁ బూర్ణత్వ స్వప్రకాశత్వములతో నభివ్యక్తమగుచున్నది. ఇఁక రెండవవైపు యథార్థముగా నించుకంతయు సత్తలేని యస్మిత, తానే సత్తావిశిష్టమగుటకుఁ గడగుచున్నది. కనుకనే యీ యుద్ధము కడు వింత గొల్పునది. ఈ వింతగొల్పుట సామాన్యజన విషయము కాదు. సిద్ధులు, మునులు నైనవారే, అనఁగా నాత్మలాభముచేఁ గృతకృత్యులైనవారు, మననశీలయోగులు నైనవారే, వాస్తవముగా నీ యుద్ధమునకు వింతపడవలసినవారు. కనుకనే మూలమందు

"సిద్ధముని విస్మయకారకమ్" అన్నాఁడు. యథార్థసాధకులుతక్క నీ యుద్ధరహస్యము నెవరెఱుంగఁగలరు ? ఆత్మను శూన్య మను కొనువాఁడే మఱల "కాదుకాదు. ఆత్మ శూన్యము కాదు. ఆత్మయే పూర్ణము." అనును.

శూన్యత్వభ్రమమునుగూర్చి మఱికొంత వినుము.

పలువురు సాధకులు, అవాఙ్మానసగోచర వస్తువును సుషుప్తివలె నజ్ఞానమువలె శూన్యమువలె నేమేమో తలంతురు. స్వయంప్రకాశవస్తువైన యాత్మను వేయిసారులు – లేదు కాదు అన్నను, నా నిషేధమునకును విజ్ఞాతృరూపముగా నది మిగిలియే యుండును. ఇది తొల్తఁ దెలియకున్నను సాధక మాత్రుఁడే తుదకది యనుభవింపఁగలఁడు. ఆత్మయొక్క పూర్ణత్వము నానందమయత్వము నుద్భాసించునాఁడు, ఈ శూన్యత్వభ్రమము తొలఁగిపోవును. నాఁటినుండి యస్మిత తన యస్తిత్వమందుఁ బట్టు సడలిపోయి యాత్మను బ్రతిషేధించుట యుండదు. అపుడు 'నేను' అనుకొన్నది మఱి లేదా ? యను నిట్టి తన యస్తిత్వవిషయకమైన సంశయము శంకయుఁ గల్గును.

ఇదే మంత్రమందు దేవి శుంభుని శూన్యమార్గమందుఁ గిరగిరం ద్రిప్పుటగా వర్ణింపఁబడినది.

అస్మితయొక్క యప్పటి యవస్థ నిజముగా మనుజుని తలత్రిప్పువలెనే యుండును. అపుడు 'నేనుగూడ స్థూలజగత్తు వలెనే దృశ్యమాత్రుఁడను, కల్పనామాత్రుఁడను' అను నిట్టి భావమును గుర్తించియే, మంత్రమందు దేవిచే శుంభుఁడు నేలఁగొట్టఁబడుటగా వర్ణింపఁబడెను. ఆత్మసత్త విశేషించి

ప్రకాశించునపుడు ప్రత్యేకసాధకుని హృదయమునందును నిట్టి భావమే సిద్ధమగును.

ఇపుడు శుంభుని తుట్టతుది ప్రయత్నము, దేవిచే నేలఁ గొట్టఁబడియు - అనఁగా స్థూలజగత్తువలెనే దృశ్యము, కల్పితము, తుచ్ఛము, అకించిత్కరముగా బ్రతీతమయ్యును, ఒకసారి తన్ను సత్తగాఁ జేసియుంచుటకై దుష్టాత్మ యురభిమాన రూపి యస్మిత (శుంభుఁడు) మఱలఁ జండికను జంపఁగోరి పిడికిటి నెత్తెను. చండికను జంపుటే శుంభుని యభిప్రాయము. ఎటులో యాత్మసత్తను దిరస్కరింపఁజేయుటచేతనే యస్మితకుఁ దనసత్త యఖండమగును, గనుక మంత్రమందు శుంభుఁడు మఱల లేచి పిడికిటి నెత్తుట చెప్పఁబడినది. చండిక నొక్కసారిగాఁ జంపుట యసంభవమైనను, ఓపినంతవఱకు నమ్మకు దూరముగా నుండుట చేతనే యస్మిత యభీష్టము సిద్ధించును. ఇందులకే యీ శుంభుని తుట్టతుది కడంక.

ఇదే శుంభవధము; ఇదే యస్మితానాశము;
ఇదే మాతృలాభము.

కథ:— పైఁబడ వచ్చుచున్న సర్వదైత్యాధిపతిని గని, దేవి తన శూలముతో వాని ఱొమ్మును జీల్చి నేలఁ బడవైచెను.

ఇంతకాలమునకు శుంభుఁడు తుదముట్టెను. అస్మిత సర్వద్వైతప్రతీతుల నాశ్రయించియే యుండెను. కనుకనే యది సర్వదైత్యాధిపతి యనఁబడెను. ఇదిగో - అనాత్మప్రతీతులన్నియు నొక్క యహంత నాశ్రయించియే యున్నవనుట, యించుక ధీరముగాఁ జింతించినచో సర్వము తెలియఁగలదు. సాధారణ

ముగా 'నేను' అనఁగానే స్థూలదేహము మొదలు బుద్ధిపర్యం తమును బాప పుణ్య ధర్మాధర్మములతోఁ గూడినదియునై యేదో తోఁచును గాని, యస్మితాక్షేత్రసాధకులు, ఆ సర్వ భావములతోఁ గూడియున్నను, కేవల వివిక్తమైన యహంతనే పట్టుకొనఁగల్గుదురు. కేవలానందమయ 'జ్ఞ' స్వరూపముయొక్క యాభాసమైనను లేనంతసేపు, ఆ యహంత వికసింపదు. అనేక జన్మసంచిత సుకృతఫలముగా శ్రీగురు నహైతుకకృపచే సాటి లేని మాతృస్నేహముచే, సాధకుఁడు విశుద్ధబోధస్వరూప మందుఁ జేరి యీ మిథ్యాభిమానము - అస్మిత యనెడి యసు రుని చేతినుండి పూర్తిగాఁ దప్పుకొనును. ఇదే శుంభవధ రహస్యము.

## అమ్మ శూలాఘాతముతోఁగాని నీ స్వరూపమును నీ వెఱుంగఁజాలవు.

దేవీ శూలపుఁబోటుతో శుంభుఁడు నేలఁగూలెను. కేవలానందమయ బోధస్వరూపముయొక్క సమ్యక్ప్రకాశ మగుటే దేవీ శూలాఘాతము. శూలమనఁగా, ఆనందమయ త్రిపుటి యని యర్థము చెప్పితిమి. ఇచట శూలశబ్దముచేఁ ద్రిపుటీ విహీనమైన కేవలానందమయ 'జ్ఞ' స్వరూపమని తెలిసికొమ్ము. దాని యుదయముతోనే యస్మిత, అనఁగా సర్వానాత్మభావ ముల బీజము పూర్తిగా విలయమైనది. "జగత్యాం పాతయామాస" - అమ్మ శుంభుని నేలపైఁ బడవైచెను. జగత్ అనఁగా దృశ్యము, జడవస్తువు అనుట కేమియు నుండనటులే, లేనటులే, ఉండఁబోనటులే, అహంత యనుట కేమియు లేదు. ఉండఁ

బోదు. 'అస్తి' రూపముగా నున్న దేదో యది 'నేను' గాదు. ఆత్మయే. ఇంతవఱకు సర్వాధిపతిగాఁ బ్రతీతమగుచుండిన 'నేను' ఇంతవఱకు సర్వభావములకును జ్ఞాతగా, నధిష్ఠాతయుఁగాఁ దోఁచుచుండిన యా 'నేను' లేదు. ముక్కాలములందును లేదు.

సాధకుఁడా! ఇదే శుంభవధము. ఏ నేనును జేకొని యనేక స్వర్గ నరక భ్రమణములను జేసితివో, ఏ నేనును బలుసారులు పలువిధముల తొడుగులతో ముస్తాబుచేసితివో, ఏ నేనును బద్ధమనుకొని, దానిని విడిపించుటకుఁ బెక్కులు కఠోర సాధనలు చేసితివో, చూడు మిపు డా 'నేను' లేదు. ముక్కాలములందు నుండదు.

నీవు నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తమునైన యాత్మవే. నీ వభయమవు; అమృతమవు; సత్యమవు; నీవు బ్రహ్మమవే; నీకు జనన మరణములు లేవు. బంధముక్తులు లేవు; నీవు నిత్యముక్తుఁడవు. ఇదే పరమలాభము. ఇదే పురుషార్థము. ఈ నేనును మఱచిపోకున్నచో, ఆ నేను — అమ్మ దొరకదు. ఇన్నాళ్ల వెనుక నేనును మఱచుట, నేల్పైఁ బడుట యయ్యెను. మాతృస్వరూపమే (ఆత్మస్వరూపమే) యుద్భాసించినది. దీని పేరే మాతృలాభము.

దీనిపేరే సత్యప్రతిష్ఠ — ఇదే బ్రాహ్మీస్థితి.

ఇపుడు వినుము. శుంభశబ్దము నర్థమెన్నటికిం జచ్చినది. మున్ను 'శుంభ్' ధాతువు నర్థము శోభయని చెప్పఁబడినది. ఆ శుంభ్ ధాతువునకు మఱియొక యర్థము వధము. ఏది వధమగుచున్నదో యది నిత్యము నిహతమగుచునే యున్నది. అనఁగా

దేని కస్తిత్వమే లేదో దానిపేరే శుంభుఁడు. శుంభశబ్దమునకు దార్శనికులు 'అసంభవ భవిష్యత్తు' అనిరి. నేనును నేనుకంటె నభిన్నమైన జగత్తును నితాంతము నసంభవ వస్తువులు. బ్రహ్మమందు జగత్తనుచు నొకవస్తు వెన్నఁడును లేదు. ఉండదు. ఇది సత్యము. ఈ సత్యమందుఁ బ్రతిష్ఠితుఁడగుట పేరే సత్య ప్రతిష్ఠ. ఇదే బ్రాహ్మీస్థితి.

జీవుఁడా ! ఇపుడు నీ వేమనవలయును ?

యోగవాశిష్ఠమందు శ్రీరామచంద్రుని ప్రశ్నముచే జగత్స్వరూపమును దెల్పునపుడు, శ్రీవశిష్ఠుఁడు చెప్పిన సంక్షిప్త మర్మమిచట నింత చెప్పుటావశ్యకమే. (ఒక యరాజకరాజ్యమం దొక రాజుండెను. అతనికిఁ బెండ్లికా లేదు. అతనికిరువురు భార్యలు. వారిరువురును గొడ్రాండ్రు. అతని యిరువురుకొడుకులు, వేటకై చెట్లులేని యడవికేగిరి.) ఈ విధమైన యుపాఖ్యాన మేమియు లేనటులే, దాదియొడిలోఁ గూర్చుండి భూతావేశములేని బిడ్డనికి శాంతిక్రియ యేదో శబ్దమాత్రమైనటులే, ఈ జగత్తు, ఈ నేను, ఈ చిదాభాసుఁడు, ఈ యస్మిత యనుచు నేమియులేదు. ఆత్మ యొకటే — అమ్మయే యున్నది. అదే సత్, అదే చిత్, అదే యానందము.

సాధక సోదరా! ఒకనాఁడు గీతాతత్త్వావసానమందు శ్రీగురుని నోర వెడలిన యపూర్వవాణి "మామేకం శరణం వ్రజ" యనుదానిని విని ముగ్ధుఁడవై నీ 'నేను'ను వాని చరణ కమలములం దర్పించితివి. ఇన్నాళ్లకు దాని సార్థకత కానవచ్చినది. చూడు. శరణాగతమైన యా నీ నేనును, ఎన్ని భిన్నభిన్న

భావములలోనుండి తప్పించి, క్రమక్రమముగాఁ బవిత్ర మొనర్చి, మన యమ్మ నేఁడు ఆత్మసత్తయందుఁ గలిపివేసినదో చూడు. నీ శరణాగతి నిజముగాఁ బండినది. జీవుఁడా! నీవు బ్రహ్మ స్వరూపమందుఁ బ్రతిష్ఠితుఁడ వైతివి. ఊరకుందు వేమి? అనుము —

"ధన్యోఽహం కృతకృత్యోఽహం సఫలం జీవనం మమ ।
ధన్యోఽహం ధన్యధన్యోఽహం బ్రహ్మానందం విభాతి మే ॥
ధన్యోఽహంధన్యోఽహం దుఃఖంసాంసారికం నవీక్ష్య తేఽద్య
ధన్యోఽహం ధన్యోఽహం స్వస్యాజ్ఞానం పలాయితంక్వాపి॥
ధన్యోఽహం ధన్యోఽహం కర్తవ్యం మే నవిద్యతే కించిత్ ।
ధన్యోఽహంధన్యోఽహం ప్రాప్తవ్యంసర్వమద్యసంపన్నమ్॥"

అనుము.

శుంభపాత సందర్భమున మంత్ర స్థూల సూక్ష్మార్థములను సావధానముగా వినుము.

కథ :— దేవీశూలపుం గొనచే గాయపడి యా యసురుఁ డుసురుల వీడి సముద్ర ద్వీప పర్వతములతోఁ గూడిన పృథివి కంపించునట్లు నేలపైఁ బడిపోయెను. ఇది మంత్రస్థూలార్థము.

ఇఁక సూక్ష్మార్థమును వినుము:— మూఁడు గుణముల పరస్పర సంక్షోభ తారతమ్యవశమునన్నైన యేడు భేదములే సప్త సముద్రములు. ఇది మున్ను వివరింపఁబడినది. ఇఁక మూలాధారాదులైన యేడు విశిష్టానుభూతి కేంద్రములే సప్తద్వీప

ములు. స్థూల జడత్వబోధమే పర్వతములు. అస్మితా వినాశ ముతో నివియన్నియుఁ జలించినవి. ఏలన నివియన్నియు నహంత యొక్క విభిన్న వికాసములే. అహంతయే నశించినపుడు వీనికి సత్త యెట్లుండును ?

ప్రారబ్ధకర్మములు నిశ్శేషము కానంతదాఁక యీ దేహాది విషయక బోధము పునరావర్తిత మగుచునే యుండును. సాధకుఁ డాత్మస్వరూపమం దవస్థితుఁ డగునపుడు వీని మచ్చ యైన మిగులదు. కాని యాత్మస్వరూపమునుండి లేనఁగానే మఱల ననాత్మబోధము తలసూపును. అనుభవమునకు వచ్చును. సర్వభ్రాంతులు నివర్తించినపైనిఁగూడ రజ్జువిషయకమైన యథార్థజ్ఞానము నిశ్చయమైనపుడుకూడ సర్పజ్ఞాన సమయమం దైన భయకంపాది లక్షణములు కొంచెము సేపుండును. ఆత్మ ప్రకాశము మొదలుకొని యస్మితవఱకును అనఁగాఁ బ్రకృతి వఱకు సర్వానాత్మవస్తువుల యునికి తోఁచుచునే యుండును. ఐనను బ్రారబ్ధ ముండునంతవఱకు వాని యనుభూతి యగు చుండును. దాని ఫలముగా స్థూలదేహధారణము, లోకశిక్ష ణోపదేశములు, శాస్త్రప్రణయనము, ధర్మప్రతిష్ఠ మున్నగు కర్మములు చేయుచుండుట యగును. యోగదర్శనమందు దీనినే నిర్మాణచిత్తఫలమని వర్ణించిరి. అనఁగా — ఆత్మజ్ఞపురుషుఁడు శరీరముతో నున్నాఁడు. కనుక విశ్వమంగళమునకై యభినవ చిత్తనిర్మాణమును జేసి, యీ నిర్మాణచిత్తము నాశ్రయించి యనేకవిధములైన లోకహితకరకార్యములను జేయుచుండునని భావము. దానిని వేదాన్తము బాధితతంతువృత్తి యనును. వాస్తవముగా నీరెండు మతములకు విరోధము లేదు.

రుద్రగ్రంథి భేదమన నేమో తెలిసికొనుము.

అస్మిత యాత్మస్వరూపమందుఁ బ్రవేశింప నుద్యమించెను. ఇపుడు యథార్థముగానే పృథ్వీసముద్రములు, ద్వీపములు, పర్వతములు కంపించెను. అనఁగా స్థూల సూక్ష్మ కారణ శరీరములు కంపించెను. ఏమన - ఎప్పుడును సత్త్వాహీనముగానే సాగి వచ్చుచున్నారు. కొందఱు సాధకులకు, సమాహితు లగుటకు ముందు క్షణమందే, గొప్పగానో కొద్దిగానో కంపనము స్థూలదేహమందుఁ గానవచ్చును. నిరవచ్ఛిన్నముగా నాత్మస్వరూపమందు నిల్కడ కల్గునంతదాఁక దేహాదులైన యనాత్మవస్తువుల యాద తప్పదు. ప్రారబ్ధము నిశ్శేషముగా క్షయించిన పైని సాధకుఁడు విదేహకైవల్యము నొందును. అపుడు మఱి యనాత్మవస్తు భానముండదు. ప్రారబ్ధసంస్కారముల నడుమ నాత్మ జ్ఞానము నొందినను, అంతరాయములు విశేషముగా నుండును. అవియుఁ బ్రబలప్రారబ్ధమని మున్నంటిమి. ప్రారబ్ధ సంస్కారములు క్షయించినపుడే యాత్మజ్ఞానము భాసించును. దీనినే సాధనభాషయందు రుద్రగ్రంథిభేదన మందురు.

ఈ జగత్తు ఈ దేహాదులు విజ్ఞానమాత్రములనెడి ప్రతీతియే రుద్రగ్రంథి. దీనిని భేదించుటే రుద్రగ్రంథిభేదన మందురు. వాస్తవముగా జగత్తు దేహాదులు ననాత్మరూపముగా నెచటను నేదియు లేదు. జగత్సత్తా ముక్కాలములందును లేదు. ఒక్కటే యద్వితీయాత్మ, అమ్మ నిత్యము విరాజిల్లుచున్నది. ఆత్మకంటె నతిరిక్తమై యేదియు నెచటను లేదు, అని చక్కఁదెలిసి, యందు నిల్చుటయే రుద్రగ్రంథిభేదనము. చిన్మాత్రస్వరూపమైన దాని

స్వరూపమనుటకు నెచ్చటను నెద్దియును లేదు. ఉండదు. వాస్తవముగా నీ క్షేత్రమందు, నీ పరమాత్మస్వరూపమునందు జగత్సృష్టి స్థితి లయము లెవ్వియు లేవు. ఆత్మ నిత్యము; స్వచ్ఛము; నిరంజనము; నిత్యశుద్ధము.

ఏమి ? సాధకా ! తెలిసినదా ? త్రాటియందు సర్పభ్రాంతి గలుగుచున్నది, కాని యా రజ్జురూపమందు సర్పము లేదు. అటులే యాత్మయందు జగద్భాన మెన్నఁడును లేదు అనెడి భావముతో నాత్మోపలబ్ధియైన తర్వాత, వ్యుత్థితావస్థయందు ఆత్మయెడ స్వాభావికమైన యనురాగము నిల్చును. దీనినే యహైతుకభక్తి యందురు. ఆత్మయెడ నప్రశాంతానురాగమును, జగత్తునెడ సత్తాభావ విషయకజ్ఞానమును అను రెండే సాధకుని సర్వదా నిస్పృహుని - అనఁగా వైరాగ్యవంతుని జేసియుంచును. ఇట్టు లమ్మకృపచే సాధకునికి బ్రహ్మవిష్ణు రుద్రగ్రంథి భేదనమగును. జీవన్ముక్తుఁడగును. సర్వబంధనములు తొలఁగిపోయి నిత్యయుక్తత ననుభవించును.

మహాసురుఁడు శుంభుఁడు (అస్మిత) నశించినపిదప నైన చిత్రపరివర్తనముల పరమార్థము నోపికతో విందువా ?

పురాణములందు నీవు కనుచున్నదే. అయిన నప్రస్తుతమనుకొనకు.

1. దేవతలు హర్షనిర్భరచిత్తులైరి:— ఇంద్రియాధిష్ఠితచైతన్యములనెడి దేవతల కిపుడు ఉద్వేగమడఁగినది. ఇంద్రియములు ప్రశాంతములైనవి. చైతన్యరాజ్య మఖండము. దేవతల

యజ్ఞభాగము లపహరింపఁబడుననుశంక మఱిలేదు. కనుక హర్షనిర్భరచిత్తులైరి.

2. గంధర్వులు పాడిరి:— నాదాధిష్ఠిత చైతన్యగణము మధురముగాఁ బాడెను. ఇంతదాఁక నస్మితాప్రభావముచే గంధర్వగణము తిరస్కరింపఁబడియుండెను. కనుక లయ తానహీనములైన యనేకశబ్దముల యభిఘాతమొందెను. ఇపుడు శబ్దాధిష్ఠిత చైతన్యగణము ప్రశాంతమై సునియంత్రితమైనది.

సాధకా! వినుము. ఆత్మప్రాప్తికాఁగా సాధకుఁ డుచ్చరించు శబ్దములు మధురము లగును. వాని కంఠమందొక విధమయిన మధురాకర్షణము తోఁచును. మున్ను వాని నోర వెల్వడిన మాటలందుఁ జిత్తాకర్షణము లేకుండెను. ఇపుడు తిట్టినను మధురముగానే యుండును. అతఁడు తిట్టినను దుఃఖము రాదు. సరికదా; లోపల నానందమగును. గంధర్వులు ప్రసన్నులైన ఫలమిది.

3. అచ్చరలు నాట్యమొనర్చిరి:— గగుర్పాటు అంగకంపనము మున్నగు సాత్త్వికభావములు బయల్పడెను. యోగప్రథమావస్థయందివి చిత్తవిక్షేప సహాకారులగు కారణమున, సాధన కంతరాయములుగా నుండును, గాని యస్మిత నశించిన తర్వాత స్వప్రకాశానందమయాత్మ స్వరూపమునఁ జేరునపుడు, ఆ యంగ కంపనాదు లానందసూచకము లగుచు విక్షేపమును గల్గింపవు. ఆత్మయందు విక్షేపమను మాటయే లేదు. విక్షేపము చిత్తధర్మము; కనుక నిచట నంగకంపనాదులనెడి బాహ్యభావములు కానఁబడినను వానివల్ల నాత్మోపలబ్ధికి బాధయే యుండదు, సరికదా, విశేషానందోపలబ్ధిసూచకము లగును,

4. పుణ్యవాయువులు వీచినవి:— ఆత్మసాక్షాత్కారమైన తరువాత నిజముగా వాయుమండలము పవిత్రమై యానంద మయ మగును. అపుడు మధుమయానందమయ ప్రియతమాత్మ స్వరూపము సర్వత్ర వెలయును. కావున సత్యదర్శులైన ఋషుల స్వరముతో స్వరముఁ జేర్చి "మధు వాతా ఋతాయ తే, మధు క్షరన్తి సింధవః" అనుచిటులు పలుకవలదా ?

ఇటులు బాహ్య వాయుమండలమే పుణ్యమయము నానందమయము నగునా ? అంతేకాదు. లోపలి ప్రాణాది వాయుపంచకమును బవిత్రమును మధుమయమును నగును.

ఈ ప్రాణాదివాయుపంచకవిషయము అప్రాసంగికమైనను జిజ్ఞాసు హితార్థము సంక్షేపించి తెల్పఁబడును. ఆంతరవాయువు లైదు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానములు. సాధా రణముగా నివి వాయురూపముగానే పరిచితములు; కాని వాస్త వముగ వాయువు వీని యతిస్థూలరూపము. ఈ స్థూలరూప సంబంధముతో నిచటఁ బనిలేదు. వీని స్వరూపము క్రియలు స్థానములు పలువు రెఱుఁగుదురు. వాగ్భటాచార్యుని వైద్య సంహితయందుఁ గ్రమముగా వీని కార్యములు "ప్రస్పందనో ద్వహన పూరణ ధారణ వివేకలక్షణో వాయుః పంచధా ప్రవి భక్తః శరీరం ధారయతి" అను సూత్రవ్యాఖ్య యెంతో యున్నది. అది యుండనిండు. మనము కేవలాధ్యాత్మికదృష్టితోఁ బ్రాణా దుల స్వరూప మెఱుంగఁ బాటుపడుదము.

ప్రాణాదులైదును కరణవిశేషణములు. జీవుని కరణములు రెండువిధములు. అంతఃకరణములు, బాహ్యకరణములు. బాహ్య కరణములు మూఁడు విధములు, అంతఃకరణములు నాల్గు విధ

ములు. మనోబుద్ధిచిత్తాహంకారములు. బాహ్యకరణములు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ప్రాణాదిపంచకము. సత్త్వ రజ స్తమస్సులవలన యథాక్రమముగా నీ త్రివిధకరణములు పుట్టినవి. ఎట్లనఁగా, సత్త్వగుణ కరణము లగుటచే జ్ఞానేంద్రియములు ప్రకాశత్వప్రధానములు. రజోగుణకరణము లగుటచేఁ గర్మేంద్రియములు క్రియాభావప్రధానములు. అటులే తమోగుణ ప్రధానము లగుటచేఁ బ్రాణాదిపంచకము ధృతిప్రధానము. ప్రాణమనుటచే బహిర్గతబోధ విశేషముయొక్క ధృతిభావమని తెలియవలయును. అనఁగా బహిర్గతవస్తువుల సంస్పర్శనముచే, ఆభ్యంతరిక బోధవిశేష ముదయించును. ఆ బోధ కధిష్ఠానమై దానిని బట్టియుంచుటే జ్ఞానకార్యము. చూడుము - నీవు దప్పిగొని నీరు త్రాగుదువు. ఇచట నీరనెడి బాహ్యవస్తువుతోఁ గుత్తుక మున్నగువానికైన సంస్పర్శముచే, దప్పి తీఱినద నెడి యొక బోధము కలుగును. ఆ బోధము నుద్ధరించు శక్తియే ప్రాణము.

శారీరక మలములను దొలఁగించు శక్తి కధిష్ఠానమై దానిని ధరించుటే యపానకార్యము.

అంగప్రత్యంగముల నిటునటుఁ గదల్చు శక్తి కధిష్ఠానమై దానిని ధరించుటే వ్యానకార్యము.

శరీరమందలి రస రక్తాది ధాతుగతబోధమున కధిష్ఠానమై దానిని ధరించియుంచుటే యుదానకార్యము.

అన్నపానములచే శరీరపాటవముఁ గలిగించు శక్తి కధిష్ఠానమై దాని ధరించుచుండుటే సమానవాయు కార్యము.

ఈ పంచవిధములైన శక్తులచేతనే యీ స్థూలశరీరము ఘటితమై నిలిచి లయమొందుచున్నది. ఇవే ప్రతిలోమముగాఁ బనిచేయునపుడు శరీరము నశించును. జ్ఞానేంద్రియ కర్మేంద్రియములవలెనే యివియు నస్మితాస్ఫురణములు. ఈ మైన ప్రాణశక్తులే ప్రాణమయకోశముయొక్క యథార్థస్వరూపము.

మాతృలాభమైన తర్వాత అనఁగా—పరమాత్మస్వరూపమునుండి వ్యుత్థితుఁడైనవానికిఁ దరువాత నగు చిత్తప్రసాదమే కాక, చిత్తప్రసన్నతకు హేతువైన జ్ఞానకర్మేంద్రియ ప్రసన్నత వలెనే, ప్రాణాది పంచవాయు ప్రసన్నత యగును. దాని ఫలముగా స్థూలశరీరపర్యంతము నానందఘనరూపముగాఁ దోఁచును. శరీరమందలి ప్రత్యేకపరమాణువును నానందకణమనెడి ప్రతీతి నొందును. శరీరమందలి వాయుప్రవాహము పుణ్యాత్మమైనందుల కిదే లక్షణము.

నాయనా! సాధకోత్తమా! ఒక్కసారి యాత్మబోధమై మనలను ముద్దాడు నమ్మయొడిలోఁ గూర్చున్నపైని నిజముగా నిటులే యగును. ప్రాణ మన ఇంద్రియములు మొదలు స్థూల దేహ పర్యంతము నొక యపూర్వమైన రసముచే రసమయ మగును. ఆ రసాస్వాదనము మున్ననుభవింపనిదగుటచే విస్మయ జనకము. ఆ మిలనరహస్యమనెడి నిరవచ్ఛిన్నానందమే దాని స్వరూపము.

5. **హోమాగ్నులెల్ల శాంతముగా మండినవి:**— శరీర మందలి తేజస్తత్త్వమే హోమాగ్నులు, కనుక మున్ననేక విధముల నుత్పాతమును సూచించినది యిపుడు శాంతభావము

నొందినది. పూర్వవాసనల దెబ్బలు, సుఖదుఃఖముల దెబ్బలు, సాధకచిత్తము నెల్లప్పుడును నిల్కడ లేకుండఁ జేసెను. కనుక శరీరమందలి తేజస్తత్త్వము పలువిధములుగాఁ బరాభవింపఁబడి యిపుడు శాంతించినది. అహంత లేదుకనుకనే యుచ్ఛృంఖలతయు లేదు. మున్ను విశ్వయజ్ఞము, ఈ కర్మయజ్ఞము, అహంకర్తృత్వ బోధముపైనే నిల్చియుండెను. కనుక నంతయు నుచ్ఛృంఖలము; అంతయు నశాంతము, అంతయు నుత్పాత సూచకమున్నై యుండెను. ఇపు డాత్మస్వరూపము ఉద్భాసింపగా నంతయు బ్రహ్మయజ్ఞముగాఁ బరిణమించినది. ఇపుడు ఏకర్మమైనను "బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం" రూపముగానే చేయఁబడుచున్నది. ఇపుడు హవ్యము, హోత, అగ్ని, హోమము, దానిఫలము సర్వమును బ్రహ్మమయము; సర్వము నాత్మమయము. కనుకఁ గర్మయజ్ఞమనెడి యనుష్ఠానము ఇపు డశాంతమన్నదిలేక సాగుచున్నది.

6. దిక్స్వనములు — అమంగళసూచకములై దూరము నుండి వినవచ్చుచుండెడివి. అహంబోధ విలుప్తమైనది. ఆత్మబోధము సముచితమైనది. అంతట నొక్క మంగళమయాత్మ తక్క మఱేమియు లేదు. కనుకనే దిక్కులనుండి వినవచ్చుచుండిన యమంగళమయధ్వనులు శాంతించెను. జాగతికములైనవానిని గూర్చుకొనుటచే నగు ఫలాఫలముల విచారము, దానివలనఁ గలుగు మంగళామంగళ విచారము మున్నుండెను. ఇపుడట్టిది లేదు. సర్వము మంగళమయమే. సర్వము నాత్మమయమే. సర్వము నానందమయమే.

## సాధకా! ఇదే యానందప్రతిష్ఠ.

చూడుము. సర్వత్రానందాభివ్యక్తియే. ఆనందస్వరూపాత్మ సాక్షాత్కరించుటచే, నిట్టులే యంతట నానందమయసత్తయే యనుభవింపఁబడును. అహంత యనుచు నొక విశిష్టజ్ఞాన మించుకంత యున్నను, నీ యానందసంధానము నొందలేఁడు. కాని యమ్మ కృపచే శుంభుఁడు నిహతుఁడు కాఁగానే (అస్మితావిలయ మగుటచే) సాధకునకు నిరవచ్ఛిన్నానందము లభించును. ఈ యానంద మెప్పుడును జాఱిపోదు. చిత్తవిక్షేపము, భోగ త్యాగములు, రోగ శోకములు అను నెట్టి యవస్థ యం దుండనీ, యానంద విచ్యుతి కాదు. దీని కాద్యంతములే లేవు. అభిన్నమును బూర్ణమును జిర నవీనము నయిన దీని నిత్యము భోగించుచున్నను దీని నవీనత తొలఁగదు. అది యంత మధురము. వైష్ణవభాషలో, నిదే నిత్యబృందావనమందు నిత్యతరుణుఁడు, నవఘనశ్యాముఁడు, నిత్యలోభనీయుఁడు. ఈయానందమే సాంఖ్యుల పురుషుఁడు. వేదాన్తుల బ్రహ్మము. ఉపనిషత్తుల యాత్మ. గీతా శ్రీకృష్ణుఁడు. దేవీమాహాత్మ్యమున (దుర్గా సప్తశతియందు) చండిక, మన యమ్మ.

చూడు, సాధకా! నీ వానందమయుఁడవు. నీ భోగ్య జగత్తు ఆనందమయము. నీ మనః ప్రాణేంద్రియ స్థూలశరీర పర్యంతము నానందమయము. ఆనందమువల్లనే యీ జగత్తు ఘటింపఁబడినది. నీకును ఈ విశ్వమునకు నానందమే యుపాదానము. ఏ యవస్థయందును నీ వానందముతో నెడయవు. నీవు ధన్యుఁడవు. ధన్యుఁడవు. ఏదీ, ఒకసారి —

"సచ్చిదానందరూపోఽహం నిత్యముక్తస్వభావవాన్" అని గానము చేయుమా.

ఇది శుంభవధము.

## తత్త్వసుధాటీకా.

ఇప్పుడు చెప్పినట్లు సాధకుని దేహమందలి పంచవాయువులు ప్రశాంతములైనవి. శ్వాస ప్రశ్వాసములు సుఖావహములు, స్వస్తిదాయకములునై నడువఁజొచ్చినవి. బాహ్యవాయుమండలము సైతము మధుమయమై వెలసినది. ప్రాణ చక్షువుల కధిపతియైన దివాకరుఁడు ప్రశాంతదివ్యజ్యోతిని వెదజల్లెను. సాధకుని బాహ్యాభ్యంతర జగత్తులందుఁ జిదానంద వికాసమైనది. దేహస్థుఁడైన తేజోరూపి వైశ్వానరుఁడును, నాభిమండలమందలి జఠరాగ్నియు యథాయోగ్యముగాఁ గ్రియాశీలములైనవి. అనఁగా భోజ్యపరిపాకాది రూపమైన జఠరాగ్ని యజ్ఞమును, మణిపూరమందలి తేజస్తత్త్వమయ కాలాగ్ని కార్యములును, సాధకుని యితర తేజోమయ కర్మ యజ్ఞాదులును, విధిపూర్వకముగా శాంతముగా ననుష్ఠింపఁబడినవి. సాధకున కమంగళకారులైన శబ్దము లణఁగిపోయినవి. అనఁగా బాహ్య జగత్సంబంధమైన శబ్దసమూహము, మున్ను సాధనకు విఘ్నముగాఁ దోఁచినది. యిపుడు వీణా సుమధుర మంజుల నాదధ్వనిగాఁ దోఁచినది. సర్వవిధ ధ్వనులును బ్రణవ ధ్వనిగాఁ బర్యవసించినవి.

బద్ధుఁడైన సాధారణ జీవుని పక్షమున బాహ్యజగత్తు నందలి యశాన్తశబ్దములు అడ్డులేక సాగుచుండును. గాని చండీసాధకుఁడు, ఉన్నతావస్థ నొందినపుడు బహిరంతర్జగత్తు లందలి శబ్దములెల్ల మంచి కట్టుపాటుతో నొక్క లక్ష్యమందే కేంద్రీభూతములగుటచేఁ బరమానందము నొందును.

## యౌగిక వ్యాఖ్య.

సాధకుఁడు, ఆజ్ఞాపద్మమందలి యంతశ్చక్రమందు గురు రూపశక్తితోఁ జేరి యామెకృపచే శివమయుఁ డగును. కారణ సముద్రరూపమైన యానందమయ కోశమును – రుద్రగ్రంథిని భేదించి – సహస్రారమందుఁ జేరును. షట్చక్రముల నెడి కల్ప తరువు(మహిమమయ కులవృక్షము)యొక్క మూలము మూలా ధారమందున్నది. ఆ వృక్షముకొమ్మలు తక్కిన చక్రములుగా నభివ్యక్తము లైనవి. ఆ వృక్షముయొక్క గొడుగువంటి యగ్ర భాగమే సహస్రారము. దానియందు సిద్ధుల నెడి ఫలపుష్పాదులు శోభించును. జ్ఞానియే కానీ, కర్మియే కానీ, యోగియే కానీ, భక్తుఁడే కానీ యెల్లరకు సహస్రదళకమలమే యిష్టభాగము— నిత్యలోకస్వరూపము. జీవదేహమందలి సహస్రారమనెడి యీ పరమస్థానమునే, కొందఱు పరమపదమనియు, కొందఱు బ్రహ్మ పదమనియు, కొందఱు విష్ణులోకమనియు, వైకుంఠధామ మనియు, కొందఱు బృందావనమనియు, కొందఱు గోలోక మనియు, కొందఱు పరమాత్మమయానంద ధామమనియు, గురు ధామమనియు, కొందఱు వ్యోమక్షేత్రమనియు, తురీయస్థాన

మనియు వర్ణింతురు. తత్త్వదర్శి మహర్షులు, ఈ క్షేత్రమునే పరమతత్త్వమనియు, మహాత్మ్యమనియు ననేకవిధముల వర్ణించిరి.

"శివస్థానం శైవాః పరమపురుషం వైష్ణవ గణా
లపంతీతి ప్రాయో హరిహరపదం కేచిదపరే।
పదం దేవ్యా దేవీచరణయుగళాంభోజరసికా
మునీంద్రా అప్యన్యే ప్రకృతి పురుషస్థాన మమలమ్॥

ద్విదళస్థ నిరాలంబనపురి — అదే యానందమయ కారణము; జలస్వరూపము. దానియందు సుషుమ్నానాడి తామరకాడవలె నున్నది. ఆ మృణాలముతోఁ గూడిన సహస్రదళపద్మమందు — అతుల సాగరమందు భాసిల్లుచు స్వరూపానందమున దోఁగుచుందురు. వివిధవర్ణములతో విచిత్రమైన యీ మహాపద్మమునకు ఏఁబదిదళములు, క్రమముగా నిరువది వరుసలుగా సుసజ్జితములై యున్నవి. వర్ణమాలయందలి యేఁబది యక్షరములు శక్తిమయ మాతృకావర్ణరూపముగా సహస్రదళకమలముయొక్క ప్రత్యేకదళమునందును విరాజిల్లును. ఈ మాతృకావర్ణములే యోగినీస్వరూపములు. వీనికే గోపికలనియు వ్యవహారము. అనఁగా సహస్రదళపద్మముయొక్క యిరువది వరుసలలో నన్నివరుసలందును ఏఁబది యోగినులు, వివిధానుభావములతో సురంజితములును సుసజ్జితములునై యైశ్వర్య మాధుర్య ప్రకాశకములై నిల్చినవి. ఆ సర్వోపరి పద్మకర్ణికయందుఁ బరమశివమహాశక్తుల సమ్మిలనమువలన భక్తుల కానందవిలాసము; అచట శ్రీ రాసమండలమందు శ్రీ రాధాకృష్ణుల నిత్యరాసలీల. సహస్రారముయొక్క మహాశక్తి

మయ విసర్గస్థానమందు అమానామ్నీ షోడశీచంద్రకళ యుండును. దీనినే అమృతధారా — దివ్యకులామృత మందురు. ఈ విధముగా జీవన్ముక్త సిద్ధసాధకులు సహస్రదళకమలమందలి దివ్య సోమధారానుపానము చేసి చేసి పరమానందమును — అమృతత్త్వమును బొంది ధన్యులగుదురు.

జీవుని ప్రాణశక్తి యనెడి రాధ (కుండలిని జేరి) కుండలినీ శక్తితోఁ జేరి, అనఁగా ఆ శక్తివలన శక్తిమతియై ప్రత్యేక చక్ర మందు మాతృకావర్ణము లనెడి విభిన్నతత్త్వములతో భావమయ గోపులను దోడుకొని సహస్రారమందుఁ బరమాత్మతో, అభిసరణమునకై పరుగెత్తును. ఈ విధముగా ద్విదళచక్రము యొక్క మనోరమకోశమందుఁ గ్రమముగాఁ జేరి మఱియు విజ్ఞానమయానందమయ కోశములనెడి కారణజలసమన్విత మహా సముద్రమును, లేదా శూన్యమయ నిరాలంబపురిని గడచి సంఘముగానున్న గోపికలతోఁ గూడి విరహిణి, ప్రాణమయి — శక్తిమయియైన రాధారాజ్ఞి పరమాత్మ — పరమపతితో మహా మేలనము నొందినది.

అనఁగా రుద్రగ్రంథి యనెడి దుస్తరపురిని మాయా పారావారము నావలిగట్టుచేరి సాధకుఁడనెడి రాధ — శక్తిమయ జీవాత్మ — విశుద్ధమై షట్చక్రభేదన మొనర్పఁగాఁ బరమాత్మతో — శ్రీకృష్ణుఁడనెడి పరమప్రియునితోఁ జేరెను. రాధాకృష్ణుల — శివశక్తుల మేళనముచే సహస్రారమందు సమ్మిళితలైన యోగినులు (గోపికలు) సహస్రదళములందు విరాజిల్లుచుండి, యిపుడు ప్రేమానందములతో నృత్యపరాయణలైరి.

ఇపుడు సాధకశ్రేష్ఠుఁడు, శుంభుని మాతృపూజ నొక్కసారి సంక్షేపముగా ధ్యానించినచో, నెంత చక్కగా సమస్త తత్త్వములుఁ గ్రమముగా లయమై తుదకాత్మస్వరూపము నొంది సుసమాధానమయ్యెనో తెలియఁగలఁడు.

పూజకు మొదటనే శరవర్షముఁ గురియించి పరిచ్ఛిన్నమును బహుముఖియు, నానందవిలాసయుక్తమును, రసమయియునైన భావరాశిని, ఏకముఖచేసి మాతృచరణములందు విలయమొనర్చెను. పిదప ధనూరూపమైన యాకాశతత్త్వలయమును, దర్వాత శక్తిరూప వాయుతత్త్వలయమును, ఆ వెనుక ఖడ్గరూప తేజస్తత్త్వలయమును గ్రమముగాఁ జర్మ (డాలు) రూప పృథ్వీతత్త్వలయమును ఈ విధముగా దేహసంబంధ పంచభూతలయమును జేసి (అన్నమయకోశలయ మొనర్చి) పిదప నింద్రియాది (అశ్వ) సహితమును మనో (సారథి) లయమును, అనఁగా, ప్రాణమయ, మనోమయకోశలయమును, దరువాత బుద్ధి (ముద్గర) లయమును, అనఁగా జ్ఞానమయ కోశలయమును, పిదప విజ్ఞానమయకోశమందు విశుద్ధత్వము నొందిన సూక్ష్మాహంతను (అస్మిత) లయ మొనర్చి, అనఁగా విజ్ఞానమయ కోశవిలయమును, దర్వాత నిరాలంబపురమందు (ఆనందమయకోశమందు) మహాసరస్వతితోఁగూడ నానందవిలాసములతోఁ గారణబీజసమూహ లయమును జేసి విశిష్టానందానుభవాంతమందు, ఆ మాతంగమునఁ జేరిపోయి, అనఁగా, నానందకోశము సైతము విలయమై, యంతమున సర్వకోశముక్త విశుద్ధ జీవాత్మతోఁ (బరమాత్మకు) మహామిలనమైనది.

ఈ విధముగా నుత్తమచరిత్రమందలి యుద్ధలీల యనెడి యపూర్వ సాధనరహస్యము అసురుల యధ్యవసాయమును సర్వత్యాగి భావసమూహ సాధకజీవనమునకుఁ బ్రేమానంద దీపకమును, అత్యుజ్జ్వలాదర్శ స్వరూపము నైనది.

## సాధక సోదరులారా ! లెండు ! రండు !

ప్రాణసమానులు, విశ్వాసులు నైన సోదరులారా ! మీరు దేవీయుద్ధమందలి యీ గూఢలీలాచాతుర్యమయ మహాపూజ యనెడి అమృతోపమ సాధనరహస్యమును మీ మీ వ్యక్తిగత జీవనమందుఁ బ్రతిఫలిత మొనర్చి ధన్యులును గృతార్థులునుగాఁ జూడఁడు ప్రథమచరిత్ర సారమైన 'సాధనసామగ్రి' తొలుమూటయందు జగన్మయి అమ్మయొక్క సన్మూర్తివికాసమును జూచితిరి. తరువాత మధ్యమచరిత్రసారమైన మలుమూటయందుఁ బ్రాణజ్ఞాన ప్రతిష్ఠచేఁ జిన్మయి అమ్మయొక్క సర్వాంతర్యామినీ రూపదర్శనములను జేసితిరి. మీ బ్రహ్మవిష్ణుగ్రంథులు విడిపోయినవి. మీ యాగామిసంచిత కర్మములు నశించినవి. ఇపుడు అమ్మయొక్క సర్వవిమోహన ప్రేమానంద రూపము నాస్వాదింపఁ బ్రయత్నింపుఁడు. లోను వెలిని సర్వభూతములందు నంతట నానంద దర్శనాస్వాదము నొనర్చి, ధన్యుల రగుఁడు.

ఆనందమువల్లనే జీవజగదుత్పత్తియైనది. ఆనందమందే యుండి నడుపఁబడుచున్నది. పరిపుష్టమగుచున్నది. మఱి యానందమనెడి మహాకాలుని యొడియందే విశ్రామము

లయము నొందుచున్నది. ఆనందముతో జీవనమును గడుపఁ గోరుదురు. మరణము మిమ్ము గాఢాలింగనపాశముతోఁ గట్టి పెట్టుటకు వ్యస్తమైయున్నది. నలువైపుల నానందముయొక్క యుబలాటమే. ఆనందకోలాహలమే. జీవజగత్తునం దేదియు, నానందమును దక్క మఱి దేనినిం గోరదు. ఆనందము లేక క్షణమైనను బ్రతుకలేదు. ఆ యమృతమయానందసంధానము మీకు వలదా? జీవత్వాభిమానమును విడిచి పరమాత్మభావముతో విభావితులు కారా? రెండు; రెండు; పొందఁదగిన వరమును బొందఁ బ్రయత్నింపుఁడు.

రండు! సాధకులారా! రండు! మన మా నిత్యానందమయి జగన్మాతయొక్క జ్ఞానప్రదీప్తములును ప్రేమాభిషిక్తములు నైన యభయ శ్రీచరణములందు సానంద ప్రణిపాత మొనర్చి, బ్రహ్మానందముతో అమ్మా! అమ్మా! యనుచు నోడల్లు మఱచి, అమ్మ యొడియందే యుందము.



జయ మాతా! పూతానుకంపాసమేతా!
దుర్గే! దుర్గతిహారిణీ! దుర్గే! అపవర్గదాయినీ!
ఆనందమయీ! జయ! జయ! జయ!

“యా చండీ మధుకైటభాది దళనీ
యా మాహిషోన్మూలినీ
యా ధూమ్రేక్షణ చండముండమథనీ
యా రక్తబీజాశనీ

యా వై శుంభ నిశుంభ దైత్యదమనీ
యా సిద్ధిలక్ష్మీః పరా
సా చండీ నవకోటిశక్తి సహితా
మాం పాతు విశ్వేశ్వరీ॥"

శ్రీ పరదేవతార్పణమస్తు.

ఇది

శ్రీ శ్రీయానందనాథాపరనామధేయుఁడు, శ్రీకాకుళవాసి,
ఈశ్వర సత్యనారాయణశర్మ సంగ్రహించిన
"సా ధ న సా మ గ్రి"
మూఁడవ మూట.

—♦—